# సంగీతకళ: నేటి స్థితి

## శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు

రేడియో, గ్రామఫోను, సంగీతాన్ని మారుమూలలకు వ్యాపింపజేసినవి. మూడు నిముసములలో మహావిద్వాంసుల గానం వినడం సాధ్యమా ? అని గ్రామఫోను రికార్డులను త్రోసిపుచ్చ నవసరములేదు. అరగంటసేపు పాటను వినిపించే (Long Playing) రికార్డులు, గంటన్నరదాకా వినిపించే (Tape recorders) వచ్చాయి. నాలుగు గంటల కచ్చేరీని నాలుగు చేపులలో రికార్డు చేయవచ్చును. ఇవి కేవలము ఆలిండియా రేడియో లాంటి సంస్థలలో మాత్రమే కాక, ప్రతివారి ఇంటనూ చూడవచ్చును. సంగీతమును ఇంతసేపు వినిపింపచేయు సాధనలు ముందు లేవు. అందుకని వీటి మూలాన వెనుక మహారాజు లనుభవించిన సంగీత కచ్చేరీలు నేడు మారుమూలలందున్న సామాన్య ప్రజలు సులభముగా వినగలుగుచున్నారు. ఇన్ని సౌకర్యములున్నా ప్రయోజనము ఏమి ? మహాగాయకులు అరుదయి పోవుచున్నారు. మునుపటి ఘనత, గాంభీర్యము, ఉదాత్తత, సంప్రదాయము, గొప్ప మనోభావము నేటి గానములో చాల అరుదయిపోవుచున్నవి. రానురాను శాస్త్రీయ సంగీతమునకు తీరని క్షామ మేర్పడు నన్న శంక, రుజువగుచున్నది. శాస్త్రీయ సంగీతమునకు మంచి రోజులు రాగలవా అన్న ప్రశ్నను హితైషులు విచార భావముతో అడుగు దురవస్థ వచ్చినది. "రానురాను మహా గాయకుణ్ణి చరిత్రలోనే తప్ప మన లోటి గాయకులలో చూడగలమా"—అని కొందరు రసికులు మదరాసులోనూ, ఢిల్లీలోనూ అనుకొనుట నేను చెవులార విన్నాను. "It Cannot be denied that, inspite of all that modern exponents of music might claim, the age of giants is over. We have no more of the old giants and ustads." అని సంగీత ప్రపంచములో సాన్నిహిత్యమున్న ఒక రసికుడు వాపోయాడు. హిందుస్థానీ, దాక్షిణాత్య సంగీతములు వ్యాప్తిలోనున్న రెండు ప్రాంతాలవారూ ఇలా సామాన్యంగా అనుకుంటూ ఉండడం సహజమయినది. ఇది నిజమా? అట్టి దుస్థితిని తొలగించుటకు మార్గము లున్నవా ? పాశ్చాత్య దేశమందు కూడ సంగీత రచనా నిర్మాతలను గురించి ఇంచుమించు ఇట్టి అభిప్రాయము ప్రబలియుండుట గమనించ తగినది. ఆ దేశముల గాయకులను గురించి అట్టి అభిప్రాయము రాలేదు.

"ఇదొక పూర్వపక్ష మీమాంస ! ఇది ప్రతివారు తమ మునుపటివారినే పొగడి ఇప్పటివారు పనికిమాలిన వారనుకోవడం, నైజంలోని ఒక దుర్లక్షణం. కాళిదాసు కాలంనుండి ఇట్టివా రుండనే ఉన్నారు. నా చిన్న వయస్సులో సంగీతమును విన్నది జ్ఞాపకం చేసుకుంటే—అనాటి సంగీతము బహు సామాన్యంగా ఉండినదనే చెప్పగలను. అకాలపు విద్వాంసులంతా నలుగు రయిదుగురే. ఎక్కువ గమకము లుండేవికావు. మొత్తం నాలుగయిదు కీర్తనలు బాగా పాడేవారు. ప్రసిద్ధ రాగములే తప్ప అల్పమయిన, అపురూపములయిన రాగాలను అసలు పాడుటే అరుదు. అందచందములమాట కొస్తే అనాటి సంగీతము మోటా అనే చెప్పవచ్చును. సంవత్సరానికి ఏ రెండు మూడు పర్యాయములో సంగీతకచ్చేరి వినగలిగే వారము కాబట్టి ఏది పాడినా అతిశయముగా వినపడేది. నేటి తాళపు గడబిడలు, కర్తారాగముల విస్తరణ, కొత్త కీర్తనల ప్రచారము, నాడు చాల అరుదు. సంగీత కచ్చేరికి వందలు వేలుగా జనము రావడ మెక్కడిది ? రాగాలాపనలు హార్మోనియంమీద వాయించినట్లుండేవి. ఇక జావళీలు, పదాలు నాట్య ప్రదర్శనలందే కాని విద్వాంసులు పాడేవారు కారు. వాద్యము లందు కూడ నేటి నిపుణత అరుదు. వాద్యములను వాయించే వారి సంఖ్య కూడ చాల తక్కువ." అని మరికొందరు అభిప్రాయపడుతూండటం కూడ వినియుండవచ్చును. ఈ రెండు భిన్నాభిప్రాయములందునూ కొంత సత్యమున్నదని పరిశీలించినవారికి కనుపడవచ్చును. విఖ్యాతి గాంచిన గాయకులు, ఉస్తాద్ ఫైయాజ్ ఖాన్, టైగర్ వరదాచార్యులు, ఫిడేల్ గోవిందస్వామిపిళ్లే, మృదంగం దక్షిణామూర్తి పిళ్లే, వీణ సంగమేశ్వరశాస్త్రి, శేషణ్ణ, వెంకటరమణదాసు మొదలగువారి శ్రేణికి చెందునట్టి విద్వాంసులు అరుదన్నమాట వాస్తవము. వీణ ధనమ్మపదములు ఇంక వినే అవకాశములేదు అన్నమాట వాస్తవమే. కాని వారి తరువాతకూడ ప్రథమశ్రేణికి చెందిన గాయకోత్తములు సంగీతమును తమ కౌశల్య ప్రదర్శనకే గాక, ఒక ఉపాసనావిద్యగ చేకొని సంప్రదాయమును ఎదుట నిలబెట్టిన ధీరులు ఎందరయిన కలరు. అట్టివారిలో కొందరు అరియకుడి రామానుజ అయ్యంగార్లు, మహారాజపురం విశ్వనాథయ్యరు, ఇటీవల గతించిన పల్లడం సంజీవరావు, వాద్య విద్వాంసులలో ద్వారం వెంకటస్వామినాయుడుగారు, పాలఘాటు మణి అయ్యరు, ఫ్లూట్ మహాలింగం, సెమ్మంగుడి శ్రీనివాసయ్యరు, జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యయ్యరు, మధుర మణి అయ్యరు—తదితరులు. కాని, రెండవశ్రేణి గాయకులు, వాద్యములను వాయించు విద్వాంసులు అట్టి ఆధిక్యార్హతలను పొందకల్గియున్నారా ? వీరిలో మునుపటి గాయకుల శక్తి సామర్థ్యములు అసలు లేవా ? ఈ గాయకులకు తమ యోగ్య

తను పెంపుచేసికొను ఆసక్తి లేదా ? వీరి సంగీత విద్యార్జనలో లోపాలున్నవా ? వీరికి కచ్చేరీలు చేయు అవకాశాలున్నవా ? ప్రజా హృదయాన్ని ఆకర్షించు మోహనకరమయిన నాద సంపద స్వాధీనము చేసుకోగల్గినారా ? వీరిమూలాన వేలకొలది సంవత్సరాలుగా కాపాడబడుచూ వచ్చిన సంప్రదాయము కృశించక, నశించక తమ తరువాతి తరమువారికి అందజేయబడుచున్నదా ? వీరు సరియయిన గాన ప్రదర్శనలు చేసి గౌరవముగా జీవించగల్గుచున్నారా ? వీరి కొరత లేవి? ఇట్టి జిజ్ఞాస అవసరము.

ఇట్టి జిజ్ఞాసను సక్రమంగా కొనసాగించుటకు మునుపటి సంగీతము ఉత్కృష్టముగా నుండుటకు కారణము లేమిటి అన్న సంగతులు ప్రజ లందరికీ బాగా తెలియవలయును. పదేపదే ఆదర్శనీయములగు కచ్చేరీలను విని గానరసమును స్వయంగా ఆస్వాదించి తన్మయత్వమును పొందగల అనుభవము గడించుకోవలయును. అట్టి ఆసక్తి గలవారు కీ. శే. టి. వి. సుబ్బారావుగారు రచించిన "Studies in Music" అను గ్రంథాన్ని, ముఖ్యంగా "The seven lamps of Sangita" అను వ్యాసాన్ని శ్రద్ధగా చదువవలయునని నా మనవి.

సంగీతమునకు ఏడు అంశములు చాల ముఖ్యమయినవి—శృతి శుద్ధత, రసప్రధానము, లయ శుద్ధము, సాహిత్య శుద్ధము, గమకాలంకార శోభితము, ఆనందమయత్వము. అన్నిటికంటె ముఖ్యమయినది శృతిశుద్ధత. 'శృతిలేని పాట, స్మృతిలేని మాట' అన్నారు. శారీర సాధనను ఎంత దీక్షతో కొనసాగించిన అంతకంతకు శృతి శుద్ధము చేకూరును. త్రిస్థాయిలందు 'అ' కార శుద్ధముగా, నాభినుండి నిండుగా పండుగా నిలకడగా స్వరములను తంబూరతోటి లయింప చేయునది శ్రేష్ఠమయిన గానము. ఇది మన సీమను వదలిపోయినదేమో ! హిందుస్థానీ గాయకులందీ పరిపక్వమయిన నాదము తరచుగా ఎక్కువగా వినగల్గుచున్నాము. కమాను వేయగానే ఒక హాయినిచ్చు నాదమును నాయుడుగారు రోజా గంటలతరబడి సాధనచేసి, స్వరస్థానములను ధ్యానించి—కైవశము చేసుకున్నారు. మణి అయ్యరు మృదంగపు నాదము, మహాలింగము వేణునాదము అట్టి పక్వమును చెవికి తేగలవు. పాశ్చాత్య సంగీత విద్వాంసులలో ఈ పరిపక్వమయిన నాదమును తప్పనిసరిగా వినవచ్చును. 'ధ్యానము' అన్నది తంబూర వేసుకొని గంటలతరబడి షడ్జ, పంచమ, మధ్యమ స్వరాలను పాడుకొనుటయే. స్వరావళులను శుద్ధముగా మూడు స్థాయిలందు శృతి విడువక జారుతో గమకముతో పాడి సంగతులను శృతిలో అమరి ఇమిడిపోవునట్లు పాడగల్గిన శారీర సాధన, వాద్యములపై స్వాధీనత తప్పనిసరి యన్న అంశమును హిందుస్థానీ సంగీత విద్వాంసులలో బాగా చూడవచ్చును. నోటి పాటకు అనువుగా ప్రక్కన వాయించిన చాలునని వయొలిన్ ద్వాంసులు తృప్తిపడరాదు. ఆ వాద్యమునకు సహజమయిన వినాదము ఎట్టిది? ఎన్నివిధములయిన కమాను లున్నవి? మూడు నాల్గు స్థాయిలలో వివిధ మాధుర్యముల నిచ్చునట్లు వ్రేళ్లాడునా ? వీణకు ఎన్నిరకములయిన 'మీటు' లున్నవి? వేలకొలది సంవత్సరాలలో మన పూర్వులు ఏర్పరచిన వాద్యవిధాన సూత్రము లేవి ? అట్లే మృదంగము అనుసరికి రానురాను లెక్కలను పెంచి, కర కర ఢమఢమ ధ్వనులతో నాద కోలాహలంలో వినువారికి గారడీ మజా నిచ్చినన్నిరోజులు, ఆ వాద్యమునుండి వెడలు ప్రణవనాదము, ఆబాలగోపాలం విన్నంతనే ఆనందముగా చిందులు త్రొక్కు వరుసలు వీనులకు అందవు. Tonal—Purity of quality) నాద పారిశుద్ధతను విశేషముగా అలవర్చుకొనుటకు రోజా గంటలతరబడి సాధన తప్పనిసరిగా చేయువలసి యున్నది. కాని రసాస్వాదనపరులగు కొందరే ఇట్టి శాంతిరసమునకు వేచియుందురు. సామాన్యప్రజల కింతటి ఓపికలు లేవు. రివ్వుమని ఫిరుకాలు పాడుట, స్వర విస్తారంతో మృదంగపు జతుల నాధరముగా నడుపించుట, 'హాత్ హూత్తు' ని నానాధ్వనులతో రెచ్చగొట్టినప్పుడు ప్రజలు నేడు తబ్బిబ్బులు పడి ఆనందపరవశులయిపోయి కరతాళధ్వనులు చేయుచున్నారు. కనుక కలకాలము నిలచు ఆత్మానందాన్ని చేకూర్చు నాదానికని పరిశ్రమ ఎందుకు ? అట్టి గానమును వినువారే లేరే ! విన్ననూ సరిగా ఆదరించరు కదా ? గంటల తరబడి సాధన చేసినగాని వీలుకాని సంగీతమును పాడుటకు గాయకులకు ఎట్టి ప్రోత్సాహము, తీరిక అవసరము ? ఈ విషయముపట్ల దక్షిణదేశ ప్రజలు గాయకులకు చేయువలసిన సహాయము ఇంకా ఎంతయిన కలదు. భూస్వాములు, వర్తకులు, ఇతర జనానీకము శాస్త్రీయ సంగీతాన్ని ఇచ్ఛరీతులలో పాడనిచ్చి, విని మనఃపూర్వకముగా ఆదరించు మంచి రోజులు వచ్చువరకు సంగీత గారడీ లెక్కువయి రానురాను అప్పటమయిన రాగసంపద నమసిపోవును. అప్పుడు చౌకబారు సినీమా సంగీతములోని లబ్జులన్నీ ఈ మేడలందే వినవలెనన్న అపోహ ప్రబలుతుంది. అది వినేవారు నేడు ఆలోచించవలసిన సమస్య. ఇట్టి పరిస్థితి హిందుస్థానీ ప్రాంతములకు రాలేదు. అచ్చటి రసికులకు శాస్త్రోక్తమయిన రాగాలాపనయే వచ్చును. ఎంత విలంబమయినా సరే, ఎంత నిదానంగా పాడినా సరే రాగ విస్తారమును అనుక్షణము సంగిలి సంగతిగా ఆస్వాదించి వింటారు. ఆ శ్రోతలకు ధృపద్, ఖ్యాల్, టుమ్రీ టప్పా మొదలగునవి ఏఏరీతులలో పాడవలయునో ఆ రీతులలో పాడించుకొని విను ఓపిక, రసజ్ఞత గలదు. మన దేశమునందు, రాగభావము, రాగ ఆలాపననుండి క్రమంగా తొలగిపోవుటకు మన శ్రోతల అభిరుచి కొంత కారణము. విలంబముగా మంద్ర మధ్యస్థాయిలలో సంప్రదాయముగా లభించిన స్వరూప వైశిష్ట్యత గల రాగాలను ఆలాపించిననే నిజమయిన సంగీతానుభవం, రసానుభవము కలుగును. ఇట్లు పాడువారే అరుదు. అంతకన్న వినువారు అరుదు. నేటి అలవాట్లు తొలగించి, హిందుస్థానీ గానములోవలె మన సంగీతమునందునూ విలంబ కాలము, మంద్రస్థాయి సంచారము, శృతిశుద్ధత, రాగ స్వరూపములను స్ఫుటీకరించు గమకశుద్ధమయిన గానమును విని

# సంగీతకళ : నేటి స్థితి

ఆనందించి ఆదరించు అలవాటు మన ప్రజలకు కలుగకున్న మేలిమియయిన అంశములు మన సంగీతమునుండి తొలగి పోవుట తథ్యము. అది మనకంటెదుట జరుగుచున్న తిరోగ మనము. ఈ సమస్యను గురించి సుమారు నలభయి సంవత్సర ములకు మునుపే కీ. శే. టైగర్ వరదాచార్యుల సోదరులు శ్రీ కె. వి. శ్రీనివాసయ్యంగార్లు వారు గానభాస్కరములో ఇట్లు వ్రాసియున్నారు. "దాక్షిణాత్య రాగాలాపనము హిందుస్థానీ రాగాలాపనమునకు వ్యత్యాసమై యున్నది.

మరియును హిందుస్థానీ రాగాలాపనము పూర్వ శాస్త్రోక్త రాగాలాపన పద్ధతి యనియును, అదియే మంచి త్రోవ యనియును తెలియుచున్నది. ఎట్లనిన పూర్వగ్రంథ గత పద్ధతిలో రాగములలో ఆలప్తిగాని, ఆలాపనముగాని మంద్ర స్థాయి నుండియే ప్రారంభించి చేయదగినదని స్పష్టముగ తెలియుచున్నది.

హిందుస్థాని గవాయిలు రాగములను పాడునపుడు మధ్య షడ్జములో ప్రారంభించి మంద్రస్థాయి ప్రస్తారమును చేసు కొని వెనుక మధ్య స్థాయిలోను, అటువెనుక తారస్థాయిలోను క్రమముగ రాగ విస్తారము జేసి తరువాత మూర్ఛనా ప్రస్తార ములచే (ఫిరుకాలచే) రాగమును మధ్యకాల త్రికాలముగ జేసి దిగి మధ్య షడ్జములో ముగించుచున్నారు. అందుచేత రాగములోని రక్తి చెడకుండ యున్నది. రాగములను పాడు నప్పుడు సుమారు మధ్యస్థాయి పంచమములోనుండి తారస్థాయి పంచమమువరకు గలుగు రక్తి విశేషము మంద్రస్థాయిలోను మధ్యస్థాయి పూర్వ భాగములోను గలుగుటలేదు. (ఇది సహ జమే). రాగవిస్తారమును చేయునపుడు మంద్రస్థాయి షడ్జ ములో నుండి అపన్యాస క్రమముగా ఆరోహించునప్పుడు (ఒక్కొక్క స్వరమునందు నిలకడ ప్రస్తరించుట) క్రమ ముగ రాగములోని రక్తి యధికమగు చున్నదను విషయము సర్వ జనానుభవ సమ్మతము. అట్లుండియు మన దక్షిణదేశములో గాయకులు రాగములను పాడునప్పుడు వానిని తారస్థాయి షడ్జములోనుండి ప్రారంభించి తారస్థాయి పంచమము వర కును విస్తరించి రాగమును ముగించునప్పుడు పాడదగినదియై యుండు మూర్ఛనా ప్రస్తారములను (ఫిరుకాలను) రాగ ప్రారంభములోనే పాడి రాగములో విరక్తిని ఒక నిముషము లోపల వ్యయముచేసి తదనంతరము కొండమీద నుండు బండ దొర్లిన చందంబున తటాలని మంద్రస్థాయికి దిగి అచట రక్తిరహితమైన సంచారములను చేయుచున్నారు. ఈ రాగ ప్రస్తార పద్ధతి అనుభవమునకును శాస్త్రమునకును విరోధమైనదియే యగును." అని.

రాగప్రధాన సంగీతమున్న సూక్తిని సరిగా పాటించుట లేదు. రాగానికి అందులోని స్వరాలను అతిక్రమించిన ఒక ప్రత్యేక వ్యక్తిత్వం కలదు. ఆ స్వరూపాన్ని అందుకోగల ధీశాలురే రాగరసాన్ని సృష్టించగలరు. రసప్రధానముగా నుండు టకు స్వరావజ్ఞానము గల రాగాలాపన తప్పనిసరి. అట్టి భావనాశక్తి లేని వారి ఆలాపన స్వరముల కూర్పుతో రస రహితమగును. రాగభావమును స్ఫుటీకరించి సర్వ లఘుపోష ణను చేకూర్చు పంచరత్న స్వరాలు, వర్ణములందలి స్వరాలు సుబ్బరాయశాస్త్రి కీర్తనలబట్టి స్వరాలు ఆదర్శనీయములు.

ఈ సందర్భమునందు హిందుస్థానీ గానములోని నాద పుష్టి, రాగపోషణలతోబాటు వారి 'బోల్‌తాన్' అను సంగ తుల రీతులను మనం నెరవలు చేయునపుడు గమనించవల యును. కేవలము లయ విన్యాసాలను రాగమును పెంపొం దించు తాన్లను పల్లవిలో ఖ్యాల్‌లో వలె పాడినను—సాహిత్యా ర్థమును విశదీకరించి పెంపొందించి హృదయములను ఆక ర్షింపచేయుచు భావయుక్తమయి, సులలితమయి, అందచంద ములను విరజిమ్ము—బోల్‌తాన్ టుమ్రీలలో వినవచ్చును. ఖ్యాల్, టుమ్రీలో తానములున్నా ఆ రెంటినీ భిన్నమార్గము లందు నడుపుదురు. అట్టిది మన ప్రాంతమునందు కీర్తనల నెరవలునందు గమనించవలసి యున్నది. పూర్వులు ఇట్లు గమ నించినందున మంచి భక్తి, శృంగార రసములు, సంగీతముతో పెంపొందించబడిన సాహిత్యరస భావములను శ్రోతల కంద జేసిరి. కేవలము తాత్కాలికముగా వింటున్నంతసేపు మాత్రము హాయి అనిపించు చిలిపిచేష్టలను మీరిన ఆత్మానందమును కలుగజేసిరి. ఇట్టి ఉత్కృష్టమయిన సంగీతమునకు— "శాంతములేక సౌఖ్యములేదు." అనుట తప్పదు.

ప్రసిద్ధ రాగములను బాగుగా పాడించుకొని వినగల్గు రసికత ప్రజలలో తగ్గినందువల్లనే రూపనామములు లేని Scales ప్రబలి అసలు రాగములను పారద్రోలుచున్నవి. గాన భాస్కరములోని మరికొన్ని సూక్తులు—"పల్లవి పాడవల సిన క్రమ మేదియని విచారింతము. భగవన్నామ ప్రబంధ మయిన నొక పల్లవిని విరసములేని దిట్టమయిన విళంబ కాలమున నుంచుకొని రాగభావము చెడకుండను పదార్థభావము తొలగకుండను గానము చేయవలయును. సంగీతశాస్త్రముతో దిట్టమయిన పరిచయము లేనివారికి పల్లవి పాడుట యసాధ్యమే యగును. సంగతులు కీర్తనపదములలోని సంగ తుల ననుసరించినవియై యుండుటయే శాస్త్ర సమ్మతము. స్వరములను పాడునప్పుడు వర్ణాలంకారముల ననుసరించియే పాడవలయును. స్వరములలో రాగ కళలు నిబిడమై యుండ వలయును. సంపూర్ణ రాగములలోను, వక్ర రాగములలోను, దేశ్య రాగములలోను, దాటుస్వర ప్రయోగములు విశేషముగ జేయగూడదు. ప్రయోగాంతరముల ననుసరించియే దాటు స్వరప్రయోగములను చేయవలయును. ఉదాహరణముగ : తోడి రాగములో గధమ—మనిద—దరినిద—దగరిని— అను దాటు ప్రయోగములచే రాగకళలు చెడవు. పసస—పగగ—రిదద— రినిమ—గరిద— మొదలగు ప్రయోగములలో రాగకళ లెంత మాత్రము గనుబడవు. ఇటులనే జాతి భేదములును, జంట లును వర్జింపవలసినయవి. ఉ : సరిగ—రిగమ—గమప—గరి సనిద—రిసనిదప—సనిదపమ— మొదలగునవి. తద్ధిత్తకిట, ధిత్తకిట—తద్ధిత్తకిట తదింగిణతోం— మొదలగు కొన్ని పింపుజాతుల ననుసరించిన "పరిప్పనిద—రినిధ—ధరి

స్సనిద—రిసనిదప"— మొదలగు స్వరములు సమూహముగ వర్జింపదగినవి. మురజాతి ననుసరించిన కళాహీనమైన స్వర సంపకములు గానయోగ్యంబులు కానేరవు. ప్రకృతము మన దేశములో దర్బారు, నాయకి, హుస్సేని, ఆహిరి, సైంధవి, కురంజి, నవరోజు, పంతువరాళి, వరాళి మొదలగు పూర్వ ప్రసిద్ధమైనవియును, జ్ఞానబలముచే మాత్రము పాడదగిన వియు నైన యనేక రాగము లెట్లు నశించినవో ఆట్లే పల్లవి పాడు పద్ధతియును నశించెను." అని.

రాగమును అనుస్వరములతో గమకాలంకార ముగ పాడుటకు గురుముఖమునుండి అధ్యయనరీతిగా కొన్ని వందల కీర్తనలు పాఠంచేయడం తప్పదు. వర్ణములను, కీర్తన లను వాటి కర్తలు అందజేసిన రీతిగా ప్రౌఢముగా పాడవల యును. త్యాగయ్యగారి పెద్ద కీర్తనలు, దీక్షితులు, శ్యామ శాస్త్రి కీర్తనలు దీక్షతో దూడిచేసి వాటిని పాడు అధికార మును గడించి ప్రజలకు ఆకర్షణీయముగా అందజేయవల యును. పాశ్చాత్యులు కచ్చేరీలకు వెళ్లుటకు మునుపు Beethoven Moyart మొదలగు మహాపురుషుల సంగీత రచన లెట్టివి, వాటి సహజ గాంభీర్య స్వరూపము లేవి యని పరీక్షించి అవగాహనం చేసుకొని వెళ్లుతారు. కాబట్టి వాగ్గేయకారుల సంగీత రచనలను చెక్కుచెదరక సమ ర్పించు భారము తప్పనిసరి యగును.

మనప్రాంతమునం దిట్టి విచక్షణచాలదు. హిందూస్థానీ రసికులలో ఇట్టి విభాగముకద్దు. ధృపద్ పాడేవారివద్ద ధృపద్‌లు, ఖ్యాల్ విద్వాంసులవద్ద ఖ్యాల్, టుమ్రీటప్పాలు పాడేవారివద్ద వాటినిమాత్ర మేవిని ఆనందిస్తారు. వాద్యము లను వినేసందర్భములలో ఆ వాద్యములో ఏవి బాగుండునో వాటినే వాయించడం వినడం జరుగుతుంది. ఇక్కడ అట్టిది అరుదు. గాత్రము పాడేవారు ఏవైతే పాడతారో వర్ణం, కీర్తన, పల్లవి, తిల్లాన, పదం, జావళీలు అన్నిటినీ వాద్యములందు వాయి స్తారు. కొందరు శ్లోకాలనూ వాయిస్తామంటారు ! ఇదొక ప్రత్యేకత. కాని వాద్యములకయి ప్రత్యేకించిన సంగీతరచనలు ఇదివరకూ ఏర్పడలేదు. ఇట్టి నూతనమార్గములలో క్రొత్త రచనలకు అంతులేని అవకాశమున్నది. మన సంగీత కచ్చేరీలందు పదాలను పెద్దకీర్తనలను వారివారి శారీరమునకు తగినట్లు మార్చి చేర్చిపాడుటవలన సంగీతసంపదకు దాని భవిష్యత్తుకు, తీరని నష్టము చేకూరుచున్నది.

కర్ణాటక సంగీతములోని మేల్మియయిన అంశములు ప్రజాదరణ లోపంవల్లను పాడువారి దీక్షాపటిమ సడలినందు వల్లను అదృశ్యము లగుచున్నవి. రెండుమూడు సభలు వేరుగా ఏర్పడి తీరవలయును— London నగరంలోవలె. ప్రత్యేకించి నట్లు శాస్త్రీయ సంగీత కచ్చేరీలు మాత్రమే కొన్నింట; మరికొన్నిట లలిత సంగీత కచేరీలు జరుగవలయును. అట్లు జరుగక ఆ సభాసదులు ఈ సభాసదులు కలిసి ఒకేచోట రెండు సంగీతాలను వింటున్నందువల్ల ఉభయులకూ సరియయిన సంగీత విందులు లభించటంలేదు. పెద్ద యోగ్యతలుగల విద్వాం సులు చౌకబారుగా పాడజాలకున్న ఇప్పటి పరిస్థితిలో వారికి జీవనోపాధికూడ దుర్లభమగును. శ్రీ టైగర్ వరదాచార్యులు, వీణ సాంబశివయ్యరు, వీణ ధనమ్మ, మన హరి నాగభూషణం గారు— అందరూ ఇట్టి ప్రజానిరాదరణకు గురియయినవారే. ఇట్టిదుస్థితిని, నివారించుటకు మనశ్రోతలుకూడ హిందూస్థానీ సంగీతశ్రోతల అడుగుజాడలను అవలంబించుట మంచిది. ఉత్తరదేశములో సంగీత గోష్ఠులున్నవి. సుమారు ముప్పయి నలభయి ఆరితేరిన రసికులు గుమిగూడి వింటారు. పాడువారు తమశక్తిని పరిపూర్ణముగా చూపెట్టవచ్చును. అక్కడ రక్తి కని చిలిపిచేష్టలు చేయుట అనవసరము, వ్యర్థము. కచ్చేరి అంతములో అట్టి గాయకులకు వేయిరూపాయలు, లేక ఐదువందలు ఇవ్వడము జరుగుతుంది. ఆంధ్రదేశములో అట్టి Music Circles సంస్కారసంపన్నులు ఏర్పరచినగాని సంగీత విద్యకు గత్యంతరములేదు. సంగీత నాటక్ అకాడమీ వారు అక్కడక్కడ గానకచ్చేరీలు ఏర్పాట్లు చేయించి ప్రజలలో సంగీతమువినే అలవాటు అభివృద్ధి చేయవలయును. గాయకు లకు సరియయిన ప్రోత్సాహము లభించుటకు ఇంకను రెండు తరాలు కావలయునేమో ! అట్టి సుసమయం ఏర్పడు లోపల మంచివన్నీ నశించి పట్టి గ్యాలరీ గడబిడతే దక్కకుండ పెద్ద పెద్ద దేవాలయములలో ఆలయాని కొక్క విద్వాంసుని ఆస్థాన విద్వాంసునిగా నియమించి, నెలకు మూడువందలో నాలుగువందలో ఇచ్చి అతని కొరతను తీర్చవలయును. అచ్చట గురుకుల వాసమేర్పరచి సంగీత విద్యాదానమునకు ఏర్పాట్లు చేయవలయును. అప్పుడు గాయకులకు సరియయిన వాతావరణం ఏర్పడుతుంది. మంచి సంగీతము విద్యార్థులకు నేర్పుటకు అవకాశముంటుంది. అది తప్పక చేయవలసిన ముఖ్యమయిన ఏర్పాటని నా విశ్వా సము. లేకున్న ఊరూరు తిరిగి కచ్చేరీలుచేయు విద్వాంసులు, ఇంటింటికెళ్లి తమ ఊపిరినంతా వచ్చీ రానివాళ్లకుచెప్పి తనుకున్న విద్యను గోల్పోవడం జరుగుతూనే వుండును. రానురాను సంస్కార మున్నవారికి శాస్త్రీయ సంగీతమునకు తమ జీవనము ధార పోయుట సాహసమేమో ననిపించుటవల్ల పురుషులు బొత్తిగా సంగీతమువంక పోవడం మానివేయుటం నే నెరుగుదును

సంగీతవిద్య బాగా అభివృద్ధికి రావలయునన్న ప్పట మయిన సంగీతమునకు ప్రోత్సాహము దొరక యును. శాస్త్రీయ సంగీతమును పెద్ద పెద్ద నగరములందు నే ద్వారా వ్యాప్తి చేయించవలయును. రేడియోకం పెను ప్రజలు గాయ కుల నెక్కువగా ఆదరించవలయును. అట్టి ప్రజాదరణ కలిసి వచ్చినప్పుడు మంచి సంగీతము దేశములో ప్రబలి ప్రజలకు మనశ్శాంతిని చేకూర్చును. అట్టి బ్రహ్మానందమును ప్రజలు నిరంతరముపొందు సదవకాశములను దేవాలయ నిర్వాహకులు, సంగీతనాటక అకాడమీవారు కలుగజేయగల మంచిసదుపాయ ములు వేరులేవు.

# 'శరణార్థిచేయు' శబ్దపల్లవమే

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

## 1

తత్త్వ నిర్ణయ తాత్పర్యముతో, శాస్త్రానుకూలమార్గమున చర్చలు సాగించువారిలో — ఎంతైనను వాదింపవచ్చును; వారిని ఒప్పించను వచ్చును. కాని, విషయపరిజ్ఞానము లేక వితండావాదములకు సిద్ధపడువారితో వేగుట మహాకష్టము. వారిని ఒప్పించుట బ్రహ్మదేవునికిని వశముకాదు.

1962 ఆగస్టు భారతిలో, శ్రీ ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులుగారు, కాళహస్తి మాహాత్మ్యము— అచ్చుప్రతిలో నున్న 'శరణార్థిఁజేసి' అను పాఠమే సరియైన దన్నారు.

నేను— అక్టోబరు భారతిలో— "కాదు స్వామీ ! (శరణార్థి + చేయు) 'శరణార్థిచేయు' అని శబ్దపల్లవ క్రియ. ఈజాతి క్రియలలో— అరసున్నలు, ద్రుతకార్యములు ఉండవు" అని లక్షణము చెప్పి, 'శరణార్థియొనర్చి' (1—34) అను మరియొక ప్రయోగమునుగూడా చూపించి, 'శరణార్థిచేసి' అనుటయే సరి. 'శరణార్థిఁజేసి' అనుట సరికాదని వివరముగా తెలిపినాను.

కాని, వారి వాదథోరణిని బట్టి—వారికి శ. ప. క్రియల తత్త్వము బొత్తిగా తెలియదనీ, చెప్పినను బోధపడదనీ నా కప్పుడే తోచినది. నా వ్యాసములో వ్రాసియు నున్నాను— మరియు వారు తమ వాదమును ఒకమాత్రాన వదలుకొను వారుకారనియు తోచినది. అదే నిజమైనది.

శబ్దపల్లవ లక్షణమును నే నంత వివరముగా చెప్పినను మనసున కెక్కించుకొనక— "శరణార్థిచేయు — శబ్దపల్లవమా?" అంటూ— డిశంబరు భారతిలో మళ్లీ ప్రత్యక్షమైనారు. ఈమాటు వారి ప్రసంగముకూడా కొంచెము సుతిమించినది. అందువల్ల, నాకు శ్రమ యైనను, లేఖ ఒక్కింత విస్తరిల్లినను, వారి యాక్షేపములకు సమాధానములు సమగ్రముగా వ్రాయవలసినదే నవి, లేకున్నచో వారివలని బాధ తొలగదని తోచినది. అందువల్ల వీలయినంతలో— విపులముగానే వ్రాయుచున్నాను.

(1) "శాస్త్రిగా రీసారి క్రొత్తయెత్తు నెత్తినారు. తాము తొలుత వ్రాసిన వ్రాతను సమర్థించుకొనుటకు, వారు త్రొక్కిన క్రొత్తపుంత ఇది. 'శరణార్థిచేయు' శబ్దపల్లవ మనియు, నందు 'శరణార్థి'యను విశేష్యమునకు 'చేయు' అను క్రియ యమప్రయుక్త మైనదనియు, నట్లగుట శబ్దపల్లవలక్షణ మనియు సిద్ధాంతీకరించుట శ్రీ శాస్త్రిగారి సాహసమో ! నా యజ్ఞతయో ! పాఠకులే యూహించుకొందురుగాక" అని వారి వ్రాత.

నే నీనాడు క్రొత్తగా ఎత్తిన యెత్తుగాని, క్రొత్తగా త్రొక్కిన పుంతగాని, చేసిన సాహసముగాని యేమీ లేదు. ఆచార్యులుగారు తమ స్వభావముకొలదిని అట్లు భావించియుందురుగాని, వాదముకొరకు వక్రమార్గము త్రొక్కుట నా పద్ధతి కాదు. ఇది యంతయు నన్ను సరిగా నెరుగక వ్రాసిన వ్రాత. నిన్న కుప్పలు— నేడాళ్లు' అన్నట్లు వా రిప్పుడిప్పుడు విమర్శ రంగములో అడుగుపెట్టుచున్నవారు. కావున శబ్దపల్లవవ్యవహారము వారికి క్రొత్త గాని, నాకు క్రొత్త కాదు. చిరకాలము క్రిందటనే నే నీ క్రియయొక్క లక్షణమును, బహుప్రయోగ ప్రమాణములతో— నా 'సాహిత్యసమీక్ష'లో— నిరూపించి యున్నాను. ఆ గ్రంథము 1955లో ముద్రితమైనది. ఈనాడు వారు శబ్దపల్లవమును గూర్చినాకు బోధింపవచ్చుట, తాతకు దగ్గులునేర్ప బూనుట వంటి పని.

(2) "శాస్త్రిగారు నుడివినట్లు— 'శరణ + అర్థి + చేయు' అందలి 'శరణ + అర్థి' అను రెండుపదములు కలిసిన విశేష్యముఁ బూర్వపదముగా గలిగినట్టి దానినిగూడ శబ్దపల్లవ మనవచ్చునని యింతదనుక నెవ్వరికిని దెలియని రహస్యము గాబోలు !" అని వారి ఆక్షేపము.

ఆక్షేపించుటే కాక అవహేళనముకూడా చేసినారు. చేయనిండు; దానికేమిగాని, రెండుపదములేకాదు; మూడు, నాలుగు, అయిదు పదములు కలిసిన విశేష్యము పూర్వపదముగా నున్నను— శబ్దపల్లవమే యగును. అదే అందున్న రహస్యము. ఈ రహస్య మెవరికిని తెలియనిదికాదు. వ్యాకరణము చదువుకొన్న వారికీ, ప్రాచీన కావ్యప్రయోగపరిచయ మున్నవారికీ తెలిసినదే. నా 'సాహిత్యసమీక్ష'లో పెక్కుప్రయోగము లిచ్చియున్నాను. లేఖ విస్తరభీతిచేత, వాటిలో కొన్ని మాత్రమే ఇక్కడ చూపుచున్నాను.

1. 'ఐదు వదిసేయు = అంజలించు'.

ఇది రెండుపదములు గలిసిన శ. వ. క్రియ (ఐదు + వది + చేయు).

"ఐదు వదిసేయరు దత్తిన తక్క" (ఆము. 2—34).

2. 'చీకటి తప్పుసేయు = వ్యభిచరించు'.

ఇందును రెండుపదము లున్నవి. (చీకటి + తప్పు + చేయు).

"అమరవల్లభుండు గౌతము కూర్మి యిల్లాలిఁ
జీకటి తప్పుసేసిన విధంబు" (శృం. నై.7—151).

(ఇల్లాలిర్ = ఇల్లాలితో— అని యర్థము).

3. 'నల్లమేఁక తప్పుసేయు=రమించు'.

ఇది మూఁడు పదములు కలిసిన క్రియ (నల్ల+మేఁక+తప్పు+చేయు).

"బలభేది గౌతముభార్య నహల్యఁ గా
మించి చేయఁడె నల్లమేఁకతప్పు" (ప్రబోధ. 1—50).

(నల్లమేఁక తప్పుచేయఁడె— అని సమన్వయము).

4. 'తునిమితూఁటాడు = త్రుంచి ముక్కలుచేయు'.

తునిమి+తూఁటాడు. ఇది అసమాపకక్రియ ముందుగా గలిగిన శబ్దపల్లవము. ఇందును రెండుపదము లున్నవి. (తునిమి+తూఁట+ఆడు).

ఈ శబ్దపల్లవముల ప్రయోగవిధానమును వ్యాకరణములు చెప్పలేదు. నిఘంటువులును ఈక్రియలను సరిగా గుర్తింపలేదు. 'బుద్ధిసేయు' అను శ. ప. క్రియ, బహుచిత్రముగా ప్రయుక్తమై యున్నది. ఆచార్యులుగారి కొరకు గాకున్నను, జిజ్ఞాసువుల కొరకైనను ఉదాహరించుట అవసరమని తోఁచి, ఉదాహరించుచున్నాను.

(i) "మాత్స్యపురమున దైన్యపడుట బుద్ధిసేయకు" (అశ్వ. 1—116).

బుద్ధిసేయకు=తలఁపవలదు— అని యర్థము.

(ii) "ఏటికి నొండొక బుద్ధిసేసెదు" (ద్రోణ. 1—391).

ఎందుకు అన్యథా భావించెదవు— అని యర్థము.

ఇక్కడ, 'ఒండొకబుద్ధి' యను సమస్తపదమునకు 'చేయు' అనుప్రయుక్తమై, శ. ప. క్రియ యైనది. ఇందులో మూఁడు పదము లున్నవి. (ఒండు+ఒక+బుద్ధి+చేయు).

(iii) "సా, వీరకుల ప్రసూతులము వీరులమే మితరక్షితీశసాధారణబుద్ధిసేయకు ముదాత్తచరిత్రులమైన మా యెడన్". (అర. 6—182).

ఇక్కడ— 'ఇతరక్షితీశ సాధారణబుద్ధి' యను సిద్ధసమాసమునకు 'చేయు' అనుప్రయుక్తమై, శ. ప. క్రియ యైనది. ఇది అయిదు పదములు కలిగినది. (ఇతర+క్షితి+ఈశ+సాధారణ+బుద్ధి+చేయు).

మేము మహావీరులము. మమ్ము ఇతరాజులను భావించినట్లు— అల్పముగా భావింపవలదు— అని భావము. శబ్దపల్లవక్రియాయోగముగల ప్రయోగములకు భావప్రధానముగా అర్థముచెప్పికొనవలె గాని, ప్రతిపదార్థము చెప్పరాదు. అది కుదురదు.

శ్రీ ఎన్. టి. పి. వి. ఆచార్యులుగారు ఏమంటారో! వారు 'శరణార్థిచేసి'— 'శరణార్థి యొనర్చి' అను ప్రయోగములను— 'శరణార్థిఁజేసి'— 'శరణార్థినొనర్చి' అని మార్చవలెననుచున్నవారుగదా! భారతప్రయోగమునుగూడా, 'ఇతరక్షితీశ సాధారణబుద్ధిఁ జేయకుము' అని మార్చవలసినదే నంటారేమో! అట్లు మార్చినచో, 'బుద్ధిఁజేయకుము = బుద్ధిని చేయవలదు'— అని యర్థ మగునేగాని, 'భావింపవలదు' అన్న అర్థమురాదు. ఆ యర్థము రానిచో పద్యమే వ్యర్థమగును. 'బుద్ధిసేయు' అను క్రియతో అన్వయించిననేగాని కవ్యుద్దిష్టార్థము సిద్ధింపదు.

అయిదు పదములు కలిసిన విశేష్యముతో నేర్పడ్డ శ. ప. క్రియయును ఉన్నది గనుక, రెండు పదములు కలిసిన విశేష్యముతో— శ. ప. క్రియ యేర్పడినదని నేను చెప్పుటలో పొరపాటు లేదనియు, అట్లుచెప్పుట సాహసమని శ్రీ ఆచార్యులుగారు ఆక్షేపించుటయు, అవహేళనము చేయుటయు ప్రాజ్ఞత యనిపించుకొన దనియు ఇక్కడ సారాంశము.

(3) "శరణార్థిచేసి— యనునది శబ్దపల్లవము కాదు. కనుకనే— శరణార్థిఁజేసి = శరణమును గోరి (శరణముయొక్క అర్థిని జేసి) అను నర్థము పొసగును" అన్నారు వారు.

ఇది యొక వక్రవ్యాఖ్యానము. వాదముకొరకు పట్టిన తప్పుదారి. 'క్రొత్తపుంత త్రొక్కుట' యనగా ఇట్టిది— 'శరణార్థిఁజేసి' అంటే, 'శరణమును గోరి (శరణముయొక్క అర్థిని జేసి)' అని యర్థమట! ఇది (వారన్నట్లు), ఇంతదనుక పండితుల కెవ్వరికిని దెలియని పరమరహస్యము గాబోలు!

ఆ యర్థము పొసగు నన్నారు. అది యెట్లు పొసగును? 'శరణముయొక్క అర్థిని జేసి' అన్నప్పుడు 'అర్థి' పదమున కర్థ మేమి? 'కోరిక' అనియా? ఈ యర్థము సంస్కృతమున నున్నదా? లేదు. తెనుగున నున్నది. అదియు వ్యస్తముగా నున్నప్పుడే. కనుక శరణ శబ్దముతో సమసింపదు— ఎట్లో సమసించు గాక; 'శరణార్థిన్— శరణముయొక్క కోరికను' అని యర్థమును అగుగాక; మరి 'చేసి' యను క్రియ కేమర్థము? 'కోరికను—చేసి' అంటే 'కోరి' అని అర్థ మెట్లగును?

శరణముయొక్క కోరికను— 'చేసి = ఒనరించి' అని యగును. లేదా, శరణముయొక్క— 'కోరికనుజేసి = కోరికచేత' అని యగును. అంతేగాని 'శరణమును గోరి' అని కాదు. ఆ యర్థము కావలె నంటే, 'శరణ మర్థిచేసి' అనవలె. అప్పుడు— శరణము= శరణమును, అర్థిచేసి = కోరి— అని యర్థ మగును. 'శరణార్థి'వి అనుటలో అర్థమే లేదు.

'విద్యనుకోరి వచ్చినా'ననుటకు, 'విద్యార్థిని జేసివచ్చినా' ననుట ఆచార్యులుగారి సాహిత్యమున చెల్లునేమో గాని, ప్రాచీన సాహిత్యరీత్యా చెల్లదు— కనుక వారిపాఠమూ, అర్థమూ రెండును తప్పే.

(4) "శరణార్థిచేసి— శబ్దపల్లవముకా" దన్నారు.

అగునో, కాదో; వారికే మెరుక? ఎరుకగలవారు శబ్దపల్లవముగానే గ్రహించినారు. అందు క్రింది యుదాహరణలు ప్రమాణము.

# ‘శరణార్థిచేయు’ శబ్దపల్లవమే

(1) “ఆడకి యమ్మకు శరణార్థిసేయుచును”.
వేటూరివారిప్రతి. (బసవ. పుట. ౧౫౨).

(2) “అడచి (?) యమ్మకు శరణార్తి యాచరించి”.
పిడుపర్తి. (బసవ. ౫—౧౧౪).

(శరణార్తి = శరణార్థి).

(3) “శరణార్థిసేసి తజ్జంగమంబునకు”.
చిలుకూరి వారిప్రతి. (పండితా.సం.౧–పుట.౨౧౫).

(4) “సద్భక్తిఁ దపసికి శరణార్థిసేసి”
(పండితా. సం. ౨-పు. ౪౭౧).

(5) “అరఁగుదేరుగ శరణార్థి సేయుచును”
(పండితా. సం. ౨—పు. ౪౯౬).

ఇంకను ఉదాహరణబాహుళ్య మెందుకు ? ఆచార్యులుగారి వాదము తప్పు.

(5) “అర్థినిజేసి— యనునప్పు డర్ధానుస్వార ముండుట యుచితమేగదా ! ‘శరణార్థి యొనర్చి’ యనుచోటను ‘శరణార్థి నొనర్చి’ యనుకొనవచ్చును” అన్నారు.

అర్థజ్ఞానము లేనప్పుడు అట్లనుకొనవచ్చునుగాని, అర్థము తెలిసిన తరువాత అ ట్లెవరును అనుకొనరు. ‘అర్థిచేసి’ అను శ. ప. క్రియలో అరసున్న పెట్టుటచేతనే ఇంత యనర్థ మేర్పడినది. కాబట్టి ఆయరసున్న యుండుట యుచితము కాదు. కేవల మనుచితము.

అరసున్నల వలన శ. వ. క్రియలఅర్థము లెట్లు మా రుచుండునో తెలియుటకు కొన్ని యుదాహరణ లిచ్చుచున్నాను.

i. ఆలిసేసి=చెఱచి.
ఆలిఁజేసి = భార్యను (గా) చేసి.

ii. తప్పుసేసి = తప్పుగానెంచి.
తప్పుఁజేసి = తప్పుచేత.

iii. మాయచేసి = మోసముచేసి.
మాయఁజేసి = నశింపఁజేసి.

iv. కొండసేసి = గొప్పచేసి.
కొండఁజేసి = కొండనుచేసి— మొదలగునవి.

ఈక్రియల కన్నిటికిని—నా ‘సాహిత్యసమీక్ష’లో ప్రయోగము లియ్యబడియున్నవి. శ్రీవారు చిత్తగించి, శ. ప. క్రియలలో అరసున్నలుండుట ఉచిత మగునేమో తెలిసికొందురుగాక.

శ్రీమా చార్యులవారి ఆక్షేపముల కన్నిటికిని సమాధానములు వచ్చినట్లే నేను భావించుచున్నాను. ఏవయినను కొరవ నరవ లున్న మన్నింపవలసినదని వారికి నా మనవి.

వారి యాక్షేపములు, వారుచేసిన సవరణ, దానికి వారు చెప్పిన అర్థము, వారి సిద్ధాంతము అన్నీ తప్పులే ననియు, ‘శరణార్థిచేసి’ అనునదే సాధుపాఠ మనియు, అది శబ్దపల్లవమే— అందుకు సందేహములే దనియు ఈ విచారణలో తేలిన ఫలితాంశము.

## నా పొరపాటు

ఇంతవరకును శ్రీ ఆచార్యులుగారి తప్పులు చెప్పినాను. వాటితోపాటు చెప్పవలసినది— నా పొరపాటుకూడా ఒకటి యేర్పడ్డది. అది యేమనగా:—

నేను సవరించిన పాఠము సరియైనదే గాని, నేను ఆపాఠానికి చెప్పిన ‘శరణుకోరి’ అను అర్థము సరియైనది కాదు. సాహిత్యదృష్టితో— ఊహించి అట్లు చెప్పినాను గాని— ‘శరణార్థిచేసి = నమస్కరించి’ అని చెప్పుట సమంజసము. ఇది సంప్రదాయశుద్ధమైన అర్థము. నా కిటీవల తెలిసినది. ఎట్లు తెలిసిన దనగా :—

ఆచార్యులుగారి యాక్షేపమునకు సమాధానముప్రాసి భారతికి పంపిన తరువాత, ఒకనాడు బసవపురాణమును చూచు చుండగా, ఈక్రింది పంక్తులు కనబడినవి.

“విడియంతో రెండువేల మాడలును
నడకి యమ్మకు శరణార్థిసేయుచును
.... .... చనియె నా బసవఁడు”. (పు. ౧౫౨).

‘అమ్మకు శరణార్థిసేయుచును’— అను మాటలో ‘శరణుకోరు’ అన్న యర్థము ఏవిధమునను పొందపడలేదు. ‘కాళహస్తి’ పద్యములో— “రండవ భక్తిన్ శరణార్థిచేసి” అని యున్నందున, ‘శరణుకోరి’ అన్న యర్థ మక్కడ ఒకవిధముగా సరిపడినది గాని, ఇక్కడ ‘అమ్మకు’ అని షష్ఠ్యంతముగా నున్నందున— అమ్మకు శరణుకోరి— అనుట బొత్తిగా సరిపడలేదు. ‘అమ్మకు నమస్కరించి’ అని యర్థమని సందర్భమే చెప్పుచున్నది. అందువల్ల ‘శరణార్థిచేయుట’ యనగా— నమస్కరించుట యనియు, ‘కాళ.’ పద్యమునను ‘శరణార్థిచేసి = నమస్కరించి’ అనియే అర్థ మనియు అప్పు డూహించుకొన్నాను.

మరియొక విషయ మేమనగా :— శైవులు— పరస్పరము —‘శరణార్థి’ అంటూ నమస్కరించుకొనుట ఆచార మైనట్లు— ఈ క్రింది పంక్తులవలన తెలిసినది.

“ ‘శరణార్థి’ యని చక్కఁ జాఁగి మ్రొక్కుడును
దరుణియు నటమున్న ‘శరణార్థి’ యనుచు
వడుగుల కర్ఘ్యపణ్యంబులు దేర”. (పు. ౧౫౨).

పెద్దలను దర్శించినపుడు— వైష్ణవులు ‘దసోహ’ మన్నట్లు— జంగములు ‘శరణార్థి’ యనుట సంప్రదాయ మని ఈక్రింది వాక్యములు తెలుపుచున్నవి.

“అరుదెంచి డగ్గఱి ‘యయ్యగారలకు
శరణార్థి శరణార్థి శరణార్థి’ యనుడు
‘శివమస్తు శివమస్తు శివమ’ న్నటంచుఁ
దవిలి తోడ్తోడన తవసి దీవింప”. (పు. ౧౫౪).

నేను గుర్తించిన ఈ విషయములు సరియైనవే నని, మిత్రులు శ్రీ యస్. సదాశివ (ఎం. ఏ.) గారు వ్రాసిన జాబు వలన— తరువాత— ధ్రువపడినది.

శ్రీ సదాశివగారు బహుభాషా సంప్రదాయజ్ఞులు. మంచి విమర్శకులు. సహృదయులు. వా రి శబ్దపల్లవచర్చను చదివి, తమ యభిప్రాయమును వా కిట్లు వ్రాసినారు:—

(ఆదిలాబాద్. 20—8—62). "గతమాసం భారతిలో కాళహస్తి మాహాత్మ్యంగూర్చి తాము వ్రాసిన విషయములు చదివి నాను. 'శరణార్థిఁజేసి' అను దానిని తాము 'శరణార్థిచేసి' అనియే ఉండవలె నన్నారు. ఈనెల భారతిలో ఎవరో శ్రీరామానుజా చార్యులవారు, నైఘంటికమైన పదార్థాన్నీ, వ్యాకరణాన్నీచూచి అది సరికాదనీ, శరణ మర్థించుట, శరణు నర్థించుట అని వుండ వలసి యుండుననీ, కనుక 'శరణార్థిఁజేసి' అనునదే సరియైనదనీ వ్రాసినారు. దాని ప్రయోగం తెలియని వ్రాతలవి. శరణార్థి చేయుట అనగా నమస్కారముచేయుట. అచల సంప్రదాయము లోనూ, జంగమభక్తి మార్గంలోను భక్తులు పరస్పరం కలుసు కొన్నప్పుడు— "అయ్యా! శరణార్థి—శరణార్థిని" అంటారు. అంటే 'అయ్యా! నమస్కారము' అనే అర్థము. మార్వాడీలు— జై రామజీకీ, జై గోపాల్‌జీకీ అంటారు. సన్న్యాలు నారాయణ స్మరణచేస్తారు. దేశభక్తులు జయహింద్ చేసుకొంటారు. ఇవన్నీ నమస్కారపరంగ వాడేవే. నైఘంటికార్థం అవసరంలేదు. కనుక తాము వ్రాసినట్లు శరణార్థిచేయుటే సమంజసము".

శబ్దార్థపాఠములకు సంబంధించిన ప్రకృతవివాద ములో, పండితులైన పాఠకుల అభిప్రాయమును తీసికొను టయు నవసరమే గనుక, శ్రీ సదాశివగారి— విలువగల— అభి ప్రాయమును నే నిందు పొందుపరిచినాను.

ఈ జాబులో, శ్రీ ఆచార్యులుగారి వాదము సరియైనది కాదన్న విషయముతోపాటు — 'శరణార్థిచేసి = నమస్కరించి' అని చెప్పుట సరిగాని, 'శరణుకోరి' అని చెప్పుట సరిగాదన్న విషయముగూడా వ్యంగ్యముగా తెలుపబడినది.

ఆ డిశంబరు భారతిలోనే, శ్రీ విర్జాల చంద్రశేఖరయ్యగారును— "కర్ణాటక దేశములో కొన్ని ప్రాంతములలో 'శర ణార్థి' అంటే 'నమస్కారము' అని వ్యావహారికముగా అర్థము కలదు" అని సహృదయతతో తెలిపియున్నారు.

ఇట్లు 'శరణార్థి' ప్రయోగ సంప్రదాయార్థమును దయతో తెలియజెప్పిన శ్రీ సదాశివగారికిని, శ్రీ చంద్రశేఖరయ్య గారికిని కృతజ్ఞతను చెప్పికొనుచు, వారి యుపదేశమును, బసవపురాణ ప్రయోగమును అనుసరించి, నేను నా పొరపాటును సవరించుకొనుచున్నాను.

శ్రీ యాచార్యులుగారు — "శరణార్థిచేయు— శబ్ద పల్లవ మని సిద్ధాంతీకరించుట, శాస్త్రిగారి సాహసమో! నా యజ్ఞతయో! పాఠకులే యూహించుకొందురుగాక" అని సెలవిచ్చియున్నారు.

పాఠకులైన శ్రీ సదాశివగారు అది శబ్దపల్లవమే నని నిశ్చయించినారు. మరి ఆచార్యులుగా రేమందురో!

ఇటపై వా రేమన్నను, నేను మాత్రము బదులువ్రాయను.

## 2

ఆ డిశంబరు భారతిలోనే, ఈ శబ్దపల్లవక్రియకు సంబంధించినదే— శ్రీ రావూరి మృత్యుంజయరావు అనువారి ఆక్షేపవ్రాత ఒకటి యున్నది.

నేను శ. ప. క్రియలలో— అరసున్నలు, ద్రుతకార్యములు ఉండవనుట 'ప్రమాద'మని వారి యాక్షేపము.

కనుఁగొను, ఏఁగుదెంచు, అరుగుదెంచు, చనుదెంచు మొదలగు క్రియలలో— అరసున్నలు, ద్రుతకార్యములు— ఉన్న వనియు, అట్టే శ. ప. క్రియలలోను ఉండవచ్చు ననియు, 'శరణార్థిఁజేసి' అనునదే సరియైన పాఠమనియు వారి సిద్ధాంతము.

'కనుఁగొను' లోని 'కొను', 'గొను' అగుటయు, 'ఏఁగు దెంచు' మున్నగు క్రియలలోని 'తెంచు', 'దెంచు' అగుటయు ద్రుతకార్యమని వారి భావము.

వారు ప్రకటించిన భావమే, వారు బాలవ్యాకరణము నైనను చదువుకొన్నవారు కారని చెప్పక చెప్పుచుండగా— నేను వారి యాక్షేపమునకు సమాధానము వ్రాయుట యెందుకు? వ్రాసి ప్రయోజనమేమి? అదియొక ప్రొద్దుపోని పని. కనుక నే నేమీ వ్రాయుట లేదు. ఇక నెన్నడును— ఇట్టి నీరసాక్షేపము లతో నాకు అలజడి కలిగింపవలదని మాత్రము వారికి వినయ ముతో మనవిచేసికొనుచున్నాను.

నా మనవిని మన్నింపక, యేమేని వ్రాసినను, దానికి నా తూష్ణీంభావమే సమాధాన మగును.

# క్షేమేంద్రుని దేశోపదేశము

## శ్రీ పమిడిపాటి వెంకటరమణ

క్షేమేంద్రుడనుసరికి భారతీయ సాహిత్య - పరిచయ మున్న వారందరికీ అతని ఔచిత్య విచారచర్చ వెంటనే స్ఫురణకు వచ్చును. కావ్యాత్మ స్వరూపచర్చా మహోద్యమచరిత్రలో ఔచిత్య ప్రస్థానమున కతడాచార్యపీఠము. అట్లని అతడు కావ్యతత్త్వ ద్రష్టయైన ఆలంకారికుడు మాత్రముకాదు రమ్యకవిత్వ స్రష్టయును. సమకాలిక సమాజరక్తనాడులలో చొచ్చుకొని పోయి అందలి విషవ్యాప్తి నిర్మూలనకు అమృత తుందిల రచనా నిర్మాణములో అతడు నాటి సాహిత్యముననేకాదు భారతీయ సాంఘిక పరిణామావసరమున వెలయు సాహిత్యమునందంతటను విశిష్టస్థాన మధిష్ఠించినాడు. ఆ సమాజపు విశ్వరూపమును నిండు కళ్ళతో దర్శించి లేఖిని ముఖమున దానిని గంభీరముగా పునర్భవ పునీతమొనర్చిన వాడతడు.

సరస్వతీ దరహాస చాలనములకు ఆ కరమైన కాశ్మీర సీమలో క్రీ. శ. 990—1065 సం. ల నడుమ అభినవ గుప్తపాదుని శిష్యుడుగా అనంతదేవ భూపాల సమ్మానితుడునై వాసికెక్కినవాడు క్షేమేంద్రుడు. అతఃపూర్వమున్న సంస్కృత వాఙ్మయమును పూర్తిగాజుర్రి సువిశాలమైన సాహిత్యానుభవ మును గడించినాడు. అంతేకాదు. లోకముయొక్క మంచి చెడ్డ లను లోతుగా పరిశీలించినాడు. ఆ శారదా పీఠప్రాంగణ రంగ వల్లికలుగా విషయ వైవిధ్యముతో ముప్పది గ్రంథములు రచించి నాడు. అందు సంస్కృతమున అధిక్షేప వాఙ్మయమునకు అధ్యక్షస్థాన మలంకరించు కావ్యములొకటికాదు రెండుకాదు అయిదున్నవి. అవి దర్పదళనము, కళావిలాసము, సమయమాతృక, నర్మమాల, దేశోపదేశము. ఈ కావ్యములలో సంఘములోని కుళ్ళునంతటిని జలకడిగి విడిచినాడు. లోకమునెడ అతని చూపు సింహావలోకనము. పోల్కింతన మతనివాక్కు రామ బాణము. అతని విమర్శ అధిక్షేప కేవలము, తర్కకర్కశమును అగుటకాదది హితోపదేశపేశలమును. అది మానవ స్వభావమును మూలమంట స్పృశించినదగుట కవిక్రాంత దర్శనుడగుట, తద్దేశ పరిమితమును తాత్కాలికమునుగాక సార్వదేశిక సార్వ కాలిక ప్రతిపత్తియు కలిగియున్నది. అందుకొన్ని తాత్కాలికా చార పరిమితములైన ప్రకరణములున్నను అటనతడు మానసిక ప్రవృత్తిని విశాల దృష్టితో చిత్రించిన వాడగుట అవి అభి ప్రాయ నిరపేక్షముగా ఆస్వాదనీయములే. ఔచిత్య విచార రూపమగు ప్రజ్ఞ అతనికి సంస్కారసిద్ధము వివేచనా బద్ధమును ఐనది. అది యెంతటి నిశిత విమర్శకును నికషరేఖ.

ప్రకృత మాతని దేశోపదేశము.

అది

ఇత్యుద్దేశ నిర్దేశనేన వివిధం యత్కించి దుక్తం మయా
తత్పర్వం స్మితకారణం సహృదయాః శృణ్వన్తు సంతఃక్షణమ్
క్షేమేంద్రః ప్రణీతం కరోతి నపటు శ్లోకోవ హాస్యేష్యలం
కింత్వే షవ్యపదేశతః ప్రతిపదం దేశోపదేశః కృతః

అభిప్రాయములు, వానికి తగిన నిదర్శనములతో వర్ణింపబడినదిది. అన సంస్కరణ కవసరమైన ఆచారముల, సమ్య గభిప్రాయముల నిరూపించి, నిదర్శన పూర్వకముగ నిర సింతునని చెప్పుకొనుట. అవి అన్నియు సహృదయులచే నవ్వ దగినవి అని, అట్లని కేవలము లోకముచే నవ్వబడుటకు మాత్రమే కాదు అందలి ప్రతిపదమును ఉపదేశ వ్యపదేశమైనదే. అట్టి దేశోపదేశమును క్షేమేంద్రుడు రచించినాడు. లోకమున కుపదేశదృష్టి ప్రధానమగుట దానిపేరే దిగంబరముగ చెప్పు చున్నది. అదిప్రముఖము. అనుషంగికము, రచనావసరమున ఉల్లిసహల్లిసకముగ హృదయమూగి ఉపదేశోపచయమున కుపకరణము హాస్యము. ఇది సేరుగా సాంఘిక విమర్శగాని వ్యక్తి విమర్శగాని చేయుటకు ప్రతి రచయితయు గ్రహించు ఉపకర ణమే. అయితే ఏ రచయిత అయినను కొంతవివేచన కలవాడయిన ఉపదేశములకేమి తెగచేయవచ్చును. తాను ఆచరించు విషయ మెట్లున్నను ఇతరులను ఆచరింపచేయునట్లున్న కాని ఉద్దిష్ట ప్రయోజనము పండుపండదు. అట్టిరచనవలన ఉపదేశమునకును బరువు, సూక్ష్మత, నిశితత్వములు అలవడును. అన ఉపదేశోపయుతమైన రచనచేయుట అతిసామాన్య విష యమే కాని అది కవితాస్థాయి నందుకొనుటకు— అన పఠితృ హృదయగ్రాహకమగుట— కవిరచనా వైదగ్ధ్యము వ్యంగ్య వైచిత్రీచిత్రితమైన రమ్యభావన. ఇలాఇలా కవికి కావలసిన సర్వ లక్షణాలు ఉండవలయును. వ్యంగ్య ప్రధానమై ఉపదేశ బోధకమగుటకు రచనలో హాస్యమవసరమేకాని పర్యవసానములో కరుణమున్నకాని ఆహాస్యము అనుకున్నంతగా ఉపదేశమును నాట లేదు. ఆ విషయమును గుర్తించినవాడే క్షేమేంద్రుడు. కావి

ముఖ్యముగా ప్రయోజనములు హాస్యము ఉపదేశములు అనియే పరిపరి చెప్పును.

దేశోపదేశ ప్రారంభముననే రమ్యకల్పనతో రచన ఉద్దేశమును, మార్గమును, ఫలమును నిర్దేశించినాడు. జయజయ నినాదములతో కావ్య నాయికా నాయకులకు సుస్వాగతము చెప్పినాడు.

జయంతి వేశ్యా వ్యసనాభ్రవిద్యుతో
జయంతి కౌటిల్యకలా నటావిటాః
జయంత్యజస్రం జనవృక్షిపాతినీ
ప్రకృష్ట మాయాతటినీచ కుట్టనీ.

వ్యసనమను ఆకాశమునకు సౌదామిని అయిన వేశ్యకు, కుటిల కళానటుడు విటునకు, ఎల్లప్పుడూ జనులను వృక్షములను కూల్చునట్టి పూచి వంటి బిడ్డయిన కుట్టనికిని జయము. ఆ పాత్రలను వర్ష సంబంధి వస్తు సంచయముతో పోల్చి వర్ష వర్ణన కూడ గ్రంథారంభమున చేయుట చక్కని అర్థస్ఫూర్తి, భావ వికసన, కవిసమయ సంయోజన అంత కన్నిటికీ మించి ఆత్మప్రయోజనము వ్యంగ్య మర్యాదతో చెప్పుట అనునవి అన్నియు రమ్య మాధుర్యముతో గూడు కట్టినవి. వర్ష ప్రయోజనము కశ్మలక్షాళన, స్వాదు సస్యావాపన, సంవర్ధనములు మూడును ఈ గ్రంథమువలన సఫలములని సూచన. వేశ్యాదుల దురాచార ఫలితమైన సమాజ సంకటములను వర్షము కశ్మలము నెట్లు కడిగివేయునో ఇది అట్లు తుడిచివేయును. ఆ సమాజము నిర్మలమైన పిదపనే నవ్య సస్యములనాటి వానికి సదాచార దోహద క్రియలతో నిర్మల సమాజ నిర్మాణమునకు ఈ గ్రంథ ముపకరణ మనుట సూచన. వినాశమార్గానుయాయియమైన రచనే కాక నిర్మాణక్షమమైన ఉద్దేశములతో కూడినదని తాత్పర్యము. ఆ వర్ష వర్ణనతోనే కవిత్వము పుష్పవతి యైనది. అట్లు ప్రయోజనమును రమ్య వర్ణనతో సూచించి పిదప స్పష్టముగా

యేదంబ మాయామయ దోష లేశ లిప్తాన మేతాన్రతి కోపి యత్నః
కిం త్వేష హాసవ్యపదేశ యుక్త్యా దేశోపదేశః క్రియతే మయాద్య
హాసేన లజ్జాతోఽత్యన్తమ్ నదోషేషుప్రవర్తతే
జనస్తదుపకారాయ మమాయం స్వయ ముద్యమః.

అని చెప్పినాడు. తమ తప్పులకు లజ్జించి సరిదిద్దవలయునని దృష్టి. పైన పేర్కొనబడిన వ్యభిచాలక పాత్రలే కాక నాటి అతిబాల్య వృద్ధ వివాహము వంటి ఆచారములు, ఖలుడు కదరుండు వంటి సమాజ కంటకులు, అధ్యయనము పేరున దూరదేశములనుండి వచ్చిన విద్యార్థులు చేయు దుండగములు మొదలగు వారిదురాచార పరంపరా వ్యాప్తిసరణి నిశితముగ విరసించినాడు. అతనిదే అయిన ఒక రచన నర్మమాలలో

హాసాయాతీత కాయస్థ చరితం కర్తు మీరితః
కరోతి తత్ప్రసంగేన దురాచార విడంబనమ్.
(ప్రథమ పరిహాసము. 6)

అనియు,

సుజన వినోదాయోంచితా హాస్య సిద్ధయౌ
కథయతి ఫలభూతం సర్వ లోకోపదేశమ్.
(తృతీయ పరిహాసము. 214)

అనియు చెప్పినాడు. హాస్యము సుజనుల కొరకు, విమర్శన, ఉపదేశములు దుర్జనులకు అట. సుజనుల హాసమువలన లజ్జితులై జనులు దోషమున ప్రవర్తింపకుండుటవలన జనులందర కుపకారమునకు తాను రచించితినను పై శ్లోక విషయమిట సమన్వయము చేయవలయును. నర్మమాల కూడ నిట్టి రచనమే కాని అట ప్రముఖముగ సమాజ కంటకులైన కాయస్థుల నిరసనమే అగుట దురాచార విడంబనము తత్ప్రసంగమున జరిగినదిగాని ఈ రచనలో అట్లుకాక ఉన్న ఎనిమిది ఉపదేశములలో నేడు దుర్జన విషయ విన్యాసితములును చివరది మిగిలిన దుర్ముఖుల ప్రకీర్ణ మగుట దురాచార నిరసన ప్రస్తుతముగను ప్రసంగవశముననను సాగినది.

నాటి సంఘమున పెరిగిన ముళ్లను, వానిని దులిపివేయు టకు క్షేమేంద్రుని ప్రయత్నములను తెలిసికొనుట కొక్కొక్క ఉపదేశమును చెప్పిన విషయములు క్లుప్త వివేచనతో—

మొట్టమొదటి ఉపదేశము సర్వ వ్యాపకమైన ఖల స్వభావ సమున్మీలన, సముత్పాటనలు. ఖల స్వభావము సర్వ దురాచారముల బీజ భూతముగ వ్యాపించి యుండుటచే దానిని ప్రప్రథమమున చెప్పుటయు పిదప ఒక్కొక్కరే లోక కంటకుల చెప్పుటయు చివర మిగిలినవారి నందర గుచ్చెత్తుటలో మొత్తము గ్రంథమునకు సక్రమామ్రకమణిక యేర్పడినది. ఖల స్వభావమును సర్వ వ్యాపక మనుటకు చూడుడు భగవద్గీతలో ప్రసిద్ధమైన భగవత్సర్వాంతర్యామిత్వమును చెప్ప

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖం
సర్వతశ్రుతి మల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి
(13:14

అను శ్లోక భాగమును గ్రహించి

# క్షేమేంద్రుని దేశోపదేశము

ఖలః సుజనపైశున్యే సర్వతో౽క్షి శిరోముఖః
సర్వతః శ్రుతిమాంల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి

అని అంటించినాడు. ఎంతో గొప్ప విషయములను అత్యల్పమైన విషయములతో పోల్చి వాని అల్పత్వమును సుస్పష్టముగ చూడగలుగునట్లు చేయుట వ్యంగ్య విమర్శలో ఒక పద్ధతి.

ఖల శబ్దమునకు క్షేమేంద్రు డొక క్రొత్త వ్యుత్పత్తిని చూపించినాడు. 'ఖ' అన ఖఛిద్రమును 'ల' అన లఘువును చెప్పునట. అన లఘువు అయికూడ మహాత్ముల మధ్యలో ఘుణమువలె నిముషములో కొండెము పుట్టించి వ్యాపింపచేయుటయందు మాయావి అగుట అతడు ఖలుడాయెనట. (1:16) ఎత్తుగడలోనే ఉలూఖలము (రోలు) వంటి ఖలునకు నమస్కారమని వ్యంగ్యముగ ప్రారంభించినాడు. ఉలూఖ సంబంధి విషయములతో పోల్చి వాని కర్కశత్వ నిరూపణమే కాక, వందనసమర్పణ ఖలునకు ఉలూఖమునకు కూడ చేయుట ఈతడు ప్రతి ఉపదేశమునను అనుసరించిన రమ్య వ్యంగ్య మర్యాదకు ప్రారంభము. ఇక ఆ ఖలుడు శత్రుమిత్రుల యెడ సమవర్తి. మానాపమానములలో నిశ్చలుడు, వృత్తిచ్ఛేదనములో అభ్యాసము కలవాడు అయిన నిర్వాణదీక్షితుని వంటి అద్వంద్వుడని శ్లేషయుతముగ విమర్శించినాడు. ఖల స్వభావ విమర్శనలో చాలవరకు వీని అల్పత్వమును స్పష్టపరచుటకు ఉత్తమ విషయములతో గాని, ప్రసిద్ధ విషయములతో గాని శ్లేషను సంఘటించి విమర్శించినాడు. అతడు అశని (పిడుగు) అయి కూడ శని ఆయెనట. అతడు స్వగుణోదరణమున శేషుడు పరనిందలో వాక్పతి. ఇక జఘనముతోవానిని పోల్చి,

లజ్జావ్యసన సమ్మోహ హేతునా కామకారిణా
కోనామ జఘనే నైవ ఖలేన నఖలీకృతః

అని నిర్లజ్జను సిగ్గు వచ్చునట్లు చెప్పుట రమ్యము. సిగ్గు విషయముననే జఘనములో పోలిక ఆతని ఔచిత్య విచారమునకు చక్కని సంచారము. ఆఖలులయందును మూర్ఖ ఖలునకు పండితఖలునకు ఉపమాన ప్రయోగములో తారతమ్య నిరూపణ చూడుడు.

భగ్నదంత ఇవవ్యాలః శ్రేయాన్ మూర్ఖ ఖలోవరమ్
పక్షవానివ కృష్ణాహిర్నత్యేవ ఖల పండితః.

పండ్లూడిన వ్యాలమువలె మూర్ఖఖలుడు శ్రేయుడే అయినను పండితఖలుడు రెక్కలువచ్చిన నల్లత్రాచు వంటివాడట: దుర్జనత్వము సమర్థమైననే లోకకంటక మనుట. అతని స్వభావమును సమాహారముచేసి చివర

భ్రుకుటి కుటిల దృష్టిర్ధాతు రన్యైర్యవసృష్టి
ర్ధన లవమదలిప్తః ప్రౌఢవాదాను లిప్తః
సదసి కుటిలదోష్ఠై ర్దుర్జనః సజ్జనానామ్
మలినయతి యశాంసి స్ఫార కైలాస భాంసి.

అని చెప్పినాడు.

రెండవ ఉపదేశము లోభి విషయము. ఇతడును నమస్క్రియా పురస్కృతుడు. వ్యక్తుల విమర్శన చేయుటలో వారు సంఘముమీద చూపు ప్రభావమునకు కారణమైనవారి మనస్తత్వమును ప్రభావ సంబంధము లేనిదానిని కూడ స్పష్టముగ అర్థము చేసుకొనవలయును. దానికి కవిత్వాపాదనకు చక్కని ఉపమాన ప్రయోగము అవసరము. లోభిట 'విముఖాః సతతమ్ యాంతి శ్మశానాదివ బాంధవః' అట. వాడు బాంధవ్యులకు విముఖత వలన శ్మశానమట. శ్మశానమువలె చొరరానివాడు, చొర సాహసించినను నిష్ఫలమైనవాడు అని. లోభి అనగనే ధనసంచయనము వాని జీవిత లక్ష్యమని కదా. వానికి ధన, భూమి, దార, గృహములు జన్మ సంచితములట.

ధనం భూమి గృహం దారాః సర్వథా జన్మ సంచితమ్
పరార్థమేవ పర్యంతే కదర్యస్య జినస్యచ."

అన్నిటినీ జన్మసంచితములవలె చూచుటచే వానికి వేని మీదను ప్రేమ లేదనుట దానిచే ఆతడు జినతుల్యుడట. ఇక ఎత్తిపొడుపుగా "కో౽న్య సదృశోదాతా" అనినాడు. వాని లోభమెంతవరకు పోయినదన చివరకు బట్టకట్టుకొనుటకును ఇష్టపడక చర్మవసనుడే ఆయెనట. అన దిగంబరుడే అని (చర్మవసనత్వముతో శివునకు శ్లేష చేయబడినది.) ఇక వాని వాలకము అతిథులు ఇంటికి వచ్చినప్పుడే చూడవలె. ఎన్ని లబ్జులను ఎంత చక్కగ వర్ణించెనో. యాదృచ్ఛికముగ వచ్చిన స్వజనులను చూచి భార్యతో కలహించి ఆ సాకుతో అనశన వ్రతమును పూనుటతో ఎంత సిగ్గులేనివాడు కూడ ఆ ఇంట్లో ఉండడుగా

కదర్యః స్వజనం దృష్ట్వా యదృచ్ఛోపగతం గృహే
కరోతిదార కలహ వ్యాజే నా నశన వ్రతమ్.

ఆ వచ్చినవారిని కుశలప్రశ్న వేయకుండుటే కాదు, వారు పలుకరించినను వినడుట. ఎక్కడ పలుకరించిన ఆరోజుకు తన యింట్లో తడియ పెట్టుదురేమో అని భయము. వాని ఇంటికి నిర్వచనము

అచుల్లిపాక మస్మీర మసుఖం నిర్ధనంచ యత్
యదుత్సవ కథాహాసం తత్కదర్య గృహం విదుః.

మొదట ఇల్లుచూచి తర్వాత ఇంట్లోవారిని చూడమనినట్లు మరి వారిని చూడకయే పోవచ్చునని. వానికి శ్రాద్ధ

విషయముగాని, ఉత్సవ విషయముగాని వచ్చినపుడు ఏ సూతక మంటుకొనినదనియో, ఏ రోగము తగులుకొనెననియో సాకు చెప్పి ఖర్చు మానునట. ఇక అటువంటి వాని రసికత విషయము నాస్యతోదర్శము. సంగీతమునకు నాట్యమునకు అది చచ్చిన శవము. సొంత గాదెలలో ధాన్యము ముక్కిపోయినన అమ్మక ఎప్పుడెప్పుడు కరవు వచ్చునా అని నిరీక్షించు చుండునట అట్టి లోభము వానికే కాక సంఘమునకు నష్టమని మానవలెనని.

మొన్న మొన్నటి వరకు బహిరంగ రహస్యముగ వ్యవస్థా వ్యవసాయమున సాగుచుండిన వ్యభిచార కూలంకషల వేశ్యల ప్రవర్తన సామాన్యముగ పలువురు రచయితలచే తూర్పార పట్టబడినది. అదేమి దాని మూల బలమో గాని దాదాపు అది మొదలుపెట్టినప్పటినుండి ఇప్పటివరకు దానిని నిరసించువారు కలరు కాని మొన్న వరకు దాని పెచ్చు రేగినట్లు కన్పించదు. ఇక దానికి మన రచయితల కున్న సంబంధము చెప్పుకొనవలెనన్న, వారి రచన, పఠితకు దానిపై అసహ్యము పుట్టించునట్లుండవలయును గాని ఆ గ్రంథమును చదివిన వేశ్య నాశించునట్లుండరాదు. అట్లయిన ఉద్దేశించిన ప్రయోజనము సాధింపబడకపోగా పైపెచ్చు ఆ రగులుచున్న మంటలో మరొక కట్టె పెట్టినట్లు, మహానుభావులు కొందరు రచయితలు ఏ కామ కతాప్రకోపము పైకి తట్టినదో అట్టి రచనలు విమర్శల పేరిట చేసినవారున్నారు. ఇక మన క్షేమేంద్రుడు ఏ విషయమును పట్టుకొనినను తన ఔచిత్య ప్రస్థానమునకు కంటకము లైనను లెక్కింపక అటనట ఆశ్లీలములు వాడినను తన అసలు ప్రయోజనము మాత్రము దెబ్బతినకుండ సాంఘిక వ్యవస్థకే చీడపురుగులైన వేశ్యలను నిరసించినాడు. సామాన్యముగా ప్రాచీనుల రచనలలో వేశ్యా నిరసన చేసిరన్న అట దుష్ట వేశ్యలు పరామర్శింపబడి రనవలయునే కాని వారు వేశ్యా వ్యవస్థనే నిందించినవారుకారు. నేడు వేశ్యా నిరసన చేయుట అసలు వ్యవస్థ మీదనే. వేశ్యకు ఆదిలో నమస్కారము.

> అర్థలుబ్ధ మతిప్రౌఢాం చిత్రాలంకార హారిణీమ్
> ప్రౌఢాం వాణీ మివకవేః స్వచ్ఛందాంబంధకీం నుమః.

అని ప్రణమిల్లినాడు సరిగా కవితావాణి లక్షణము లన్నియు నిరికించి శ్లేషలో. అర్థలోభము, ప్రౌఢి రచన, చిత్రాలంకారాలు కలది, స్వేచ్ఛ కలది అయిన కవివాణి వంటిదట వేశ్య. అట్టి వేశ్యకు ఎవ్వనిమీద కూడ అనురాగ ముండదనుటకు యోగినితో శ్లేషించి,

> స్పృహారాగ వినిర్ముక్తా నిష్కామా కామచారిణీ
> స్వధ్యానశీలా గణికా యోగినీవ గుణోంఖితా.

అనురాగమును వదలివేసినది, కామములేనిది, ఇచ్చ వచ్చినట్లు తిరుగునది, ఆత్మధ్యాన స్వభావము కలది అయిన గణిక యోగినివలె గుణయుత. ఆమె ధనార్జనకు చేయు దుష్ప్రవర్తనను అబ్బో ఎన్ని గుణములని చేయు వెటకారము నేరుగా విమర్శించిన దానికంటె గుండెకు చుర కత్తిపోటువలె తగులును. ఇక పుష్పాపచయమువలె సీరు రక్తాపచయమును చేయుట, మృత్యుబుద్ధివలె కుర్రలనుండి ముది వగ్గుల వరకు ఎట్టి పక్షపాతములేక ఆదరింతురట. అప్పుడును యంత్రములచే నటించు బొమ్మ లుండెనేమో, అట్లు ఆ యంత్ర పుత్రికలవలె వీరును నటించుదురట. ఇక వారు చేయు మోసములా అనుస్యూతములు. ఈమె ప్రథమ పుష్పిణి నీకే మొదట దక్కినదని ప్రాత పరిచారాలను కూడ వేంపుచున్నారట. రసాభాసకు వేశ్య ప్రథమ లక్ష్యము. ఆమె బహునక్తిని పలువురు కవులు ఎంతో అసహ్యముగ వర్ణించిరి కాని క్షేమేంద్రుని మెరుగు చూపినవా రరుదు. వేశ్యట ఓ వంద మంది విటులను కటికి కట్టివేసుకొని, దారినబోయే ప్రతి దానయ్యచేత పీల్చబడిన నోరు కలదై, ఓ వెయ్యి మందిచే మర్దింపబడిన స్తనాల కలిగిఉన్నదట.

> కటిర్విట శతైర్ధృష్టా పాంథపీతోజ్ఝితం ముఖం
> స్తనౌ సహస్రమృదితౌ యస్యాః కస్యాస్తు సానిజా.

ఆమె అందము కొరకు పడు తాపత్రయము చక్కగ చురకవలె విమర్శించినాడు. దానిని కాపాడుకొనుటకు తెగ మంచి తిండి తినుటయే కాక ఎవరి దిష్టి తగులకుండుటకు నూటఒక్క ఆభరణాలు ధరించునట. అసలు ముసలితొత్ర అయినను కుర్రవలె ప్రవర్తించునట. ఇట్లు అది వేయు వేషాలు ఎన్ని ఉన్నవో అన్నిటిని దుయ్యబట్టినాడు. వేశ్యా విషయములో విశేషాంశములు లేకపోయినను విశిష్ట వ్యంగ్య రచనారీతి సునిశిత పరశుప్రాయ నిరసన ఉన్నవి.

తరువాతి ఉపదేశము ఆ వేశ్యలకు రాయబారి అయిన కుట్టనీ విషయ విన్యస్తము. ఆమె అసహ్య స్వరూపము, ప్రజల మోసగించి ఆ రొంపిలోనికి దించు నేర్పు, ఉద్దేశ నిర్దేశాలతో వర్ణింపబడినది. ఆనాటి ప్రజలకు కుట్టనీపీడ వేశ్యాపీడ వలెనే విపరీతముగ నుండినట్లు తోచును. దామోదర మిశ్రుడు కూడ కుట్టనీ మతమని ఒక ప్రత్యేక గ్రంథమును రచించెను. అయితే అది శాస్త్రమాత్ర కథనము, ఇది అస్త్రప్రాయ రచన, ఆమెట దేవేంద్రుని రాజ్యము నపహరించుటకును దక్ష, బ్రహ్మ హత్యవలె శివునకును భయము కలిగించు నంతటిది. ఆ రాముడు ఆ కృష్ణుడు ఓ ఇద్దరు స్త్రీలను చంపినారుగాని విశ్వకంటకి అయిన కుట్టని నెందుకు వధించరనుకొనినాడు. ఇక ఆమె

# క్షేమేంద్రుని దేశోపదేశము

నిత్యకర్మలో జాంబవంతునకు జ్యేష్ఠ అట. అన జాంబవంతుడు ఒక్క రామాయణమునే చూచిన ఈమె రామాయణ సహస్రాణాం సాక్షిణీ. కథమన్యథా' అనినాడు ఇక నేటి కొందఱ వలె నాడు కుట్టనులు పుణ్యతీర్థ సేవ పేరిట నిధులు ప్రోగు చేసి చివరకు ఏ ప్రక్క వూరికో వెళ్లివచ్చి ఆ పుణ్యతీర్థము పోయి వచ్చితిమని మోసగించుచుండిరట. దినచర్య రామాయణ మహాకాండలో సవతులమధ్య పోరుపెట్టుటవంటివి ఆమె అలవాట్లు అనంతములు. అప్పటినుండి ఇంచుమించు వేశ్య ఉన్న గ్రంథములం దంతట ఆమెగాని, ఆమెకు మారుగ వేశ్యమాత గాని వాకిలి ముంగిట సాక్షాత్కరింతురు.

పిదప ఉపదేశము స్వైర విహారధీరులగు విటుల కలాప ఖండనముగ మూర్తి కట్టినది. విటులను మర్కటములతో కపట నటులతో, యోగులతో, శకటముతో, గ్రహ గమనముతో పోల్చి అవగుణాలన్నిటినీ వ్యక్తీకరించినాడు. వారు దెబ్బలు తిన్నను పోని కుక్కలవలె వేశ్య ఇంటి చూరు దొరకినను పట్టి వ్రేలాడుచు, అవకాశము దొరికిన పునః ప్రవేశము చేయుచుండిరట ఒక వరుసలో. ఇక వాని ఆకార వికారాలు విపులముగ అన్ని వాలకములతో వర్ణింపబడినవి. సొంత తల్లిని మానధనులైన ఆ విటు లట కుంభదాసి యని చెప్పికొనిరట.

" . . . . . సజనే నజనీం పురః
మమేయం కుంభదాసీతి వక్తి మానధనోవిటః."

ఆ విటపండితులు అప్పుచేసి నేయి త్రాగు పద్ధతిలో ఇంట భార్యల బాధించి విదేశాలకు పోవుచుండిరట.

అట్లా బహిరంగ వ్యాపారాలను ఖండించి తరువాత విద్యార్థులై కాశ్మీరదేశ విశ్వవిద్యాలయమునకు వచ్చిన గౌడులను వారి ప్రవర్తనను నిశితముగ పరామర్శించినాడు. వారు స్వదేశమునుండి వచ్చునపుడు కాల కంకాళములవలె నున్నవారు అక్కడి వాతావరణమునకు తెగ బలిసి భయంకరులగు చుండిరట. ఆ దైశికులు వ్రతభ్రష్టులై వ్యసనము లలవాటు చేయుచుండిరని,

'భాటీః పృచ్ఛతి వేశ్యానామ్ ద్యూతమ్ పృచ్ఛతి నిర్జితమ్
మాంసం సంపృచ్ఛతి భోజ్యే వ్రతభిన్నేషు దైశికః.'

ఇక వారి చదువు. ఓంకార స్వస్తి శబ్దములు సరిగా పలుకుట రాకయే పతంజలి మహాభాష్యమును తర్క మీమాంస శాస్త్రాధ్యయనము ప్రారంభించుచుండిరట. మొలకు చురకత్తి తగిలించి కిర్రు చెప్పులు శబ్దము చేయుచుండ నడచి పోయెడివారట. హేలగా చేత పట్టుకొని లతను త్రిప్పుచు నానా వికారములు లోడుచూ సాయం సమయములందు వేశ్యా గృహములకు దాపున ఉన్న వీథులలో 'బీట్' తిరిగేవారట. ఇది ఇట్లుండ వూరుమీద పడి రండ లెచట నున్నారో వెతకి వెతకి వారి తండ్రిపేరు కనుగొని ఇల్లుచేరి సత్రభోజన విశేషములను ముగ్ధులవలె ఆ పరస్త్రీలకు చెప్పి నవ్వించుచు దగ్గర విశ్వాసము కుదురునట్లు సేవించుచున్నారట. సత్రపు పిండి వంటలను నెమ్మది నెమ్మదిగా అనుపుదేవతలైన వేశ్యలకు నైవేద్య మర్పించు చుండిరట. వారి దగ్గరనుండి డబ్బు లాగుటకు భట్రాజులవంటి కవులు వారి గొప్పలను కీర్తింతురు. వారు అధికారులమని పేరుతో వణిజులకడ కొద్ది డబ్బుకు ఎక్కువ వస్తువు కావలెనని బాధ పెట్టుచున్నారట. అప్పటికే కావలసినంత కశ్మలము విద్యార్థులలోను విద్యాభ్యాసములోను ఏర్పడినది. ఇంత నిశితముగ గ్రంథముల కెక్కుటకు అప్పటి ఆ బ్రహ్మచారుల ప్రవర్తన పట్టణముల కెంత గగ్గోలు పుట్టించినదో. ఆ తరువాత 16, 17 శతాబ్దములలోను విద్యాధ్యయనములోని చీడను వేంకటాధ్వరి కూడ నిశితముగ నిరసించినాడు విశ్వగుణాదర్శములో. అప్పటినుండి ఇప్పటివరకు మన విశ్వవిద్యాలయ విద్యార్థుల ప్రవర్తనలో ఎంత ఉన్నతముగ చెప్పుకొన జూచినను కరుడుకంపు కావలసినంత లేకపోలేదు.

ఏడవ ఉపదేశము అతి బాల్య వృద్ధ వివాహమునకు సంబంధించిన ఒక చక్కని ప్రహసనప్రాయ కావ్యరచన. ముసలి వయసులో యౌవనశాలిని, అనాఘ్రాత పుష్పమూ అయిన కన్యను వివాహమాడి దాని ప్రవర్తనకు రేగిన సుళ్లలో గిలగిల కొట్టుకొన్న ఒక వృద్ధుని మానసిక పరివర్తన రమ్య భణితమైనది. అతడు వివాహమైన వనితను చూడుడు.

మమః పుష్పవతీం కాంతాం యౌవన శాలినీమ్
పురుష స్పర్శరహితాం శ్వభ్రజాతాం లతామివ.

ఇక వాడామెను లోభి సంపదవలె, ఆశించుచుండెనట. జనులు నవ్వి పరలోకార్థము వివాహము చేసికొనుచున్నాడని వ్యంగ్యముగ వ్యాఖ్యానించిరి. (వివాహం పరలోకార్థం కరోత్యేష విచక్షణః) ఆ పిల్లను ఇంత ముదుసలికా ఇచ్చుట అని ఇంట్లో పేచీ పెట్టినట్లున్నది. ఆ పిల్లయు ఏడ్చుచు నిలబడి సమాశ్వసించుచు ఆమె తండ్రి అన్నాడుట అకాలముగ వచ్చిన ముసలితనమే కాని మరొకటి కాదు. పెళ్లికొడుకు చాల డబ్బు కలవాడు అని ఆశలు పెట్టుచు,

అకాలే జరయా పుత్రి వ్యాప్తోఽయం ధనినాంవరః
ఇతివృద్ధః పితా బ్రూతే తనయా మశ్రువర్షిణీమ్.

వివాహము నిర్ణయమైనది.. ఆ ముసలినే చేసికొనక తప్పినది కాదు. పండువంటి ఆమెను కోతిలా పరిగ్రహించుచున్నాడని వివాహ సందర్భములో క్షేమేంద్రుని ఆశీర్వచన స్వస్తివాక్యము

అలంబ్య కన్యా మంజర్యా వివాహేపాణి పల్లవమ్
వృద్ధః కుచఫల న్యస్తవదనో వానరాయతే.

వివాహములో మంజరి వంటి కన్య యొక్క పాణి పల్లవమును అలంబనముగ పై కుచఫలాల కొరకు ఆశించుచున్నదట ఆ వృద్ధ వానరము. వీని బాధ ఇట్లుండ ఆమెయో వీని ప్రక్క చూడకపోయిన పోయె మొదటలోనే ఆ పెళ్లికి వచ్చిన కుర్రకారు మీదనే చూపు లగించినదట. వీనితో ఆమెకు సుఖము మానె అతని శయ్య వధ్య శిలవలె నుండెనట.

వధూర్వరోత్సవాయాత తరుణన్యస్తలోచనా
నోప సర్పతి వృద్ధస్య శయ్యాం వధ్య శిలామివ.

ఇక అబ్బ అతని శృంగారము ఆలాలాపూర్ణ వదనముతో ఆ కర్మకాండ ఎంత అసహ్యముగ నుండెనో సుభగముగ వర్ణించినాడు. ఆ ముసలిత్వక్కుతో నుండుటకు సిగ్గుపడి ఆమె మొదటి నుండియేక్షాంతోపీవలె తయారైనది. నీవు నాకు తండ్రి తాతవు కావలసినవానివి. ఎందుకు సిగ్గుపడవని ముఖముమీదనే అడిగివేసినదట. అట్లనుచున్నప్పటికీ వూడిన దంతాలతో చొల్లు కార్చుచు ఆమెను శయనానికి యాచించుచున్నాడుట. పాముకాటుకు దెబ్బతిన్నవాడివలె ఆమె ఆ యింటికి ఈ ఇంటికి పరుగిడుచుండ మరల బంధువులు తెచ్చి వానికి అప్పగించుటయు ఆమె ఛండాలునియొక్క స్పర్శవలె భయపడుచు తనను రక్షించుకొనుచున్నది. ఇక ఆమె వ్యభిచారకాండ అనాహతము. వాని మనస్తత్వము ఆ సందర్భములో బాగుగా చిత్రింపబడినవి. ఈమెను సంతృప్తిపరచుటకు వాడు అనేక బాధలకు లోనైనాడు. శక్తిని పుంజించుకొనుటకు ఆసవాదులను సేవించుచున్నాడు. శక్తికొరకు వాజీకరణ యోగము చేసిన అది అతిసారరోగమునకు దారితీసినది. వీని పరిస్థితి ఇట్లుండ ఆమె ఉన్నట్లుండి అతని దగ్గర చేరినదట. దానికి కారణము.

గర్భిణీ పరబీజేన వృద్ధస్యోత్సవకారిణీః
దదాత్యన్నుజ్ఞాం సతతం పాద సంవాహనే వధూః.

ఆ పరబీజమువలన ఓ బిడ్డపుట్టిన ఆ పుత్రుని మంత్రణోత్సవములో స్త్రీలు నృత్యము చేయుచు ఇట్లు పాడుచున్నారట. ఘుణముచే తొలవబడిన తరువునకు కూడ మరల అంకురము కలిగినదని వక్రరచనలో పాడిరి.

ఘుణజగ్ధస్య దగ్ధస్య తరోర్జాతోయ మంకురః
ఇతి బ్రువాణా వృద్ధస్య ప్రవనృత్యంత్యుత్సవేస్త్రియః.

ఇట్టి అతని అవసానకాలము ఆమెకు సుఖప్రదమే అయి ఆమె పెట్టు బాధలకు, బందిపోటువలె ధనముకై ఆమె పీడించుట లివి అన్నియు వానికి కలిగించిన బాధను స్పష్ట వ్యక్తితో యువతిని చేసుకొనిన ముసలికి సిగ్గు వచ్చునట్లు రచించినాడు. ఈరీతిగ ఒక కథను చెప్పినట్లు చెప్పి చివరకు అతి బాల్యవృద్ధ వివాహమువలన వృద్ధుని బాధను ఇట్లు మనవి చేసినాడు.

విరత సురత శక్తిః స్పర్శమాత్రైకభక్తిః
నిశినిశిత వచోభిర్భర్త్స్యమానో గృహిణ్యా
భుజ భుజగ నిబద్ధం స్వక్షయే వృద్ధయక్షః
సుభగభగ నిధానం రక్షతిన్యస్తహస్తః.

అని కొంత అసహ్యముగనే చెప్పినను సిగ్గు వచ్చునట్లు చెప్పినాడు. దానివలన ఫలితములను చూచి చీదరించుకొని సంస్కరణాభిలాషతో రచించిన ఈ ఖండిక రమ్యముగ సాగినది. ఈ దురాచారము నాటినుండియు మొన్న మొన్నటివరకు విపరీతముగ వీరవిహారము చేసినది. ఇక ఆ వస్తువును గ్రహించి రచించుటలో క్రొత్తదనమును చూపుటయే కాక క్షేమేంద్రుడు దానికి తన కవితాపీయూష పోసి చక్కని ఖండికగా చించినాడు. వా రిద్దరకు పేర్లు పెట్టి రచించిన అది జరిగిన ఒక చిన్న కథ అయిఉండెడిది. ఆ రచనలోను వివాహ నిశ్చయమాది చివర వరకు అటు ముసలివానికి ఇటు యువతికి జరుగుచు వచ్చిన మానసిక పరివర్తన, వారి తాపత్రయములను సహజ రమ్యముగ వర్ణించినాడు. గ్రంథమువ నితర ఖండిక లొక యెత్తు మానసిక పరామర్శలోనిది యొక ఎత్తు. దానికి తోడు అతని వ్యంగ్య వ్యాఖ్యానము సంస్మరణోన్ముఖ మైనది.

తుది ఉపదేశము 'ఏకత్ర సంక్షిప్తధియా ప్రకీర్ణ జనవర్ణనమ్' ఇందులో లోక కంటకులైన వ్యక్తుల ప్రవర్తన మనో ప్రవృత్తి డాంబికము మొదలగువానిని చెలగినాడు. అందు గురువు, దివిరుడు, గురుసురతముతో పవిత్రమైన కులవధువు, భట్టుడు, వణిజుడు, కవి, ధాతువాది, ద్యూతకరుడు, బుద్ధిహీనుడు, గురుభక్తుడు, వైణికుడు, వైద్యుడు, నిరుటుడు, పండితుడు, లేఖకుడు, శివయోగి, రండలు ఉన్నారు. వీరన్న వీరునాటి సంఘములో ముక్కిన పురుగులు. వారి విషయము లన్నియు లఘు వివేచనకు అధికప్రసంగము లగుట రమ్య రచితములగు ఒక రిద్దరి విషయము మాత్రము చెప్పుట వసరము.

# క్షేమేంద్రుని దేశోపదేశము

వా రందరు గురువుగారి కడకు వచ్చి తమ అభిప్రాయముల వెళ్లబుచ్చి ఆయనవలన తగు దీక్షితులై చనిరట. అప్పటి దొంగ గురువుల వ్యవహారమును ఖండించినాడు. ఒక కావ్యహేవాకి కొంచెము సంస్కారము కలవాడై కూడ సారస్వత మంత్రార్థియై గురువును దర్శించెనట. ఆ కవి,

అజ్ఞాత ధాతులింగం ముఖకూణన ముల్బణ మపక్వమ్
అజ్వరమివ వమతి కవిః శ్లోకం కృచ్ఛ్రాత్సహ ప్రాణైః.

అట్టికు కవుల నిరసించినాడు, ఇక హృదయహీనులైన ధూర్తులు వైద్యులై పిడుగులవలె నిధానములమీద పడుచున్నారట. వాక్య సమన్వయహీనులు, లింగమును మరచి మాట్లాడుటచే నపుంసక ప్రకృతులు అయిన పండితులు దూషింపబడిరి. దొంగలెక్కలు చూపి గ్రామాలను మ్రింగ ప్రయత్నించుచుండిన దివిరులు, గురువుగారి సంసేవనలో ఆత్మపావిత్ర్యమును పొందిన రండలు, వేషాడంబరములో లోకుల మోసగించు శైవకాపాలికాదులు విమర్శింపబడిరి.

మొత్తముమీద ఇంతమందిని దుయ్యబట్టుటయే కాక ఆ తిట్టిన తిట్లను క్రమ పద్ధతిలో ఆనుపూర్వితో తిట్టినాడు. కేవల ముపదేశమే కాక కావ్యత్వదృష్టి కూడ కలదన్న మాట.

గ్రంథమునకు కావ్యత్వ ప్రతిపాదకములు అందలి చక్కని ధ్వని, రచన, ఉపమాన పురస్సరమగు కవితా స్ఫురణ, హాస కుసుమ వికస్వరము, వానికి చక్కని శైలీ సంయోజన మొదలగునవి. అందు వ్యంగ్య రచనలో చమత్కార చంద్రికా కిరణ సంయోజన కన్పించును. అతడు తన కవి కంఠాభరణములో (4 వ అధ్యాయము) చెప్పుకొనిన దశవిధ చమత్కారములును ఇందు నిరూపింప వచ్చును. (అవిచారిత రమణీయ విచారిత రమణీయః, సమస్త సూక్త వ్యాప్తి, సూక్తైకదేశ దృక్ శబ్దగతః శబ్దార్థగతః, అలంకారగతః రసగతః ప్రఖ్యాత వృత్తగతశ్చ) అయితే అందు శబ్దార్థగత ప్రధానములైన శ్లేషధ్వనులే విశేష ముపయుక్తమైనవి. అవీ హాస్యరసాది గత చమత్కారములును గ్రంథోత్కృష్టతకు కారణములు. వృద్ధుని పుత్ర నిమంత్రణోత్సవములో స్త్రీలు నాట్యము చేయుచు గానము చేసిన వ్యంగ్య వాక్యము, కురుసేనతో కుట్టనిని పోల్చి చెప్పిన పద్యము, విటుని పాపగ్రహములతో పోల్చి చెప్పిన శ్లోకము, వివాహం పరలోకార్థం కరోత్యేష విచక్షణః అన్నమాట ఉదాహరణీయములు. మృదువైన హాస్యమునకు అల్పత్వ నిరూపణకు ఉత్తములతో అల్పులను పోల్చుటయు, భగవద్గీతాది ప్రసిద్ధ శ్లోకములను సందర్భానుసారముగ అతుకుటయు క్షేమేంద్రుని వ్యంగ్య రచనాప్రక్రియలో ప్రత్యేకతలు. భగవద్గీత శ్లోకము కొంచెము మార్చి ఖలునకు సర్వాంతర్యామిత్వము నంటగట్టునది పైన ఉక్తము. అట్టిదే మరియొకటి. లోభి రాత్రి ధనభయము వలన నిద్రించకయు దానిచే పగలు నిద్రించునను విషయమును సంయమిని గూర్చి భగవద్గీతలో చెప్పిన,

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశాపశ్యతో మునేః
(2:69)

అను శ్లోకమును ఇట తెచ్చి అతికించినాడు. ఇట్లు శ్లోకములకు శ్లోకములు తెచ్చుట అటుంచి అనేక భావములను ప్రసిద్ధములను సమయానుగుణముగ సంఘటించును. ఇక ఒక అల్ప విషయమునుగాని, అసహ్య విషయమును గాని, ఏదో ఒక పెద్ద సద్విషయమును నిర్వచించినట్లు చేయబూనుకొన్న ఒక రకమైన హాస్యమునకు కారణమగును. అట్టి రచనమును చేసినాడు క్షేమేంద్రుడు లోభి గృహము మొదలగువానిని నిర్వచించుటలో.

అల్పత్వస్ఫూర్తికి వ్యంగ్య మెంత సాయము చేయునో ఉపమా ప్రయోగమును మరియొక విధముగ అంత సాయమును చేయును. అది కవితా బీజమయము, మృదుభావన. రమ్య కల్పనకు ప్రాణము. ఇట్టి రచన గ్రంథ మంతట విశేషము కలదు. మూర్ఖఖలుడు కోరలు తీసిన పాము, పండిత ఖలుడు రెక్కలు వచ్చిన కృష్ణసర్పము అనుట చక్కని ఉదాహరణ. ముసలి భర్తతోడి శయ్య వధ్యశిల వంటిదట. ఆ యువతిని గూర్చి చెప్పుచు,

పీనస్తనోరు జఘనా జీర్ణవీణోప మాకృతిః
తరుణీం సంస్పృశన్వృద్ధః శుష్యత్యా ప్యాయాతి
శుష్కతామ్.

భావ ప్రభావితములే కాక ప్రాచీన ప్రసిద్ధాంశములను అంగాంగి సమన్వయముతో నుపమించట వంటిది కురుసైన్యముతో కుట్టనిని పోల్చుట మొదువానియందు చూడ నగును.

ఇట్టి వ్యంగ్య హాస్యము సుజనుల కెట్లు హృద్యమై కుజనాల కుపదేశోపయుక్తమగుచున్నదనినాడో అత డనలేదు గాని కరుణమును అంతటి ప్రయోజనమును సాధించును. కుజనుల దృష్టియం దుంచుకొని రచించిన, అసలు హాస్యము కంటె కూడ కరుణ మెక్కువ ఉపయోగపడగలదు. నిరసింప బడువాని పరిణామములో చివర కాతడు విషాదాంతముమ పొందె

వనుట అటు ఉపదేశము హృదయగత మగుటయు ఇటు ఉత్కృష్ట కావ్యత్వ స్థితియు రెండును సమకూరును. ఆ స్ఫూర్తిని గమనించినవాడే క్షేమేంద్రుడు. వృద్ధ భార్యా వర్ణనలో వృద్ధుని పరిణామము విషాదాంత మయినది. ముఖ్యముగ సార్వకాలిక దుర్విషయ ఖండనము కంటె ఇది సామాజిక దురాచార నిర్మూలన విషయములో బాగుగ పనిచేయును. పలువురు, ఇతర కవులు హాస్యమునకు పరిమితము చేసికొనిరి. కాని అవి కుజనుల మనమును కదలింపలేక పోయినవి. వృద్ధుని చివరకు,

క్వ కియత్కిం తవాస్తీతి కంఠప్రాప్తార్థ జీవితమ్:
వృద్ధం చౌరమివా భ్యేత్యధనం పృచ్ఛతి గేహినీ.

వరకు పిసికొనివెళ్లి ఆ పరిస్థితిలోను పీడింపబడినట్లు చేసినాడు. ఇక ప్రతి ఉపదేశమునందును ఆనుషంగికముగ ఆ దుర్జనులవలన వారికే కలుగు నష్టములను స్పష్టము చేయుచుండును. తమ ప్రవర్తనమువలన సంఘమునకు నష్టమనిన వినుటకంటె తనకే నష్టమనిన వినుటయు దానివలన ఫలితము కొంత ఎక్కువగ నుండవచ్చును. అందు మనస్తత్వ నిరూపణశక్తి అధికముగ నుండవలయును అది పటువుగ నున్న వాడే క్షేమేంద్రుడు.

వీని అన్నిటికి తోడు రమ్యశైలీ సంయోజన, ప్రసిద్ధ పదములనే చమత్కారముగ వాడుట కాక అవసరమునకు తాత్కాలికముగ దేశ పదములను కూడ వాడినాడు. అట్లని అతడే ''దేశభాషాపదైర్మిశ్ర మధునా క్రియతేమయా'' అని చెప్పుకొనినాడు. అయితే ఆ పదములు ఆ కాశ్మీరదేశ సంబంధులే అయినను తదితరులు చదువునప్పుడు బాధ కలిగించు నవి మాత్రము కావు. దివిరుడు వంటివి ఉన్నను అవి సందర్భ సంవాదు లగుట తేలికగ అవగతము లగును.

అటనట అనుప్రాసయుతమైన శైలిని వాడినను అది తాత్కాలికము అటనట ప్రయోజనోద్దిష్టమును. గ్రంథమంతయు సరళముగా, సున్నితముగా సాగిపోయినది. ఏ భావమును వ్యక్తీకరించుటకును అన్వయ క్లిష్టతే లేని అతని పద సంయోజన సమర్థమైనది. అతని అలంకారముల వాడకమును ఔచిత్యయుతమైనది. గ్రంథమంతట వ్యాపించిన అతని ఆత్మ ఔచిత్యము అటనట అశ్లీలయుతమైనను మొక్కవోయినది కాదు. ఆ పదముల మార్పిడి బాగుండును గాని అవి కొన్ని చోట్ల శ్లేషలో మరుగుపడినవి.. మరికొన్నిచోట్ల అసహ్య స్ఫూర్తికి ఆకరము లైనవి అగుట ఫరవాలేదు. అట్టి రచన వలన అసహ్యము పుట్టునట్లున్న మంచిదే కాని ఆకర్షణ మాత్రము జరుగరాదు. పతిత నా రొంపిలోనికి దించిన అసలు ప్రయోజనము భ్రష్టమైనట్లే. అటనట నర్మమాలలో ఈ దోషము కొంత స్ఫుటమైన దనవచ్చునేమో గాని ఇట మాత్రము ఔచిత్యయుతమే అనవలయును.

మొత్తముమీద, సంఘ దృష్టి కొరవడిన కాలములో కేవల మూహా జగత్తులో నాయికా నాయకుల శైరవ తంత్ర వర్ణనలో, కవులు ధ్యానము నిల్పిన కాలములో, ఇక కొంత కాలమునకు సంస్కృత వాఙ్మయ ప్రభ వాలిపోవుచున్న కాలములో, సంఘ మనేక దురాచార పరంపరాస్థితికి మూలమై జిడ్డుదేరి అసహ్యమగుచుండిన కాలములో ఆ లోపముల నన్నిటికి గొడ్డలిపెట్టు పెట్టుచు హృద్య కవిత్వశాద్వలముగ వెలసిన క్షేమేంద్రుని ఇట్టి నాలుగు కావ్యములలో నీ దేశోపదేశము సుకృతి.

# అలభ్యమగు

# అన్నమాచార్య రామాయణము

శ్రీ వేటూరి ఆనందమూర్తి

తాళ్లపాక చిన్నన్న తానురచించిన 'అన్నమాచార్య చరిత్ర ద్విపద'లో తన తాతగారగు అన్నమాచార్యుని రచనంబు ప్రస్తుతించుచు నీ క్రింది విధమున వివరించెను.

> "సారు వేత్రముపై సంకీర్తనములు
> సరసత్వమును దాసముఖముల్ గాగ
> సరసుతంత్రములు ముప్పది రెండువేలు
> ప్రవిమల ద్విపద ప్రబంధరూపమున
> నవముగా రామాయణము,......

ప్రతిలేని నానా ప్రబంధముల్ చేసి "(అన్నమా. చరిత్ర. పు 46—47) ఇందు అన్నమాచార్యుడు ద్విపద రామాయణ ప్రబంధ రచయితగా ప్రస్తుతుడయ్యెను. ఈ రామాయణమును 'ప్రవిమల ద్విపద ప్రబంధ' రూపమున 'నవముగా' రచించెననుటలో విశేషించి వీరి రచన లక్షణబద్ధమైన దనియు, సంతకుముందు వేరొక ద్విపద రామాయణ రచన యుండగా దివిని వీరు క్రొంగ్రొత్తగా ప్రతిభామయముగా వివరించినారనియుం గూడ నూహింపనగుచున్నది. అన్నమాచార్యుని ద్విపద రామాయణము నేడు కానరాదుకాని రామాయణకథ ప్రసక్తములు సంకీర్తనము లనేకము లున్నవి 1. అన్నమయ్యగారి రచనలన్నియు శ్రీ వెంకటేశ్వరస్వామి వారికే యంకిత మన్నటునుబట్టి యిదియు నా స్వామికే యంకితమై యుండుననవచ్చును.' దుర్లభమగు నీ ద్విపదరామాయణ ప్రబంధము నుద్ధరించుట తెలుగువారి పనియై యున్నది!

తెలుగు దేశమున రామాయణ ద్విపద కావ్యములు' గ్రంథకర్తృ నామాదికములు తెలియదగిన ఒకకొన్ని తంజావూరు, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములం దున్నవి. వీనిలో కొన్ని ముద్రితములు— కొన్ని యముద్రితములు.2 ఇవికాక ఆద్యంతములు శిథిలములై కర్తృత్వ విషయాదిక మగోచరముగను, సంశయాస్పదముగను గల రామాయణ ద్విపద రచనా భాగములును, రామాయణ కథాప్రసక్తములగు ద్విపద గ్రంథవిభాగములునుగూడా నొండు రెండు గలవు.3

వీనినెల్ల పరస్పరముపోల్చి పరిశీలించినచో వేయే పంక్తులేయే కవుల గ్రంథము లందరినో కొంతవరకెఱుగుట కవకాశ మేర్పడును. మనకు లభ్యములై సుప్రసిద్ధములగు రామాయణ ద్విపద కృతులలో రంగనాథ రామాయణము, కట్టావరదరాజ రామాయణము, భోసల ఏకోజీ రామాయణము ముఖ్యముగా పేర్కొనదగినవి. ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు రంగనాథ

---

1. చూ. అన్నమాచార్య చరిత్ర పీఠిక— పుట69—70. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

2. ద్విపద రామాయణ కృతులలో కాలక్రమము ననుసరించి యెఱుగదగిన వాటిలో మొదటిది రంగనాథ రామాయణము (13 శతాబ్ది— ముద్రితము), తరువాతిది అన్నమాచార్య రామాయణము (15 శతాబ్ది —అలభ్యము), ఆ తరువాతిది కట్టావరద రాజు రామాయణము(16 శతాబ్ది—ముద్రితము), అటుతరువాతిది భోసల ఏకోజీరామాయణము (18 శతాబ్ది—అముద్రితము) పేర్కొనదగినవి.

3. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున సంఖ్య 981 నుండి 1008 వఱకు గల గ్రంథములన్నియు రామాయణ సంబంధముగలవే. వీనిలో కొని స్పష్టంగా రంగనాథ రామాయణ భాగములే. అయినను వీనిలోగొన్నిట రంగనాథ రామాయణమున గానరాని పాఠభేదములు గలవు. ద్విపద రామాయణములను గూర్చిన సమగ్ర పరిశోధనము గావించువారి క్రింది వానిని పరిశీలించిన కొంతవిషయము తెలియగల దనుకొందును. సంఖ్యలు 990, 996, 1005.

ఇక తంజావూరు సరస్వతీ మహలు పుస్తక భాండాగారమందు సంఖ్య 335 మొదలుకొని 352 వఱకును గల ప్రతులన్నియు రామాయణ ద్విపదలే. వానిలో 336 నుండి 350 వఱకు నన్నియు రంగనాథ రామాయణ ద్విపదభాగములు.

351— కట్టా వరదరాజు రామాయణము

352 భోసల ఏకోజీ రామాయణము.

356— విభీషణబుద్ధి యను గ్రంథభాగము కూడ చాలవఱకు రంగనాథ రామాయణ రచనగనే కానవచ్చుచున్నది. కాని పాఠభేదము లధికముగ నున్నవి.

మదరాసులోని పై 990 సం. గల ప్రతిలో తొలుత తాళ్లపా

రామాయణమును పరిష్కరించి శుద్ధ ప్రతిని ప్రకటించి పాఠాంతరములను, ప్రక్షిప్తములైన వానిని గుర్తించి యనుబంధములలో ప్రకటించిరి. 4 ఆటు పిదప కట్టా వరదరాజ రామాయణము తంజావూరు సరస్వతీ మహలు లైబ్రరీ పక్షమున ప్రకటితమైనది. 5 దీనిని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తంజావూరులోని 351 నం. గల ఏకైక ప్రతినిబట్టి పరిష్కరించి, ప్రకటించినారు. ఇక మూడవది అముద్రితమై, తంజావూరు గ్రంథాలయమందే 352 సంఖ్యతోగల ఏకోజీ రామాయణము. కావున తాళ్లపాకవారివిగా ననుమానింపదగిన ద్విపద గ్రంథ భాగములేవేని లభ్యము లగుచో వానిని పై మూడు గ్రంథములతో జాగ్రత్తగా పరిశీలించిన యెడల అన్నమాచార్యుని రామాయణమును గూర్చిన వివరణము కొంత తెలియగలదు. కాని ఇందులో కూడ కొన్ని చిక్కులున్నవి. రంగనాథ రామాయణమునందలి పనుకొను ద్విపదలు కొన్ని వరదరాజ రామాయణములోనివిగా కానవచ్చుచున్నవి. 6 ఇక తాళ్లపాకవారి ద్విపద పంక్తులెన్ని పైని పేర్కొనబడిన రామాయణ గ్రంథములందు లీనమైపోయినవో! వరదరాజ రామాయణాదులకు ప్రత్యంతరములు కూడ లేమిచే నిది యొక చిక్కు సమస్యగనే మిగిలిపోవుచున్నది.

ఆంధ్ర విశ్వ కళాపరిషత్తువారు ప్రకటించిన రంగనాథ రామాయణమున కడపటి రెండు అనుబంధముల నిచ్చినారు. అందు రెండవ యనుబంధమున రంగనాథుని రచనలో చేరిపోయి, పలు ప్రతులలో గానరాని, ఇతరేతర కవి కృత గ్రంథ రచనా భాగములు ప్రకటింపబడినవి. ఆ యా భాగములలో కొన్ని చరణములు 16 వ శతాబ్దములో రచితమైన వరదరాజ రామాయణమునందలివని తత్పరిష్కర్తలు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తమ పీఠికలో వివరించిరి. అట్లే అన్నమార్య కృత రామాయణ ద్విపదలు కూడ కొన్ని కొన్ని యుందుండి యుండవగునని వా రభిప్రాయపడిరి. ఇందలి యథార్థ్యము అన్నమాచార్యునిదిగా ననుమానింపదగిన గ్రంథ భాగ మెచటనేని లభ్యమైనపుడు వ్యక్తము కాగలదు. కాని, యున్నంతలో ముద్రితమగు రంగనాథ రామాయణమున పరిశిష్టమున నీయబడిన ద్విపదలలో అష్టమహిషీ కళ్యాణకర్తయగు తాళ్లపాక చిన్నన్న చెప్పిన ద్విపద లక్షణము ననుసరించిన పంక్తులు కొన్ని యుందుండక పోలేదు. అందందు తాళ్లపాకవారి పలుకుబడి తీరును లేకపోలేదు. మచ్చునకు రంగనాథ రామాయణము— రెండవ యనుబంధమునందలి పుటలు 686 (22—20), 702 (131—13), 704 (151—9), 725 (288—3), 736 (310—2), 738 (312—19), 746 (315—23), 752 (354—18), 753 (369—16) పరిశీలింపదగును. పైని పేర్కొనబడిన ద్విపదలలోని లక్షణము, భాష, వైష్ణవభావన, అవతార ప్రశంస మున్నగు నంశములు గుర్తింపదగినవి. పై యుదాహరణములలోని పలుకుబడి, రచనారీతి, భావ సంపద అన్నమాచార్యుని రామాయణసంబంధి కీర్తనములందు పుష్కలముగా కానవగును. (చూ. సంకీర్తనముల సంపుటములు 2, 8, 11) కవితా స్వరూపమునుబట్టి, వీనిలో గొన్నియైన తాళ్లపాకవారి ద్విపద పంక్తులు కాగూడదా యనవచ్చును.

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తమ వరదరాజ రామాయణ పీఠికలో 'తంజావూరి పుస్తకశాలలో 335 సంఖ్యగల 'రామకథ' యను ద్విపదభాగము మన్నమయ్యగారి ద్విపద రామాయణములోనిది కాబోలును. (పుట—32) అని వ్రాసిరి. కాని యందు గ్రంథ గ్రంథకర్తృ నామములు దెలిసికొనుటకాధారములులేవు. ఎవరి కంకితమీయబడినదో కూడ తెలియరాదు. 'రామకథ'లో ప్రసంచితమైనది రామాయణగాథకాదు. రామాయణ కథాప్రసక్తముగా రామ సుగ్రీవుల సంభాషణము నడుమను సాగిన కపోత కథయే యందలి ఇతివృత్తము. విభీషణుడు శ్రీరాముని శరణుజొచ్చినప్పుడు సుగ్రీవు డభ్యంతరము చెప్పు సందర్భమున నీ యితివృత్తము ప్రసంచితమైనది 7. ఈ గాథయే

నారి ఉషాపరిణయ ద్విపద యున్నది. దాని తరువాతనున్న రామాయణ రచన అన్నమయ్యయగు నాయని పరిశీలించినగాని, యందలి ద్విపదలు చాలవరకు రంగనాథ రామాయణమునందలివిగావే గోచరమైనవి. ఆ ప్రతి నిలేఖకుడు రఘునాథ అనువాడు తాళ్లపాకవారి ఉషాపరిణయముతోబాటు రంగనాథుని ద్విపదనే వ్రాసికొనెను కాబోలును.

4. రంగనాథ రామాయణము— ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు ముద్రణము (1942) పరిష్కర్త— శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.

5. వరదరాజ రామాయణము—తంజావూరు సరస్వతీ మహలు, గ్రంథమాల నం. 12. ముద్రణము 1950. పరిష్కర్త శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు.

6. చూ. వరదరాజ రామాయణ పీఠిక—ప్రథమ సంపుటము పుట 36.

7. సంస్కృత రామాయణమున నీ కపోత వృత్తాంతము స్మరింపబడిన దంతే.

'శ్రూయతేహి కపోతేన శత్రుశ్శరణ మాగతః
అర్చితశ్చ యథా న్యాయం స్వైశ్చ మాంసైర్నిమంత్రితః
సహితం ప్రతి జగ్రాహ భార్యా హర్తార మాగతమ్
కపోతో వానర శ్రేష్ఠ కిం పునర్మ ద్విధో జనః
శ్రీ రామాయణే—యుద్ధకాండే—అష్టాదశస్సర్గః 24—25

ఇందుదాహృతమగు కపోత వృత్తాంతమే (మహాభారత శాంతి

'కపోత వాక్య' మను పేరున మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున నాలుగైదు ప్రతులు విభిన్న కర్తృకములు కానవచ్చుచున్నవి. 8 కాని, నే జూచినంతవరకు నీ రచనయు నా రచనలును వేరుగా నున్నవి. దీనికర్త ఎవరోమరి! రచన చదివి చూడగా తాళ్లపాకవారిది కాదగునేమో యనదగియే యున్నదికాని, వారి రామాయణమున నీ యితివృత్త మింత విస్తృతముగా నుండియుండునా యని యొక సందేహము కల్గును. ఇది రామాయణమున వైష్ణవ పరమ ధర్మమగు శరణాగతిని వివరించు కథా సందర్భము గాన్పన గోవింద రాజీయాది రామాయణ వ్యాఖ్యలీ పట్టున విపులముగా విశదీకరించినట్లే తాళ్ళపాకవారును దీని నింతగా విస్తరించి వ్రాసియుండరాదా యని సమాధానము చెప్పుకొని సందేహనివృత్తి చేసికొనవచ్చును. 9 పైగా నీ గ్రంథారంభము, ముగింపు 'కపోత వాక్య' మను పేరున గల ఇతర గ్రంథములందువలె కృత్యాద్యంత మర్యాదలతో లేక ప్రధాన రామాయణ కథకు నదుక దగినట్లే యున్నది. కావున నీ గ్రంథము వానివలె నొక స్వతంత్ర ప్రబంధముగాక, రామాయణ కావ్యాంతర్భాగమే కాదగుననుటలో దోషములేదు. ఇదమిత్థముగ నిది అన్నమయ్యగారి రామాయణ రచనా భాగమే యని నొక్కి చెప్పగల ప్రబల సాక్ష్యమింకను లేకున్నను, నేడు మనకు లభ్యము లగుచున్న రామాయణ ద్విపదలం దీ ద్విపదలను బొప్పించుటకు వీలులేని విధమున వాని వాని రచనా ప్రణాళిక లుండుటనుబట్టియు 10 అందీ ద్విపదలు లేకుండుటనుబట్టియు ఈ గ్రంథభాగము వేరొక రామాయణమునందలి దనుట నిక్కమనవచ్చును. అట్టి దేది యని ప్రశ్నించుకొనినపుడు అన్నమాచార్యుని రామాయణమే కాదగునని సమాధానము తోచును. ఇది యూహ మాత్రమే.

ఈ రామకథలోని ద్విపద పంక్తులే కొన్ని యిపుడు ముద్రితమగు కట్టా వరదరాజ రామాయణమున గొన్ని పాఠభేదములతో కానవచ్చుచున్నవి. మచ్చునకు—

"రవి లేని దినము సారథిలేని రథము
........లేని పరువు మాలిమిలేని యోగ
తమిలేని వలపు చిత్తములేని కొలువు
...........................
మితిలేని ప్రియము గామిడిలేని యూరు
పతిలేని గృహము విస్పారంబుగాదె" (రామకథ)

చూడుడు—వరదరాజ రామాయణము (పీఠిక—పుట 52)

"రవిలేని దినము సారథిలేని రథము
కవిలేని కీర్తి, యంకములేని పోటు
ప్రతిలేనివాదు తీర్పరిలేని పేచ
ధృతిలేని తెగువ కూరిమిలేని చెలిమి
పతిలేని గృహము వాసనలేని పూవు
ధృతిలేని కొలువు కోయిలలేని వనము"

రామకథా గ్రంథకర్తృత్వ విషయ మెట్లున్నను ఇతరేతర కవికృత రచనా భాగములు కొన్ని వరదరాజ రామాయణమునందును ప్రవేశించిన వనుట కిదియే తార్కాణము. ఈ రామకథ శ్రీ విడుదవోలువారూహించినట్లు, పైన నేను వివరించినట్లు అన్నమాచార్య కృతమే యగుచో నిట్టివే మరికొన్ని తాళ్ల పాకవారి రామాయణ ద్విపదలు వరదరాజ రామాయణము

---

పర్వాంతర్గతమగు కపోతోపాఖ్యానమే) ఈ తెలుగు కృతియందు వివరింపబడినది.

కాని రంగనాథ రామాయణమం దీ వృత్తాంతము భిన్నముగా నున్నది.

"అర్కజ! ఇతడు మేలోట గీడొట తర్కింపనేటికి ధర్మంబు ప్రోవ శరణని వచ్చిన శత్రువునైన—బరికింపగా రావపాడి రక్షింప, నొక కపోతము దేగ యుద్ధతి దరుమ—వికం బావంబున వేగంబువచ్చి శిబి మాటు సొచ్చెం జొచ్చిన డేగయుమున శిబితను విచ్చి మెచ్చెరగున్న గాదె"

(రం. రామా. యుద్ధ. పుట 349)

ఈ యుదాహరణముకన్నను శరణాగతి ధర్మ ప్రతిపాదనమునకుపూర్వోదాహరణమే తగినది—మూలానుసారియు. వరదరాజ రామాయణ మందీ పట్టున సంగ్రహముగ కపోతోపాఖ్యానమే పదిపండ్రెండు ద్విపదలలో వర్ణితమై యున్నది.

8. సంస్కృత రామాయణమున ప్రస్తావింపబడి, మహా భారతమున విస్తరింపబడిన కపోతోపాఖ్యానమే రామాయణ కథా సంబంధిగా 'కపోత వాక్య' మను పేరున తెలుగు దేశమున ప్రచారముగాంచినది. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున నం. 1035 నుండి 1039 వరకును గల 'కపోత వాక్యము' అను ద్విపదకృతు లందలి యితివృత్తము గూడ నిదియే. ఏ తత్కృతికర్త లెవరో ఓబళయ్య, వెంకటగిరి ప్రభృతులు. ఇందు 1038 నం॥గల గ్రంథకర్త కందాళ వరదాచార్యుల శిష్యుడట. ఈ కపోత వాక్యమే తంజావూరు సరస్వతీమహలునందును కూడ నం. 294 నందున్నది. అవియు నిదియు నొక్కటే.

9. రామాయణ సారమంతయు నీ విభీషణ శరణాగతి ఘట్టమునందే కలదని విజ్ఞులందురు. అందుకే దీనిని శరణాగతి కావ్యమనియు నందురు. తెలుగుదేశపు రామాయణములందు దేశీయాభిమానమును పురస్కరించుకొని మూలమున గానరాని కథా వర్ణనాంశము లెన్నో చేరి, గ్రంథము పెద్దదైనది. ఆట్లే రామాయణ కథా సారమును పిండిపోయు నీ కథయు వీరి రచనయందు చేరి గుణాధిక్యమునే కల్గించి యుండవచ్చును.

10. కపోతోపాఖ్యానమును గూర్చిన వెనుకటి అధో జ్ఞాపిక చూచునది.

నందణగియుండుననియు భావింపవచ్చును. 11 ఈ సమస్యలెల్ల తొలగుటకు అన్నమాచార్యుని రామాయణమేని లభింపవలెను, లేదా వరదరాజు రామాయణమునకు ప్రత్యంతరములేని లభింపవలెను. అప్పుడుగాని యథార్థము వెల్లడికాదు.

అన్నమాచార్యుని రామాయణమునకు సంబంధించినదగునో కాదోగాని చిన్నన్న వ్రాసిన అష్టమహిషీ కళ్యాణ ద్విపద కథామధ్యమున ప్రథమాశ్వాసాంతమున 'భాగవత రామాయణ' మను పేరుతో కొంత గ్రంథ భాగమున్నది. రామాయణ సంబంధముగల తాళ్లపాకవారి ద్విపద పంక్తులగుటచేత నించుక వివరించుచున్నాను. బలరామకృష్ణులు గోగోప గణముతో సంచరించుచుండగా శ్రీదామ నామధేయుండైన గోపాలకుండు ధేనుకాసుర సంహరణార్థమై వారిని సమీపమందలి తాళ వనమునకు గొంపోయిన సందర్భమున నీ వృత్తాంతము గలదు. ధేనుకుడా వనమున ఖరాకారుడై, శూరులగు తన జ్ఞాతులతో వర్థిల్లుచుండెనను పురాణకథ ననుసరించి ఖర నామ సామ్యమున లంకేశ్వరు ననుజన్ములను, ధేనుకుని వధించిన బలరాముని పేరులోని రామనామ సామ్యమున దశరథరాముడును స్ఫురించి చిన్నన్న ఈ పట్టును భాగవత రామాయణమను పేరున చమత్కారముగ నిర్వహించియుండును. ఈ కథతో రామాయణమునకుగల సమన్వయ మిందే తప్ప సంస్కృత భాగవతమందుగాని, పోతన భాగవతాంధ్రీకరణమందుగాని, కానరాకున్న భారతాంతర్గత రామాయణముండగా, భాగవతాంతర్గత రామాయణస్ఫూర్తి యేల ఇందు రారాదని తలచియే చిన్నన్న దీని నిట్లు నిర్వహించెనో, లేక తాతగారి రామాయణ ద్విపదల ప్రభావమునకు లోగి యీ యిట్లు పరిష్కరించెనో తెలియదు. ఆ రామాయణ కథా సమన్వయ మీ క్రింది విధమున గలదు.

భాగవత రామాయణము:

"ఈ లంకనుండు నయ్యింద్రారిబంధు
జాలంబు తను గొల్వ జగదేకవీర
యీామహోరిపుఁజంపి యచట నుత్తాల
భూమిజామృత ఫలంబును నీవకొనుచు—
ననుడు రామానుజుం డా రామచంద్రుఁ
డనయంబు హర్షించి...........
అరితమ్ము గనుగొని యుభయ మన్నంత
నరిది నీ లంకకు నధిపు జేసెదము
అనుచు నగాలి బిట్టుగలంగ........
*          *          *
రామ సైన్యం బిట్లు రణకేళి సలుప
*          *          *
అతికాయ వజ్రదంష్ట్ర్యానల రోమ
శత మాయు ఘనబాహు శాలి భుజంగ
రోమ ధూమ్రాక్ష విరూపాక్ష ఖడ్గ
రోమ వృశ్చిక రోమ రుధిరాక్ష మేఘ
నా దన రామ రాంతక దేవజిన్మ
హోదర భయద విద్యుజ్జిహ్వ శౌర్య
భీకర దైతేయ బృందంబు వెరలి—
*          *          *
ఖర భావహితుఁ డు రాక్షస లోక విభుఁడు
కరము గ్రమ్ముగరాము గదియ నవ్విభుఁడు
పంక్తి కంధరశిరోభాగముల్ దునియఁ
బంక్తిగాఁ బటు కదంబములు వేయుచును.
*          *          *
ప్రతిన విభీషణ పట్టంబుగాఁగ
నామోదమున దిక్కులం దదమ్ఖమి
భూమిజాధిక ఫలపుంజంబుతోడ
నను జన్మ తోడ భృత్యాళి సేవింప
వనరాశి గడచి............
*          *          *
భట కోటితో జనార్భట కోటితోడఁ
జటుల తర నిజ నివాసము ప్రవేశించె
(చూ. అష్టమహిషీ పుటలు 54—58)[12]

ఈ రీతి నీ ద్విపద (భాగవత) రామాయణ పంక్తు లిందరి కథా సందర్భమున చమత్కారముగ పొసగింపబడినవి. ఇందు బలరాముడు రాముడు. ఖరాకారుడు ఖరసోదరుడు. తాళవనము లంక. భూమిజ భూమిజామృతఫలంబు. ఈ సమన్వయము సరిగానే యున్నదికాని, యీ విభీషణు డెవ్వరో! భాగవత పురాణమున ధేనుకునితోబాటు అతని బంధుగులు, సోదరులు, ఖరదైత్య భటులు నందరును మడసినట్లున్నది. కథా సమన్వయమునకై చిన్నన్న యిందు విభీషణు నొకనిని చిత్రించెనేమో. ఏమైనను

11. వరదరాజు అన్నమాచార్యునకు తరువాతి కాలము వాడు. ఇరువురును కడప మండలమువారే. శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తులే. వైష్ణవాభిమానమున తన్మత ప్రచారమునకై రామాయణరచన గావించినవారే. వరదరాజు తన గ్రంథమున అన్నమాచార్యుని స్మరింపకున్నను నాతడు అన్నమయ్యగారి రచన నెరిగిన వాడనియే తలపవచ్చును. కావున కొన్ని పోలిక లుండవచ్చును. కాలక్రమమున అన్నమాచార్యుని రామాయణ ద్విపదలును వరదరాజు రామాయణమందు ప్రవేశించి యుండవచ్చును.

12. తి. తి. దేవస్థానమువారు 1937లో ప్రకటించిన అష్ట మహిషీ కళ్యాణ ద్విపద కావ్యమునం దచ్చు తప్పు లధికముగా నున్నవి. దీనిని చక్కగా పరిష్కరించి మరల ప్రకటింపవలసిన యవసర మెంతేని గలదు. పై ద్విపద పంక్తులన్నియు నున్నట్లే ఉదాహరించితిని.

# అలభ్యమగు అన్నమాచార్య రామాయణము

ఇందీ రామాయణ కథాంశములతోఁ గూడిన ద్విపద పంక్తులుండుట గమనార్హము.

తెలుగున రామాయణ కథాసాగరాభిముఖమై ప్రవహించిన ద్విపద వాహినులెల్ల నేకమై తుదకు వేరుసేయరాని విధమున కలిసిపోయినవి. ఈ ద్విపద రామాయణముల విషయ మింత కలగాపులగ మయిపోవుటయు, దేశమున వానికి గల్గిన ప్రాచుర్యమునే వెల్లడించుచున్నది. అన్నమాచార్యకృత రామాయణము నేడు సమగ్రముగ గుర్తింప రాకుండుట మన దురదృష్టమే. శతకోటి ప్రవిస్తరమై, మహాపాతక నాశనమైన రఘునాథుని దివ్య చరితమును అన్నమయ్య సంపూర్ణ రామాయణముగానే విస్తృతముగానే విరచించియుండును.

ఇతఁడే పరబ్రహ్మ మిదియె "రామకథ"
శతకోటి విస్తరము సర్వ పుణ్యఫలము
ధరలో రాముఁడు పుట్టె—ధరణిజఁ బెండ్లాడె
అరణ్యవాసులకెల్లా—అభయ మిచ్చె
సారిది ముక్కు జెవులు చుప్పనాతికి గోసె
ఖర దూషణులను ఖండించివేసె.

కినిసి వాలి జంపి—కిష్కింధ సుగ్రీవు కిచ్చె
వనధి బంధించి దాటె—వానరులతో
కవలి రావణ కుంభ—కర్ణాదులను జంపి
వనిత జేకొని మళ్లి—వచ్చె నయోధ్యకు.
సౌమిత్రియు భరతుఁడు—శత్రుఘ్నుఁడు గొలువఁగ
భూమి యేలె కుశలవ—పుత్రులఁగాంచె
శ్రీమంతుఁడై నిలిచె—శ్రీ వేంకటాద్రిమీఁద
కామించి విభీషణులం—కకు బట్టముగట్టె.

(అన్నమా. అధ్యాత్మ. 11—224)

స్థూలముగా నిదియే వీరి రామాయణ రచనా ప్రణాళిక గావచ్చును. శరణాగతి కావ్యమని ప్రసిద్ధిగాంచిన రామాయణమునందలి రహస్యముల నెల్ల వీరి రచన నిక్షేపించుకొనియుండును. అయినను వీరి యనువాద పద్ధతి పూర్వ రామాయణానువాదములందువలెనే స్వతంత్రమై దేశీయతతో తొణికిసలాడు చుండుననియే తలతును. ఇట్లూహించుటకు నేడు లభ్యములగు చున్న అన్నమాచార్యుని రామాయణ సంకీర్తనములే ముఖ్య కారణములు.

వీరి రామాయణము నుద్ధరించుటకై ఆంధ్రదేశము ప్రయత్నించునుగాక!



## భావజచంద్రులు

క. నీ వెంత వేడుకొన్నను
గేవల పాతకుల కేలకృప పుట్టుమదిన్
దేవుడు 'నహి' గురువు 'నహి'
భావజచంద్రులకు వికచ పద్మ దళాక్షీ.

—ముత్తరాజు–పద్మావతి కల్యాణము.

# సంస్కృత వాఙ్మయమున గర్భకవిత్వము లేదా?

శ్రీ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు

విద్వాన్ శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు 'తెలుగుభాషలో ఛందోరీతులు,[1] అను తమ గ్రంథరాజమున—'సంస్కృత వాఙ్మయమున చిత్రబంధ కవితలు గలవు, గాని గర్భ కవిత యెందును గానరాదు. గర్భకవిత తెనుంగు ఛందోరీతిలోని ప్రత్యేక ప్రక్రియ యనవచ్చును[2] అని వ్రాసియున్నారు.

పై యభిప్రాయము సరి కాదని కవికాల సర్వజ్ఞ హేమచంద్రుని కావ్యాను శాసనములోనందలి ఈ క్రింది యుదాహరణము ననుబట్టి తెలియుచున్నది.

1 వర్ణచ్యుతం యథా—

చం. 'సిత నృశిరః స్రజా రచితమౌళి శిరోమణిమౌక్తికైస్తథా
శిఖిరుచిరోర్ధ్వదృక్ పృథులలాటతటే
తిలకక్రియా చ సా,
స్ఫుట వికటాట్టహాసలలితం వదనం స్మిత
పేశలం చ తద్
అభినవ మీశ్వరో వహతి వేష మహో!
తుహినాద్రిజార్ధయుక్ ?

(అత్ర గౌరీశ్వర వర్ణనే సిద్ధచ్ఛన్దసి ప్రతిపాద మాద్యాక్షర ద్వయపాతే అన్త్యాక్షర సప్తకచ్యుతా చ ఈశ్వర రూపవర్ణన మేవ ప్రమితాక్షరావృత్తేన.

యదివా, ఆద్యాక్షర సప్తకచ్యుతౌ అన్త్యాక్షరద్వయ పాతే చ గౌరీ వర్ణనం ద్రుత విలమ్బిత వృత్తేన).

పై శ్లోకమున గర్భితములగు ప్రమితాక్షరా వృత్తమును (ఈశ్వర వర్ణనము) ద్రుత విలంబిత వృత్తమును (గౌరీ వర్ణనము) ఈ క్రింద నుల్లేఖింపబడుచున్నవి. ఈశ్వర రూప వర్ణనము:

(ప్రమితాక్షరా వృత్తము)

'నృశిరః స్రజా రచితమౌళిశిరో
రుచిరోర్ధ్వదృక్ పృథులలాటతటే,
వికటాట్టహాస లలితం వదనం
...ష మహో?

గౌరీవర్ణనము: (ద్రుత విలంబితమ్)

'రచితమౌళి శిరోమణి మౌక్తికైః
పృథులలాటతటే తిలకక్రియా,
సలలితం వదనం స్మిత పేశలం
వహతి వేష మహో! తుహినాద్రిజా?[4]

ఆచార్య హేమచంద్రుడు క్రీ. 1088 వ వత్సరమున అవతరించి, పరస్పహస్రమానజీవియై (84 వర్షములు జీవించి) క్రీ. 1172 వ సంవత్సరమున అస్తమించెను.

ఇదం ప్రథమముగా నన్నిచోడుడు కుమారసంభవమున బంధగర్భకవితల రచించె ననియు, అయినను మనకు తెలిసినంతవరకు మొట్టమొదట గర్భ కవిత్వమును చెప్పిన ఆంధ్ర లాక్షణికుడు కావ్యాలంకారచూడామణిని నిర్మించిన విన్నకోట పెద్దన కవియే యనియు శ్రీ దొరసామి శర్మగారు వ్రాసియున్నారు. (379 పు.) ఈ పెద్దన కాలము క్రీ. 1407 ప్రాంతము. అందువలన కావ్యాలంకారచూడామణికంటె ఇంచుమించు 250 సంవత్సరములు పూర్వుడగు హేమచంద్రుని గ్రంథములో మనకు గర్భ కవిత్వమునకు లక్ష్యము కనబడు చుండగా, గర్భ కవిత తెనుగు ఛందోరీతిలో ప్రత్యేక ప్రక్రియ యనుట విశ్వసనీయము కాజాలదు.

పై యుదాహరణము ఘూర్జర దేశమునకు జెందిన ప్రాచీన మహాకవియగు హేమచంద్రసూరి గ్రంథము

1. వెల్డన్ ప్రెస్, మదరాసు (క్రీ. 1962)
2. నవమ ప్రకరణము (పుట: 379)
3. S. M. Jain Vidyalaya edition- Vol. I, chap. V 473v'322p. (Bombay) 1938.
4. ప్రసంగాను ప్రసక్తముగా ఇట నొక విశేషమును పేర్కొనదగును. పై గర్భస్థ శ్లోకములు రెండింటికిని మాతృభూతమగు 'సిత నృశిరః స్రజా' అను శ్లోకము సంస్కృతమున బహువిరళమగు చంపక మాలావృత్తము. వివిధ చ్ఛందో గ్రంథములందు చంపకమాల కనేక నామాంతరములుకలవు. 1.చంపకమాలిక, 2. చిత్రలత, 3. ధృతశ్రీ, 4. పంచకావళి, 5. రుక్మవతి, 6. రూపవతి, 7. శశివదన, 8.సరసి, 9. సలిలనిధి, 10. సిద్ధి. సంస్కృత సారస్వతమున అపూర్వమగు చంపకమాలను కూర్చిన నా వ్యాసము కాలాంతరమున ప్రకటింపబడును.

నుండి యుల్లేఖింపబడెను. ఇక క్రీ. శ. 19 వ శతకమునకు జెందిన తెలుగునాటి సంస్కృతకవి కావ్యమునుండి ఉదాహరణము చూపబడును. చతుశ్చిత్ర గర్భ—శ్రీరామాయణ సంగ్రహమను మహా కావ్యము. పద్య గద్యాత్మక మగు నీ కృతి యందు 30 సర్గములు కలవు. కర్త నిట్టల ఉపమాక వేంకటేశ్వరకవి, విశ్వనాథ కామాంబా తనయుడు. విశాఖ పట్టణ మండలమునందలి విజయ నగర ప్రాంతములకుఁ జెందినవాఁడు. నిరుపమాన చిత్ర కవితా ప్రజ్ఞ కలిగిన శేముషీ సింధువు. ఈయన రామాయణ సంగ్రహము చిత్రగర్భ కవిత్వములకు నిలయము. ఇందు రామ కవచ స్తోత్రము, రామాయణ సంగ్రహముకాక, గౌరీ కల్యాణము, శ్రీ రంగాది క్షేత్ర మహాత్మ్యము, భగవదవతార చరిత్రము, ద్రౌపదీ కల్యాణము అను నాలుగు కావ్యములిముడ్పఁ బడినవి. బాలకాండమునం దీ చిత్ర పద్ధతినే కవి ఆత్మ వృత్తాంతమును కొంత తెలిపియున్నాఁడు. బాలకాండమునందలి ప్రతి శ్లోకాద్యాక్షరమును వరుసగా వ్రాసిన రామ కవచమగును. ఈ కాండమునందలి ప్రతి పద్యమునను రెండవ పాదము నందలి మొదటి యక్షరములనుగూర్చి చదివిన కవి వృత్తాంతము తెలియును.

''అథాస్య కాండస్య ఆద్య పద్య ద్వితీయ పాదాదిమ వర్ణ మారభ్య అంత్య పద్య ద్వితీయపాదాది వర్ణ పర్యంతం తైర్వర్ణైరుదిత చిత్రాణి —

శ్రీ నిట్టలోపమాక శర్మణా, విశ్వనాథ తనయేన కామాంబాలతా ప్రసవేన జాయా ద్వయజాతనార—విశ్వనాథ రామభద్ర రామాది పుత్రవతా చ రామపాదకమల యుగ సంచార లోల మానసేన విబుధ చరణ కంజసేవినా, భవతమోఽరుణోఽయ శ్రీరామాయణసంగ్రహోనామ భూతకాలచరితోరచితో బభూవ'[5]

గద్యము:—

''ఇతి చతుశ్చిత్ర గర్భే శ్రీ రామాయణ సంగ్రహ బాల కాండే షష్ఠస్సర్గః''.

బాలకాండమునందలి ఆరుసర్గల యందలి మొత్తము పద్యములు: 687. గ్రంథ సంఖ్య: 733. శేషవర్ణములు: 281. బాలకాండమున పద్య శ్లోక చతుశ్చిత్ర వర్ణముల గ్రంథ సంఖ్య 85. శేష వర్ణములు: 28.

యుద్ధకాండ పుష్పిక: [6]

'ఇతి చతుశ్చిత్ర గర్భ రామాయణ సంగ్రహే ఉపమాక వేంకటేశ్వర శర్మణా విరచితే యుద్ధకాండే ఏ కోన త్రింశః సర్గః

యుద్ధకాండమునందలి పద్యముల మొత్తము: 1738. గ్రంథసంఖ్య: 1786. శేషాక్షరములు: 28. బాలాదిషట్కాండముల యందలి సర్గములు 68. షట్కాండములలోని శ్లోకములు: 3736. షట్కాండములయందలి గ్రంథముల మొత్తము 4112. శేషాక్షరములు 24.

1. గౌరీకల్యాణము : పార్వతీ పరమేశ్వరుల పరిణయమును చిత్రించు గర్భస్థ కావ్యము. రామాయణ సంగ్రహమున అయోధ్యాకాండ మొదలు యుద్ధకాండము వరకు గల పద్యముల యందలి మొదటి యక్షరముల వరుసగా కూర్చినచో గౌరీ వివాహ కథ అగును.

పుష్పిక :

'శ్రీ కాంతాకాంత ప్రచోదిత మానస కవి నిరచిత నానా విచిత్ర కుక్షి శ్రీ రామాయణ సంగ్రహాయోధ్యకాండ ప్రథమ పాదాద్య క్షర ప్రభృతికథనకాండగత శ్లోకాద్యక్షరావధి క్రమ నియమితాక్షరైః ఉదిత గౌరీ వివాహాఖ్యం ఇదం చరితమ్ [7]

2. శ్రీ రంగాది క్షేత్ర మాహాత్మ్యము:—త్రయోదశ ప్రధాన దివ్య క్షేత్రముల వైభవము, మహాత్మ్యమును ఈ గర్భస్థ కావ్యము వర్ణించును. అయోధ్యకాండ మొదలు యుద్ధకాండ వరకుగల శ్లోకముల ద్వితీయ పాద ప్రథమాక్షరముల వరుసగా వ్రాసిన ఈ కావ్య మేర్పడును.

క:—

''ఇతి చతుశ్చిత్ర గర్భ శ్రీ రామాయణ సంగ్రహాయోధ్యా కాండాద్య శ్లోక ద్వితీయ పాదాద్యక్షర మారభ్య, యుద్ధకాండాంతిమ శ్లోక ద్వితీయ పాదా ద్యక్షర పర్యంతం చతుర్వర్గ—ధర్మార్థ ప్రదానామ్. ఉపమాక వేంకటేశ్వర విరచితానామ్ ఆద్య శ్రీరంగ పురు షోత్తమ—రామేశ్వరా విముక్త—సింహాచల—కాంచీ—సాకేత—ద్వారకా—మథురా—శేషాచల—ప్రయాగ—గౌతమీ—భద్రాచలాభిదాన—త్రయోదశ ప్రధాన దివ్యక్షేత్ర తీర్థ పురీ మహిమోపేతాః త్రిషష్ఠి శ్లోకాః''[8]

3. భగవదవతార చరిత్రము:—

అయోధ్యాకాండ మొదలు యుద్ధకాండము వరకుగల శ్లోకముల యందలి మూఁడవ పాదముల ప్రథమాక్షరముల క్రమముగా కూర్చినచో ఈ కావ్య మేర్పడును. ఇందు శ్రీ మహావిష్ణువు వివిధావతారములు వర్ణింపబడెను.

4. ద్రౌపదీ కల్యాణము:—

అయోధ్యాకాండ మొదలు యుద్ధకాండవరకు గల శ్లోకములయందలి నాల్గవ పాదముల ప్రథమాక్షరములు క్రమముగా కూర్చినచో ఈ కావ్య మేర్పడును. ఉపసంహారము:

'ఇదం ద్రౌపదీ మంగళం నాథునిత్యమ్, చతుశ్చిత్రగర్భంతు రామాయణస్థమ్'

పైని ఉదాహరించిన ఆచార్య హేమచంద్ర—వేంకటేశ్వర కవుల రచనలనుబట్టి గర్భ కవిత్వము చిరకాలము క్రిందటనే సంస్కృత సారస్వతము వెలసినదనియును, ఇది తెనుగు ఛందోరీతిలోని ప్రత్యేక ప్రక్రియ కాదనియు తెలియుచున్నది.

---

5. A Triennial Catalogue of Mss – Vol. IV. Part I – Skt. B. (R. No, 3375; pages 5032 (A. D. 1928)–Madras,

6. Ibid – p. 5033.

7. Ibid. p. 5034.

8. Ibid. p. 5035.

# ప్లేటో ఆదర్శరాజ్యం

ఒక సమీక్షకుడు

మహర్షులు, మహాత్ములు ఒక దేశమునందే యవతరింపరు. జ్ఞానమొకదేశముయొక్క సొమ్ము గాదు. అఖండ ప్రపంచ చరిత్రను సింహావలోకనము చేసినచో సర్వయుగములందు, సమస్త దేశములందు మహర్షు లవతరించిరనియు, జ్ఞానధార, తత్త్వసమీక్ష కొనసాగినదనియు తెలియును. కాల గమనమును బట్టి చూచినచో నొకదేశము మఱొకదేశముకంటె ననేక పరిస్థితులనుబట్టి, ముందుగా నాగరకము గావచ్చును. విజ్ఞానము ప్రోది సేయవచ్చును. అంతమాత్రమున ఆదేశము నొసటనే ప్రొద్దు పొడిచినదని, శేషదేశములన్నియు ననాగరకదేశములని పొంగిపోయి, మిన్నుముట్టరాదు—సత్యాన్వేషకులయినవారి విషయమిది. విభిన్న సంస్కృతులను తక్కెడలో పెట్టి తూచునపుడు మన మా యా సంస్కృతులు విశ్వజనీన జ్ఞానాభివృద్ధి కెంతగా దోహదము చేసినవను దానినే ముఖ్యముగా గమనింపవలయును. స్వజాతీయ దురభిమాన దృక్పథమునకు తల యొగ్గరాదు. తల యొగ్గితిమో దోషైక దృక్కుల మగుదుము. ఈ విధముగా నొక సిద్ధాంతమును జేసికొనినగాని, మనకు భారతీయులకు యవన దేశ సభ్యతా విశేషము లర్థము గావు. కళారంగమున, తాత్త్విక రంగమున యవనదేశము (Greece) స్ఫైతము ప్రశంసనీయమైన సంస్కృతి పొదుకొల్పినది. ఒకనాడు యవన సభ్యతావాణి పాశ్చాత్య ప్రపంచమును సమ్మోహ పరచినది. ఏ కళా విద్యారంగమునందు విచారమున కుపక్రమించినప్పటికి పాశ్చాత్య దేశ విమర్శకులు మున్ముందుగా ఏథెన్సు నగరమునకు ప్రయాణము కట్టవలయును.

అట్టి యవన దేశములో మహర్షు లెందరో యవతరించిరి. శాస్త్ర చర్చలు చెలరేగినవి. కళలు విరిసినవి. ఒక మహా సంస్కృతి విరాడ్రూపము ధరించినది. యవన మహర్షులెన్నో యుత్తమ గ్రంథములు రచించిరి. విద్యా పరిషత్తులు వెలకొల్పి, విజ్ఞానమును వెదచల్లిరి. సమకాలీన శోచనీయ పరిస్థితులు వారిలో తత్త్వ విచారమును పెంపొందించినవి. స్వదేశీయుల యజ్ఞానమునకు నగచి వారికి జ్ఞానచక్షువు ప్రసాదింప ఈ మహర్షు లెంతో యావేదన పడిరి.

(ప్లేటో ఆదర్శ రాజ్యం. అనువాదం:—జి. వి. కృష్ణారావు, పి. హెచ్. డి. ప్రచురణ సంస్థ:—సాహిత్య ఎకాడెమీ పక్షమున—సాహితీ కేంద్రం; తెనాలి. ప్రాప్తిస్థానములు:—సాహితీ కేంద్రం, తెనాలి (లేక) సాహిత్య ఎకాడమీ, న్యూఢిల్లీ—1. మూల్యము పది రూపాయలు).

సమకాలీనులు వారి నీసడించిరి. ఒకనిని విషముపెట్టి బలవన్మరణముపాలుచేసిరి. వేఱొకనిని ప్రవాసమునకు బంపిరి. అయినను యవనర్షులు జంకలేదు. సమకాలీన సమాజమును సంస్కరింపవలయునను సత్సంకల్పముతో యీ మహర్షులు చర్చలుచేసిచేసి యూర్ధ్వ లోకముల కెగ్రజకిరి. వారు దివికి భువికి సూత్ర పట్టిరి. వారి గ్రంథములు దివ్య రాజ్యమునకు నిశ్రేణు లయినవి. తత్ఫలితముగా వారి గ్రంథములలో నానాటికి కాలా బాధితమయిన, దేశకాలావధులను తిరస్కరించిన సత్యము గూడు కట్టుకొన్నది. దేశములు పురోగమించవచ్చును. సంస్కృతుల పేర్పాటు పొసగవచ్చును. కాలము మారవచ్చును. ఆ గ్రంథములందు ప్రతిపాదింపబడిన సిద్ధాంతము లనంతర యుగములవారి తిరస్కారమునకు పాత్రము గావచ్చును. ఒక కొన్ని చర్చ లేవగింపు కల్గింపవచ్చును. కాని, యీ గ్రంథములను గొల్సు కూటము చేసికొన్న దివ్య సత్యమును మాత్రము త్రోసిరాజనలేము. జిజ్ఞాస చిగురొత్తించు "సత్తు—చిత్తు" ఆ గ్రంథములలో నున్నంతకాలము, ఆ "సత్తు—చిత్తు" ననుభవించుశక్తి ప్రపంచ నాగరికులలో నున్నంత కాలము ఆ గ్రంథములు ధ్రువ తారలే. అట్టి యుజ్జ్వల ధ్రువ తారలయిన గ్రంథములలో "రిపబ్లిక్" ఒకటి. దానిని సృష్టించిన మహర్షి ప్లేటో. వేదా కర్మయోగి గ్రంథమునకు "ప్లేటో ఆదర్శ రాజ్యం" అను పేరుతో ఆంధ్రానువాదముకూర్చి మన కందించినవారు డాక్టర్ జి. వి. కృష్ణారావుగారు. బెంజమిన్ జోవెట్ చేసిన యాంగ్లానువాదమును మూలముగాగొని జి. వి. కృష్ణారావుగారు తెనుగు చేసిరి.

ప్లేటో మహర్షి (క్రీ. పూ. 427—348) సాక్రటీసు శిష్యుడు. బొడ్డున మాణిక్యముతో బుట్టినప్పటికి, అనుష్యయణుడయినప్పటికి, కాలానుగుణముగా అవకాశములున్నట్టి ప్లేటో రాజ్యపాలకుడు గాలేదు. మరి తత్త్వ శాస్త్రమువైపు మొగ్గినాడు. "సాక్రటీసుయొక్క తత్త్వాన్వేషణ విధానము, ధర్మైకదృష్టి ప్లేటో జీవితాన్ని దిద్ది తీర్చాయి. అతని జీవితానికి పరమ లక్ష్యమైపోయాయి." జి. వి. కృష్ణారావుగారు "జేగంటలు" లో ప్లేటో జ్ఞాన విడంబనమును గూర్చి యుదాత్తముగా వ్రాకుచ్చిరి. బెంజమిన్ జోవెట్‌కు ప్లేటో ఈ విధముగా కన్పించినాడు.

"He was the greatest metaphysical genious whom the world has seen; and in him more than in any other ancient thinker, the germs of future knowledge are contained." "He is the

**father of idealism in philosophy, in politics, in literature. And many of the latest conceptions of modern thinkers and statesmen, such as the unity of knowledge, the reign of law, and the equality of the sexes, have been anticipated in a dream by him."** ఎట్టి గంభీర విషయమును చర్చించుచున్నప్పటికి, దానిని ప్లేటో మధురాతి మధురముగా, తర్కబద్ధముగా యుక్తి సహముగా గ్రంథస్థము చేయును. ఆయన రచించిన గ్రంథములు మధుర కావ్యములు. ఆ మధుర కావ్యములలో అగ్రశ్రేణికి చెందినది "రిపబ్లిక్" మన సంప్రదాయ పరిభాషలో జెప్పికొనవలయునన్నచో ఉపనిషత్తులు, ధర్మ శాస్త్ర గ్రంథములు, చాణక్యుని యర్థశాస్త్రము సర్వము రాశీభూతమయినచో ఏ స్వరూపము బహిర్గతమగునో, ఆ స్వరూపమును పోలునదే "రిపబ్లిక్". దీనినిగూర్చి జోవెట్ ఈ క్రింది విధముగా జెప్పినాడు.

**"But no other Dialogue of Plato has the same largeness of view and the same perfection of style no other shows an equal knowledge of the world or contains more of those thoughts which are new as well as old and not of one age only but of all. No where in Plato is there a deeper irony or a greater wealth of humour or imagery or more Dramatic power. Nor in any other of his writings is the attempt made to interweave life and speculation or to connect politics with philosophy. The Republic is the centre around which the other Dialogues may be grouped; here philosophy reaches the highest point (Especially in Books V, VI, VII) to which ancient thinkers ever attained."** అట్టి "రిపబ్లిక్"లో పదిప్రకరణము (**Ten Books**) లున్నవి. విషయ ప్రాధాన్యమునుబట్టి యీ పది ప్రకరణముల నయిదు ప్రకరణములుగా చేయవచ్చును. ఆ యైదు ప్రకరణము లివి: 1. ప్రథమ ప్రకరణమునుండి ద్వితీయ ప్రకరణము సగాలు వరకు న్యాయ విచారణము ప్రధానము. న్యాయమునుగూర్చి బహుళ ప్రచారమందున్న సర్వ సామాన్య సిద్ధాంతములు, కుతార్కిక సిద్ధాంతములు ఖండింపబడెను. 2. ద్వితీయ ప్రకరణోత్తర భాగమునుండి చతుర్థ ప్రకరణాంతముదాక తాత్త్విక పరిపాలితమగు ఆదర్శ రాజ్యము నిర్మింపబడినది. ఉత్తమ విద్యా విధాన వర్ణనము కలదు. 3. పంచమ ప్రకరణమునుండి సప్తమ ప్రకరణము తుది వరకు న్యాయ విచారణముకంటె ధర్మ దర్శన చర్చ యధికము. సాంఘిక రాజకీయ సిద్ధాంత చర్చలు వెనుకంజ వేసినవి. వైయక్తికమగు వార్జవ విచారణము ప్రారంభమయినది. సమాజపరమయిన వైవాహిక విధానము నిర్దేశింపబడినది. 4. అష్టమ నవమ ప్రకరణములలో బహువిధ రాజ్యావతార పతన హేతువులు నిర్ణయింపబడినవి. వ్యక్తి నిష్ఠమగు లాలసప్రవృత్తి, నియంతృసరణి సమీక్షింపబడినవి. 5. దశమ ప్రకరణములో తత్త్వశాస్త్ర కవితా సంబంధము నిశ్చితమయినది. ఆదర్శ రాజ్యపౌరునకెట్టి యూర్ధ్వగతు లొనగూడునో యొక జానపద గాథనుబట్టి వర్ణింపబడినది. ఈ విధముగగాక సమస్త గ్రంథమును స్థూలముగా రెండుభాగములు చేయవచ్చును. పంచమప్రకరణము వరకు యున్న సంస్కృతి సాధారణలక్షణములగు నైతిక ధార్మిక సిద్ధాంతములనుబట్టి యేర్పడు రాజకీయ వ్యవస్థ వర్ణింపబడినది. శేషగ్రంథములో ఈ సాధారణ రాజకీయ వ్యవస్థ యెట్లు సాధారణమయిన యాదర్శ రాజ్యవ్యవస్థగా పరిణమించునో వివరింపబడినదనవచ్చును. ఈ యాదర్శ రాజ్యమే ప్రధానము, అనుత్తమమును. తదితర రాజ్యవ్యవస్థలన్నియు పతనచిహ్న గర్భితములు. అరిష్ట దాయకములు. ఈ విధముగా ఎట్టి సమానలక్షణములులేని సాధారణ రాజ్యవ్యవస్థను, ఆదర్శ రాజ్యవ్యవస్థతో ముడిపెట్టుట ప్లేటో మహర్షివంటి కారణ జన్మునకే సుసాధ్యము. కానిచో న్యాయ విచారముతో ప్రారంభమయిన ఈ గ్రంథ మాదర్శ రాజ్య పౌరునకు ప్రాప్తించు నానుషంగిక ఫలవర్ణనముతో నెట్లు పరిసమాప్తి గాంచును. "రిపబ్లిక్" తర్కబద్ధమయిన, సరసమయిన సంభాషణములు గలది. ఎక్కడను అంధవిచారముగాని మూఢవిచారములు గానిలేవు. సునిశిత బుద్ధి వైభవమునకు ప్రతిపుట సాక్ష్యము. ఈ మధురకావ్యములో సరససల్లాపము లాలపించిన పాత్రలు ఆరు. సోక్రటీస్ గురుపీఠ మధిష్ఠించెను. మిగిలినవారు సిఫాలస్, పాలిమార్కస్, థ్రాసిమాకస్, గ్లాకస్, ఎడిమాంటస్. వీరిలో కొందరు చారిత్రక వ్యక్తులు. ఆ పాత్రలన్నియు ప్లేటో మహర్షికాలమునాటి బహు విధములయిన, బహుజనాదృతములయిన సిద్ధాంతములు ప్రతిపాదించును. ఒక్కొక్క పాత్రయొక్కొక్క సిద్ధాంతమునకు మూర్తి కల్పనమా యనునట్లుండును. ఇట్టి పాత్రలతో సోక్రటీస్ చర్చలుచేసి తత్త్వమును తరచి చూచుచున్నాడనినచో, ప్లేటో తన కాలమునాటి విభిన్న సిద్ధాంతములను ఢీకొని, ఖండించి చరమసిద్ధాంతము స్థాపించుచున్నాడనియే యర్థము.

జోవెట్ ఆంగ్లానువాదము సరళ సుందరమయినట్టిది. చక్కని పలుకుబడి గలట్టిది. మూలగ్రంథ మెట్లుండునో యవనభాషా విద్వాంసులకే తెలియును. కాని జోవెట్ ఆంగ్లానువాదమును జూచినపిదప "రిపబ్లిక్" అంగాంగిభావ సంయుక్తమయి, రససిద్ధి పొందిన మహాకావ్యమనియు, అసామాన్య తర్కబద్ధమై, నిశిత మేధాసంపత్తి కాలవాలమనియు, అవ్యాప్త్యతి వ్యాప్తి దోషములు కగపడ వట్టిదనియు తేటతెల్లమగును. జోవెట్ గ్రంథమును, కృష్ణారావుగారి యను

వాదమును దగ్గరపెట్టుకొని చూచినగాని, యాంధ్రానువాద కర్త పడినశ్రమ పడసిన విజయము తెలియవు. ''ప్లేటో ఆదర్శరాజ్య'' మందలి యే పుటను పరిశీలించినను అది జోవెట్ గ్రంథభాగమునకు పోటీయగుచున్నది. ఆంగ్లభాషా కారకము వేరు. ఆంధ్రభాషా కారకమువేరు. భాషా సంప్రదాయమందు వాక్యవిన్యాసమందు, నుడికారము నందాంగ్లాంధ్ర భాషలకు సామ్యములేదు. అట్టిచో యవన భాషనుండి యనువదించు నపుడు జోవెట్ ఎంతకష్టపడెనో, ఆ యాంగ్లభాష నుండి యనువాదము చేయునపుడు కృష్ణారావుగారుకూడా నంతే శ్రమింప వలయును. శ్రమించిరికూడ. ఆంధ్రభాషా సంప్రదాయము కాపాడుకొనుటలో నేమి, యాంగ్లపదములకు సమానమయిన— సమస్తార్థము నియ్యగల, ప్రకరణోచితమయిన భావము ప్రకటింపగల— యాంధ్ర పదముల నెన్నుకొనుటతో నేమి కృష్ణారావుగారు కృతకృత్యులయిరనియే నిష్పక్షపాతముగా చెప్ప వచ్చును. ఆంధ్రానువాదము కత్తిమీది సామే కాని యా సాములో ఆంధ్రానువాదకర్త యిసుమంతయు గాయపడలేదు. సెబాసనిపించుకొనిరి.

''రిపబ్లిక్''లోని కొన్నికొన్ని యాంగ్లపదముల భావ మును దాను సృష్టించిన తెలుగుమాటలు సంపూర్ణముగా నొసగ వేమో యను తలంపుతో గాబోలు కృష్ణారావుగారు బ్రాకెట్లలో నా యాంగ్లపదములనుదహరించిరి. ఇది మంచిపోకడ. మూల గ్రంథములో చర్చచేయువారు తమ వాదమునకు బలము నొసగుటకయి ప్రసిద్ధ యవనుల వాక్యములనుట్టంకించిరి. కృష్ణారావుగారా వాక్యములను పద్యములలో నిబంధించిరి. పద్య ములు సరళములు, రచనమునకు విలయములు. అన్నిటికంటె నీ యాంధ్రానువాదమునకు వన్నెపెట్టినట్టిది శిష్టవ్యావహారిక భాషతో కూడిన, సభ్యప్రపంచ మాననీయమయిన శైలి ఈ శైలి కవితాశక్తి గర్భోత్పన్నమయినట్టిది. గ్రాంథికాంధ్ర భాషా సహాయముతో వచనమునందు ''నీతిచంద్రిక'' రచించిన వాడు చిన్నయసూరి. జి. వి. కృష్ణారావుగారు నిర్మించిన ''ప్లేటో ఆదర్శరాజ్యము'' శిష్ట వ్యావహారిక భాషతో కూడిన ''నీతి చంద్రిక''. భాషా భేదమున్నను, ఇతివృత్త తారతమ్యమున్నను వక్తృ భావానుకూలముగా, ప్రకరణోచితముగా వాక్య నిర్మాణ మొనర్చుట, శబ్దాను సంధానము చేయుట, తత్సమ పదములు తెలుగు పలుకుబళ్ల నుపయోగించుట మున్నగు శిల్పపరిష్కార సృష్టియంతయు అటు ''నీతి చంద్రిక''లో, ఇటు ''ప్లేటో ఆదర్శ రాజ్యము''లో సమానమని నా మనవి. కృష్ణారావుగారి యనువాద నైపుణ్య సౌందర్యమును దిఙ్మాత్రముగా చూపుటకై భిన్నభిన్న ఘట్టములను చూపవలసియుండును. ఎల్లయెడల ప్రతి పదమునందు వారి శ్రమ ఫలించినదని ద్యోతకమగును. చదువ మొద లిడినంత వీడబుద్ధి పొడమదు, తరంగ ప్రాయముగా ఆలో చనలు రేకెత్తించు ననువాదముచేసిరి కృష్ణారావుగారు. మూల మునకు త్రిగుణ వ్యవహితమగు ననువాదమయిన నేగాక ! వర్ణనము కవిత్వము మేళవించినదో గాక ! కృష్ణారావుగారు బహువిధములుగా విజయముసాధించి, తెలుగు నాటగల యెరుక గలవారి కృతజ్ఞతకు పాత్రులయిరి. అనువాదమేగాక పుస్తక ముద్రణముగూడ ముచ్చటగా నున్నది. ముద్రణము నొక కళయే యను సత్యమును మనవారింకను గుర్తింపలేదు. అట్టిచో అక్షర స్ఖాలిత్యాది దోషరహితమగు ''ప్లేటో ఆదర్శ రాజ్యము'' ముద్రణ సౌభాగ్యము చూచినపుడాహ్లాదము కలుగును. ముద్ర ణము ముచ్చటగానున్న యీ గ్రంథమునకు, విజ్ఞాన ప్రచా రార్థము సాహిత్య ఎకాడెమీ పక్షమున ప్రచురిత మయినట్టి దానికి మూల్యము పదిరూపాయలుండుట యెక్కువయేమో యని చెప్పక తప్పదు.

# రంప

ఉ. రంప పరాయిమూక జొరరాని రహస్యపుఁగొంప, కాన్స్టెబిల్
గుంపులటొంప, కోయదొరకూటువ దుంప, విరోధిగుండె వా
లంప, పితూరిదారుల గలంపఁగ వచ్చెదు తెల్లవారికిన్
కంపన నించిమించుతట కాపద జేసెదు శంప గాత్రమిన్

తూర్పుగోదావరీ మండలమున నేజెన్సీభాగము ఎనుబదేండ్ల క్రిందట రంప పితూరి జరిగినది. అప్పుడు పన్నాల సీతారామ బ్రహ్మశాస్త్రిగారు చెప్పినట్టిది. (1822—1904) వీరు కందుకూరి వీరేశలింగము పంతులుగారి యాంధ్ర గీర్వాణ గురువులు.

## లేఖలు

# అముద్రిత ఆంధ్ర నానార్థ నిఘంటువు

అయ్యా!

మన భాషలోవున్న నిఘంటు సంఖ్య స్వల్పాతి స్వల్పం. ఉన్నవి కూడా అసమగ్రంగా ఉన్నవి. ఈ సూత్రం ప్రతి నిఘంటువుకు పడుతుంది.

భాషలో కావ్యా లనంతంగా ఉన్నప్పుడు, ఏకావ్యంలో ఏమూల, ఏశబ్దం వాడబడిందో పరిశోధించి, నిఘంటువులో చేర్చడమే కష్టమైనప్పుడు, అముద్రితంగా, అలభ్యంగా అనేక గ్రంథాలు, కావ్యాలున్నప్పుడు అందులో శబ్దాలు నిఘంటువులో కెలా ఎక్కటం? ఈవిధంగా మన నిఘంటువులు అసమగ్రంగానే ఉంటూ వస్తున్నవి.

ఇదిలా ఉండగా మార్చి (1963) నెంలో పై శీర్షికతో ఒక వ్యాసం వచ్చింది. సాహితీ జిజ్ఞాసువులకు ఆ వ్యాసమందలి విషయం పరమాహ్లాదంగా ఉంటుందనడంలో అతిశయోక్తి ఏముంటుంది?

అది నానార్థ నిఘంటువట. అందు 51 ఆట వెలదులు, 294 కందములు మున్నవట. ఇదివరకున్న నిఘంటువులలో లేని పదాలు చాలా వున్నవట—ఇంతకంటె కావలసిందేముంది? పైగా అందులోవున్న ఇంకొక విశేషం ఏమిటంటే—మన నిఘంటువుల్లో వృక్షనామమేదైనా వచ్చిందంటే—వాళ్ళకు మాత్రం ఏం దెలుస్తుంది గనక—వృక్ష విశేషమని వ్రాయటం. అలాగే జంతు విశేషమని—ఈ పద్ధతి కన్పిస్తుంది. ఆ వ్యాసకర్త శ్రీ హస్నాబాద నాగలింగయోగిగారు సంపాదించిన ఆ తాళపత్ర ప్రతిలో కేవలం జంతు విశేషం, వృక్ష విశేషం—అని తప్పించుకొనిపోకుండా ఆ చెట్టో, మెకమో ఏదో దాన్నిగూర్చిన వివరాలు కూడా వున్నవట. ఇట్టి గ్రంథాలు సత్వరం ముద్రింపబడటం అత్యావశ్యకంగా తోస్తుంది ప్రతి సాహిత్యజిజ్ఞాసువునకు.

ఆ నిఘంటువును వ్రాసిందెవరో ఆ తాళపత్ర ప్రతియందు దొరకలేదుట. కాని, నేటికి 107 సం. ల క్రితం వ్రాయబడిందని మాత్రం అందులో ఉందట. ఈ నాటి కది బైట పడింది. దాన్ని బైటకు త్రవ్వినందుకు నాగలింగయోగి గారికి ఆంధ్రులు కృతజ్ఞులు.

ఆ నిఘంటువులోని కొన్ని పద్యములు వా రుదాహరణగా ఇచ్చారు. అవి మొత్తం 15. అందులో ఆట వెలదులు 2. కందాలు 13.

ఆ నిఘంటుకర్త తాను చేతిమీదుగా వ్రాసుకొన్నదో, ఆ ప్రతి, లేక ఆయన వ్రాసుకొన్న ప్రతికి ఎన్నో పుత్రికయో మనకేమీ తెలియదు. కాని, ఆ పద్యాలు వ్రాసిన కవికి, లేక ఈ ప్రతిని వ్రాసుకొన్న వ్రాయసకానికి ఛందోజ్ఞానం పూజ్యం. శబ్దజ్ఞానం అంతకుముందే లేదు. ఆటవెలది, కందముల లక్షణమే సరిగా తెలియదు. కొన్నిశబ్దముల కద్భుతార్థము లియ్యబడివున్నవి. వాటిని క్రమంగా నిరూపించటం మంచిదనుకుంటాను.

ఇక్కడొక చిన్న మనవి. ఈ వ్యాసం ఆ వ్యాసకర్తకు సంబంధించినదికాదు. ఆ నిఘంటుకర్తకు సంబంధించినది. ఇది కాక, ఇట్టి నిఘంటువులు అవశ్యం ముద్రింపబడాలని ముందే మనవి చేసినానుకదా. అట్లా చేయటానికి ఆ వ్యాసకర్తలుగాని, మరెవ్వరైనా తత్ప్రయత్నంలోవుంటే చాలా పరిష్కరించాల్సి ఉంటుందని సూచన చేయడానికిది వ్రాయటం. అంతకన్న ఏమీ లేదు.

రెండు ఆట వెలదుల్లోనూ ఒక పద్యంలో ఒక్క పాదానికి మాత్రమే యతి పాటించబడింది.

శ్వేతమనగ తెలుపును శ్వేతము యెరుపును—మిగిలినవన్నీ యతులు లేనివే.

13 కందపద్యాలకుండే ఇరవైయారు యతుల్లోనూ పదకొండు మాత్రమే యతులు పాటించబడినవి.

ఇక ప్రాసలు:—ఒక పద్యంలో ప్రాస కూడా లేదు.

బరహియున—
బర్హియునన్—
బరహియున—
బర్హియునన్—

ఛందో దోషాలు:—

"చమరి మృగము ననగ తెల్లవెంట్రుకల మృగము"
"శ్వేతమనగ తెలుపును, శ్వేతము యెరుపును"

ఇందొక్కొక్కఅక్షర మెక్కువగావుంది. రెండవదానిలో 'ము' తీసివేయవచ్చు. పై దానిలో వెంట్రుక—వెండ్రుక—కాబోలు.

కందపద్యంలో బేసిగణము జగణముండరాదుగదా. మాణవుడన బమ్మచారి.

కల్హారంబన కలువలు—ఈ పద్యం నాలుగవ పాదం.

కల్హార మనంగ పుష్పాడికిని పేరయ్యెన్—

ఇందు బేసిగణం జగణమేకాక, ఛందస్సు కూడా తప్పింది. పోనీ "కల్హార మనంగ పుష్పాడికిని పేరయ్యెన్—" ఇట్లా పఠించినా 7 వ గణం నగమౌతున్నది. యతి లేదు.

ఇక శాబ్దిక దోషాలు:—

6. లాంశంబన—ఆడెటివారున్

(1) నానార్థ శబ్దములకును

మానుగ శబ్దార్థములును మరి దెలుసు మమీ

(2) ఏ శబ్దములు వచ్చిన—(శబ్దంబులు కాబోలు)

యా శబ్దంబులను నన్నియంతయు తెలుసున్—

(ఇందులో అన్ని—యంతయు—అర్థమేమిటో?) ఇట్లున్నవి.

(1) కురువకమున

కురువక.........కూకటియౌనూ—ఇందులో ఈ 'నూ' దీర్ఘ మెట్లు వచ్చిందో తెలియదు.

వ్యర్థ శబ్ద ప్రయోగం, పునరుక్తులు కుప్పలు తెప్పలు.

మానుగ జదివిన దీనిన్

మానుగ శబ్దార్థములును మరి దెలుసుసుమీ

ఈ ప్రాస యతులకు ఈ నిఘంటుకర్త పెడ్డపేట్లకిది నిదర్శనం.

హరులన గుఱ్ఱములగునూ

హరులన పగ్గముల పేరును హరులన శత్రుల్

(ఇందు'ను' ఎక్కువ—శత్రుల్ కాబోలు)

అరియన్న శబ్దానికి శత్రువన్న అర్థముందిగాని 'హరి' శబ్దానికున్నదా. ఇట్లాంటివాటికి ఉదాహరణకావాలి. (లేక హరించువాడని చెప్పుకోవాలి. ప్రతివాడుహరించగలడా)

శశిబంధు డనగ కుందేలు—ఈ శశి బంధు శబ్దాని కిచ్చిన అర్థాలు విచార సహ్యములు.

శశిబంధు డనంగ రాజు చూడు ధరిత్రిన్—శశిబంధు డనే రాజుకథ ప్రసిద్ధంగావుంది. మరి ఈ శశిబంధు డెవరో? ఎవరో ఒకరుండకపోరు. కాని, ప్రసిద్ధి ననుసరించికదా చెప్పాలి. శకట సాధురేఫ సాంకర్యం, అర్ధబిందువులు పాటించకపోవటం, యతులు, ప్రాసలు, ఛందస్సు, శబ్దములు, అర్థములు—వీని యన్నింటిలోనూ దోషాలు కన్పిస్తున్నవి. ఇచ్చింది 15 పద్యాలు, 30, 40 దోషాలు. సంధి దోషా లనేకం. మరి ఇట్టి నిఘంటువు ప్రామాణికంగా అంగీకరింబడడమెలా? ఇది పరిష్కరణ దుస్సాధ్యంలాగా కన్పిస్తుంది.

దీన్నెవరైనా ప్రచురించే ప్రయత్నంలోవుంటే వారికిదొక సూచన.

కరీంనగర్ **తుమ్మపూడి కోటీశ్వర రావు.**

# ప్రౌఢకవి మల్లన పోతన కుమారుడా?

అయ్యా!

శ్రీ విమర్శ కాగ్రేసర దీపాల పిచ్చయ్యశాస్త్రిగారిచే సంపాదితమైన "చాటుపద్య రత్నాకరము"న 54 పాఠట(?) "ప్రౌఢకవి మల్లన" అను శీర్షికక్రింద "ఈ మల్లన బమ్మెర పోతనామాత్యుని కుమారుడగు ప్రౌఢకవి మల్లనయే" యని వ్రాసియున్నారు. కాని ప్రౌఢకవి మల్లన దాక్షాయణీ పరిణయము, రుక్మాంగద చరిత్రము అను రెండు ప్రౌఢ ప్రబంధములను వ్రాసియున్నాడు. ఈతని గోత్రాదికముల నిట్లు తెలియుచున్నది.

కం॥ ఎనయుచు సేవింపుదు—మ

జ్జనకుని శ్రీవత్స గోత్ర సాగర చంద్రున్

ఘను బోతయమంత్రీశ్వరు

ననయంబును భక్తి నమ్మకాంబా ప్రియునిన్॥

ఈ పద్యమునుబట్టి శ్రీవత్స గోత్రమనియు, అమ్మకాంబ పోతయలు తల్లిదండ్రులనియు తెలియుచున్నదికదా!

ఇక పోతన కుమారుడగు మల్లన గోత్రము 'కౌండిన్యస' తండ్రి పోతనామాత్యుడు. ఈ మల్లనకు ప్రౌఢకవియను బిరుదమున్నట్లు కనపడదు. పై రుక్మాంగద చరిత్రలోని పద్యమువలన ప్రౌఢకవి మల్లన పోతనకుమారుడగుటలేదుకదా! కావున శ్రీ శాస్త్రిగారు తమ "చాటు పద్య రత్నాకరము"లో వ్రాసినది పొరపాటేమోయని తోచుచున్నది.

కొమాండూరి **రామానుజాచార్యులు.**

ఆర్యా

కేంద్రప్రభుత్వ సాహిత్య అకాడెమీవారు 1962 వ సంవత్సరమున తెలుగు భాషలో కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి "మధ్యాక్కరలు" అన్న గ్రంథాని కైదు వేల రూపాయలు బహుమతి నిచ్చిరని వెనుకదు విని యుంటిమి. ఆ బహుమతి వారు స్వీకరించిరని కూడ తెలిసికొంటిమి.

సాహిత్య అకాడమీవా రిదివఱ కిచ్చిన పుస్తకముల వి షయత మాట కేమిగాని ప్రస్తుతము విశ్వనాథవారి బహుమతి గ్రంథము మాత్రము మావంటివారి కత్యాశ్చర్యము కలిగించినది. బహుమతికి పంపబడు గ్రంథముల రచనా విశేషములే గాక, గ్రంథ ప్రచురణాది విశేషములు గూడ చర్చింపబడునని వినుచున్నాము.

విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షాది మహాకావ్యము లుండగా, ఈచిన్ని మధ్యాక్కరల పుస్తకమున కీపెద్ద బహుమతి యెట్లు వచ్చినదో అది మాకు దురూహ్యముగా నున్నది. ఏ పత్రికయందు నీ మధ్యాక్కరలు మొదట ప్రకటితములైనవో, ఆ 'భారతి' పత్రిక గూర్చి 'భారతి స్థాయి పడిపోయినది' అని స్పష్టముగా విశ్వనాథవారు నిందించియున్నారు. కాని నేడా "స్థాయి పడిపోయిన పత్రిక" లో ప్రకటితములైన పద్యములనే బహుమతి గ్రంథముగా రూపొందించుట చిత్రముగా నున్నది. కేవలము బహుమానము కొరకు నీ 'మధ్య'' "అక్కరలు" అక్కరకు వచ్చినవి కాబోలు.

గ్రంథము మాటకేమి—గాని గ్రంథము పేరు 'మధ్యాక్కఱలు'' అని శకటరేఫముగా వారు వ్రాసిరి. వన్నయ మండి, వేటివరకు, సరళముగా నున్న మధ్యాక్కరము, వీరు పరుషముగ—'ఱ' గా నిర్ధారించినారు. దీని భావమేమి తిరుమలేశ ? నన్నయను మించవలయునేమియా ? చిన్నయను కించపరుచవలె ననియా ?

హైదరాబాదు **ఒక పాఠకుడు.**

# సమానత్వ సిద్ధాంతాలు

చట్ట సమానత్వమనేది పశ్చిమ దేశాల సంప్రదాయాల ఉత్తమ లక్షణంగా వుంది: సుదీర్ఘంగా, పట్టుదలగా పోరాటాన్ని సాగించినతర్వాత మన పూర్వీకులు దీనిని సాధించారు. మనతరంలో నిరంకుశ ప్రభుత్వాలు ఏర్పడిన కారణాన, చట్ట సమానత్వాన్ని గురించి మనం నిర్లక్ష్యంగా వుండరాదని స్పష్టమవుతున్నది. అవకాశ సమానత్వమనేదికూడా ఉదారమైనది. విశాలమైనది: సృజనాత్మక శక్తులను పెంచేది దీనికోసమని, మిగిలినవన్నీ త్యాగం చేయడానికి, కుంచింప జేయడాని మనం సిద్ధంగా లేకున్నంతమాత్రాన, ఈ ఆశయానికి మనం విలువ ఇవ్వడం లేదనో, దాని సాధనకు సరళమైన మార్గంలో కృషి చేయడానికి మనం సిద్ధపడడం లేదనో అర్థం చెప్పకొనరాదు. ఇక ఆదాయం-సంపదలకు సంబంధించినంతవరకు, కేవలం కత్తిరించాలన్న ధోరణిలో ఆదాయాలు, సంపదలు తగ్గింపజేయడాన్ని మనం వ్యతిరేకిస్తాము: ఈర్ష్యవల్ల, ద్వేషంవల్ల మనమిలా చేయడం లేదనికూడా చెప్పకొనడం న్యాయం కాగలదు: అసమానత్వానికి జతపడివున్న తప్పుడు విలువలను గురించి విజ్ఞుడైనవ్యక్తి విచారించక మానడు: సౌజన్యధోరణి కలవ్యక్తి తనతో సమానమైన లేదా తన కంటె మెరుగైనవారితో కూడిన సమాజంలో హెచ్చు సంతృప్తిని పొందగలడు. తనను అందరికంటె ఘనునిగా చూడాలని ఆయన కోరడు కాగా కృత్రిమమైన వర్గ విషచక్రాన్ని సృష్టించే పరిస్థితులకు సహజంగానే వైముఖ్యం చూపుతాడు. దీనిని అందరూ సానుభూతితోను, సుహృద్భావంతోను అర్థం చేసుకొనడం అవసరం.

ఈ కారణాలవల్ల వామపక్షీయుల పరిష్కారమార్గాలను సమర్థించేవారికి, వ్యతిరేకించేవారికి మధ్యవున్న తేడా-తప్పుడు విలువలపట్ల వారికిగల వైముఖ్యం వీరిలోనూ లేకపోవడంకాక, మరొక మార్గంద్వారా ఆ తప్పుడు విలువలను సవరించవచ్చునని సూచించడంలో వుంది: నిర్ణీతమైన లోపాలను, వాటిని సవరించగల నిర్ణీతమైన చర్యల ద్వారా పరిష్కరించాలికాని, సదుద్దేశ్యాలతోకూడిన స్థూలమైన పరిష్కారమార్గాలను అనుసరించడంవల్ల, ఏ ఉత్తమ శక్తులను ప్రోత్సహించాలని మనం అభిలషిస్తున్నామో, ఆ ఉత్తమశక్తుల అభివృద్ధికి ఏమాత్రం అవకాశమివ్వని విధంగా సామాజికవ్యవస్థను మూసపోయడం ప్రమాదకరమని హెచ్చరించడంలో వుందని గమనించకోరుతున్నాను. [లండన్ లో "బవ్ గ్రూపు"వారు సమానత్వాన్ని గురించి జరిపిన విద్వద్గోష్ఠిలో శ్రీ రాబిన్స్ చేసిన ప్రసంగభాగాలు ఈ వ్యాసం]

# కవిత్వము - ఛందము

## శ్రీ కె. వి. రాఘవాచార్య

గత ఫిబ్రవరి నెల 'భారతి' లోని 'కవిత్వము—ఛందము'— అను నా వ్యాసమందలి కొన్ని దృక్పథములను మిత్రులు శ్రీ వి. రాజగోపాలరావు ఎం.ఏ. గారు మార్చి నెల, 'భారతి' లో పరిశీలించిరి. అందులకు వారికి కృతజ్ఞత చెప్పుకొంటూ, ఆ పరిశీలన లోని కొన్ని అభిప్రాయములను పరామర్శించుచున్నాను.

నన్నయ వసంత ఋతువర్ణన లయగ్రాహిలో గాకుండా, మరొక ఛందములో (వృత్తము?) యుండి యుండిన రసగ్రహణమునకు అంతరాయము కల్గియుండునా యను విషయమును యోచింపవలయుననిరి కాని యోచించి, ఒక నిశ్చితాభిప్రాయమునకు రాజాలరైరి! మరియు, వారు ఎఱ్ఱన, నన్నయల వసంత ఋతు వర్ణనల నుదాహరించి, పరిశీలించి "ఇరువురొనరించినది వసంతఋతు వర్ణనయే యైనను శబ్ద చిత్రము లందలి భేదములవలన పాఠకుల మనో నయనముల యెదుట గోచరించు వసంత కాల దృశ్యము వేర్వేరుగనే కన్పట్టును'' అనిరి. ఆ వసంత వర్ణనల ఉనికి, ప్రయోజనముల గమనించిన నాకు తోచిన భావము లివి :—

### ఎఱ్ఱన - వసంత వర్ణన

వ: ఇట్లా దంపతులు (సావిత్రీసత్యవంతులు) మంద గమనంబున నరిగి పరిసరారణ్యంబు దఱియంజొచ్చి రప్పుడు.

సీ: కమనీయ కమలినీ కల్లోల వీథుల
గదలు రాయంచల గతుల యొప్పు
బహు పుష్ప పల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరులతా తతుల సొంపు
మకరంద రసపాన మద విలోలంబులై
క్రాలెడి యెలదేటి గముల యులివు
బరి పక్వమంజుల ఫల రసోద్ధత ములై
పలుకు రాచిలుకల పటు రవంబు
ప్రియుడు వేఱువేఱ ప్రీతిమై జూపుచు
చెప్పుచును జనంగ చిగురుఁ బోడి
గనుచు వినుచు నిర్వికార సల్లాపమిం
పారనతని తెఱంగు నరయు చుండె.

వ: తదనంతరంబయా రాజర్షి నందనుండు మధురంబు లగు ఫలంబులు గోయుచు .....

—భారతము. ఆరణ్య. 7 ఆ 212—214.

ఇందలి ప్రకృతి సౌందర్యము యువ దంపతులగు సావిత్రీ సత్యవంతుల హృదయముల పై నెట్టి ప్రభావమును నెఱప లేక పోయినది! ప్రకృతి సౌందర్యమును దర్శించిన స్త్రీ పురుషు లందు వికారమంకురించుట సహజము. ఇకనూత్న దంపతుల మాట చెప్పనేల? ఈ సహజ ధర్మ మనివార్యమనుటకు లోకజ్ఞుడైన కాళిదాసు శకుంతలచే పలికించిన "కిం నుఖలు ఇమం ప్రేక్ష్య తపోవన విరోధినో వికారస్య గమనీయాస్మి సంవృత్తా'' (1 అం) (ఇతనిని చూచి తపోవన విరుద్ధమైన వికారమునకు పాలయితినేమి?) అను వాక్యము ప్రమాణము. సావిత్రి నిర్వికారియై యుండుటకు తగిన కారణమున్నది! యువకుడగు సత్యవంతుడట్టి మనోహర సన్నివేశములో పత్నియుతుడయ్యు చలింపకుండుటకు హేతువేమి? వికారము నొందకుండుటస్వాభావికమా? వసంతఋతువైనా, ఆ ప్రకృతియందు ప్రేరేపక శక్తి లేదు. అది నిర్జీవము. ఈ వర్ణన లేక పోయినను కథకు లోపము గలుగదు! అది సాధించు ప్రయోజనము లేదు!! ఈ వర్ణన సంప్రదాయ రక్షణకై చేసినది కాబోలు!

### నన్నయ - వసంత వర్ణన

వ: .....వసంత సమయంబు నఖిల జీవలోకానంద జననంబై చనుదెంచు చున్న

లయగ్రాహి:— కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు మధుపమ్ముల సుగీత నినదమ్ము లెసగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి ముకుళమ్ముల ను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము మధు రమ్మగుచు విన్చె ననిశమ్ము సుమనోభా

రమ్ముల నశోక నికరమ్ములును జంపక చ
యమ్ములును గింశుక వనమ్ములును నొప్పెన్.

లయగ్రాహి:— చందన తమాల తరులందు నగరు ద్రుమము
లందు గదళీవనములందు లవలీమా
కంద తరు షండములయందు నని మీాల దర
వింద సరసీ వనములందు వనరాజే
కందళిత పుష్ప మకరంద రసముం దగులు
చుందనువు సౌర భమునొంది జనచిత్తా
నందముగ బ్రోషితుల డెందముల లందురుగ
మందమలయా నిల మమంద గతి వీచెన్.

వ: ఇట్లు సర్వభూత సమ్మోహనంబయిన వసంత సమయంబునం బాండురాజు మదన సమ్మోహన మార్గణ బందీకృత మానసుండై మద్ర రాజపుత్రిదైన మనోహరాకృతి యందు మనంబునిలిపి యున్నంత......

—భారతము. ఆది. 5 ఆ. 137—140.

ఎత్తిన వసంత వర్ణన వలె ఇదియు వచనములమధ్య అమరి యున్నది. పద్యమున కిరు ప్రక్కలనున్న వచనములు వాని స్థితిని పోషించుచున్నవి. ఈ వర్ణనయందు లోకజ్ఞుడగు నన్నయ చూపిన విదగ్ధత అపురూపము. రసోత్కంఠ స్థితికి మొదటి వచనము ఆరోహణముగ, రెండవ వచనము అవరోహణముగ నున్నవి. ఇక ఇందలి వ్యంగ్య వైభవమును దర్శింతము.

(1) లతాంత—మన్మధుడు లతాంతాయుధుడు.
మధుపములు—మన్మధుని వింటి అల్లెత్రాడు.
సుగీత నినదమ్ము— వింటినారి మ్రోత.

మన్మధుని వింటి నారిగా తుమ్మెదల జెప్పుట కవిసమయము. వాటి మ్రోత కామోద్దీపకము. ఇందులకు

శో. ధనుః పౌష్పం మౌర్వీ మధుకర మయీా చంచల దృశాం
దృశాంకోణో బాణః సుహృదపి జడాత్మా హిమకరః
స్వయం చైకోఽనంగః సకల భువనం వ్యాకులయతి
క్రియా సిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే॥

అను శ్లోకము ప్రమాణము. ధ్వని బాణ ప్రయోగమ్మునకు పూర్వము నారిని మ్రోయించుట సహజము. తుమ్మెదల ఝుంకారము, నారిటంకారము యొకటిగా నుండుట విశ్రుతము. కావున మొదటి వాక్యమున వసంత కాలము అఖిలజీవ లోకావనండ దాయకమై యుండగా భావజుడు బాణ ప్రయోగమునకు సిద్ధపడి, నారిని మ్రోగించుట స్ఫురించుచున్నది.

(2) కిసలయమును స్త్రీల అధరముతో పోల్చుట కవి సమయము. పల్లవాధరి— మొ. వి ప్రసిద్ధములు. కోకిల— పుంలింగ శబ్ద మగుటచే చుంబనము ఊహింపదగినది.

(3) సుమనస్. (స్త్రీ. లిం.) పూవు. స్త్రీలు పూబోడులు, పుష్పవతులగుట ప్రసిద్ధము. అశోకము (పు. లిం) శోకము లేని వాడు. చంపక కింశుకములు పుంలింగ శబ్దములు. కావున మూడవ వాక్యమున పురుషాయిత భోగ మూహ్యము. ఇదియే రతికి పరమావధి. ఇందే స్త్రీల భారముచే పురుషుడు శోభించుట సంభవించును. ఇందులకే భర్తృహరి శ్లోకము ప్రమాణము.

శో. ఉరసి నిపతితానాం స్రస్త ధమ్మిల్ల కానాం
ముకుళిత నయనానాం కించి దున్మీలితానాం
ఉపరి సురత ఖేద స్విన్న గండస్థలానాం
అధర మధు వధూనాం భాగ్యవంతః పిబంతి॥

—శృంగార శతకము. 25 శ్లో.

ప్రకృతి మధుపమ్ముల సుగీత నినదమ్ములతో, కోకిల మధుర రవమ్ములతో, సుమనో భారమ్ములగు అశోకమ్ములతో నుజ్జ్వలమై యుండగా, మలయా నిలము శైత్య, సౌరభ, మాంద్య గుణములు గల్గి మంద గతిని వీచు చుండగా పాండు రాజు కిందముని శాపమును గూడ తలంపకు ప్రకృతి ప్రేరణకు పరవశించి, మాద్రి శాప భయముచే వారించుచున్నను, బలిమిం దత్సంభోగ సుఖ సమీహితుఁ డయ్యెను.

నన్నయ వసంత వర్ణన ప్రేరేపక శక్తి గల్గినట్టిది. సొగసైన బహిరాకారము, సత్వ గరిష్ఠమైన జీవకళ గలది. ఈ ప్రకృతి పాండు రాజునకేగాక పాఠకులకు గూడ సమ్మోహమును గల్గించుచున్నది. కథకు మిక్కిలి ప్రయోజన కారియైనది. పాండురాజ మరణమునకు వసంత ఋతు సౌందర్యము హేతువగుచున్నది. ప్రయోజన కరమగు ప్రకృతి వర్ణనలను చేయుటలోను నన్నయ ఆద్యుడే ! ఇట్టిది కవా మహాకవుల ప్రతిభ! ఇందు కోమలాను వరణనము గల ప్రసన్న పద సంఘటన వలన గలుగు మనోజ్ఞమగు నాదము, వర్ణముల యావృత్తి వలన గలుగు శబ్ద సంగీతము వీనులకు విందొనరచ్చు చున్నవి. పద్యము లందలి శయ్యా సౌభాగ్యము, ఛందోగుణములగు లయ, తాళములు విషయ వైశద్యమునకు, అర్థ స్పష్టతకు తోడ్పడుచున్నవి. ఇట్లు సాహిత్య, సంగీత, నృత్యతత్త్వములు సంయోగించి యుండుట ఇంకెడ గానము. ఇందు శబ్దార్థ సిద్ధులను నన్నయ సాధించెను.

ఈ వసంత వర్ణన 'కావ్యాత్మ' యగు వ్యంగ్యార్థముచే నుప జీవములైన, రసానంద దాయకములైన భావములచే నాద సౌభాగ్యముచే సంపన్నయై, ఉత్తమ కవిత్వమున కుదాహరణముగ నున్నది. ఛందోతత్త్వ వేత్తయగు నన్నయ, రసవ్యంజనకు ఉచితమైన ఛందము గల 'లయ గ్రాహి' యను ఉద్ధురమాలా వృత్తమును పరిగ్రహించి, "అక్షర రమ్యత" సాధించెను. ఇందలి నాద మాధుర్యము అనుభవైక వేద్యము, గనుక అనిర్వచనీయము.

కావ్యమందలి భావ సంచరణమునకు మంద్ర మధ్యమ తార స్థాయులను మూడు స్థాయులు గలవు. కేవల కథా నిర్వహణమున భావ సంచారము మంద్రస్థాయిలో నుండును. ఇందు వచనమే యుపయోగింప దగినది. పద్యములకు ప్రసక్తి లేదు. మధ్యమ స్థాయిలో భావము ద్రవీ భూతమగు చుండును. ఇందు కథా నిర్వహణకు కంటే, రస సంచారమే ప్రధానము. ఈ స్థాయిలో పద్యములుండుట సహజము. ఇక తారస్థాయిలో భావము మాటల కందదు. ఇది రసమునకు పరిపక్వ దశ. కనుక ఇందు సాహిత్యము, సంగీత, నృత్య గుణాన్వితమై యుండవలెను. ఈ రసోత్కంఠ దశలో ఛందో తత్త్వ వేత్తలైన మహాకవులు రస వ్యంజనకుచితములగు, వృత్త విశేషములనే స్వీకరించిరి. కాళిదాసు కుమార సంభవమున రతీ విలాపమును— వియోగినీ వృత్తమున, సందేశమును, మందాక్రాంత వృత్తమున, నన్నెచోడుడు దక్షకృత శివస్తుతిని లయ గ్రాహి, లయ హారిణులందు, పెద్దన మనుచరిత్రలో పుష్పాపచయమును ద్విరదగతి రగడ యందు, వేమన తన భావములను ఆట వెలదులందు రచించిరి. ఆయా భావ ప్రకటన యందు ఆయా వృత్తములు ఒప్పునని వారి నిశ్చితాభిప్రాయము. ఇందును గూర్చి మన 'ఊహలు అసంగతములే యగును.

రవీంద్రుని గీతాంజలి (Song offerings) ఛందో గుణసంపన్నమని "These lyrics—which are in the original, my Indians tell me, full of subtlety of rhythm of untramslatable delicacies of Colour of metrical invention - display in their thought a world I have dreamed of all my life long" - అని Y. B. Yeats కవి ఉపోద్ఘాతములో నుద్ఘోషించియున్నారు. అందువలన రవీంద్రుని 'గీతములు' తత్త్వములో నవ్యాధునికుల ,వచన పద్యాల' వంటివి కావు. ఆంగ్ల గీతాంజలి మౌలికం గాదు. అది వంగ 'గీతాంజలి'కి అనువాదము. ఆంగ్ల గీతాంజలి మాత్రమే Free verse(స్వేచ్ఛా గీతిక)లో నుంది. మూల గ్రంథమగు వంగ గీతాంజలి శబ్దాలంకార సమాలంకృతము, లయతాళ సమన్వితము అగు గీతముల (Lyrics)లో నున్నది. అందువలననే అది 'గీతాంజలి' యైనది !

* * * *

మానవులందు తమ ఆనందానుభవమును దెలుపవలెనను కోరిక యుండును. కవి యందిది బలీయముగ నుండును. భావోద్రేకము గలిగినపుడు ఆయా వికారములకు తగిన వాక్యములు నోట వెలువడుట మానవులందరికి సహజమైనను, కవినోట వెలువడు వాక్యములు ఏవో కొన్ని నిర్మాణ సూత్రములకు, సంప్రదాయమునకు అనుగుణముగ రూపొందించుచుండును. లక్షణములు ప్రతిభావంతులైన కవుల రచనల—భావ ప్రకటనా పద్ధతి—సమ్యక్ పరిశీలనవలన తేలిన సామాన్య ధర్మములనుట మరువరాదు. కవి హృదయము భావపూర్ణమై, తొణికిసలాడుచున్నపుడు పద్యమువెలువడినంత సులభముగా గద్యము వెలువడదు ! రసోత్కంఠ దశలో కాళిదాసాది మహాకవులు వచనమును గాక ఛందోబద్ధమైన వృత్త విశేషములనే గ్రహించిరి. అసామాన్య వ్యక్తితప్ప అట్టి సందర్భములలో పాడి మాటలతో, శుష్క వచనములతో రసస్ఫూర్తి జేయ లేడు. "విషయము ప్రధానమైనది గద్యము, రస ప్రధానమైనది పద్యము" అను కవిత్వ తత్త్వ విచార కారుని అభిప్రాయము గ్రహణీయము. భావోద్రేకమును ప్రకటించుటకు గద్యము కంటె పద్యము ఉత్తమ ప్రకటనా విధానమని నా తలంపు.

ప్రతి సాహిత్యము శ్రుతి తాళలయాత్మకమైన గేయముతో నుద్భవిల్లినది. తెలుగున అట్టి పదకవిత్వమే పద్యకవిత్వమునకు మూలమైనది. లిపిలేని భాషలలో గేయములు, పద్యములు మొదలగు ఛందోబద్ధ కవిత్వమేగాని కేవల వచన కవిత్వముండుటకు వీలులేదు ! ప్రాబలుకులు వేదములు గేయములే ! వానిని ఉదాత్తానుదాత్తాది స్వరములతో పఠింపవలెను. సామవేదము సామగానమని ప్రసిద్ధి పొందినది. సంస్కృతభాషలో ఆది కావ్యమగు రామాయణము గేయ కావ్యమే ! దానిని కుశలవులు గానము చేసిరి. తెలుగున ఆదికావ్యమగు భారతము చంపూ పద్ధతిలో గద్య పద్య మిశ్రితముగ — రచింపబడినది. ఇందలి వచనము ఛందోగుణ సంపన్నమై పద్య వాతావరణముతో శోభిల్లుచున్నది. భట్ట బాణ, దండి ప్రభృతుల సంస్కృత గద్య కావ్యమందలి గద్యము వృత్తగంధి, చూర్ణము, ఉత్కళికా ప్రాయమని మూడు విధములుగ నున్నది. పద్యభాగము గలది వృత్తగంధి. అనావిద్ధ లలిత పదములు గలది చూర్ణము. పతద్విపరతము ఉత్కళికా

ప్రాయము ( " గద్యం — వృత్తగంధి, చూర్ణ ముత్కలికా ప్రాయంచ, పద్యభాగవత్ వృత్తగంధి. అనా విద్ధ లలిత పదం చూర్ణమ్; విపరీత ముత్కలికా ప్రాయంచ " — కావ్యాలంకార సూత్ర వృత్తి) ప్రాచీన కాలమున గద్య, వచన పదములు తాళలయానుగుణ్యమైన, పాడుటకనువుగ నున్న రచనలకే చెల్లు చుండెను. వెంకటేశ్వర వచనములు, బిరుదు గద్యలు, శఠకోపవిన్నపములు — ఇట్టివి. ఈ రచనలు మాత్రాఛందము ననుసరించి ప్రవర్తించుచు, పాడుటకు తగి యుండెను. పాదనియమము లేకుండుటయే వీనికి పద్యములకు గల భేదము !

సర్వ ఉద్రిక్త భావములు, భవ్యావేశములు లయ్యాన్వితమగు ఛందోబద్ధమైన భాషలో వెలువడుట సహజము. అది పద్యమా? గేయమా ? వచనమా ? అనునది కవి యొక్క ప్రతిభ, ప్రకటనా సామర్థ్యము, అలవాటు మొదలగు వానిపై ఆధారపడి యుండును. ఈ క్రింది ' శ్రీపాద ' వారి వాక్యములను పరిశీలించండి.

" ' ఫిడేలు రాగమ్, ఫిడేలు రాగమ్ ' అన్నారు. ఏదో నడక స్ఫురించింది. ' ఫిడేలు రాగంబులు ' అని విరిచారు. ' వినూత్న పదప్రేమికులు మహాకాముకులు ' అనగానే మళ్లీ నడక స్ఫురించింది. ' అన్యోన్యమగు దంపతులు గూడ ' అని మళ్లీ విరిచారు."

—— ' భారతి ' డిసెంబరు 1963. 6 పుట.

దీన ఆవేశముచే లేక ఆలోచనచే నేర్పడిన శబ్దస్వరూపమును పదసంఘటనచే సహజముగా స్ఫురించుచున్న నడకను, లయను ' అహంభావ కవులు ' నవ్యత కొరకు చెరచుచున్నారని తేలుచున్నది గదా ? పదముల కూర్పుచే సహజముగా నేర్పడుచున్న లయ, తాళములను చెరచుటకు కవుల మనుకొనువారే కావలెనా ? అందులకు ఎవడు తగడు ?

" కవిత్వము రసాత్మకమైనది. కనుక సరసభావము యే రూపమున నున్నను రసికుని భావోద్విగ్న మానసమునొనరించియే తీరు ననుట " సరికాదు.

అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదిత రసమ్
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూప మనఘం
నజానేభోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః॥

— శాకుంతలము. 2 అం. 10 శ్లో.

ఈ సరస భావమునే వచనములో అనువదింతుము. " శకుంతల సౌందర్యము వాసన చూడబడని పూవు. గోటితో గిల్లబడని లేజిగురు. తొలువబడని రత్నం. రుచిచూడబడని క్రొత్త మధువు, పూర్వ పుణ్యముల సమగ్ర ఫలము వలె నున్నది. ఇట్టి రూపము ననుభవించుటకు బ్రహ్మ ఎవనిని కూర్చునో నేనెరుంగను" శ్లోక మందలి, వచన మందలి భావము యొకటేయైనను 'శబ్ద సంఘటనాశక్తి ' వలన శ్లోకము వలె వచనము పాఠకుల మనము నాకట్టుకొనజాలదనుటకు రసికుల హృదయముపై వానికి గల ప్రభావము హస్తి మశకాంతరమనుటకు సహృదయుల ఆనందానుభవమే ప్రమాణము !

హృదయము భావశబలితమై యుద్రిక్తమైనపుడు భావములు తమంతట తాము ఉచితమైన భాష వెదికి కొని తాళలయాన్వితముగ ప్రవహించును. కీచకుని పలుకులకు కోపించిన ద్రౌపది వాడు నీచుడు గావున జంకించిన గాని మెత్తబడి పోడని దలంచి ఇట్లనుచున్నది.

శా. దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యా పారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతులేవు రిప్పుడు నిను దోర్లీలన్ వెసంగిట్టిగం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యంబెమ్మెయిం
గీచకా !

—భారతము. విరాట. 2 ఆ. 55ప.

అందులకు ప్రత్యుత్తరము బలగర్వితుడైన కీచకుడు నిర్వికారముతో ఇట్లనుచున్నాడు.

అనుడు నతడిట్లు లనియె నాయతుల బాహు
బలము జెనయంగ భవదీయ పతుల కారు
మూడు లోకంబులందు నెవ్వాడు లేమి
నిక్కువం బింత నమ్ముము నీరజాక్షి.

—భారతము. విరాట—2 ఆ. 56

ఇట్లు భావతీవ్రత ననుసరించి రచన మారుచుండును. రసవ్యంజనకుచితమైన పద సంఘటనతో మహాకవులు భావ ప్రకటన గావింతురు.

వచన కావ్య కర్తలు రస సంచారమున్న చోట వచనమును శ్రుతి, లయ, తాళాది, ఛందో గుణములచే శక్తి వంతమొనర్చి యున్నారు. ఇందులకు బాణ, దండి, నన్నయ, చిన్నయల వచన కావ్యములుదాహరణములు. ప్రాచీన కవులు—నన్నయాదులు— రసస్ఫూర్తి లేనిచోట వచనము వంటి పద్యములనే రచించిరి. ఇట్లు రససంచారము ననుసరించి వచనమును, పద్యాలనుపయోగించుటయే గాక తిక్కనాది కవులు శ్రవ్యకావ్యములందలి రసవద్ఘట్టములను దృశ్య కావ్య గుణ సంపన్న మొనర్చిరి. విరాటోద్యోగ పర్వములు, మను చరిత్ర ద్వితీయాశ్వాసము ప్రభావతీ ప్రద్యుమ్నము లుదాహరింప దగినవి. సమ్యక్ పరిశీలన వలన రసాత్మకమైన భావము

గల వచనము స్మైతము కవిత్వ మగుననుట ఔపచారికమే యగును! గద్య కావ్యముల కంటె పద్యకావ్యములు వానికంటె దృశ్య కావ్యములు శ్రేష్ఠమైనవి గదా ! "కావ్యేషు నాటకం రమ్యమ్" అను ఆర్యోక్తి ప్రమాణికమైనదే !

*  *  *  *

'పద్యః పరనిర్వృతి' కావ్యము యొక్క పరమ ప్రయోజనము. ఈ కావ్యానందమును అనుభవించునది పాఠకుని హృదయము. అందులకు తోడ్పడునది శ్రవణము. కవిత్వము యొక్క సౌందర్యమును నిర్ధారణ జేసి, కావ్యానందమును గల్గించునది. కవిత్వము శ్రవ్యకళ కావున భావములు లయతాళ సమన్వితమై శ్రవణానంద సంధాయకము లైననే గాని, సహృదయుని అనుభవములకు ఉత్తేజకములై, హృదయముచే కావ్యానందమును ననుభవింప జేయలేవు. భావములు శ్రుతిరంజకత్వము గీతి మాధుర్యము గల్గి యుండుటవసరము. ఈ గుణము శ్రుతి లయ తాళముల గల్గి యుండుటచే జనించును. శ్రుతి, తాళ, లయ గుణములు ఛందో మూలములు. శబ్ద సంఘటన ఛందో మూలముననే శ్రుతి, లయ, తాళ బద్ధమగును. ఈ ఛందస్సు వలననే పద్య పఠన వేళ మధురమైన, హృదయా వర్జకమైన గీతి విశేషము, వచన పఠనము కంటె భిన్నమైనది వ్యక్త మగు చుండును. "There is no doubt that rhythmical words exert an enchanting influence on the mind. we restored to music even we fail to seize the sense:" అని సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల అభిప్రాయము.

వలయు సామగ్రి అంతయు గద్య పద్యములకు సమానమైనను, ఛందము పద్యమునకు విశేషము. అందువలన గద్య పద్యములకు గల భేదము ఛందో గుణముల ననుసరించి యుండును. అనుభవములకు ప్రరేపకములైన, వీనులకు విందొనర్చు స్వరములను ఛందము వెలయించును. కావున గద్యము, పద్యముతో అన్ని విధముల సరి పోవుచున్నను ఛందోలోపము వలన రూప, నాద సౌందర్యముల లేమి గలదగుచున్నది ! వచన కవిత్వమునందు కేవల సాహిత్యము, పద్య కవిత్వమునందు సాహిత్యముతో బాటు సంగీత నాట్య గుణ సంపన్నత గలదు. "కావ్యమునకు శ్రుతి, లయ, తాళములవలన గలుగు నిశ్చితత్వము (certainity) శక్తిమత్వము (Force) నియతత్వము (Regularity) అను గుణత్రయము పద్యకావ్యములందు స్పష్టీకృతమై, హృదయ స్పందకవలైనట్లు వచన, కావ్యములలో కుదరదు"— ఎం. అర్నాల్డ్.

హృదయాను భావములకు ఉత్తేజకమైన, గీతి మాధుర్యము గల గద్యరచన పద్యరచన కంటె కష్టతర మగుటచే "గద్యం కవీనాం నికషం వదన్తి" అను నానుడి యేర్పడినది.కాదంబరి మొ. గు గద్య కావ్యములందు రసస్ఫూర్తి గల్గుచున్నది. సంస్కృత లాక్షిణికులు గద్య కావ్యములను గూడ పరిగ్రహించిరి. నన్నయ భట్టాది కవీంద్రులు శ్రుతి లయ, తాళ సమన్వితమైన వచనములో రసప్రచురమైన రచన చేసిరి ! అతి విస్తృతమైన సంస్కృత సాహిత్యములో గద్య కావ్యము లెన్ని ? గద్య కవులెందరు ? ఒక హస్తమును దాటవు ! దాటరు ! బాణ, దండి ప్రభృతుల వచన కావ్యములకు, కాళిదాసాది మహా కవుల కావ్యములకుగల ప్రాచుర్యమే ఛందోబద్ధరచనా విశిష్టతకు ప్రమాణము.

"క్రాస్వర్డు పజిల్సు లాగున్న
నీ కన్నులను సాల్వు చేసే మహా భాగ్యం
ఏ మా నవునిదో కదా !
ఓ భోగం చానా ! నీవు
సంఘానికి వేస్టు పేపరు బాస్కట్టువా ?"

రసాత్మకమైన భావము కవిత్వము గదా ! ఇందు అసూయ, శంక, మోహము, విషాదము, వితర్కము మొ.గు వ్యభిచారి భావములే గలవు. రసమేది ? చిత్త విభ్రమము గలదేగాని ధ్వని యేది? "విభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః" (విభావములు, అనుభావములు, సాత్త్విక భావములు, వ్యభిచారి భావములు అనువాని సంయోగమున రస్యమాన మగు స్థాయి భావము రసము) అని భరతుని రస సూత్రము. ఇందు పాఠకులను 'ఆహా !' అనిపించే మాటల గమ్మత్తు గలదు. చెవి కింపగు లయా ఖండములు గలవు. శైలి మణి ప్రవాళము. భాష ఆంగ్లాంధ్ర సంకరమగుటచే పరిమిత మైన పాఠకులు గల దగుచున్నది. 'టెక్నిక్' ప్రధానంగా గల ఈ సాము గరిడీల కవిత్వము ప్రాచీన బంధకవిత్వాదుల వలె Intellectual gymnastics కు ఉదాహరణము కాదగి యున్నది.

వ్యక్తి యొక్క ప్రతి ప్రైవేటు ఉద్రేకము కవిత్వమనిపించు కొంటుందా ? వాఙ్మయమును సృజించు వారనేకు లుందురు. వారందరిని కవులను కొనుట ఆత్మవంచనయే యగును.

# కవిత్వము - అలంకారము ఛందము

## శ్రీ ఉమాపతి పద్మనాభ శర్మ

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారిటీవల భారతి, ఆంధ్రపత్రిక [ఉగాది సంచిక] లలో కవిత్వమునకు వ్యాకరణ ఛ్ఛందోలంకారాదులతో పనిలేదనుచు సహేతుకముగ చర్చించిరి. అవి యక్కఱకురాని బంధములుగను, బరువులుగను పరిణమించుటకుగల హేతువులవశ్యాలోచనీయాంశములైనను, ఆ హేతువులను పురస్కరించుకుని వాని ఉపయోగములను త్రోసిరాజనుటయు బంధముగనే భాసించును.

లక్ష్య లక్షణ సంబంధములను విలోమముగా గ్రహించి ఛందస్సుకొఱకే కవిత్వము వ్రాయుట, అలంకారము నలంకారముకొఱకే వాడుకొనుటయు, అంధానుకరణము, కీర్తికాముకత్వము వంటివి వాని విలువలను కొంచెపఱచుటయేగాక కవిత్వమును "కసరత్తు"గ మార్చివేసియుండును. ఇంచుమించుగ నిట్టి కేవల చమత్కార కవిత్వములను పూర్వులే నిరసించియుండిరి. గణవర్ణ శబ్దార్థ గుణదోష నికరంబుఁ బరికించి కబ్బముఁ గూర్చువారును, బహుతరానుప్రాస పదబంధ నియమంబు వదలకఁ గృతిసేయువారును, యమకాదులు చెప్పువారును, అలంకృతులఁ బొందుపఱచు 'భూషణార్థు'లును కవిబ్రువులనియే పెద్దలైన యభిజ్ఞుల యభిప్రాయము.

'ప్రాయశోయమకే చిత్రే రస పుష్టిర్నదృశ్యతే' (విద్యాధరుఁడు) అని చిత్రకవిత్వము యొక్కయు, 'రసాభావే చిత్రకావ్యే శబ్దార్థ వైచిత్రీ మాత్ర పర్యవసాయిత్వ మలంకారాణాం' (ప్ర. రు. రత్నాపణము) అని అలంకారములయొక్కయు, 'వాగ్వైదగ్ధ్య ప్రధానేఽపి రస ఏవాత్ర జీవితం' (అగ్నిపురాణము) అని వాగ్వైదగ్ధ్యము యొక్కయు విలువలను పలు విధములుగా పరికించి నిర్ణయించి యుండిరి.

అలంకార ఛ్ఛందములు సాక్షాద్రసోపస్కారములు గాకున్నను రస పర్యవసాయిత్వ హేతువులుగా నుపాదేయములను దృక్పథమును ముఖ్యముగ కవిత్వమునను, భాషలోను వాని ఇమిడి పోయిన తీరును యథాశక్తి పరిశీలింప కుతూహలమును ఈ వ్యాసమునకు ప్రోత్సాహకములు. ఆక్షేపించుట విమర్శించుట, నిరసించుటయు నిందు కార్యములు గావు నిది యొక సహృదయుని స్వగతముగ భావింపదగును.

కవిత్వమునకు రసము ప్రధానమైనది భావముచే సిద్ధించును. భావ వ్యక్తీకరణమునకు ముఖ్య సాధనము భాష. భావము దాని సహజ స్థితిలో నగ్నముగా నుండును. నగ్నభావమ నితరులు చూడ జాలరు. ఇతరులు చూచి యానందించుటయే కవిత్వగత భావనకు పరమావధి. కావున నది భాష యను నాచ్ఛాదనమున ననుభూతి యోగ్యమగును. దీనినిబట్టి భాష యను నది భావనయొక్క యథాతథమైన చిత్రణ చేయజాలుట లేదని తెలియుచున్నది. భాష కందని యూహాలుండుట తద్జ్ఞులకు విదితమే. ఎవరి యూహల వారే యనుభవించి నప్పుడవి నిసర్గముగా నుండును. ఒకరివి మఱియొకరు పంచుకొనవలసి వచ్చినపుడు భాషచేత కృత్రిమములై యుండును. సూక్ష్మముగ నాలోచింప వ్యాకరణచ్ఛందోలంకారాదులకు వలెనే భాష సైతము 'రసము'ను కట్టడి చేయుచున్నదని తోచును.

ఇట్టి దృష్టితోడనేమో జేమ్స్ జాయిస్, గెర్ట్రూడ్ స్టైన్, వర్జీనియా వుల్ఫ్ మొదలగు పాశ్చాత్యులు, అనుభవమున్నది యున్నట్లుగా చిత్రించుట కొక వినూత్న ప్రక్రియ కనుగొనిరి. ఈ పద్ధతిని తెలుగులో బుచ్చిబాబు 'చైతన్య స్రవంతి' యను రచనలో ననుకరించిరి. ఇందు భాషకుండు సామాన్య ధర్మములు, వ్యాకరణ నిబంధనలు నిరంకుశముగా నతిక్రమింతురు. భాషకందని భావములకు స్వయముగా కొంత పరిభాష సృష్టించుకొందురు. కొన్ని భావములను సాంకేతిక

ముగనే సూచింతురు. ఇట్టి నిసర్గభావ వ్యక్తీకరణ పద్ధతులు దురవగాహము లగుటచే శిష్టమగు భాషలో వారే వ్యాఖ్యానములు వ్రాసికొందురు. ఇది ప్రత్యేక కళాత్మక ధోరణి యైనచో గావోపును. కాని, యీ రచనలందు వారతి సహజత్వము కొఱకతి కృత్రిమమార్గమవలంబించిరేమో యనిపించును.

తెలుగు దేశమున, ప్రాంతీయ పరిమితిలో నైనను భాష కొన్ని సామాన్య ధర్మములతో విస్తరించును. ఆ లక్షణములే భాషను శక్తివంతముగ వశపఱచుకొనును. ఐనను భాష, భావ సామ్యమును పొందజాలకున్నది.

ఒకరి ముఖ 'మందము' సున్నదందుము. 'అంద' మను మాట నుపయోగించు మాత్రమున నా ముఖము మన యూహలో దర్శన మివ్వజాలదు. కొన్నివేల ముఖము లంద ముగా నుండవచ్చును. కాని యందరి వొక్కలాగున నుండు ననుకొనలేము. ఆ మాట ఎన్నో ముఖముల వర్ణించుచు వచ్చుచున్నది. వేరు మరియొక ముఖమునకును నా ప్రాత మాటే శరణ్యము. ఒక్కొక్క క్రొత్త ముఖమున కొక్కొక్క క్రొత్త పదము సృష్టించుకొనుటయు, ఆ సృష్టించుకొనిన దితరుల కర్థమగుటయు దుస్తరము.

భాషలోని యిట్టి యసౌకర్యమే యలంకారమునకు మూలము. కావున నది భాషలో నొక భాగమే యగుచున్నది.

అర్థము విశేషముగ భావింపజేయదలచి యొకరు "ముఖము చంద్రబింబమువలె నున్న' దని విలక్షణముగ వర్ణించిరి. "అతథానపి తథా సంస్థితానివ హృదయే యా సూచయతి అర్థవిశేషే సా జయతి వికటకవి గోచరా వాణీ" అను నభియుక్తోక్తినిబట్టి యట్లు వర్ణించిన వాడు కవియే గావోపును. ఆ వర్ణనము సహృదయ సమ్మతమై ప్రశస్తినందినది. అట్టి ప్రాశస్త్య ప్రభావమునకు శాసించు శక్తి యబ్బినది. అనుభవమును కాదను శాస్త్రము లేదందురు. కావున నెట్టి యనుభవమునకైనను శాసించు నవకాశము 'సమ్మతి' యను ప్రమాణముచే కలుగును. ముఖమును చంద్ర—కమల—దర్పణాదులతో గాక మరి దేనితో పోల్చినను, వైలక్షణ్యము కొఱకెట్లు చెప్పబూనినను, అది యలంకారమే యగును. కావున భాషయొక్క విస్తృత రూపమే యలంకారము.

అట్లు భాషలో నతిశయోక్తులు, అసత్యములు, ఉపమాదులు తాళిదళ సంపుటములందే గాక, పోల్చుకొనరానంత సన్నిహితముగ, మన నిత్య వ్యవహారమునవే స్థిరపడియున్నవి. "ప్రాతవడ్డ మాటల తమ వేర్పు చూపు" కవులను తిక్కన నిందించెను. ఏదో నదే పనిగను, గ్రుడ్డిగ ననుకరించుట ప్రాతవడి వినుగు పుట్టించును. తిరుపతి వేంకటకవులని నట్లు "కాలము బట్టి, దేశమును గాంచి, ప్రభుత్వము నెంచి దేశభాషా లలితాంగి" మారుచుండును. అట్టిదే జీవద్భాష యగును.

అప్రస్తుతము గాని నలంకారములే భాషగా మారిన కుదహరింపదగు కొన్ని ప్రయోగము లిట పరికింప దగును.

"ఓయి పిచ్చివాడా ! (కాకుస్వనము), స్వర్గసౌఖ్యం, నరకం, చస్తున్నాం బాబూ, ఏనుగంత మనిషి, బుంగమూతి, బంగారుకొండ, పిల్లికళ్ళు, శకునపక్షి, శనిగ్రహం, మొద్దు నిద్ర, గొంతులో వెలక్కాయ, తెలివి తెల్లారు, నసపిట్ట, అరికాలుమంట...., తాతలు దిగివచ్చు, తలప్రాణం తోకకువచ్చు కళ్ళు కాయలుకాచు, చింతనిప్పుల్లాంటి కళ్ళు, బ్రహ్మాండంగా, ఊసరవెల్లి, నల్లి, నాలిముచ్చు, కొంగజపం, తిండిపోతు, రాతిగుండె, అబద్ధాలపుట్ట, రాక్షసుడు, వాడికేం మహారాజులా, కొయ్యబారు, గంపెడాస, ఏదోలా ఉంది [ఉపవాసం దొరకనప్పుడు], మట్టిబుర్ర, పిల్లకాయ, పండుముసలి, ఉంగరాలజుట్టు"

ప్రభుత్వ, కాలములనుబట్టి యేర్పడునవి :—

"అమృతం లాంటి కాఫీ, చుక్కలకు దాకు ధరలు, ఐసైపోవు, మెదడులో రైళ్ళు పరుగెత్తు, ఆటంబాంబులా లేచాడు, రాకెట్‌లా దూసుకుపోవు దొరబాబులా, షేక్స్‌పియర్ మోహం" మొదలగునవెన్నేని గలవు.

అలంకారములు "గంగిరెద్దు బొంతలవలె" నుండునని శ్రీపాద వారే యుపమించిరి. [గంగిరెద్దుకు బొంతలందమిచ్చును!!] భాష తీరట్లుండ నిరలంకార— నిసర్గ రచన చేయుమనుటయే భారమగును గదా! అలంకారము లేనియే భావమును కుంచించి బంధించును.

కవిత్వమున కలంకార ప్రాధాన్యమెంత వఱకను చర్చయాలంకారికుల లోనే వచ్చెను. కేవల మర్ధ చిత్రములుగా గాకు కావ్య జీవితమునకుపస్కారకములుగను,— ఆస్వాద్యములుగాను నుండవలయుననియే యుగ్గడించిరి. బొత్తిగ వాని యక్కఱను త్రోసిపుచ్చినవారు కానరారు. భామహాద్యలంకార వాదులు కొందఱు, రసమును నైతమలంకారముగనే భావించిరి. అభినవ వాగనుశాసనులు, శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిట్లందురు.

"సాహిత్య లక్షణ కర్తల యభిప్రాయములను బట్టి కావ్యమునకు శోభ గలిగించునట్టి రీతి— వృత్తి— శయ్యా— పాక—

ధ్వని— భావ— రస— ప్రసాద— యమక— ఉపమ— కథా— పాత్రౌచిత్యాది సకల కావ్యధర్మములను అలంకార శబ్దవాచ్య ములేయని భావింపదగును." (సంస్కృత వాఙ్మయ చరిత్ర. పుట 199)

ఇది సత్యమేని యలంకారములను కాదనుట కవిత్వమునే కాదనుట వంటి దగును.

"కావ్యకథ— భావ అనుభవము కల్గించే పోషకపు రచనలో అలంకారములు పుడకల" ని శ్రీ పాదవారనిరి. (ఆం.ప. ఉగాది)— విషయము సుబోధకముగ నుండుటకు, భావానుభవమును విశేషించి కలుగజేయుటకు వాడుకొను నలంకారము భాషలో జొచ్చిన తీరు, ప్రయోజనము, వారి వాక్యముననే గమనింపదగును.

"నహి కవేరితి వృత్త మాత్ర నిర్వాహణేన ఆత్మపదలాభః, ఇతిహాసాదేవ తత్సిద్ధేః" అని ధ్వన్యాలోక కారుడనును. కావ్యకథలో కథ కన్న కావ్యగుణమునకున్న విలువ మిన్న—కేవల కథ నిర్వహించుటయే విధిగా తలచిన నా విధి నిర్వహణమునను కవిత్వమావిర్భవింపదు. ఇతిహాసము చరిత్రమును సిద్ధమగును. భావానుభవ సౌష్ఠవమున కలంకారము దోహదకారియగుట, కొన్ని యెడల నలంకారము లేనిదే భావానుభవ మభావమగుటయు గలదు.

"క్షీరోదకగతిఁ బాండవ, కౌరవులొడఁ గూడిమనికి కార్యంబది వీ
వారసి నడపుము, వారన వీరనఁ గురు ముఖ్య నీకు వేఱుగలదే?"
(భారతము— ఉ— తృ. 258)

ఇవి శ్రీ కృష్ణుఁడు ధృతరాష్ట్రునితో ననిన మాటలు. శ్రీ కృష్ణునకు సంధి పొసగదని తెలియును. ఐనను "అన్నదమ్ములు తమలోనం బోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించె" నని జను లాడుదురని ధృతరాష్ట్రునితో సంధి విషయము సంప్రదించెను. శ్రీకృష్ణుని మానసము "క్షీరోదకగతి" ద్వారమున నతి విస్పష్టముగ సూచితమగుచున్నది. లోకమున నరుదుగ లభించు వస్తువు క్షీరమువలె [పాండవులు] ప్రియముగా నుండును. విరివిగ లభించు వస్తువుదకము వలె [కౌరవులు] ప్రియముగ నుండ నేరదు. కొద్ది క్షీరమున [ఐదుగురు] నెక్కువ యుదకము [నంద] కలిపినచో నుదకమునకు క్షీరత్వమబ్బునేమో గాని క్షీరము విలువ తగ్గిపోవును. ద్రవగుణమున్నంతమాత్రమున [అన్నదమ్ములు] వానికలయికలోని విప్రత్తి యవాంఛితము. పాలు, నీరు విజాతీయములు. పాలను పలుచన చేయుట ఎవరికి మాత్రమిష్టము గల్గునవి? "గంగమ్మ చల్లనిదైనను [క్షాత్రము], గట్లను కోయును. జలమునకు ప్రళయమును సృష్టించు శక్తి గలదు. అట్లు "క్షీరోదకగతి" లోని వ్యంగ్యము శ్రీ కృష్ణుని యభీష్టమును, ధృతరాష్ట్రుని యసమర్థతను, పాండవ కౌరవుల గుణాగుణములను చెప్పక చెప్పుచు, జరుగబోవుదెల్లరకు విదితమే యను విపులార్థమును వెలువరించుచున్నది.

శ్రీనాథుని శృంగార నైషధమున దమయంతి స్వయంవర సందర్భమున సరస్వతీదేవి 'ఐదుగురు నలచక్రవర్తులను' వర్ణించు శ్లేష, కథకు పుష్టిగల్గించుచు సహృదయ హృదయానందకరముగ నొప్పారును. అయ్యలంకారము లేనిదే ఔచిత్యమునకెట్లు భంగము వాటిల్లునో, యూహింపదగినది.

ప్రాచీన కావ్యములందే గాక నాధునిక కవిత్వమందును వలసినంత యలంకార సంపద భావుకత్వ ప్రేరేపకమై యలరారుచున్నది.

అలంకారములు కొన్ని యనుకరణముచేతను, విశేష ప్రచారముచేతను పేలవములైన మాట వాస్తవము. ఈ 'అనుకరణ' మనునది యనివార్యమగు నొక మానవతాధర్మము. అసలు కవిత్వమే ప్రకృతి కనుకరణమని అరిస్టాటిలభిప్రాయపడెను. అది యట్టిదే.

L. ఏబర్ క్రాంబీ దాని నిట్లు వివరించును.

"The poet first derives an inspiration from the world by the power of his imagination; the art of Poetry then imitates this imaginative inspiration in Language."

[Principles of literary critisism]

కవితాజగత్తులోని యాదర్శములను పాఠకులు, [పాఠకులలోను కవులుండవచ్చును.] అనుకరింతురని ఫిలిప్ సిడ్ని భావించెను. కవి, ప్రకృతినుండి పొందిన యుత్తేజమును భాషలోని కనుకరించునపుడు తన వైయక్తికమగు కళాత్మక మౌలికతను జతపఱచి యా యనుకరణమును కమనీయమునర్చును. అదే యసలి కవిత్వమగును. అందుచే అనుకరణ మనునది యొక మూఢ విశ్వాస ముగను, గ్రుడ్డిగను పరిణమించుట యారోగ్యము కాదనుట సమంజసమగును. అనుకరణమునను స్వేచ్ఛ యుండదగును.

"అలంకారము కవిత్వానికి అందము సమకూరుస్తుంది. అని వాదిస్తే అది పూర్తి సత్యము కాదు. అది బంధము కూడ కాగలదని చేరిస్తేనే పూర్తి సత్యమౌతుంది" అను శ్రీపాదవారి వాక్యములు యథాక్షర సత్యములు. అందుచే 'బంధము కాగల' దనుట అర్ధసత్యము మాత్రమే—ఛందోలం

కారములతోడనే కవిత్వము వ్రాయవలెననుకొనువారి కవి బంధములే యగును. కాని కవిత్వమున—కవికైనను తెలియకుండ—సహజముగ విమిడివచ్చు నలంకారమ్మైనను, ఛందమ్మైనను సుందరములుగ నుండును. ఫారసీ కవి అక్బర్ ఇల్హాబాది యిట్లనెను.

"షేర్ అజ్ గోయమ్ ఆబెహయాత్,
మన్నదానమ్ ఫాయలాతున్ ఫాయలాత్."

[కవిత్వ లక్షణములు నాకు తెలియవు. కాని నా కవిత్వమున నమృతత్వ ముండును]. వాల్మీకి శ్లోకమును నట్లే నిసర్గ రమణీయ మయ్యెను. ఛందో విషయమున పాశ్చాత్యుల భావము నద్దియే.

Metere is instinctively used by all poets. [Rhetoric Notes]

కవిత్వమున 'రసము' గుంభనగా నుండుటవలననే పాఠకునిలో క్రమసంచలనము కలిగి తాదాత్మ్య స్థితి కల్గును. రసానుభవ పరిణతి కొక కాలావధి, ఒక మార్గమును కావలయును. ఆ మార్గమున కిట్లు సోపానము లుండును. 1. నాదము—లయ 2. శబ్దము 3. అర్థము 4. అన్వయము 5. భావము 6. రసము. ఇవి యొక్కొక్కటిగా నాకర్షించుచు సహృదయుని రసానందమునకు గొంపోవును. కాని హఠాత్తుగ రసమును ప్రత్యక్షముచేయుట అసౌకర్యము. ఒకవేళ చేయ గల్గినను తదమూల్యానుభవమునకు పట్టుకొని, ఆస్వాదించి, ఆనందించుట యసౌలభ్యము. రసవత్తరమగు భావము కల్గుటకు వెనుక, దానిని వెలువరించు భాష వెనుక కవి హృదయమున నొక 'మథన' యుండును. ఆ 'మథన' ఛాయామాత్రముగనేని పాఠకునికి స్ఫురించినపుడతఁడు కవితో సహానుభూతి పొందగల్గును. కార్యకారణ సంబంధమును, కాలపు విలువను సడలించి భావసారమును ముందుంచినచో పాఠకుని రుచి దెబ్బతినును. మధు బిందువుల నౌషధమువలె గుటకవేయక రుచి నూరించి యూహించి, రసనాస్పర్శచే నాస్వాదించి గుటకవేయుదుము.

అందుకే ఆపాతమాధుర్యము కొఱకు 'శబ్దాలంకారములును, అర్థమును ప్రతిధ్వనింపజేయుటకు నౌదార్యమును (Onomatopocia), అర్థాన్వయ భావాదుల స్పష్టమును చేయు కొఱ "కాశ్రయాశ్రయా భావేన" అలంకారములును రసానుగుణ్యముగ మాత్రమే గ్రాహ్యములయ్యెను. కాని రసమునే వదలి వానినే ప్రదర్శింపదలచిన నవి వ్యర్థ చమత్కారము లగును.

"భావము తీవ్రమగుచోట నలంకారమ్ము ఫలించనేరదు."
కాని ఆ భావ తీవ్రతాదశకు వెనుక కొంత యలంకార సామగ్రి యుండును. అదియే ఆదర్శకత్యవసర పోషకముగా నుండుటయు కద్దు. మనుచరిత్రమున వరూధినీ ప్రవర సంవాదమునకు పూర్వమున గల వర్ణన మా ఘట్టమునకు పుష్టి గూర్చినది. ప్రవరుఁడు 'మకరాంక శశాంకమూర్తి'యైనగదా వరూధిని 'నీపయిం జిక్కె మనంబు నాకు' అనియన గల్గినది. కావ్యమున భావస్వరూపమును బట్టి, అలంకార్యాలంకారముల గుర్తించి యే వంపులో నెట్టి యలంకారము తొడుగవలెనో, ఎంతవఱకు వస్త్రములు ధరింపజేయవలెనో, యెచ్చట నగ్నముగా వదలవలెనో కళాదృష్టిగల కవికి తెలియును. బంగరు పట్టు పుట్టములు గలవని వాని నొడలంతయు గప్పడు. ఏడు వారముల సొమ్ము నొకేసారి యలంకరించడు.

"అలంకారమున్న కవిత్వము ప్రాంతీయమే కాగలదు. విశ్వజనీనము కాలేదు." అని శ్రీపాదవారి యభిప్రాయము.

మానవత్వమునకు వలెనే రసానుభూతికి విశ్వజనీనత గలదు. కాని రస ప్రతిపాదకమగు వే శక్తికి నట్టి విశ్వజనీనత యున్నట్లు గన్పట్టదు. రసము ననుభవమునకు దెచ్చుటకు భాషేకదా ముఖ్యసాధనము. ఆ భాషే ప్రాంతీయ పరిమితి గలదయ్యెను. లోకోత్తర వర్ణనా నిపుణుడైనను, అద్భుత సౌందర్యద్రష్టయైనను, స్రష్టయైనను, కవి నివసించు పరిసరములలోని మనుష్యులు, రూపములు, భాషలు, మతములు, ఆచార సంప్రదాయములు, ఋతువులు, ప్రకృతి సంపదలు, సంస్కృతి సభ్యతలు, చరిత్రలును—ఎంతో కొంత యతని కవిత్వముపై ప్రభావము కలిగియుండక తప్పదు. కావున నొక్క యలంకార మేల? ఇవన్నియును విశ్వజనీనత కాటంకములు కావలయును. కాని యట్లగుట లేదు. భారతీయ సంస్కృతిమయముగ నలంకార సుచిరముగ నుండు కాళిదాసుని శాకుంతలమును జదివి జర్మను కవి గెతే ఆనందోన్మత్తుడై గంతులు వేసెను. మధ్యయుగము నాటి శబ్దజాలము, ఆకాలపు సామాజిక చిత్రణలు, చరిత్రలును గల్గు షేక్స్పియర్ రచనలు లోకప్రసిద్ధములై యలరారుచున్నవి. 'కవితాశక్తి' సహృదయుని నానందమున ముంచెత్త గల్గుచున్నపుడు, రసికుడు, కవి వాడుకొను భాషలో, సంప్రదాయములలో జొచ్చికొని పోయి, వాని నతిక్రమించిన రసానందమున వెదకికొను నోపిక, సహృదయత్వము [సమాన మానసిక భావము] న సమాధ్యమునకు వెళ్లగల్గు యోగ్యత గలిగియున్నపుడును—అలంకారముగాని, ఛందముగాని సామాన్య స్థితిలో విశ్వజనీనత కాటంకప్రాయములు కానేరవు. అవి కవితా సౌందర్యమును నందించి ప్రక్కకు తొలగును.

# కవిత్వము - అలంకారము - ఛందము

మహాకవుల రచనలైనను భాషాంతరీకరణమున మూలములోని శోభను గోల్పోవును. కవిలో పుంజీభూతములై నిండియున్న సంస్కృతి సభ్యతలు, వాని నాశ్రయించి యతఁడు చెప్పినయట్లు నడచు భాషలోని చక్కదనము, దానికి కట్టుబడిన భావనావైఖరియు నితర భాషలో నంత సులువుగ రానేరవు. రసము—భాష అన్యోన్యాశ్రయములు గాన వానిని వేరుచేయునపు డందము తగ్గిపోవును. నిరలంకార కవిత్వమైనను మూలమునను, వేరొక భాషలోను చదువునప్పటి యానందములలో తారతమ్యము లుండును. ప్రపంచ సాహిత్యములందలి యలంకార సామ్యములకు తద్జ్ఞులు ప్రమాణము.

ఇక ఛందస్సు—

సంగీతమునకు వలెనే సాహిత్యమునకును నాదమే ప్రధానము. నాదమునుండియే శబ్ద ముత్పన్నమయ్యెను. [నాదే నవ్యజ్యతే వర్ణః పదం వర్ణాత్పదాద్వచః]శబ్దోచ్చారణలోని నాదము వినబడిన తరువాత నర్థగ్రహణము జరుగును. ఈ నాదములోని యుదాత్తానుదాత్త స్వరితములపై, హ్రస్వ దీర్ఘ ప్లుతములపైనను శబ్దార్థము, వాక్యభావమును, ఆధారపడి యుండును. వేదమంత్రములను సస్వరముగా జెప్పుటకు కారణ మదియే.

> ''మంత్రో హీన స్స్వరతో వర్ణతో వా
> మిథ్యా ప్రయుక్తో న తదర్థ మాహ
> న వాగ్వజ్రో యజమానంహి నస్తి
> యథేంద్ర శత్రు స్స్వరతోఽపరాధాత్.''

ఇట్టి సందర్భముననే యపస్వరమువలని యనర్థము నుభవించిన వృత్రాసురుని కథ జెప్పుదురు. శబ్దములోని యక్షరములకును, వాక్యములోని శబ్దములకును, వాక్యములకును మధ్య కొంతకాలము నిబద్ధమై యుండును.

> ''లోకే వేదేచ వచసాం పాదయోర్గతిరుత్తమా
> తాళేనైవ వినా తేన స్ఖలనం తేషు దృశ్యతే'' అని

కోహళాచార్యుఁడు భావమునకు వాక్యములందలి లయ తోడ్పాటును సూచించెను. స్వర, లయలలోని హెచ్చు తగ్గులు తప్పుటచేత నపార్థములు వచ్చుట మనకు నిత్యానుభవ సిద్ధమే. ఈ స్వర లయల సమ్యక్పరిపుష్టదశయే ఛందమని తోచును.

కొందఱు మాట్లాడునప్పుడును, కొన్ని భాషలు— మనకు తెలియకున్నను— వినునప్పుడును వానిలో నేదియో సంగీత గుణము ద్యోతకమగును. పద్యములను గాని, పాటలను గాని లిపి రూపమున చూచునప్పుడు ప్రత్యక్షర సాక్ష్యముగా గోచరించునది కాల విభజన మాత్రమే. వానిని వచనములాగైనను, భావస్ఫోరకముగఁ జదివినచో నాద విభజన కూడా శ్రవ్యమగును.

> ''పసుపుం గుంకుమ పూలు పూజ లిడి, సౌభాగ్యంబు శోభిల్ల, భూ
> మిసుర వ్రాతము వనల్ గురియ, నామేలెంచి కట్టించితిం
> పెనగన్ మంగళసూత్రమీ మెడను; దంద్రీ! దీని నీ చేతులా
> ర,''—సతీరత్నము వెక్కియేడ్చెనెద జాఱన్ రుద్ధ కంఠంబునన్—
>
> [శివ భారతము]

ఈ పద్యమును కేవలము లయ విభజనతో వినిపింపలేము. 'చేతులార— సతీరత్నము' అన్న చోట ముఖ్యముగా నాదము చేతనే భావాభివ్యక్తి జరుగును. నాదము శ్రవ్యముగావునను, స్వతంత్రము నతి సూక్ష్మమును నగుటంజేసి, చదువాని భావుకత, గళ మార్దవము [Melody] నాదము నెప్పటికప్పుడే విశ్లేషింపగలుగును. స్వరమక్షర రూపమున నిక్షిప్తము చేయదగినది కాదు. సంగీత గ్రంథములందు కృతులకును, కీర్తనలకును స్వర విభజన మమర్చి చూపుదురు. కాని యాస్వరములను యథాతథములుగ స్వీకరించినచో పాట రాణించ జాలదు. స్వరముల మధ్య గల్గు నొయ్యారము, మెలిక, కంపనము మొదలగు వాని కక్షర సంజ్ఞలుండవు. అందుచే నాదము వినదగినది మాత్రమే. ఇట్టి నాదము నాయా కంఠధ్వనుల నపేక్షించియు, లయను విస్పష్టముగను ఛందము సూచించును. ''కావ్యగానము'' వినునప్పుడును, స్వయముగఁ జదువుకొనునప్పుడును గల్గు నానందములకును మన ప్రతి చర్యలు గమనింపదగును.

సంగీత నాట్యగుణ సంపన్నత కొఱకే ఛందస్సు, కవిత్వమునకబ్బెను. పాశ్చాత్యులు నైతము ఛందస్సు యొక్క ప్రయోజనమునిట్టులే వివరింతురు.

**"It is the survival of music and dancing in poetry and gives the pleasure and thrill...by its rhythmical flow."**

**"It is the spontanious out pouring of emotion which sooths by its regularity."**

[Rhetoric Notes]

ఇస్లాం మతమున సంగీతమునొక పాపకార్యముగ భావించి నిషేధింతురట. ఇతరుల విషయమేమో గాని మన వారు పద్యములను శ్లోకముల నేల పాడిరో యాలోచింపదగును. 'కావ్యేషు నాటకం రమ్యం' అని దృశ్య కావ్యములకు ప్రాధాన్యమిచ్చుటం

జేసి, భరతుని భావమున నేత్రశ్రోత్రములే రసగ్రహణ యోగ్యములగుటంజేసియు, సంగీతము వ్యక్తి ప్రత్యేకతను తొలగించి యాత్మ విస్మృతి కలిగించుటకుత్తమ సాధనమగుటవలనను, శబ్ద నాద బ్రహ్మలద్వైత స్థితిని దాల్చినవని తోచును.

పదము వలెనే పద్యమును పాడదగియున్నది. వృత్త భేదములు తాళ భేదములే. కొన్ని వృత్తములు సంగీతమున కనుకూలముగ మనము వినియున్న పాటలకు సరిపోలుచున్నవి. భుజంగప్రయాతము వృత్తము ''తేరెశివా కౌనుమేరా కృష్ణకనయ్యా'' అను మట్టునను, పంచ చామరము ''ఖదం ఖదం బఢాయెజా'' అను మట్టునకు సరిపోవుచున్నవి.

భారతీయ సంగీతము నన్న రసానుగుణ్యమైన వాద వైచిత్రి—అనుభూతి—ఇతర సంగీతములలో నెంతవరకున్నవో తెలియరాదు—రాగములు స్వతస్సిద్ధముగ రసప్రతిపాదకములు. సంపూర్ణ రాగములు శృంగార, కరుణాదులందు, షాడవ రాగములు రౌద్ర వీర భయానకములందును వాడబడును. లయలో రాగము లీనమగునప్పటి యానందమునకు రసికుల వీనులు ప్రమాణము. శ్రీ కే.వి.రాఘవాచార్యులుగారు ''లయకు నైసర్గికముగా నితరముల సహాయము లేకయే శ్రోతలను మైమరపించు శక్తి గల'' దనిరి. ఇది కొంత యాలోచనను పురి కొల్పును. లయ అనగా కేవలము కాలవిభజన. రెండు ధ్వనుల మధ్య గల్గు నిశ్శబ్దకాలము.

''తాళాంతరాళ వర్తీయః కాలో౽సౌలయ నామకః'' అని కోహళాచార్యుడు లయకర్థము వివరించెను. ధ్వనులను తనయందు లీనము చేసికొని లయ గుర్తింపబడును. కవిత్వమున శబ్ద, గణ రూపముననను, సంగీతమున మృదంగాది వాద్య రూపముననను, లయ నాదము నాశ్రయించి శ్రవ్యమగుచున్నది.

ఈ లయ తాళప్రాణము. తాళము నృత్తగీత వాద్యములందు తమగును.

''తాళస్తల ప్రతిష్ఠాయా మితి ధాతోః ప్రయోగతః

నృత్తం గీతం తథా వాద్యం యతస్తాళే ప్రతిష్ఠితం''

అని శార్ఙ్గదేవుడు; నృత్తగీత వాద్యములు తాళమందు ప్రతిష్ఠితమైన వనెను. ''రాగ స్వరశ్చ తాళశ్చ త్రిభిస్సంగీత ముచ్యతే'' అని సంగీతము నిర్వచింప బడును. ఛందస్సు తాళస్వరూపమే, కావున ఛందస్సునకును, సంగీతమునకును సంబంధము గలదు.

ఆపాత మధురమగు సంగీత రసమును ఆలోచనామృతమగు కవితా రసముతో జత గూర్చ, రెండు మనోహర వళల సమ్మేళనమే ఛందోబద్ధమగు పద్యము, 'పాట' యేర్పడెను. లయాన్వితములగు పద్యములు సంగీత గంధముచే హృద్యము లగుచున్నవి.

''పద్యంలో రాగం ప్రవేశించడంవల్ల లయ స్ఫురించడంలేదు. మరి నాట్య గుణ సంపన్నతను మెచ్చుకునేవారు దేన్ని చూచి మురిసిపోతున్నట్లు?'' అని శ్రీపాద ప్రశ్నింతురు. దీని కిట్లు సమాధానము చెప్పనొప్పును.

ఉదాహరణము కొలకుత్పలమాలను దీసికొందము. ఇది వార్తిక మార్గమున త్రిశ్రజాతి త్రిపుటలో నాల్గు చరణములు, నాల్గావృతములలో సాగు నృత్తము. పాదము నందలి శబ్దములను లయ కనుబంధించి పాడిన యెడల తాళము నడచు విధానము స్పష్టముగ గోచరించును. గుర్వక్షరములను రాగపు మెలికలతో లాగుచు, లఘువులను సామాన్యముకంటె పొట్టిగ నుచ్చరింపుచు తాళము నింపుకొని పాడినచో కాల విభజనకును, అక్షర విభజనకును గల సంబంధ మస్పష్టమై పోవును. కాని లయ మాత్ర ముండితీరును. ఇట్లే పద్ధతి నింకను విస్తారముగ నుపయోగించుకొనిన నవే నాల్గు చరణములను, ఎనిమిది, పదహారా వృతముల వరకు—అర్థము చెడనంత వరకు—పెంచుచు వెళ్లవచ్చును. రాగతాళ ప్రస్తార వశమున నీ పద్ధతి యందు లయ అసాధారణముగ నుండుటచే లయలేదను భ్రాంతియు గల్గుచుండును. 'హిందుస్తానీ' గాయకులు 'విలంబిత్' పాడునపు డంతర్వర్తిగ నడచు లయ సామాన్య దృష్టికి విస్పష్టముగ గోచరింపదు.

పద్యము లర్థ ప్రాధాన్యము లగుటంజేసి సభా నాటకాదులలో వాద్యములతో తాళము సూచించు పద్ధతి ప్రచారమునకు రాకుండును. కాలక్రమమున పద్యముల బాడువారిలో మాత్రకాలముల ధారణ చేయగల్గు శ్రద్ధాసక్తులు సన్నగిలి, రాగము మిగిలి, లయ మాయమై యుండును. కావున పద్యములను తాళ బద్ధములుగనే పాడవలసి యుండును.

ఇక ఛందస్సు విస్తరించిన తీరు తెన్నులు కొన్ని విచిత్రములుగ గన్పట్టును. సంస్కృతమున లేని యతి ప్రాసలు తెలుగున నెందుకు ప్రవేశించెను? యతి ప్రాసలతో తెలుగు కవిత్వము ''మేడ్ డిఫికల్టు'' య్యెనా? యను ప్రశ్న లాలోచనీయములు.

యతిప్రాసలు క్రమబద్ధము చేయబడిన యక్షర పునరావృత్తులు. శ్రుతిపర్వమగు వినోదము, వైలక్షణ్యమే వీని ప్రయోజనములైన కట్టుదిట్టము లేల ? యతి నియతి గురించి సంస్కృతము నుండి తెలుగులోనికి వచ్చిన కొన్ని వృత్తములలో కవుల పాటింపులు, లాక్షణికుల మతములును వేర్వేరుగా నుండుట గమనార్హము. యతిస్థలములు నిర్ణయించుకొనుటలో కవులకు స్వాతంత్ర్య ముండవలెనని

శ్రీ గిడుగు వేంకట సీతాపతి గారభిప్రాయపడిరి. [చూ. ఆనంతుని ఛందము— ఉపోద్ఘాతము. పుట 19] తెలుగు పద్యములందు సంస్కృతమునందువలె శబ్ద విశ్రాంతి లేదు. అందుచే "వడి (వళి)కి బదులుగా యతి, విరతి మొదలగు పర్యాయ పదములలో మరియేదిన్ని వాడకూడదన్నట్లే తోచు"నని గిడుగువారు తెల్పిరి. కేవల సంస్కృత విశ్రాంతి నియతి వలననే యతికి విరామాది పదములు పర్యాయము లయ్యెనని యూహింప వీలగుచున్నది. అంతకన్న యతికి విరామాది పదములెట్లు సార్థములగునో తెలియరాకున్నది. కావున యతికి "నియతి" శబ్దమే పర్యాయ మనుట యుచితమగును—

ఏలయన తాళప్రాణములగు కాలమార్గ క్రియాదులలో 'యతి' కూడ గలదు. 'యతి' అనగా లయ నడచు విధానమును సూచించెడు నియమము. "లయ ప్రవృత్తి నియమో యతిరిత్యభి ధీయతే" అని కోహళాచార్యుడు. అక్షర సామ్యద్వారమున నొక "విలంబితలయ"ను ప్రతి చరణమున యతి,— నియతిగా సూచించుచుండును. యత్యక్షరములు [ప్రాసలును] తాళపు ఘాతల ననుసరించి యుండును. ఎన్ని యతులున్నన్ని తాళపు ఘాతల మూలమున లయ మారుచుండు గతి సూచితమగుచుండును. తాళాంగములగు లఘు, ద్రుతాదుల విభజించుటకు యత్యక్షర ముపయోగింపబడును. ఈ విభజన క్రమములలో మారుచుండు యతులకు పారిభాషిక నామములు గలవు. ఉదాహరణము. కొఱకొక వృత్తము పరిశీలింపదగును.

ఉత్సాహమను వృత్తము చతురశ్ర జాతి, చతురశ్ర గతి త్రిపుట [ఆది] తాళములో నొక చరణ మొక యావృతమున నడచును.

ఇట్లు క్రౌంచ పదాదులలో యతి, ప్రాసయతులును, భుజంగ ప్రయాతరుచిరాదులలో ప్రాసలు యతులు కలిసియు, కొన్నింట కేవల ప్రాసములును గ్రహ విధానముల ననుసరించి చిత్ర విచిత్ర గతులతో సాగుచుండును.

"తక, తరి, కిట" మొదలగు తాళ ప్రత్యయములకును, సరిగమాది స్వరముల తాళబద్ధములైన రూపములకును "జతి" అని పేరు. తాళాంగముల ననుసరించియుండును కావుననే వానికి జతి [యతి] పేరు సార్థమగును. జతి శబ్దము యతికి వైకృత రూపముగా నేర్పడి యుండవలెను. "యతిస్వరములు", "స్వరయతులు" ను "జతిస్వరములు" "స్వరజతులు"గను మారియుండవచ్చును. కాని శబ్ద రత్నాకరమున "జతి" శబ్దము దేశ్యమని వ్రాయబడెను. ప్రౌఢ్యమునను, ఈ శబ్దమునకు సంస్కృత సూచ్యమగు గుర్తించబడ దయ్యెను. శ్రీ మునుసూరి వేంకటశాస్త్రిగారి శబ్దార్థ దీపిక యందిట్లు వ్రాయబడును.

జతి— వై. వి. (సం. యతిః) కావున నా శబ్దము వైకృత మనుటయే లెస్స. పద్యమునందలి సాహిత్యమును ప్రక్కగా నుంచిన యెడల యతి (యతులు) లఘుద్రుతాదుల విభజించుచు సాగుచుండు జతి స్వరముల వంటివి. ఇక విరామాది శబ్దములగూర్చి ఇంచుక పరిశీలింపవలయు.

షోడశ తాళాంగములలో నొక యక్షర కాలమును 'అనుద్రుత' మందురు. దీనికే విరామమని నామాంతరము గలదు.

"అమ ద్రుతోర్థ చంద్ర స్యాద్వ్యంజనం చాను నాసికం
అవ్యక్తంచ విరామంచ వక్తవ్యం భరతజ్ఞకైః"

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అ * | తుల | శౌర్యుఁ | డనిల | తనయుఁ | డమిత * | వాహి | నీ ప | దా |
| ఘాత | | చిటికెన వ్రేల | అనామిక | మధ్యమము | ఘాత | విసి | ఘాత | ఉసి |
| లఘువు | | | | | ద్రుతము | | ద్రుతము | |

మొదటి తాళాంగము పెద్దదియగు లఘువును, తరువాతివి చిన్నవగు ద్రుతములు నగుటచే నిది గోపుచ్ఛయతి నాఁబడును. ఇందు లఘు-ద్రుతములను వేరు చేయుటకు రెండు ఘాతలు సరిపోవును. ఈ రెండు ఘాతలను చరణ ప్రథమాక్షరము, యత్యక్షరమును, తెలియఁజేయుచున్నవి.

అని తాళాంగ నిఘంటువు. అంగ విభజనకొక యక్షర కాలమగు ననుద్రుతము నక్షర సామ్యమున 'యతి'గా నియమించుటంజేసి యా శబ్దమునకు విరామాది శబ్దములు పర్యాయములై యుండునా యనిపించును. 'వళి' యను మాట హద్దు (ముడుత)ను, వడి యనునది వేగము (కాలము)ను తెలు

పుచు యతికి మారుపదములై యుండును. ఏమైన నీ విష యము పండితులు శోధింపదగినది. ప్రాసలు శబ్దాలంకార ప్రాయములైనను ఆ యా యక్షరములనుబట్టి ఆ యా రసములను స్ఫురింప జేయును.

కర్షితరిపు లన్యోన్యా
కర్షణ సంకర్షణాప కర్షణముల సా
మర్షులయి పెనఁగి రాహ వ
హర్షంబునఁ బవన సుత బృహద్రధ పుత్రుల్.
(నన్నయ)

ఇందు భీమ జరాసంధుల శరీర కర్కశత్వములు, మల్లయుద్ధ మును 'ర్ష' ప్రాసము ధ్వనింపజేయుచున్నది.

యతిప్రాసలు 'టీకా' వంటివి. అనుప్రాస యమ కాదులు ద్విత్వ సంయుక్తాక్షరములనున్న "వరుసల"ను బోలియు, సామాన్యక్షర పునరావృత్తులు తాళపు నడకను స్పష్టము చేయునవియుగ నున్నవి. శ్రీనాధుని "ధాటీ ఘోటక......", పెద్దనార్యుని "అటజనికాంచె..." ఉదాహర ణీయములు. శంకరాచార్యుని ఈ శ్లోకము వినదగును.

"డమరు డిండిమ ఝర్ఝర ఝల్లరీ
మృదు రవ ద్రగడ ద్రగడాదయః
ఝడితి ఝాంకృత ఝాంకృత ఝాంకృతై
ర్బహుదయం హృదయం సుఖయంతుతే"

చివరి చరణమునందలి 'యం' పునరావృత్తి 'ముక్తా యింపు' వలె విన్పించును. పోతనామాత్యుని "పాద ద్వంద్వము నేలమోపి" అను పద్యమున చివరి పాదమున, "......నక్రము విక్రమించె కరి పాదాక్రాంత నిర్వక్రమై", అనుటలో 'క్ర' పునరాగమనము, "అమ్మల గన్నయమ్మ" పద్యమున "మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్" అనుటలోని "త్వ" ఆ వృత్తియు నటులే 'ముక్తాయి'ల బోలి శ్రవణ సుఖదము లగును.

పాశ్చాత్యులు "Rhythm" అను మాట కిట్లర్థము చెప్పుదురు.

**"The hormonious reccurence of sound accent and moment; in music a grouping of tones in regard to accent and time value."**

**Reccurenee–Moment–Time value** అను మాటలు సమన్వయింప అక్షర సామ్యమున తాళమును సాధిం చుట యనునది స్పష్టమగును.

యతి=**In Telugu it denotes a syllable rhyming to intial of the line.**

ప్రాస=**In Telugu it denotes alliteration, a rhyme.** అని బ్రౌను నిఘంటువున వ్రాయబడును.

**Rhyme**— అక్షర పునరావృత్తి తాళ (కాల) నియమానుసారముగ వాడబడును. కావున యతి ప్రాసలు లయపై నాధారపడి ప్రత్యేక వాద్యాదులతో తాళము సూచింప నక్కఱ గల్గకుండునట్లు పద్యముననే అక్షర రూపమున నిమిడియున్నవని తోచును.

గర్భ కవిత్వ మంతర్లయల సూచించునవై యుండును. బంధ కవిత్వము గూడ నొక విచిత్ర ప్రక్రియ. పద్మ చక్రాది బంధములు పెక్కుల జూడ మన వారలు కవిత్వ మున గాంధర్వముతోబాటు చిత్రకళను సైత మిమిడ్చి చూపి రను నూహ కలుగుచున్నది. వస్తు స్వరూప వర్ణనలయందు నా యా వస్తువులయొక్క యూహా చిత్రముల నూహా దృష్టికి దృశ్యమానము చేయుటకో, లేక తత్తద్వస్తు రూప ముల కావ్య కథాంశములతో నుపమించుటకో ఈ బంధ కవిత్వ మవతరించెనను శంక వొడముచున్నది. పాశ్చాత్య సాహిత్యము నను నిట్టి కవిత్వ మొకా నొక కాలమున నుండి యున్నట్లు 'బెరిడెల్ కీత్' పండితుఁడు

**History of Sanskrit litrature [Page 127]** అను గ్రంధమున వ్రాసినట్లు శ్రీ సన్నిధానం సూర్యనారా యణశాస్త్రిగారు కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యానమున వివరించిరి. బంధ కవిత్వోద్భవమునకు కారణము నా పండితుఁ డిట్లూహించెను.

**"It may be that these tricks arose from the practice of writing inscriptions on swords and leaves."**

పూర్వులు ప్రయోజనములేని పద్ధతులను ప్రవేశ పెట్ట లేదేమో యనిపించును. ఒక్కొక్క భావమున కొక్కొక్క వాఙ్మయ స్వరూపము మిక్కిలి ప్రయోజనకారి కాగలదు. కాని వ్యాస ముఖముననే సూచింపబడినట్లు లక్ష్య లక్షణ సంబం ధములను గ్రహించినచో 'గ్రుడ్డి యనుకరణ'లకు తావుండక నా యా విలువలు నిలిచియుండును.

ఛందస్సుతో వ్రాసినవే కవిత్వమనుట 'విప్పన్న జెప్పినదే వేద' మనుట వంటిది. గద్యములోనను కవిత్వము గలదు ముక్తక వృత్తగంధి, ఉత్కలికా ప్రాయాది గద్యముల ప్రాచీ నులు వాడిరి. ఆధునికులు వ్రాయు కొన్ని వచన కవిత్వము

లందును, కథలలోనను, నవలలలోను హృదయమును ఝల్లు మనిపించు చైతన్యము గలదు. సహృదయుడైనవాడే రూపమున నున్న కవితా సౌందర్యమునైనను పోల్చుకొని యానందించును. కాని ఆయా సౌందర్యములందు భేదముండునని మాత్రము చెప్పదగును.

కవిత్వమునకు సంగీత తత్త్వము [ఛందము] అక్కఱలేదనువారును, 'మాటకు, పాటకు వైరుధ్యము లే'దనువారును, 'సంగీతము నాదాశ్రయ శబ్దాశ్రయమేగాక—అర్థాశ్రయమై గూడ నుండగదని'యు [శ్రీ కె. వి. రమణారెడ్డి—భారతి జూన్' 64— పుట 6] సంగీతమును బహుసూక్ష్మ భంగులుగా విశ్లేషించు వారును గలరు. ''కవిత్వమే సంగీత''మను వారును—ఉండవచ్చును. ఆ యా రుచులను కాదనరాదు.

నాదము [సంగీతము], స్ఫోట [అర్థ యుక్త లయాన్విత నాదము] రెండును శ్రుతి ద్వారమున గ్రాహ్యము లగుటం జేసి యిట్టి విశ్లేషణములకు వీలు కలుగుచున్నది. కాని యివి ఆ యా పరిణతులకు ప్రాతిపదికలు మాత్రమే. వాని పరిపుష్ట దశలు భిన్నమార్గములుగ నున్నవి. ఆ దశలను ప్రాతిపదిక స్వరూపముల కన్వయించుట చేతనే ''మాటలలోనుండు 'సంగీతము' కవిత్వములో నుండగల్గు''చున్నది. అందుకే ఛందము బంధమై ''స్వచ్ఛందము'' అందమై వచన కవిత్వ మావిర్భవించినది. ఇందు కవితా గుణమును ప్రక్కగా నుంచిన, శబ్దాంతర్లయలకు ప్రాధాన్యమీయబడు నన్వయ గుంఫనగల గద్యమే భావ స్ఫోరకముగా పాదములుగా విరువబడుచు ''పద్యము చదివిన యనుభూతి'' గలుగును.

అనిబద్ధ కవిత్వ మొక మెట్టు పైకెక్కినది. ఏదైనను క్రమ పరిణామముననే సహజముగ నుండును. 'ఇది యిట్లుండవలయు' ననుట నిర్బంధమగును. కవితాకన్యయొక్క ''వివర సౌందర్యము''ను చూచుటకు మన కన్నులలవడవలయును. ఏమైనను కవిత్వముతో చదువరులకు సంబంధముండునంత కాలము భాషయు, తదాశ్రితములైన సమకాలీన సామాన్య నిబంధనలు తప్పవు.



# నాట్యకళ - గీర్వాణ రూపకము

శ్రీమతి ముష్టి వెంకటలక్ష్మీదేవి

ప్రాణవ శరీరము సర్వదేవతామయమని సూత సంహిత మొదలైన గ్రంథములందు పేర్కొనబడి ఉన్నది. దానిని నాట్యరూపముగా విశదీకరించుటకై భగవంతుడు మనకు నాట్యవిద్యను ప్రసాదించినాడు. నటుడు భావావేశముతో సర్వ దేవతామయమైన శరీరమునందు హస్తలాఘవము, అంగ విన్యాసమును చూపించుట చిత్తము భగవంతునియందు లగ్నము చేయుటకేయని విశదమగుచున్నది. జయదేవ మహాకవి వ్రాసినఅష్టపదీగానమునందు బాహ్యముగా శృంగారరస ప్రధానముగా కన్పించినను,తన భార్యను శ్రీకృష్ణ పరమాత్మ అనుగ్రహమువలన బ్రతికించుట యను దృష్ట ప్రమాణముచేత ఈ నాట్య విద్య ఆధ్యాత్మిక విద్యయని తెలియుచున్నది. ''కృష్ణ లీలాతరంగిణి''లో సప్తమస్కంధములో శ్రీ కృష్ణుడు గోపికలకు తత్త్వోపదేశము చేయు సందర్భమున ''త్వమేవాహమ్' అను పదముతో జీవ బ్రహ్మైక్యసిద్ధిని రాగ, తాళ, లయాన్వితముగా దర్శించినట్లు నారాయణతీర్థులవారు చూపిరి. గనుక ఇట్లు అనేక ఉదాహరణల రీత్యా నాట్య విద్య బ్రహ్మ భావ కలితమై, బహుజన మనోరంజకమై అలరారుచున్నదని చెప్పుటకు సంశయములేదు. ఇట్టి ఆధ్యాత్మిక విద్యను వినుటయేగాక కనులార దర్శించుట మహద్భాగ్యముగా తలంచవచ్చును. కైలాసమందలి పరమ శివుడు తన ప్రియురాలైన పార్వతీదేవి ఆనందము కొరకు నటరాజ రూపము ధరించి అఖండ తాండవము చేసినది అందరికి విదితమేగదా!

## నాట్యము

స్వాయంభువ మనువు ప్రజాపాలనము నందలి విసుగు తొలగుటకై ఏదేని వినోదము సూచింపుమని తండ్రియగు సూర్యభగవానుని ఒకనాడు వేడుకొనెను. అప్పుడు సూర్యుడు మనువునకీ వృత్తాంతము చెప్పినాడు.

''ప్రజాపతి, విష్ణువు సన్నిధికి జని, వినోద మేదైనా నిర్దేశింపు మని ప్రార్థింపగా ఆయన ప్రజాపతిని మహేశ్వరునిసన్నిధానమునకు పొమ్మని చెప్పినాడు. అంతకు పూర్వమే తనకడ గాంధర్వ వేదము నభ్యసించిన నందీశ్వరుని మహేశ్వరుడు పిలిపించి ప్రజాపతికి నేర్పుమని యాదేశించినాడు.

నటుని కొరకు తలపోయగా అయిదుగురు తో నొకానొక ముని యావిర్భవించినాడు. సరస్వతీదేవి సమక్షమున ప్రజాపతి నాట్యవేదము ననువదింపుడని వారితో చెప్పినాడు. వారు నాట్య వేదమును వివిధాంగములతో నభ్యసించి భావరాగసంయుతముగా యెదుట ప్రదర్శించి మెప్పుపొందిరి. ఆయన వారి భక్తి శ్రద్ధలకు మెచ్చి వారికి ముల్లోకములలో భరతులని పేరు వచ్చుననియు, నాట్య వేదమునకు భరతమని ప్రసిద్ధి కలుగుననియు వరము ప్రసాదించినాడు.''

సూర్యుని వలన ప్రబోధము గాంచి స్వాయంభువ మనువు ప్రజాపతిని వేడుకొనగా, ఆయన మనువు వెంట భరతులను భారతవర్షమునకు పొండని యానతిచ్చెను. వారు అయోధ్యా నగరమునకు చని దేవలోకమున ప్రదర్శించిన విధమున దేవర్షుల గాథలను అచ్చట బ్రదర్శించిరి. ఈ భరతశిష్యులు, భరతఖండములో వివిధ ప్రాంతములలో రంగ గృహములు నిర్మించి, నాట్యకళను వ్యాప్తి చేసినారు. మనువు కోరికపై వారు నాట్య వేద

పారమును దేవదశసాహస్రి అనియు, శతసాహస్రి యనియు రెండు గ్రంథములుగా రచించినారు. దీనికే భరతమను పేరు వచ్చినది.

నాట్య శాస్త్రమందు నాట్యవేదావిర్భావము ఈ విధముగా కానవచ్చును. సృష్టియైన పిమ్మట పంచమ వేదమును సృజింపుమని ప్రజాపతిని ఇంద్రుడు వేడినాడు. ప్రజాపతి భంగిని, సంగీతమును, అంగ చలనమును, భావమును వేదముల నుండి గ్రహించి నాట్య వేదమును నిర్మించినాడు. అనంతరము భరతుని అతని శిష్య వర్గమును పిలచి నాట్య వేదమును ప్రచారము చేయుడని యాదేశించినాడు. ప్రప్రథమ రూపకము దానవసంహార కథ. దేవలోకమున నీ కళ వృద్ధిగాంచినది. నహుషుడు ఇంద్ర పీఠము నధిష్ఠించిన పిదప, భూలోకమున కూడా ఈ కళ వ్యాపింపవలెనని, భరతపుత్రులను పంపినాడు. వారు మర్త్యులలో గలసి పోయిరి. వారి సంతతి వారు నాట్యకళలో ప్రవీణులైరి. కోహళుడు, శాండిల్యుడు మొదలగువారు లోకానుగ్రహ బుద్ధితో ఈ శాస్త్రమును రచించిరి.

తొలుదొల్త నాట్యకళలో నాట్యము, నృత్తము, నృత్యము, అను మూడంగము లుండెను. వీనిని దేవతల ఎదుట గంధర్వులు, అప్సరసలు ప్రదర్శించెడివారు. మహేశ్వరుని అనుచరుడు, ఈ కళలో ఆయన శిష్యుడునగు తండు పేర తాండవము ప్రసిద్ధిగాంచెను. మహేశ్వరుడు తాండవ లాస్యములను రెండు రీతులను యిందు చేర్చినాడు. నాట్య మనగా నాటకము. అందు అభినయము, వాచకము, కలవు. నృత్తమున వాచికము లేకుండా అభినయము మాత్రము వుండును. తాండవలాశ్యములు రెండూ నృత్త రీతులే.

తన భక్తుడగు బాణాసురుని పుత్రిక అయిన ఉషాకుమారికి పార్వతీదేవి లాస్యము నేర్పినది. ఉషాదేవి వివాహానంతరము ద్వారకా నగరమున నివసించుచు అచ్చటి గోపికలకు లాస్యము నేర్పినది. వారి వలన సౌరాష్ట్ర దేశ స్త్రీలకును, వారివలన నితరులకును ఈ కళ అబ్బినది.

గానము, అభినయము, సంభాషణము, రూపారోపమును, గీర్వాణ రూపకమునకు పూర్వ కాలముననే యుండెను. భరత ఖండమున గానము వైదిక యుగమునుండి వర్ధిల్లెను. వేదములో గానమున్నది. వానిలో సంవాదములు గలవు. ఋగ్వేదమున 13 సంవాదములు స్పష్టముగా కానవచ్చును. మహాభారతము సూతునకు అతని శిష్యులకును సంవాద రూపమున రచింపబడినది.

ప్రాచీనకాలముననే లక్షణవేత్తలు నృత్త, నృత్య, నాట్యములకు భేదము స్పష్టీకరించినారు. కొన్ని రూపకములు నృత్యముమీదను, మరికొన్ని నాట్యము మీదను ఆధారపడి యుండుటచే ఈ పదములను ముందుగా గ్రహింప వలెను.

నృత్తమున కేవల మవయవ చలనముండును. అనగా నేత్ర, భ్రూ, ముఖ, హస్త, భుజ, వక్షోజ, కటి, పాదాంగుళుల చాలనము.

నృత్తమునకుతోడు గానము, పాఠ్యము, వ్యక్తీకరణము నృత్యమగును. నృత్యనాట్యములకుతోడు రూపకాభినయము, నాట్యాభినయమగును. అవసరము లేనపుడు నృత్యసంగీతముల విడువవచ్చును.

స్త్రీలకు లాస్యము, పురుషులకు తాండవము విధించినారు. నృత్యము భావాశ్రయము. నాట్యము రసాశ్రయము.

## రూపకములు—ఉపరూపకములు

నృత్తము నాధారముగా చేసుకున్నది రూపకముగా పరిణమింపలేదు. నృత్తము రాజప్రాసాదములలోను, దేవాలయ ప్రాంగణములలోను నిలిచిపోయినది. ఇయ్యది గణికల కళ. గణికలవలన రాజకుమారికలు, రాజకుమారులు నృత్తము నభ్యసించెడి వారు. వినోదమునకై నవీన విధానము లావిర్భవించినపుడు కాలక్రమమున రూపకము లేర్పడినవి. రూపకములు నాట్యాధారములు. నృత్యాధారములు ఉపరూపకములు.

హేమచంద్రాచార్యుని కావ్యానుశాసనమున గేయమనునది నేటి నృత్యము (ఉపరూపకము). పాఠ్యమనునది నేటి నాట్యము (రూపకము). అందలి గేయ రూపకము అభినవభారతిలోని నృత్తకావ్యము.

రూపకములు రసాత్మకము లనియు, ఉపరూపకములు భావాత్మకము లని భావప్రకాశమను గ్రంథమున స్పష్టముగా చెప్పి, ఉపరూపకములు నృత్య

భేదము లనియు, రూపకములు నాట్యభేదము లనియు వివరించబడినది. నాట్యము వ్యాక్యార్థాభినయాత్మకము. నృత్యము పదార్థాభినయాత్మకము అని నిరూపింపబడినది.

భరతముని రూపకమునకు లక్షణము చెప్పి విభాగము చేయుటయేగాక, ఉదాహరణముగా కొన్ని రూపకములు రచించినాడు. జామదగ్న్య విజయము (వ్యాయోగము), కుసుమశేఖరవిజయము అను ఈహా మృగము, శర్మిష్ఠాయయాతి అను నంకములను ఈయన రచించెను. నహుషుడు ఇంద్రపీఠము నధిష్టించి యున్నప్పుడు, తత్సమక్షమున శర్మిష్ఠయయాతి ప్రదర్శనము జరిగెను.

పితామహుడు సముద్ర మథనమును సమవాకారమును, త్రిపురదాహమను డిమమును రచించెనని ప్రతీతి. ఇంద్రధ్వజమహోత్సవ సమయమున సముద్ర మథనము, హిమాచలోత్తర భాగమున మహేశ్వర సన్నిధానమున త్రిపురదాహము ప్రదర్శనము జరిగెను. సరస్వతీ దేవి లక్ష్మీస్వయంవర నాటకమును రచించెను. ఆమె యానతి చొప్పున భరతమునివలన శిక్షణ నొంది అప్సరసలు ఇంద్రుని నాటకశాలలో దానిని ప్రదర్శించిరి.

భరతముని తర్వాత అనేకులు నాట్యశాస్త్ర విషయములు రచించినవారు కలరు. వారు మన సంప్రదాయప్రకారము, కలియుగమునకు పూర్వమే వర్ధిల్లిరి. వాత్స్యాయనుడు వారి గ్రంథములనుండి ఉదాహరణము లిచ్చినాడు. రామాయణములోను, మహాభారతములోను, నటనర్తక శబ్దములు, సూత్రధారశబ్దములు కలవు. నగరములలో నాటకములు, నృత్యములు బాగుగా జరగుచుండెడివని వానిలో వర్ణింపబడినది.

గౌతమ బుద్ధుని కాలమున సౌగంధికాపహరణము అను రూపకమును రాజగృహమున ఆయన శిష్యులగు ఉపతిష్య, మౌద్గల్యామనులు ప్రదర్శించిరి. వరరుచి భాణమునే గాక నాట్యశాస్త్రమును కూడా రచించెనని శ్యామిలకుడు వ్రాసినాడు.

క్రీస్తుపూర్వము 150 సంవత్సరము ప్రాంతమున పతంజలి మహర్షి మహాభాష్యమును జేసినాడు. అందు రెండు పక్షముల గ్రాంధికులు అభినయము లేకుండా నోటిమాట పలుకుదురు. వారు సౌభికుల వలె అభినయింపరు. ఐననూ పతంజలి కాలమున నాటకము లుండెను. నటులు గురువులై రంగస్థలమును పాలించిరి. రూపక ప్రయోగములను నిర్వహించెడివారు సౌభికులు. అందు గానము, నృత్యము సంభాషణము ఉండెడివి. ఇది నేత్రోత్సవమేగాక, కర్ణోత్సవము కూడను. పతంజలి, పాణిని మహర్షులకు పూర్వము గీర్వాణరూపకము లుండెడివనుటనిర్వివాదము.

## రూపక భేదములు

భరతముని 10 విధములగు రూపకములను, 14 విధముల ఉపరూపకములను పేర్కొన్నాడు. ధనంజయుడు తన గ్రంథమునకు దశరూపక మని పేరుపెట్టినాడు. కోహలాచార్యుడు 20 విధముల, అగ్ని పురాణము 27 విధములు, శారదాతనయుడు 30 విధముల చెప్పినారు. ప్రధానములైన దశరూపకములు రసాశ్రయములు. వాక్యార్థాభినయములు. తక్కినవి భావాశ్రయములు, పదార్థాభినయములు.

రూపకములలో నృత్యసంగీతముల బాహుళ్య వైరళ్యములను బట్టి కోహలాచార్యుడు దేశి మార్గ విభాగము చేసినాడు. దత్తిలుడు— సట్టక, తోటక, గోష్ఠి, బిందక, శిల్పక, ప్రేక్షణ, సల్లాపక, హల్లీక; రాసక, ఉల్లాస్య, శ్రీగదిత, నాట్య, దోర్వల్లి, ప్రస్థాన, కావ్య, లాసిక అను 16 విధముల పేర్కొన్నాడు. దీనిని బట్టి సామాజికుల ఎదుట ప్రదర్శించున వన్నియును రూపకములని సామాన్యముగా నన్నారు. "తేషాం రూపక సంజ్ఞాపి—ప్రాయోదృశ్యతయాక్వచిత్" అని శారదాతనయుడన్నాడు.

## రూపక సామాన్య లక్షణం

గీర్వాణ రూపకములను లాక్షిణికులు వివిధముగా విభాగించినారు. తన సాహిత్యదర్పణ గ్రంథమున విశ్వనాథకవిరాజు రూపకములు 10 యనియు, ఉపరూపకములు 18 అనియు విభజించినాడు.

పూర్వకాలముననే ప్రచారము నందున్న తోలు బొమ్మలాటయు రూప్ శబ్దముచే వాడబడుచున్నది. త్రిపిటకములలోని థేరగాథలో రూప్యరూపకము అను మాట కలదు. కథా ప్రదర్శనమునకు తోలుదొల్త రూపక శబ్దమున కర్థము. క్రమముగా దృశ్య ప్రదర్శనమునకు కూడా ఈ శబ్దమే ప్రయోగింపబడినదని తోచును. నాట్యశాస్త్రమున దశరూప

పర్యాయపదము ఆరు పర్యాయములు ఈ యర్థమున గాన వచ్చును. ఈగ్రంథమునందే రూపశబ్దము గోచరించి నను రూపాభాసమని కాని, సౌందర్యమని కాని తాత్పర్యము.

నాట్యశాస్త్రమున దశరూప శబ్దము నాటక ప్రదర్శనము నుద్ఘాటించుచున్నది. పూర్వకాలమున బహిరంగముగా ప్రదర్శించుట యను నర్థమున నాట ధాతువును, నాటకమునకు నాట్యశబ్దము నుపయోగించెడివారు. రూప్ కాలక్రమమున ధాతువుగాను, సుబంతముగాను వ్యాప్తమయ్యెను. రమారమి సహస్ర వర్షముల కాలము రూప, నాటధాతువులు ప్రచలితము లైననూ, తుదకు నాట మాత్రమే మిగిలినది కాని రూప్ ధాతువు రూపకముగా పరిణమించి నాట్య శబ్దమును త్రోసిపుచ్చి తానే మిగిలినది. క్రీస్తు శకము తొమ్మిది, పది శతాబ్దములలో రూపకము జాతి వాచకమైనది.

## నృత్తాదికము

భావతరంగములు లేచి శరీరముపై కనిపించును. ఒకనికి భావోదయమగును. అతడు దానిని పంబాళించు కొనలేక తన కరచరణాదులను కదలించును. అతని కన్యుల విషయమై ఆలోచనయే లేదు. ఆత్మసంతృప్తికై అతడు గంతులు వేయును. ఇది నృత్తము. ఈ కళ ఆత్మాశ్రమము. బిడ్డ యాదృచ్ఛికముగా గంతులు వేయుట నృత్తమున కుదాహరణముగా చెప్పవచ్చును.

నృత్యము యాదృచ్ఛికముగా నుండు భావ ప్రదర్శనము. అన్యులకు భావస్ఫోరకముగా నుండునని గ్రహించినప్పుడు అయ్యది క్రమబద్ధము కావలసి వచ్చును. తన యానందము అన్యులకు నిరూపింప దలచినపుడు నటుడు చేయు ప్రదర్శనము నృత్యమగును. ఇందు సాధారణీకరణమను గుణము గలదు. భావప్రదర్శనమునకు నటుడు సంగీత మపేక్షించును. నటునకు కలిగిన భావమును నృత్యమువలన సామాజికులు గ్రహింతురు. సామాజికుల కాభావము కలుగ నక్కరలేదు. కావున నీ కళ భావాశ్రయమై కొలదిగా విశ్వజనీనత్వము గాంచును.

నాట్యమున నటుడు భావావేశము చెంది, అభినయమున దానిని వ్యక్తీకరించునప్పుడు సామాజికులుకూడా తన్మయత్వము నొందుదురు. ఒకానొక నర్తకి రాజసన్నిధానమున నాట్యముచేయుచు ప్రభుచిత్తమున ననురాగమంకురింప జేయదలచి నాట్యము చేయునప్పుడు రాజుచిత్తము భావోద్రిక్తమగును. ఇయ్యది నాట్యము. ఆత్మాశ్రయత్వమిందు స్వల్పముగను, అన్యాశ్రమత్వమందు విశేషముగను గోచరించును. మాళవికాగ్నిమిత్రములోని చరిత మిట్టిది. నాట్య సర్వస్వ దీపికలోని వివిధ నాట్యములు ఈ జాతిలోనివి.

ఇంతియే గాక వేరొక కళకూడ కలదు. సీతారాముల వియోగము నొకానొక నటుడు వ్యక్తీకరింప దలచినచో సామాజికుల ఎదుట నేర్పుతో ప్రదర్శనము చేయును. సామాజికులు నటుని భావమునే పొందుదురు. దీనికై నటుడు నాట్యమునేగాక ఆహార్యమును గూడ నవలంబించును. అప్పుడు రూపము నాట్యముతో కలసినది. అదివరలో విడిగానుండెడి కళ నాట్యముతో కలసి రూపము, క్రమముగా రూపకము అనుపేర్లు పొందినది. రూపకము రమారమి వెయ్యి సంవత్సరముల క్రిందట నిర్ణీతమైనది.

అంతకు పూర్వము నాటకమునకు నాట్య, రూపశబ్దములతో వ్యవహార ముండెడిది. కాలక్రమమున రూపకము జాతివాచకమై నాటకము, నాటకభేదమైనది. "అవస్థానుకృతిర్నాట్యం రూపం దృశ్యతయోచ్యతే రూపకం తత్సమారోపాత్" అను దశరూపకములోని లక్షణమును తరువాత లాక్షణికులు అవలంబించినారు.

సంగీత, కావ్య, ప్రేక్ష సమాజాది శబ్దములు ఈకళను మొత్తముమీద సూచించిననూ ఇందలిప్రత్యేకాంగములనే నిర్ధారించినవి. సంగీతమున గానము హెచ్చుగా నుండును. కావ్యమున పద్యగీతికలు మెండు. ప్రేక్షలో దర్శనీయ విషయములు మెండు.

నృత్యము, నృత్తము, నాట్యము అనెడి మూడు పదములు సాధారణముగా సమానార్థకములుగనే వాడబడుచుండును. అదిపొరపాటు. ఈమూడును పర్యాయ పదములుగావు. అవి నిరూపించెడి యర్థము లందు సామ్యముకంటె భేదభావమే ఎక్కువగా కలదు. వీనిలో నృత్తము తక్కిన రెండింటికంటె ముందు పుట్టినది. తరువాత నృత్య నాట్యములు వెలసినవి.

శరీరావయవ విక్షేపములను లయాన్వితముచేయ నెంచిన పూర్వకాలపు మనుష్యుడు మొట్టమొదట

సృష్టించుకున్న కళ నృత్తము. తాళమునకు అనుగుణముగా లయశుద్ధి యొప్పునట్లు అతడుచూపిన పాదన్యాసమే నృత్తమునకు ప్రారంభదశ. క్రమముగా దానిని అన్ని తాళములకు, అన్ని కాలములకు అనురూపముగా పెంపుచేయవలెనని యాతడు యత్నించెను. ఎంతయత్నించిననూ, పాదన్యాసము, తాళమును తుదముట్ట అనుగమింపజాలదు. హస్త నాడులకు గల లాఘవము పాదనాడులకు ఉండదు. గనుక హస్తముతో వేయు తాళగతులనన్నిటిని పాదముతో చేయునృత్త గతులన్నియు ననుసరించలేవు. గనుక నృత్యవిద్య తాళముతో కొంత దూరమే నడచినది. నృత్తము చేయునప్పుడు పూర్వాపర కాయముల సమత కుదురుటకై వేరొక దశలో పాదవిక్షేపమునకు హస్తవిక్షేపము తోడైనది. ప్రారంభ దశలోగాని ఈ దశలోగాని నృత్తమునకు శబ్దముతోడి సంబంధమించుకయును లేదు. అనగా నృత్తము చేయునప్పుడు తాళము మాత్ర మపేక్షింపబడునుగాని గీతమపేక్షింప బడదు.

ఈగాత్ర విక్షేపవిద్య తాళలయాన్వితముగా నుండుటయేగాక శబ్దార్థ సూచకముగా వుండవలెననెడి యాశతో మానవుడు కల్పించిన ప్రక్రియాంతరము నృత్యము. నోటితో గీతమును బాడుచు యందలి భావమును చేతితో ప్రదర్శించుట దాని ప్రధానాంశము. ఆ పాడెడిగీతము తాళబద్ధముగానుండును గనుక తాళమునకు తగినట్లు కాలితో నృత్యముచేయుట దానికొక యంగము. కావుననే నృత్యమునందు అర్థసూచకమైన హస్తన్యాసమేగాక ఒక్కొక్క యెడ తాళాశ్రయమైన నృత్తముకూడా ప్రకటితమగుచుండును. కృష్ణలీలా తరంగనృత్యమును చూచినప్పుడు మనకిది తార్కాణమగును. నృత్యము నృత్తముకంటె గుణాధికమై శాస్త్ర నిబద్ధమైనది. అందుచేతనే దానిని 'మార్గ' యనియు నృత్తమును "దేశి" యనియు ఆలంకారికులు పేర్కొనిరి.

గీతి వాడకమే యర్థవంతముగా నృత్యము నల్లుట, తరువాత గలిగిన పెంపులలో విశేషము. భారతీయ నృత్యమును విజయవంతముగా నేడు ఖండ ఖండాంతరముల ప్రదర్శించుచున్న ఉదయశంకరుని నృత్యమే ఈ వాక్యమువకు దృష్టాంతము.

మిశ్రకళలోని యంగకళకు ఎంత సామరస్యమున్నదో యంత స్పర్ధయున్నది. సంగీతమునకు శబ్దసహచర్యము లేకున్నను లోటులేదని చూపుటకే జంత్రగానము పుట్టినది. అట్లే కవి వాక్యము లేకున్నను నాట్యము నిలువగలదని చూపుటకే కథాకళివంటి మూకాభినయము యత్నించినది. మరికొంతకాలమునకు, నృత్యమున శబ్దార్థమునేగాక భావాశ్రయమైన వాక్యార్థమును సయితము ప్రదర్శింప వలెనని మానవు డింకొక సంస్కారమును జేసెను. తత్ఫలితముగా గాత్ర విక్షేప విద్య కొంత అవస్థానుకృతియై అభినయమను పేరుదాల్చినది. క్షేత్రపదములు, జావళీలు మున్నగునవి ప్రదర్శితము లగునప్పుడు దాని స్వరూపమును ప్రత్యక్షముగా చూడగలము.

ఈ అభినయమునకు మీదిమెట్టు నాట్యము. రెండిటికినిగల సన్నిహితత్వమును బట్టియే, అభినయశబ్దము నాట్యపరముగా సహితముపయోగింపబడినది. వ్యస్తములైన పదములను, జావళీలను మాత్రమేగాక నిబద్ధకావ్యములైన నాటకములను గూడ ప్రదర్శించుటవలన అభినయము నాట్యమైనది. కాగా పదముల యభినయము భావగీతమువంటిది. ప్రబంధము వంటిది నాట్యము.

కూచిపూడివారి నాటకప్రదర్శనమున (నవనాగరికులు సహించని చిందులుత్రొక్కుట, చేతులు త్రిప్పుట) నాట్యవిద్యాపరిణితిలోని ఈభిన్న భిన్నదశలను చూపుటకును నృత్త, నృత్య, నాట్య మిశ్రీకరణము వలన ప్రదర్శనకు లభించు సమగ్ర కళాసిద్ధిని చూపుటకును ఉద్దేశింపబడినవి. కావున యక్షగాన నాట్యము నృత్త నృత్యప్రాణితత్వమని గ్రహింపవలెను.

పూర్వకాలమున సంస్కృత నాటక ప్రదర్శనములందు నృత్త, నృత్యములకు యథాభావరసస్థానమొసగబడినది. ఇప్పటిమార్గ నాటక ప్రదర్శనమునందు కొంచెము నృత్యము (పదార్థాభినయం) మాత్రము నిల్చినది. తక్కినదంతయు నాట్యమే.

ఇట్టి దశా పరిణామము నాట్యకళకేగాక తక్కిన చిత్రకళలకునూ సహజమైయుండినట్లే కన్పట్టుచున్నది. మొదట త్రిస్వరాత్మకముగానే యున్నగానము తుదకు సప్త స్వరాత్మకమగుట యిట్టిదే.

ఆనంద రసాత్మకమై, బహుజనమనోరంజకమై ఈ నాట్య విద్య ప్రపంచములో అలరారుచున్నది.

నాటిక:

# "ఆపదలో అబల"

[గతసంచిక తరువాయి]

## శ్రీ రంగధామ్

### రెండో రంగం

(తెర లేవగానే కమలా, నరసింహంగారు స్టేజి మీద వుంటారు. సమయం—మరునాటి ప్రొద్దున్న)

కమల—తెల్లవార్లూ వీళ్ల భజన కాలక్షేపంతో చెవులు చిల్లులు పడిపోయాయి. ఇలా నాల్రోజులు గనక సాగితే నిజంగా మనం ఎక్కడికైనా వెళ్లిపోవలసి వస్తుంది. అక్కయ్యకి పురుడు రాకపోవడంవల్ల అమ్మ అక్కడ వుండిపోవడంతో మనకి సలహా చెప్పేవాళ్లే లేకుండా అయిపోయింది.

నర—(కళ్లజోడులోంచి చూస్తూ) ఇదుగో, వెంటనే మీ అమ్మకు ఉత్తరం రాస్తున్నాను. అదివచ్చి వీళ్లభజనలేమిటో, అల్లరేమిటోతేలుస్తుంది. క్రిందటిసారి ఆ ప్లీడరుగారు వెనక వాటా ఎప్పటికీ ఖాళీ చెయ్యకపోతే తను పూనుకుని మూడు నిముషాల్లో ఖాళీ చేయించింది.

కమల—ఎలాటి వాళ్లైనాసరే అమ్మదగ్గర ఎంతో భయభక్తులతో వుంటారు.

నర—అప్పుడప్పుడు నేను అనుకుంటూంటాను. నీకూ మీ అమ్మపోలిక వచ్చిందని. నీక్కూడా కోపం పాలు ఎక్కువ. నిన్నరాత్రి అతన్ని చాలా మాట లనేశావ్.

కమల—లేకపోతే ఈ కాలేజీ కుర్రాళ్లకి కాస్తసిగ్గు వడి మర్యాదగా తప్పుకుంటే పూర్తిగా లోకువ కట్టేసి ఏడిపించడం మొదలెడతారు.

(సుబ్బారావు చేతిలో సంచితో ప్రవేశిస్తాడు).

సుబ్బారావు—హల్లో మామయ్యా!

నర—ఓహో ఎప్పుడొచ్చావురా?

సుబ్బా—ఇదేరావడం. హల్లో కమలా! కులాసాయేనా?

కమల—ఓహో! బావగారికి ఇన్నాళ్లకి మేము జ్ఞాపక మొచ్చాం కాబోలు.

సుబ్బా—అబ్బే. ఎప్పుడూ జ్ఞాపకంలోనే వుంటున్నారు. కానీ తీరిక లేక ఇన్నాళ్లూ రాలేకపోయాను.

నర—నువ్వు కాకినాడలో ఇంజినీరుగా పనిచేస్తున్నావు కదూ!

సుబ్బా—అవును మామయ్యా. మొన్ననే 'కోర్సు' పూర్తిచేసి ఉద్యోగంలో చేరాను.

కమల—ఇప్పుడే వస్తా (అని లోపలికి వెడుతుంది).

నర—నిన్ను చూసి అయిదారేళ్లయిందిరా. మీ అమ్మా నాన్నా అంతా కులాసాయేనా?

సుబ్బా—అంతా కులాసాయే. అత్తయ్యేదీ?

నర—మా పెద్దమ్మాయిదగ్గరికి వెళ్లింది.

సుబ్బా—కమల చాలా పొడుగైంది కదు మామయ్యా! కాలేజీలో చదువుతోందా?

నర—లేదురా. పి. యూ. సీ. చదివి మానేసింది. ఇక్కడే డి. ఇ. వో. ఆఫీసులో టైపిస్టుగా పనిచేస్తోంది.

(కమల కప్పుతో కాఫీ తెచ్చి సుబ్బారావు కిస్తుంది.)

# రచయిత
# అతని సమస్యలు - 3

శ్రీ యుజ్నే ఐనెస్కో

సులభమైనవైనా, క్లిష్టమైనవైనా, సూక్ష్మమైనవైనా, స్థూలమైనవైనా మన ప్రశ్నలన్నీ ఉపక్రమణకు, అంతః ప్రేరణకు చెందినవి. వీటిని శీఘ్రంగానే వెనక్కునెట్టి వదిలి వేస్తాము. మన అన్వేషణ, పరిశోధనా యాత్రలు ప్రారంభించడానికి అవి దోహద మిస్తాయి. కాని మనకు ఏమి కనపడుతుందో మనకు తెలియదు. ఉపదేశాలు చేయాలనే రచయితలు తమ పథకం ముందే వేసుకొని వుంటారు. అందుకని వారు కొత్తగా తెలుసుకొనేది కాని, కనుక్కునేది కాని వుండదు. వారి అన్వేషణ నిజంగా అనవసరం. ఎందుకంటే ఇతరుల అన్వేషణా ఫలితాలను ఏకరువు పెడతారు. అదివరకు ఒకరు తయారుచేసి పెట్టినదానిని, అందరూ ఎరిగిన దానినే వారు చెబుతారు. అలాంటి రచయితలు సాహిత్యానికి కొత్తగా ఇవ్వ గలిగినదేమీ లేదు. వారు కాలం తీరిన వారు. వారు మనకు చెప్పడానికి వారి దగ్గర సరుకేమీ లేదు. సాధారణంగా ముందు ప్రశ్నలు వస్తాయి. సమాధానాలు తర్వాత వస్తాయి. ఉపదేశ పద్ధతి నవలంబించే రచయిత, రాజకీయాలను గురించి వ్రాసే రచయిత ప్రశ్నలు తెలపకుండానే సమాధానాలు ఇస్తారు. అయితే ఈ పద్ధతిలో సజీవమైన సమాధానాలు రావు. ప్రశ్నలు వేయటంతో సమాధానాలు రావచ్చు: రాక పోవచ్చు: కాని సాహిత్యంలో సమాధానం ఇవ్వటం, ఇవ్వలేకపోవటం అనేది ప్రధానం కాదు. ప్రశ్నలు వేసి, వాటికి సమాధానాలు ఇచ్చేవారు, ఇవ్వలేనివారు, ఉభయులు కూడా సమానమైన ప్రముఖ స్థాన మాక్రమిస్తారు. ఎందుకనంటే ఒక రచన సజీవమైన వ్యక్తి వంటిది. ప్రపంచం వంటిది. అలా సజీవంగా వుండటమే ముఖ్యం. ఈ విషయాన్ని గురించి తర్వాత చెబుతాను. ఏది ఎలా వున్నా రచనలో వుండే శాంతి-ఆందోళన; నిశ్చితా-అనిశ్చితాలు ఆ రచనను సజీవంగాను, ఉర్రూతలూగించేది గాను చేయటానికి సామాగ్రి అవుతాయి. అవి శరీరానికి అవయవాల లాంటివి. దానికి ఈ లక్షణాలే విలువనిస్తాయి. ఆ రచనకు యధార్థ్యాన్ని ఇస్తాయి. రచన అనేది, ఉదాహరణకు ఒక నాటకం ప్రశ్నలు-సమాధానాలతో కూడిన సంపుటి కాదు. నిజంగా కళాత్మకమైన రచనలో అది వేసే ప్రశ్నలకు సమాధానాలు

దానిలో వుండనే వుంటాయి. ఒక చిత్రంలో ఒక రంగుకి పక్కనవున్న రంగు అర్థమూ, రూపమూ ఇచ్చినట్టు, సంగీతంలో ఒకస్వరం తర్వాత ఇంకొకస్వరం వచ్చినప్పుడు రాగమైనట్టు, రచన కూడా తనకు తానే సమాధానాలు ఇస్తుంది: నాటకంలో ప్రశ్నలు-సమాధానాలు ఆటలో ఆటాడే వారి వంటివి. నిజంగా నాటకమనేది ఒక దానితో ఆట ఆడుతూ వుంటుంది. ఆ నాటకంలో వుండే ప్రశ్నల స్వరూపాన్నిబట్టి, ఆ ప్రశ్నల లోని సత్యాన్నిబట్టి ఆ రచన ప్రాధాన్యత వుంటుంది.

కాబట్టి సాహిత్యరచనలు చేయడానికి కావలసిన స్వల్పవిషయం ఒకే ఒకటి—— అది చిత్తశుద్ధి. చిత్తశుద్ధితో కూడిన వాణి బాగా వినపడుతుంది. అంటే చిత్తశుద్ధి కంఠస్వరం పెద్దది. మీ స్వరం వినపడవచ్చు. అంతమాత్రంచేత దానిని వింటారని లేదు. మొదట్లో దానికి ప్రతికూలత వుండవచ్చు. మీరు భావించింది, అనుభవించింది, అంటే మీరు యథార్థమైనది చెప్పినప్పుడు జనం మిమ్ములను నమ్మడానికి ఇష్టపడరు. ఒక్కొక్కప్పుడు సత్యం అతిసాధారణ విషయంగానూ, వట్టిదిగానూ కనపడవచ్చు: అసలు అర్థం మామూలుగా గోచరించదు. చూడనివ్వదు. జనం దానిని అప్పుడే చూడరు. తరువాత చూస్తారు. నిర్దుష్టమైన సత్యముతో కూడిన యథార్థవిషయము మామూలుకు భిన్నంగా వుంటుంది. అది అసాధారణము. అబద్ధము బజారులో కనబడుతుంది. మిమ్మల్ని అబద్ధాలకోరు అంటే మీరు చిత్తశుద్ధి కలవారని అనాలి. మీరు నిజాయితీపరులైతే, మిమ్ములను దొంగ అంటారు. మీ కేక సాముదాయక దృక్పదానికి ఒక గండి కొడుతుంది. నిన్న నిజమన్నది, కొత్తగా కనిపెట్టామన్నది, నేడు త్రోసివేయబడినా, సాంఘిక-మానసిక ధోరణులు కరుడు గట్టిపోయి, నిర్వీర్యము, నిరుపయోగము అయినవాటికి అంటిపెట్టుకొనడం పరిపాటి అయిపోయింది. ప్రతి దానిని ఎందుకొచ్చిన గొడవని ఆమోదించడం అలవాటు అయిపోయింది. ఇది ముఖ్యంగా విప్లవసందర్భాలలో వ్యక్తమౌతుంది.

తత్వజ్ఞుడు, శాస్త్రజ్ఞుడు తాను తెలుసుకున్న సత్యాలను, తన్ను గూర్చిన వాస్తవాలను తెలుసుకొని ప్రతిపాదించినట్లే, చిత్రకారుడు రచయిత కూడా తన పరిశోధన వల్ల, చిత్తశుద్ధివల్ల తనకు తెలిసినవి, గోచరించినవి ప్రతిపాదిస్తాడు. దీనికి ప్రాముఖ్యము వుండవచ్చు. లేకపోవచ్చు. అయితే ఎలాటిదైనా అది అనుకోకుండా వస్తుంది. ఇరుకున పెడుతుంది. అందుకని మొదట దానిని తిరస్కరించాలని అనుకుంటారు దానిని తెలుసుకోవడం అనవసర శ్రమ అని, తెలిసిన దానితో తృప్తిపడాలని అనుకుంటారు. ఏదీ తప్పనిసరిగా అవసరమని అనుకోరు. అయినప్పటికి ఆ కొత్తగా వచ్చినది వెనక్కుపోకుండా తిష్ట వేస్తుంది. చివరికి అది చెప్పే దానికి జనం చెవి ఇస్తారు. మీరు చెప్పే దానిలో ఏమి వున్నదో అని చూస్తారు. మొట్టమొదట పెదిమ విరిచి, హేళన చేసి, తర్వాత మీపట్ల శ్రద్ధ చూపిస్తారు. మీరేమి చెబుతారో అని చూస్తారు. తర్వాత అబద్ధమన్నది నిజము అవుతుంది. యథార్థాన్ని మరో దృష్ట్యా రచయిత చిత్రిస్తున్నాడని గ్రహిస్తారు: చిత్రకారుడు కూడా తనేదో కనిపెడుతున్నానని, అనుకుంటాడు. కాని

నిజానికి అతను కనుక్కొంటున్నాడు. కనిపెట్టడం—కనుక్కొనడం ఒకే మోస్తరువి: తనలోను, తనద్వారాను ఆవిర్భవించినవని రచయిత అనుకొన్నవి, తమకు కనిపించిన వాస్తవవిషయాలుగా జనానికి కనపడతాయి. అంతటితో వాటిని కాదన లేరు. అవి ముందే తెలుసునని అనుకుంటారు. చాలా ప్రాథమికమైన, సులభమైన సత్యాలుగా కనబడతాయి. వింతగా వున్నది సామాన్యంగా కనపడుతుంది. అస్పష్టమైనది విస్పష్టమౌతుంది. అసాధ్యమనేది లేదనిపిస్తుంది. రచయిత కనిపెట్టడం మూలాన కనుక్కోవడం జరిగిందనేది చెల్లదనడానికి వీల్లేదు: అది జనం మనస్సుల్లో జీర్ణించి పోయింది. కొత్తగా కనపడేది మరుగుపడిపోయిన పాతదే, కొత్త వెలుగులో కనపడుతున్నదని అంటారు: కనపడకుండావున్న ప్రపంచం తిరిగి కనపడినదంటారు.

ఆ తర్వాత అది బజారుసరుకల్లే కనపడేటంత మామూలై పోతుంది: రచయిత ప్రత్యేకంగా సాధించినదానిని గురించి, దానిని వివరిస్తూను కొల్లకొల్లలుగా వ్యాసాలు వ్యాఖ్యానాలు వస్తాయి. ఆయన వ్రాసిన దానిని పరిశీలించి తిరస్కరించడం జరుగుతుంది. ఆయన చెప్పవలసింది చివరదాకా చెప్పలేదని ఒకరు అంటారు. అలా నడిపించవలసిందని, లేకపోతే, ఇలా నడిపించవలసిందని ఒక విమర్శకుడు అంటాడు. ఆయా విమర్శకులు దానికిచ్చే అర్థాన్ని బట్టి ఇలా అనడం జరుగుతుంది.

నేను వ్రాసిన దానికంటె, నా మీద వ్రాసినది ఎక్కువ. నా ధారణాశక్తి పటుత్వమైనదైతే నన్ను గురించి వ్రాసిన పుస్తకాలను ఆధారం చేసుకొని డాక్టరేట్‌కు కావలసినంత గ్రంథాన్ని తయారు చేయగలను. అంతకంటే విశేషం ఆ వ్యాఖ్యాతల సాంఘిక-మానసిక తత్వాలపైన కూడా ఒక గ్రంథాన్ని తయారు చేయగలను. అంటే ఒక విధంగా ఒకరి రచన స్వరూపాన్ని మార్చివేయటం జరుగుతుంది. అసలు అసలు రచనే కాకుండా పోతుంది. [ఆ పుస్తకం ఆ పుస్తకంగానే వుంటే ఎలా వుంటుంది?] అది ఇతరులు అన్నట్టుగానే వుండి పోతుంది. దానిని విమర్శించే విమర్శకుని గురించి నాకు ఇదివరకే తెలిసి వుండినా, అతను ఏ పత్రికకు వ్రాస్తాడనేది తెలిసినా, అతనికి ఆ పుస్తకం అంటే వ్యక్తిగతంగా ఇష్టమైనా-అయిష్టమైనా, అతను వ్రాయబోయేది నాకు ముందే తెలుస్తుంది. అదే విధంగా, నా రచనను గురించి విమర్శకుని వ్యాఖ్యానంలో కొంత చదివినా, అతని రాజకీయదృక్పథం ఏమిటో తెలిసి పోతుంది. అతని నైతిక మానసిక స్వరూపాన్ని నేను తేలికగా చిత్రించగలను. నా రచన కొత్తదైనా, అది కొత్తదనే దృష్టితో దానిని పరిశీలించరు. పరిశీలించే పద్ధతి అదివరకే నిర్ణయమై పోయివుంటుంది. దానిని భేదించడానికి, భేదించగలిగినంత కొత్తగా బహుశా ఈ రచన లేకపోవచ్చు. అదివరకు అమలులో వున్న పద్ధతులను భేదించగలిగేటంత నవ్యత దానిలో లేకపోవచ్చు. లేకపోతే, కొంత కాలం అయిన తర్వాత ఆ రచన శక్తిని గుర్తించడం జరగవచ్చు.

తన రచనలు వెదజల్లిన ప్రభావాల్ని చూచి, రచయితే ఆశ్చర్యపోతాడు. కాబట్టి ఎంతో ఆనందంగా వుంటాడు. తనచిత్తశుద్ధి నిర్దుష్టమైనదేనా, తాను మోసం చేయలేదా

అని అనుకోవడం మూలాన ఆనందం పొందుతాడు: చిత్తశుద్ధికి, సత్యానికి నవ్యత అనేది చిహ్నమని నేను ఇదివరకే స్పష్టం చేశాను. నవ్యత నిజం. అనుచరణ కృత్రిమం: సాంప్రదాయం సంఘంచేసే కృత్రిమం: ఇతరులు నీకు నేర్పనిదే నిజమైనది. నిష్కలంకమైనది. చిలుకపలుకుకు చిత్తశుద్ధి లేదు. దాని పలుకు దానికి పట్టదు. అది దానికి అర్థంకాదు.

జ్ఞానాభివృద్ధికి నూతనభావం తప్పనిసరి. రచన సాగిస్తున్నప్పుడు తాను వ్రాసేది వ్రాయడానికి, తనకెంత అధికారమున్నదని, అదెంతవరకు సమంజసమని అనుకుంటూ వుంటాడు. ఇతరులు దానిని ధృవపరచడం కోసం వేచి వుంటాడు. అయితే జనులు రచయితపట్ల శ్రద్ధ చూపించినప్పుడు, వారు తన రచనను గురించి అనేది అనడానికి వారికి హక్కు వున్నదా అని కూడా అనుకుంటాడు. ఇతరులకు నీ ఆంతర్యం చెప్పుకొనడానికి వ్రాస్తావు: కాని అలా చెప్పుకున్నందుకు తరువాత నీమీద నీకే కోపంవస్తుంది. తను వ్రాసిన దానిని వారు అపార్థం చేసుకున్నారనడం కంటె, స్వలాభాపేక్షతో, తమ ఆశయ సిద్ధికి సాధన సామగ్రిగా ఉపయోగించుకొనడం కోసం, తమ నైతిక-రాజకీయ విశ్వాసాల సమర్థన కోసం చిత్రాలుగా ఉపయోగిస్తారని రచయిత అనుకోవచ్చు; నిష్కపటం అంటే నవ్యత అంటే పరిశుద్ధత—ఇవి ఒక రచనయొక్క విలువకు చిహ్నాలు. ఆవిధంగా ప్రగాఢమైన తన విషయపరిశీలనలో శిల్పి విషయంతో తాదాత్మ్యం పొందుతాడు. సనాతనుడు, నవీనుడు అవుతాడు. అంటే శాశ్వతస్థాయిని అందుకుంటాడు. ఎరిగినవాడు అవుతాడు. ఎరుగనివాడు అవుతాడు.

విమర్శ విలువ విషయంలో కూడా ఇదే నిజం. నేను అవలంబించే విమర్శా పద్ధతుల సామాన్యలక్షణాలను చూపనంతవరకు విమర్శ అనేది అంగీకారయోగ్యం. తన ప్రమాణాలను విస్మరించకుండా వాటిని నిరంతరం పరీక్షిస్తూ విమర్శకుడు, ఒక రచనను నిష్పాక్షికమైన, శుద్ధమైన దృష్టితో వ్యాఖ్యానించినట్లయితేనే, అది ఉత్తమమైనది అవుతుంది. రచయిత పూర్తిగా పాక్షికదృక్పథానికి ప్రతినిధి అయినప్పుడు, విమర్శకుడు పూర్తిగా నిష్పాక్షిక దృక్పథానికి ప్రతినిధిగా వుండ కూడదేమో నాకు తెలియదు. తిరస్కారభావంతో వుండే విమర్శకుడు చెడ్డవాడు. అతను తాను విమర్శించే రచయిత కంటే అధికుడనని అనుకుంటాడు. తన గొప్పతనాన్ని ప్రదర్శించాలని అనుకుంటాడు. విద్యార్థిపట్ల ఉపాధ్యాయుడు ప్రదర్శించే వైఖరిని కాక, విద్యార్థి వైఖరిని విమర్శకుడు ప్రదర్శించాలి.

# రచయిత
# తని సమస్యలు

## శ్రీ యుజ్నే ఐనెస్కో

"మీరెందుకు వ్రాస్తారు'' అని రచయితలను తరచు ప్రశ్నిస్తూవుంటారు. "అది మీకే తెలిసివుండాలి" అని రచయితలు సమాధాన మివ్వవచ్చు.

"మీరు మా రచనలను చదువుతారు. అలా చదువుతూవుంటే వాటిలో మీకు కావలసినది, మీకు అవసరమైనది, మీ మెదడకు మేతవేసినది వాటిలో మీకు దొరికివుండాలి. అందుకనే మీకు తెలిసివుండాలి అని అన్నది. వాటి అవసరం మీకేమిటి? మేము మీకు పెట్టే ప్రసాదం ఏమిటి? నేనొక రచయితను కావచ్చును. మరి మీరు చదువరి ఎందుకుకావాలి? మీరు నన్ను అడిగే ప్రశ్నకు సమాధానం మీలోనేవుంది." వినోదంకోసం వెడుతున్నానని, నాటకానికి వెళ్ళే అతను చెబుతాడు; ఏదోవిషయం తెలుసుకొనడానికని, పుస్తకం చదివేఅతను చెబుతాడు.

* ''ఎన్‌కౌంటర్'' సౌజన్యంతో.

మొత్తంమీదచూస్తే ఇవి రెండే మామూలుగా వచ్చే సమాధానాలు. విషయం తెలుసుకోవడం అంటే రచయిత ఏమివ్రాశాడో, అతని తత్వం ఏమిటో తెలుసుకొనడం. తనకు దొరకని సమాధానాలు దొరుకుతాయనే ఆశతో చదువుతున్నానని సాధుభావంగల పాఠకుడు అంటాడు. దైనందిన జీవితంలో వచ్చేకష్టాలను మరచి, తాను చదివే పుస్తకం, తాను చూచే నాటక సౌందర్యంలో ఆనందంతో మునిగిపోవాలనే పాఠకునికి రచయిత ఏదో ధర్మోపదేశం చేయబోతున్నాడనే భావం కలిగితే, విసిగిస్తున్నదని విసుక్కుంటాడు. పాఠకుని విషయాన్వేషణ ఆసక్తిని పరిహసించడం ద్వారా వినోదాన్ని ప్రసాదించాలని రచయిత ప్రయత్నిస్తే, తాను విడదీయలేని చిక్కులను ఏమీ విడదీయలేదని నిందిస్తాడు. ఎవరన్నా ఒకరు ఒక గీతాన్నికాని, ఒక పాటనుగాని, ఒక ప్రహసనాన్నికాని, ఒక నవలనుగాని, ఒక విషాద నాటకాన్నికాని

వ్రాస్తే సోషలిజం, కేపిటలిజం, మంచి — చెడూ, గణితశాస్త్రం, అంతరిక్షయానం, పరిమాణవాదం (క్వాంటమ్‌థీరీ), ప్రేమ, ఫుట్‌బాల్, పాకశాస్త్రం, రాజ్యాధిపతి వీరందరినీ గురించి రచయిత అభిప్రాయం ఏమిటని తెలుసుకొనడానికి పత్రికా రచయిత పరిగెత్తుతాడు.

ఎప్పుడో ఒకతడవ నేను నౌకనుంచి చెరొకచేత్తో పెట్టెలు పట్టుకుని దిగుతూవుండగా, దక్షిణ అమెరికా పత్రికా రచయిత ఒకతను వచ్చి, జీవితాన్ని గురించి, మరణాన్ని గురించి మీరేమనుకుంటున్నారు అని ప్రశ్నించాడు. అప్పుడు నేను పెట్టెలు రెండూ కిందపెట్టి, నుదుటిమీద చెమటను తుడుచుకుని, సమాధాన మివ్వడానికి ఒక ఇరవైఏళ్ళ వ్యవధి ఇవ్వమని అడిగాను. అప్పటికికూడా నేను సమాధానమిస్తాననే హామీ ఇవ్వలేనన్నాను. "ఇదే ప్రశ్న నాకు నేను వేసుకుంటాను. అలా వేసుకోడానికే రచన చేస్తూ వుంటాను" అని కూడా ఆయనకు చెప్పాను. ఆ సమాధానం ఆయనకు చాలా ఆశాభంగం కలిగించిందన్న భావంతో కింద వున్న నా చిన్న పెట్టెలు రెండూ పుచ్చుకున్నాను. ఈ విశ్వసౌధం తాళంచెవి ప్రతి ఒక్కని చొక్కా జేబులోను, చేతి పెట్టెలోనూ వుండదు. ఎవరన్నా రచయిత నీవు ఎందుకు చదువుతావు - నాటకాలు ఎందుకు చూస్తావు అని నన్ను అడిగితే, నాకు కావలసిన సమాధానాలకోసం కాక, ఇంకా ఎక్కువ ప్రశ్నలను తెలుసుకొనడానికి చదువుతాను, చూస్తాను అని సమాధాన మివ్వాల్సివుంటుంది. విషయసేకరణకు కాక, ఒక విషయంతోను, ఒక వ్యక్తితోను పరిచయం కోసం అని చెబుతాను. విజ్ఞానాభివృద్ధి పట్ల వుండే ఉత్సాహం అభ్యాసానికి ప్రోత్సహిస్తుంది. సైన్సు తృప్తిని ఇస్తుంది. నాటకానికి, చిత్రకళా ప్రదర్శనశాలకు, పుస్తకాల షాపులో సాహిత్యానికి సంబంధించిన పుస్తకాలు వుండేచోటుకు లాక్కుపోయే ఉత్సాహం స్వభావం వేరు నాకు ఇష్టమైనవారి, అయిష్టమైనవారి లక్షణాలను, అంతరంగాలను తెలుసుకోవాలనే వాంఛ నన్ను నడుపుతుంది.

తనకు వేసిన ప్రశ్నలవల్ల రచయిత కలతపడతాడు. ఎందుకనంటే ఇంకా అనేక ప్రశ్నలతోపాటు ఈ ప్రశ్నను తనూ వేసుకుంటూవుంటాడు. అంతేగాకుండా తనువేసుకోవాల్సిన ప్రశ్నలు ఇంకా చాలా వున్నాయని, అవి వేసుకోలేనని అతని అనుమానం. వాటికి సమాధాన మివ్వడమనేది ఇక సరే సరి. ప్రతిఒక్కరూ, రచయిత అయినవాడు కూడా, తాను ఏకాంతంగా వున్నప్పుడూ, జర్నలిస్టులు, రిక్రూటింగ్ సార్జెంటులు దూరంగా వున్నప్పుడు తప్ప, స్వేచ్ఛగా ఊపిరి తీసుకుంటూ వుంటాడు. తానెందుకు ఊపిరి తీసుకుంటున్నాను అని ఒక్కొక్కప్పుడు తనకు తానే ప్రశ్నించుకుంటాడు. ఒక్కొక్కప్పుడు ప్రశ్నించుకోడు ఇలా

ప్రశ్నించుకున్నా, ప్రశ్నించుకోనకపోయినా ఊపిరి తీసుకోనడంమట్టుకు మానడు; అతను ఊపిరి తీసుకోవాలి. ర చ యి త కాబట్టి వ్రాస్తూవుంటాడు. తను వ్రాయడం ఆరంభించిన తర్వాతనే, తన రచనకు కారణం, ప్రయోజనం ఏమిటని ఆలోచనకు దిగుతాడు. వడ్రంగి ఒక బీరువా తయారుచేసేటప్పుడు దాని భాగాలను చేరుస్తూ, దాని ఆకారాన్ని గురించి ఆలోచిస్తూ వున్నప్పుడు కూడా తన వ్యక్తిగత సమస్యలను గురించి ఆందోళనపడుతూ వుంటాడు. కాని వ్యక్తిగతమైన బాధలు మూలాన బీరువా నే చేయడాన్ని ఆపివేయడు. నేనెందుకు వ్రాస్తున్నాను? దేనికి దేనికి సంబంధం? ఇతరులకంటె నేను ఎక్కువగా చెప్పగలిగినది ఏదైనా వుందా? నా ఉనికిని సమర్థించుకొనడానికి ఇది ఆధారమా? చావు అంటే భయపడి, ఆ తర్వాతకూడా ప్రజల మనస్సులలో మని వుండడానికా? ప్రపంచాన్ని రక్షించడానికా? నన్ను రక్షించుకొనడానికా? భగవంతుని స్తోత్రించడానికా? వి శ్వ రూ పా న్ని ప్రశంసించడానికా? నా భావాలను విస్పష్టం చేసుకోనడానికా? పరిశీలించడానికా? ఆకళింపు చేసుకొనడానికా? వివరించుకొనడానికా? నన్ను నేను అర్థం చేసుకోలేక ఇతరులని ప్రాధేయపడడమా? వంటరితనాన్నుంచి బయటపడి ఇతరులకు నా మనోభావాలను వెల్లడించి సంబంధ బాంధవ్యాలను ఏర్పరచుకోడానికా? నేను పేర్కొన్న ఈ కారణాలన్నీ వట్టివేనా? అసలు ఇవేవీ కాక అంతర్గతంగా నాలో వున్న కొన్ని ఏవో శక్తులు అకారణంగా కొన్ని పనులు చేయడానికి నన్ను ముందుకు నెట్టుతున్నవా? పైకి కనపడే ఈ చర్యలు అంతర్గతంగా వున్న కారణాలను కప్పిపుచ్చడానికా? ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకొనడానికా? మహా అయోమయంగా వున్న ఈ ప్రపంచాన్ని ఒక క్రమపద్ధతిని నా తృప్తికోసం తీసుకురావడానికా? రచన, చిత్రకళ అనే కృషి ఒక ఉద్యమం యొక్క భావములో భాగముకదా? సృష్టించడం అనేది మానవుడికి అన్ని అవస్థలలోను ఊపిరి తీసేటంత స్వాభావికమైన లక్షణమా? ఒక నాటకమా లేక ఆటా? అయితే వీటి అర్థం ఏమిటి ?

తాను చేసేది ఏమిటో రచయితకైనా పూర్తిగా తెలుసా ? అతను మోసపోతున్నాడని నా అభిప్రాయం. అతను కొన్నిటిని గురించి గట్టిగా అనుకోవచ్చు. ఒకవిషయాన్ని నిరూపించడానికి నిశ్చయించుకొని వుండవచ్చు. ఆ నిరూపణ అనేదే ప్రధానమైనదని అనుకోవచ్చు; అయితే తాను కల్పించిన కథ తాను నిరూపించ దలచినదానికన్న ప్రధాన స్థాన మాక్రమించినట్లుగా పరిణమించిందని తనుగాని, ఇంకొకరుగాని అనుకొనడం జరగవచ్చు. తాను నిరూపించ దలచిన విషయం ఆకర్షించకపోవచ్చు. అంతకంటె దాని నిరూపణకు చేసిన రచనాక్రమము ఆకర్షణీయము కావచ్చు. గృహ నిర్మాత వాస్తుశాస్త్ర సూత్రాలను ప్రస్ఫుటించేటట్లు నిర్మించినట్లుగానే, సాహిత్యసూత్రాలను, నాటకసూత్రా

లను ప్రస్ఫుటింప జేయడానికి రచయిత ఒక సాహిత్య సౌధాన్ని నిర్మించ యత్నిస్తాడు. మనుష్యులు వెళ్లడం మానివేయడంవల్ల చర్చి (క్రైస్థవ దేవాలయం) పూజాస్థలం కాకుండాపోయి, ఆసుపత్రి కావచ్చు. పోలీసుస్టేషను కావచ్చు. లేక ఖాళీగావుండ వచ్చు. కాని అదిమాత్రం వాస్తుశిల్పాన్ని తెలియజేసే ఒక కట్టడంగా వుండనేవుంటుంది. చర్చిగామాత్రం వుండదు. ఒక నాటకంగాని, ఒక పద్యకావ్యంగాని, రాజకీయప్రచారానికి సాధనగా ఉపయోగించినట్లు ఈ కట్టడాన్ని కూడా చర్చిగా ఉపయోగించి వుండవచ్చు. దానిపైన అధికారం కలవారు తమ ఇష్టం వచ్చినపనికి ఉపయోగించవచ్చు. కళకళలాడే కళకు నిదర్శనంగావున్న ఆ కట్టడాన్ని లేదు అనడానికి వీలు లేదు. ఒక పుస్తకంలో అనేక సమస్యల చర్చలు, ఉద్యేశ్యాలు, అనేక రకాల వ్యూహాలు, సంఘాన్ని గురించిన, మానవజాతిని గురించిన విమర్శలు ఉబుకుతూ వుంటాయి. తనను గురించి తాను వ్రాయడం లేదని రచయిత అనుకోవచ్చు. అయినా అందులో తానే దర్శనమిస్తాడు. తనకు తెలియకుండా తాను వెలిగక్కే విషయాల మీదనే ఆ రచన ప్రాధాన్యత వుంటుంది. వీటికి విరుద్ధం వేరేవ్యాఖ్యానాలు ఇచ్చి, అవి అబద్దాలనడం జరుగుతుంది. వాటిని రచయితకు ప్రతికూలంగా ప్రయోగించవచ్చు. కాని అది వేరేవిషయం.

ఈ ప్రశ్నలన్నీ ఇదివరకు తయారైనవే. వాటికి వేదాంతులు, తత్వజ్ఞులు, మానసిక శాస్త్రవేత్తలు, సాంఘికశాస్త్రజ్ఞులు సమాధాన మివ్వడానికి కృషిచేశారు. వేలకొలది పుస్తకాలలో చర్చించారు.

నే చెప్పిన కారణాలన్నీ నిజము—అబద్ధము. మనం అన్నీ ఒప్పుకుంటే నిజం. ఒకటిగాని, కొన్నిగాని ఒప్పుకుంటే అబద్ధం. వీటిలో ఒకటో అంతకుమించో కారణాలు తీసుకొని, ఒకసిద్ధాంతరీత్యా, వేదాంత [illegible]్య, వాటిని సమర్థిస్తూ వాదించవచ్చు. అదేమంత కష్టమైన పనికాదు. నాకు నేనై ఈ సమస్యతో వ్యవహరించడంలోగల చిక్కు నాకు తెలుసు. నేను చెప్పేది ఇదివరకు చెప్పినదే. నేను చూపెట్టబోయే సాక్ష్యంలో కొత్తదిఏమీ వుండకపోవచ్చు. అందుకని మనం ఇంకా ఇరుకున పడతాము. వ్రాయడానికి నన్ను అనేకం వత్తిడిచేస్తాయి. అలా వత్తిడిచేసేవి పరస్పరానుబంధమైనవి. విరుద్ధమైనవి; అధికారవాంఛ, హేయభావం, ప్రేమ, ఆవేదన, తపన, భయం, ఆత్మవిశ్వాసం, ఆత్మవిశ్వాసం లేకపోవడం; నాదిన్యాయము అనేదృఢనమ్మకం వుండడం, ఆ నమ్మకం లేకపోవడం; తీవ్రమైన జ్ఞానపిపాస, ఉపదేశం పొందడానికి, ఉపదేశించడానికి తీవ్రమైన ఆరాటం, కులాసా, వినయం, విముక్తి భావం మొదలైనవే అవి. వ్రాయడమనేది నాకు నిజంగా కులాసాయిస్తే అది ఎంతో కష్టంగాను, ఎంతో ఆయాసంగాను ఎందుకువుండాలి. ఇవన్నీ సాహిత్యగ్రంథాలన్నింటిలోను కనబడతాయి ఆ గ్రంథకర్తలు వాటినిగురించి మాట్లాడేటప్పటికన్న వ్రాతలో బాగాచెప్పగలుగుతారు.

బహుశా వ్రాయడం మానివేస్తే మంచిదేమో. మానేస్తే మరొక సమస్య తయారు అవుతుంది. చేయడమా—చేయకపోవడమా; చావడమా బ్రతకడమా; పని చేయడమా చేయకపోవడమా? ఎందు

## రచయిత - అతని సమస్యలు

కంటే వ్రాయడం కూడా ఒకవిధంగా పని చేయడమే అని మన అందరికీ తెలుసు.

ఇది నా ఒక్కడి కంఠస్వరమేనా? నేను కనిపెట్టదలచిందీ, కనిపెడుతున్నాననుకునేది, కనిపెట్టాననుకొనేది, నా స్వంతమేనా? జనానికి నేనుగాని నా రచనలుగాని అవసరమా? అసలు జనానికి ఒకరు అవసరమా? ఒకరు కావాలంటే నేను వెడుతున్నానా? లేకపోతే నేనే జనంమీద విరుచుకు పడుతున్నానా? రెండవదే అయితే అలాచేయడానికి నాకేమి హక్కు వుంది? ఎవ్వరైనా అదేచేయవచ్చు రచయితను వ్యాఖ్యానించి, ఒక నిర్ణయానికి వచ్చి, అతనిని అంగీకరించడం తిరస్కరించడం జరుగుతుందనేది కనబడుతున్నది. పాట కచ్చేరీ జరుగుతున్నంతసేపు ఆ కచ్చేరీలోని కళాకారుని చూచినట్లే రచయితనూ చూస్తారు. దేనికీ కాకపోయినా, అతను చెప్పింది కాదనడానికైనా అతనిని లెక్కచేస్తూవుంటారు. అదివరకు వుంటేనేకదా ఇప్పుడు కాదనడానికి. రచయిత ఇలా అనుకుంటాడు—నేను ఇతరులతో వున్నాను. నేను ఇతరులతోవుంటే, నేను ఇతరులూ అవ్వాలి; నేనూ అవ్వాలి. ఇతరులు నాస్వరంతో మాట్లాడతారు. అప్పుడు నేను నేనుగా కన్న, వారుగా పెరుగుతాను. ఈ నేను అంటే ఏమిటి? విభిన్నమైన శక్తులు ఏకమయ్యే సంగమస్థానమా లేక పరస్పరం సంఘర్షణకు తలపడే రంగస్థలమా? నేనేమో ఒక అపరూప వ్యక్తినా? అందుకనే నేను అందరి దృష్టిని ఆకర్షిస్తానా? అసలు నేను అందరి దృష్టిని ఎందుకు ఆకర్షిస్తానని అనుకోవాలి? ఇవి రెండూ నిజమా. అయితే, అది మళ్లీ వేరేసమస్య అవుతుంది. ఈ నేను అనేది సర్వస్వతంత్రమా, అస్వతంత్రమా. ఈ నేను అనేది నేను నిర్వచించలేనిది. నా స్వంతం అనుకొనే యోచనలు ఇతరులచేత నిర్ణయింపబడినవే అయివుండవచ్చు. మనం ఒకరు మరొకరుగా మారవచ్చా లేక ఎవ్వరి అవతారం వారిదేనా? దీనికి సమాధానం అవునూ అనవచ్చు; కాదూ అనవచ్చు; లేకపోతే రెండూ అనవచ్చు. ఏమైనా అందువల్ల ఏదో చెప్పడానికి, చెప్ప ప్రయత్నించడానికి రచయితకు సమర్థనీయమైన అవకాశం కలగజేస్తుంది. అంతేగాకుండా తనస్థితిని చూచి తాను సిగ్గుపడకుండా వుండడానికి ఉపకరిస్తుంది. రచనా వ్యాసంగంలో నిమగ్నుడై వుండటం గర్వప్రదర్శన లక్షణంగా కనపడితే, ఆ వ్యాసంగాన్ని తిరస్కరించడం, అసలు వ్యాసంగం అనేదానికి వైముఖ్యం చూపడం, కృషికి దూరంగా వుండడంకూడా గర్వ లక్షణమే అవుతుంది.

(సశేషం)

# వ్యావహారికభాష

# వ్యాకృ

శ్రీ నూరిరామ సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్లో॥ వాగర్థావివసంపృక్తౌ-వాగర్థప్రతిపత్తయే।
జగతః పితరౌవందే-పార్వతీ పరమేశ్వరౌ॥

ప్రాపంచిక వ్యవహారములందుఁ గలుగుచుండు ప్రయోజనములఁబట్టి లౌకికభాషయందుఁ దఱచుగా నూత్నపద సన్నివేశాది కారణముఁచే మార్పులు కలుగుచుండుట సహజము. భిన్న రాజన్యుల కాలములందు నాయా రాజకీయాది పదజాలములును జేరుచుండును. కర్ణాటక రాజుల పాలనమునఁ గన్నడ భాషాది సంస్కృతి బహువిధముల నాంధ్రమున వ్యాప్తిఁ జెందెను. తురుష్కుల రాజ్యమున మ్లేచ్ఛ పదములు సహితము చూరఁగొనిన రీతి నాంగ్లేయుల యేలుబడియందున నాంగ్లపద సాంప్రదాయములును దన్నాగరకతతోబాటుగ నాటుకొనినవి.

క్రమక్రమముగా నాగరకత యభివృద్ధినొంది ముద్రణాది సౌకర్యముల వలన గ్రంథ రచనాదుల శీఘ్రవ్యాప్తికి సావకాశము నేర్పడుటచే యథాగతిఁ బరిణతిఁ బొందియున్న యాంధ్ర భాషను గొంత నియమించి యప్పటికిఁ బూర్వము ప్రాచుర్యమున నున్న భాషాస్వరూప మవగత మగునట్లుగా వ్యాకృతి నేర్పఱచిరి. అందును గొన్ని శబ్దముల సహజ స్వరూపములు దెల్పి సంధి సమాసాద్యవసరములందును విభక్త్యాది భేదములచేతను భూతాది కాల భేదములచేతను సృష్టిజ్ఞాన్త్యాదులందుఁ గల్గుచుండు పరిణామముల గుర్తెరుఁగునట్లుగా వివరింపఁ బడినది. ఇట్టి నియమము లసంబద్ధములైయున్న తత్పూర్వ గ్రంథముల సమన్వయించుటకు "నాంధ్రనామ సంగ్రహాది" నిఘంటువులు సంపూర్ణముగా సహాయకరములుగాకుండుటచే "శబ్ద రత్నాకరము" మున్నగు నిఘంటువుల నిర్మితి సహితమవసరమై చూపట్టినది.

యదార్థమున నన్నయాదుల వ్యాకృతి రచనల కాలమందు మాత్రము భాషయట్టి రూపముననే లౌకిక వ్యావహార్యమున నున్నదనియును మనము నిర్ణయింపఁ జాలము. "ము" వర్ణకము ప్రథమైకవచనాంతమునం గొన్ని పదములందైన నొకప్పుడుండెనని ప్రస్తుత భాషా స్వరూపముఁ బట్టి మన మూహించుటకు నెట్టి యవకాశము కాన్పించుటలేదు. సంస్కృత శబ్దములను "కాలం, ముఖం, లోకం" అను రూపములు వ్యావహారికమున నున్నవి. కాని "ము" వర్ణక ప్రయోగము లౌకిక భాషయందు మచ్చునకైన నెచ్చటను గానఁ బడుటలేదు.

మాండలిక భేదముల వివరించుచు "డొక్క" యను పదము నర్థము చేసికొనుటలో భిన్నమాండలికులగు పండితులెట్లు శ్రమనొందినదియు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య గారుదహరించిరి.

"పొట్టడొక్క కడుపు— బొజ్జబొఱ్ఱ యనంగ
నుదరమునకు నాఖ్య—లొప్పుచుండు"

అను నాంధ్రనామ సంగ్రహ పద్యము నెరుఁగని పండితుఁ డిట్టియెడ ఖసూచియగుటయు సహజమే. ఇట్లే :—

"కాలనఁ బేరగునాలవ
పలికిఁ బాదంబునకును—బాలేందుధరా"

అనెడు నానార్థములు సహితమెరిఁగినప్పుడే తన్నుఁ బండితునిగా నెంచుకొనవలసినయున్నదిగాని యన్యము కానేరదు.

ఇట్లు నిఘంట్వాదులు భిన్న ప్రాంతీయములగు పద సంచయములనెల్ల ప్రదర్శించుటయు నవసరమైయున్నది. కాని వ్యావహారిక భాషయందుఁ గల మాండలిక భేదములత్యంతము క్లేశావహములై కాన్పించుచున్నవి. వాని నన్నిటిని సమన్వయమున గొన్ని యెడల సుష్టువులుగా నెంచినను వానినెల్లరు నవలంభింపవలసిన యవసరము కాన్పించదు.

"ఏమి" యనుపదము "ఏమిటి, ఏంటి, ఏమిది, ఏంది, ఎంది" అను భిన్న విధముల భిన్న ప్రాంతీయములై

యున్నది. "అట్లు" అను పదము "అట్లాగే, అట్టాగే, అలాగే, అట్టా" అను వివిధ పరిణామముల నొప్పుచున్నది. "ఆ విధమున" అనునర్థమున "ఆమోయిన" అనుటకు "ఆమోయిన" అవియును గొన్ని ప్రాంతముల వాడుకకలదు. "ఏందది ఆమోయిన మొద్దారె కూర్చున్నాడు!" అనుచు గుంటూరు మండలమున శిష్ట ప్రయోగము కాన్పించుచున్నది. "గట్ల, గిట్ల" తోబాటుగ "గిక్కడ", గిక్కడ" అను తెలంగాణమున వాడఁబడుచున్నవి. "వచ్చాడు", చూశాడు" అను నట్లుగా "వచ్చిండు, చూశిండు" అనియును శిష్ట ప్రయోగములై కానఁబడుచున్నవి. "చూచుట, పోయుట" యనుటకు "చూసుడు" "పోసుడు"ననియు విహితములై యున్నవి. "అట్లందు" వనుటకు "గట్లన బడతవు" అని భావే ప్రయోగము కలదు. "ఇమ్మనను, రమ్మనను" అనుపదములు "ఇమ్మాను, రమ్మాను" అను రూపముల నున్నవి.

"ఆయిబాబో! దీని తల్లిబొడ్డు బొక్క" మొదలగు నూతన పదములు గోదావరీ మండలమున సాధారణ్యముననున్నవి. "వచ్చినయ్యా" అను కృష్ణామండల ప్రయోగముకంటె "వచ్చాయా" అను గోదావరీ మండల ప్రయోగము మాత్రా లాఘవముచే సౌష్ఠవాధిక్యతఁ గలిగియున్నదనవలసియున్నది. పాకశాలయందు నపూపములఁ జేయుటకై పిండిని ముందుగా దడిపిపెట్టుటకు "ఉప్పుట" యని వ్యవహరింతురు. శ్రాద్ధదినమునందు "పిండిని ఉబ్బోసి కలుపు"మని అత్త కోడలితో బల్కుట గోదావరీ మండలమునఁ గలదు. "బంగాళాదుంప కూరంటే నాకు చచ్చే యిష్టం" అని ధారాళముగా లౌకిక భాషా రచనములందును వాడుచున్నారు. "చచ్చే" అను పదమును "అత్యంతము" అను నర్థమున నిఘంటువులోఁ జేర్పఁ దగదు కదా! ఇట్లు కట్టుబాట్లు త్రెంచుకొని విచ్చలవిడిగా ప్రవర్తిల్లుచుండు వ్యావహారిక భాషయందున నశ్లీలాది దోషబాహుళ్య మెప్పటికప్పుడు దొరకుచునే యుండును.

తెలంగణమున వ్యావహారిక భాషయందున దొసంగులు బహుభంగులఁ గానఁబడుచున్నవి.

"దీనినిఁ బట్టుకొను"మనుటను "దీన్ని పట్టుకో" లని ధారాళముగాద్వితీయామీద "గసడదవా" దేశము బాహుళ్యమున నున్నది. ఔత్తరీయ సాంప్రదాయమున "వబయోరభేదః" అను విధానమున "వసన్త" మనుటకు "బసంత్" "రవీంద్రుడు" అనుటకు "రబీందర్" యని వాడఁబడుచుండగా, నిచ్చట "బకారమ్ము" స్థానమున "వకారమును" బ్రయోగించుట సుఖముగా దోచును.

"పగిలినది" "తగిలినది" అను పదములు "పలిగినది. తలిగినది" అనుచు వర్ణ వ్యత్యయమున వాడఁబడుచున్నవి. "నా దగ్గర" అను నర్థమున "నాతోడ" ననుటకు "నాతాన" అని యుపయోగింపఁబడుచున్నది.

"నా కెల్లె" అనఁగా నా వైపున నను నర్థమున నాంధ్రప్రాంతమున నింద్య గ్రామ్య ప్రయోగము. కాని "మావూరు కెల్లె వస్తున్నాను" "పట్నంకెల్లె పోతున్నాను" అనుచు "నుండి" యనియును "దగ్గరకు" ననియు రెండర్థముల నీ పద ముపయోగమున నున్నది. ఉజ్జాయింపుగా నిచ్చట రెండు మూడు ప్రయోగముల నుదహరించితిని గాని, శిష్టాశిష్ట వివక్షత లేక సర్వజన విశిష్టమై బహు దోషపదములు గానఁబడుచున్నవి.

గోదావరీ మండలమున "దొబ్బేశాడు" అను పదమును "పారిపోయెను, ఎత్తుకొని పోయెను" అను నర్థమున స్త్రీ జనములు సహితము పల్కుచుండ విని కృష్ణామండల వాసులు తెల్లబోయి చూచుచుందురు. తెలంగాణమున నీ పదము "త్రోసెను" అను నర్థమున సర్వత్ర ప్రయుక్తమై కాన్పించుచున్నది. కావున నిందలి ప్రథమాక్షరమును గ్రాంథిక సహితముగా వాడిరి,

"ముందుకుం ద్రొబ్బి గురునకు—మ్రొక్కు మనియె" నని పోతనాదులును బ్రయోగించిరి.

★

ప్రాంతీయ భేదములచేతను గల్గు పరిణామ భేదము లనేకములు కాన్పించుచున్నవి. "ఏకణా, దో అణా, దస్ అణా, పంద్రాణా" మొదలగు స్థానముల సంఖ్యావాచకములే కాదు. "రావణుడు సీత నెత్తుకొని పోవుచుండగా "రాస్తాలో జటాయువు గడీని రోకాయించాడు" అని హరిదాసు కథలో చెప్పుచున్నాడు. కన్యాశుల్కంలో గిరీశం "ఏమోయి! My dear Venkatsam! ముఖం వేగిలేశావ్" అన్నాడు. అంతకంటె దీర్ఘ పదప్రయోగము చేయలేదు. మాచినతనంలో "When I say "one" you better చేతులు పైకెత్తండి" అని మాస్టరుగారు Drill చెప్పేవారు.

"అసలే I am suffering from fever అందులో మీరు Question వేస్తే How can I answer? సార్" అని పిల్లలనేవారు. Higher forms చదివె విద్యార్థులు కనుక అంత పొడుగుగా మాట్లాడ నలకొనవచ్చునుగాని, ఈ హరిదాసుగారు ఎంత పాండిత్యమున్న అన్ని పదముల నురుదుతో పలుకుచున్నారని తలచవలసి యున్నది! క్రమక్రమముగా నురుదు భాష సార్వజనీన మగునట్లుగా నవు డుద్దేశింపఁబడిన్న దనియును దెలియుచున్నది.

# వ్యావహారికభాష - వ్యాకృతి

భోజరాజు పది సంవత్సరములలోఁ దన రాజ్యము నందంతటను సంస్కృతభాష వ్యాప్తిలోనికిఁ దెచ్చెనని చెప్పుదురు.

''కావా బాలా—కాంచనమాలా
కస్యాఃపుత్రీ—కనకలతాయాః
కింతే హస్తే—తాళపత్రం
కావా రేఖాః—కాఖాగాఘాః.''

పాఠశాలకు జనుచున్న పంచవర్ష ప్రాయము ల బాలికతో భోజుం డిట్లు సంభాషించెనని ప్రతీతి కలదు. సంస్కృతము గ్రాంధికభాషయే గాని ''Spoken languag' కాదని కొందరు పల్కుచున్నారు. చాలకాలమునుండి సంస్కృత పాఠశాలలు ప్రసిద్ధములై యున్న విజయనగరము, కోనసీమ, సరిపల్లె, ఆగిరిపల్లి'' మొదలగు స్థలముల విద్యార్థులు పరిశీలించిన యెడల వారితో తుల్యతను మనము సంపాదింపలేనందులకెంతయు చింతింపవలసి యున్నది. అట్టి దైవభాషను సర్వత్ర వ్యాప్తియందుఁ దెచ్చుటకై సర్వథా యత్నించుట మన విద్యుక్తధర్మమై యున్నది.

తాండూరు పట్టణమునఁ గూరగాయలమ్ము మనిషి వచ్చి ''అమ్మా ! మీకు బేఁ !'' అని యడుగును. ''హాకు బేడ'' అనియును ప్రత్యుత్తరము నిత్తురు. ఇంతియకాక, ''విసత్తారుబొట్టు—అరుస్వరణా'' అను పాఠములును కన్నడ ప్రాంతమునఁ బాలుర ముఖముల వినఁబడుచుండును. ఇట్లే తమిళ ప్రాంతములందును నాయా పదములు మిశ్రితములై వ్యవహారికభాషయందుఁ గాన్పించును. పంచ ద్రావిడములు పరస్పర సంబంధము కలవియై యున్న కారణమునఁ గొన్ని పదము లాంధ్రమున యధారథముగా వచ్చి చేరినను వాని నంతటితో నియమించి గ్రాంధికాది రచనముల నలుపవలసి యున్నది కదా ! లేనియెడల ''నా దుడ్డుదా! నేడుదా ! కుదురా'' అనెడు ''అరవ రామదాసు'' కథవలె అత్యంతము హాస్యాస్పదముగా నుండును.

సుమారు రెండు మూడు దశాబ్దముల నుండి నవలాది గ్రంథరచనములు పత్రిక ప్రచురణములు వ్యావహారికభాష యందున్న నలుపుచున్న కారణమున నీ భాష యిప్పటికే సార్వజనీనమై యుండవోఁపు గావున మాండలిక భేదములు క్రమముగాఁ బాటింపవలసిన యగత్య ముండఁబోదని తలంచుట యుక్తి యుక్తము కనేరదు. ఇప్పటి కెన్ని సంవత్సరముల నుండియో గ్రాంధికభాషను బఠియించుచు నందు పాండిత్యము సంపాదించి ప్రబంధాది గ్రంథరచనల చేయుచున్నవారైననూ వా భాషకు గృహకృత్య వ్యవహారముల వినియోగింప నేరకున్నారు. ''వెస్పెలీ ! బిచ్చుగా దేలెంచే. తండులంబుల జేకొని చెచ్చెర విచ్చేయుము'' మని నిజపత్నికి వాకొచ్చిరని శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి వచనముల నెంతయో వింతగాఁ జెప్పుకొనుచున్నాము. కావునఁ గృష్ణా గోదావరీ మండలములందలి వ్యావహారికభాషాపదములతో రచనలను, పత్రికాదులనుఁ జదువుచున్న కారణమున నీ భాషయే యలవడి యన్య మాండలికులు స్వమాండలిక పదముల మఱతురని యెంచరాదు. ఇదొక్క ప్రాంతీయమైన వ్యావహారికభాష ప్రమాణ మనియును మఱొక్క ప్రాంతీయ మసహజ మనియును ననఁజాలము. వివిధ ప్రాంతీయ భాషా రచనలు కొన్ని యెడల విభిన్నార్థ ప్రదర్శకములై యుండుననుటలో సంశయము లేదు. ఈ భావమును బురస్కరించుకొనియే స్వమాండలిక భాషలందున గ్రంథరచనల నల్పుట కెందరో సందియముచే ముందంజవేయ సాహసింపనేరకున్నారు.

''ఏది ! నీ తప్పుల దస్త్రమును విప్పు'' మని శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు పుత్రున కనలిచ్చిరట. వారి ''బాలకవి శరణ్యము'' నందు నిరూపించిన రీతినిఁ బూర్వ కవి ప్రయోగములందు సహితమా దోసఁగు లేల కలిగె ననవలసి యున్నది ! ''ప్రమాదో ధీమతా మపి'' ధీమంతులకును ప్రమాదము సహజమై యున్నది. ''To err is human''. జలమునకు నిమ్న ప్రవణమువలె రజస్తమో విశిష్టమై యున్న చిత్త మెల్లప్పుడును సన్మార్గ సంచరణమున లాఘవము కలిగి యున్నది.

''ప్రఖ్యా రూపంహి చిత్త సత్త్వం
రజస్తమోభ్యాం విశిష్ట
మైశ్వర్య విషయం భవతి.''

స్వయముగా సత్త్వమైన చిత్తము జ్ఞానస్వరూపము. రజస్తమస్సులచే నావృతమై యుండుటచే నాత్మను స్వస్వరూపాను సంధానమునుండి వినివృత్తమొనర్చి ప్రాపంచిక విషయాసక్త మగునట్లుగ నొనర్చుచున్నదని శ్రీ పాతంజల యోగసూత్రము. కావునఁ గొండపైకి గుండును దొరలింప యత్నించు తెఱంగున నను పదమును నీ చిత్తము నన్యాయత్తము కాకుండగ సర్వదా జాగరూకత వహించుట ముఖ్య కర్తవ్యమై యున్నది. ఒక్కసారిగా రచియించిన కార్యము సంస్కారరూపమును జిత్తమున హత్తియుండి మరల దత్తదను రూప దేశ కాలాదులందును బ్రవృత్తి నొందుచుండును. ఇట్లు కొన్ని సార్లుగా మరల మరల నొనరించిన కార్యము దృఢ సంస్కృతి నొందిన నదియే తత్ప్రకృతిగాఁ బరిణమించును. ఇట్లు చిత్తము సర్వదా బహిఃకార్య ప్రవృత్తిచేఁ గలుషితమగు

చుండుటచే నిది బహు జన్మార్జిత సంస్కార పుంజమై యొప్పుచున్నది.

వ్యావహారికభాష సహితము భిన్న ముఖములఁ గల్గి యుండు వివిధ సంస్కార బాహుళ్యముచేఁ గట్టుబాట్లు దాఁటి యథేచ్ఛముగా బ్రసరించుచు వచ్చుచున్న కారణమున నప భ్రంశమై నిజస్వరూపమును గోల్పోయినది. అను పదము నెన్నివిధముల నిర్బంధములఁ బట్టుకొని వచ్చుచున్నను బరాకు కల్గినపు డెల్ల పండితుల ముఖమునుండియును జారి దాని కభ్యసితమైయున్న భ్రష్టపథము ననువర్తించు చుండును.

"నీ ముఖమునుండి యుచ్చరించు భాష సుష్టువు కాదని నీవేల సంశయించెద" వని శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగా రొక యుపాధ్యాయునిఁ బ్రశ్నించిరట! సుష్టుతా సుష్టుతల నుచ్చరించు పదములందే నిర్ణయింపవలసి యున్నది. ముఖమునుండి యుచ్చరించు శబ్దజాలమున కెల్లను రజస్తమో గుణసంస్కారబాహుళ్యమున నిమగ్నమైయున్న చిత్తవృత్తియే మూలకారణమై యున్నదని యెఱుఁగదగి యున్నది. కాల వాహినిచే సర్వతోముఖముగ భ్రష్టత నొందుచున్న వ్యావ హారిక భాషాపదములెల్ల సుష్టువులే యని యెట్లు నిర్ణయింప గలము! విశృంఖల వృత్తిచే నుచ్చ నీచములఁ బాటింపక యథేచ్ఛ ముగాఁ బల్కుచుండు నీచునకునువాని ప్రాక్తన సంస్కా రానుగుణ్యమగు బుద్ధి వృత్తియే కారణ మగుచుండును. కావున ముఖమునుండి యుచ్చరించు పదముల సౌష్టవము ననుస రించియె ఆయా వ్యక్తుల యొక్కయు, నాయా ప్రాంతముల యొక్కయు నాగరకత నిర్ణయింపఁబడుచున్నది. అట్లుగాక, బహుభంగుల వచ్చి చేరుచుండు తప్పులచే సర్వ విధముల వికృతాకృతి నొందుచున్న భాషయె సర్వథా గ్రంథ రచనాదులందును విధియింపఁదగిన యెడల శ్రీరామమూర్తి పంతులుగారు సూచించిన తప్పులన్నియు నొక్క సారిగా నొప్పులకుప్పగాఁ బరిణమించుచున్నదిగదా! పూర్వ కవిప్రయోగములగుట సుష్టుగా నెంచబడుచున్నను నందు సుగుణాతిశయము గాన్పించిన యెడలనే సర్వదా గ్రాహ్యమగు నని యర్థము. లేనిచో "ఛాందసత్వాన్న దోషః" అన్నటుల నెంచఁదగియున్నది.

వ్యావహారిక భాషయందును శిష్టము, గ్రామ్యము, నింద్యము మొదలగు భేదములు గల్పించుచున్నారు. సంస్కృత ప్రాకృతాదిభవము లపభ్రంశములై యాంధ్రమునఁ గన్పట్టు రీతిని గొన్ని ప్రదేశముల నాగరకజనుల ముఖమునను నింద్య గ్రామ్య శబ్దజాలము విశేషముగా గాన్పించుచున్నది. ఈ వైల క్షణ్యమున కేమనవలసి యున్నది!

ఉ. మద్దెల వాసడానికిని మంగలి రంగడు యిద్దెగాడుబో
గుద్దును డోలుమీన, మన గుర్వన పెండ్లికి సందె రేవులో
మిద్దెలకాడ పోరుబడి మీసము దువ్వి పోనాయిబాడ సే
కొద్దిని వాసె వాద్దెమని కూసును మూర్ఘుడు రాజశేఖరా!

ఇట్లు నిరూపింపఁబడిన భాష యంతయు నింద్యమే కదా!

"యెలక జల్మంలోన యెవరమోనంటి
సిగ్గొచ్చినయ్యింది సీఁకనా యెంకి."

ఈ యెంకి పాటలు సహితము "అందురు మూర్ఖులు చంద్రశేఖరా" అను నింద్య భాషయందున నున్నను ననరక్ష వాఙ్మయము కాఁజాలవని శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులును సమర్థించియుండ కాలక్రమమున నిట్టి రచనలను వ్యావ హారికమునకు సుష్టువులుగా నెంచుటకై యత్నింపవలసిన యవసర ముండునేమో!

హిందీభాషా సాంప్రదాయము ననుసరించి పదము నందలి ద్వితీయాంతిమాక్షరముల కుండు "అకారస్వర" ముచ్చ రింపఁబడదు. లిపియందు నక్షర స్వరూపమున నుపపన్నమై యున్నను సంస్కృతపదమునందు సహితము "అకారము" వదలివేయుబడుచున్నది. "రామ" యను శబ్దము" "రాం" అనఁబడును. "లోక" శబ్దము "లోక్" అగును. ఇట్లు పుంలింగ శబ్దములు సహితము నపుంసకాంతములుగను, హలంతములుగను బరిణమించుచున్నవి. సంస్కృతభాష యందలి శబ్దములెల్ల నర్థసిద్ధి కలవియై యుండుటచే నిట్లు స్వరోచ్చారణమును వదలివేసిన యెడల నాంధ్రము నందు "దద్భవ శబ్దముల" వలె నిర్జీవములై యెట్లు విపరీత ఫలప్రదము లగునదియును మ ద్విరచిత "శబ్దార్థ తత్త్వము" నందు సోదాహరణముగా నిరూపించితిని.

"రఘుపతి రాఘవ రాజారాం
పతిత పావన సీతారాం."

ఈ గీతమునందు గల "రాం" అను శబ్దమునందును "ఇక మీ జోలికి మేమేరాం" అను పదమునందు "రాం" అను శబ్దోచ్చారణమునందు గల్గు నర్థసిద్ధియందు నెట్టి భేదము కలుగనేరదు.

# వ్యావహారికభాష - వ్యాకృతి

శ్లో. శ్రీరామ రామ రామేతి—రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం—రామనామ వరాననే !''

ఇందు "శ్రీరామ, రామ, రామ" యని రామ నామమును విస్పష్టముగా ముమ్మారులు పలుకుచు శ్రీరామ నామ మాహాత్మ్యమును బరమశివుఁడు జగదంబకు నుపదేశించెను. కాని, మనకు బ్రస్తుత ముపలబ్ధమై యున్న హిందీభాషా సాంప్రదాయముచే నవశబ్దజాలములు దెచ్చిపెట్టుకొని మన వ్యావహారిక భాషను సర్వ విధముల దోష భూయిష్ఠ మొనర్చుకొనుచున్నాము. భగవన్నామ సంస్మరణమునందు సహిత మిట్టి దొంగ గొనితెచ్చి పెట్టుకొను నవసరము కల్గినందుల కెంతయు జింతిల్లవలసి యున్నది. ఈ తప్పుల తడికెలను గావని యపరోధించువా రెవ్వరు ?

"జనగణమన అధినాయక జయహే
భారత భాగ్యవిధాత !''

ఈ ప్రయోగమునందు విసంధి యేల విధియింపబడిన దనునది వంగభాషా సాంప్రదాయ మనసరించి యున్నది.

"వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్చల జలధితరంగా.''

ఇది బహువ్రీహి సమాసమే యైనయెడల నిందును విసంధియే కానంబడుచున్నది గదా ! ఇంతియకాక ఆంధ్రమున సమాస ప్రకరణ మంతయును దత్సమ పదములందున సంస్కృత భాషా ప్రకరణము ననుసరించియే యున్నది. అట్లుగాక భిన్నముగా నున్నను విశ్వకవి ప్రయుక్త మగుటచే వంగభాషా సాంప్రదాయమని యెంచి మన మందరము సర్వదా సంస్మరింపవలసి వచ్చినది గదా ! కొంతకాలమున కిట్టివి వ్యాప్తియందు నిలచియుండి సుష్ఠుసాంప్రదాయముల విస్మరింపఁజేయు ననుటలో సంశయ ముండుబోదు. లౌకికభాష యందుననే గాక, గ్రాంథిక భాషయందును నిట్టివి స్థిరనివాస మేర్పరచుకొను ననుట సహజము.

ఈ యవసరమున మఱొక్క యంశమును సహితము నొక్కి వక్కాణింపవలసి యున్నది. "నమస్తే'' అనగా నిది హిందీ భాష కాబోలునని యతి సులభమున ననేకులు దీనిని వాడుచున్నారు. "బ్రహ్మచారి—నమస్తే'' అను హిందీ చలనచిత్రముతో నీ పద ము వ్యాప్తిలోనికివచ్చెనని కొందరుతలంచుచున్నారు. నమః తే "నీ కొఱకు నమస్కారము అని పల్కుటతో నమస్కారమున కర్హులగు వారలకు దండముతోబాటుగ "నీకొఱకు' ననెడి ఏకవచన ప్రయోగ మేటి సాంప్రదాయమో తెలియుట లేదు. "నమస్తే రుద్రమన్యవే'' అను నిత్యాది విధానములందు బరమేశ్వరునందుఁ దక్క యన్యస్థలములందు నమస్కారార్హతగల పెద్దలయెడ "నీ కొఱకు'' నను నేకవచన ప్రయోగము చెల్లబోదు. దీనియందలి దోషమును వివర్జించినన విద్వాంసులు సహితము విన నొల్లకుండుట విషాదకరమై యున్నది. ఇది యంతయు నలౌకికమని యెంచక పెద్దలు సహిత మీ శబ్దమును వినినంతనే తాము హిందీ భాషలోనే దండమును బొందగల్గినట్లుగా నాధిక్యత నెంచి యత్యంతము సంతసిల్లుచున్నారు.

ఇట్టి వివిధ భ్రమల కోర్వఁజాలక కాబోలును ఆంగ్లమున్న దండము మొదలు దేవార్చనము వరకు ననునట్లుగా "You'' అను బహువచన ప్రయోగమున నెన్నుచున్నారు. తుట్టతుదకు " You are my dog '' అనుచుఁ దన కుక్కను సహితము బహువచనమున సంబోధించుచున్నారు. మన సాంప్రదాయము దీనికి విరుద్ధముగా నున్నది. ఇట్లెప్పటి కప్పుడు తప్పొప్పులు దెలియనొల్లక విచ్చలవిడిగా పెచ్చుపెరిగి ఏ యలౌకికుంచేతనో చేయఁబడిన ప్రయోగములెల్ల వ్యావహారికభాష యందు నిలచిపోవుచుండుటచే నీ భాషకు నైసర్గికమగు సుష్ఠుత యెట్లు స్థిరముగా నుండఁగలదు !

"నమో వెంకటేశా—
నమో తిరుమలేశా.''

"నమో వెంకటేశా'' అనినట్లుగా "నమో తిరుమలేశా'' అనియును నీ కవి ప్రయోగించినాడు. "నమః + తే = నమస్తే'' అని యగుచుండగా "నమ + తిరుమలేశా = నమస్తిరుమలేశా'' అని యేల పలుకరాదో తెలియదు. ఇది స్థిరముగ నిలచి సార్వజనీన మగుచున్నదిగదా ! కొంతకాలమున కిది పూర్వకవి ప్రయోగమై కన్పించును.

ఇట్లు భిన్న స్రోతోముఖములఁ బరివర్తమై సర్వదా పరిణతిం బొందుచుండు వ్యావహారిక భాషయందుననే గ్రంథ రచనల సల్పుచు వచ్చిన గొంతకాలమునకుఁ బూర్వ ప్రణీత గ్రంథములు జదువు సామర్థ్యము సహితము నమసిపోవును. ఇట్లు ప్రతి శతాబ్దియందును మరల మరల వ్యాకృతులను, నిఘంటువులను వ్రాయుచు వచ్చిన నీ కలాపమునకు మాత్ర మవధి యెక్కడ ? ఇట్లు రచియించు వ్యాకృతులును కేవల మా శబ్దముల దేశ ప్రయోగ భేదములు దెల్పు చరిత్రల వంటివే యగును గాని శబ్ద ప్రయోగ విధానమును విధియింప సమర్థములు కాఁజాలవు కదా !

ఆంగ్లమున వర్ణక్రమము ( Spelling ) నుగల క్లేశభావమును సహింపఁజాలక ధ్వన్యనుప్రయుక్త (Pho-nctic ) విధానమునకై సల్పు మార్పుల వలను బూర్వ రచిత గ్రంథముల నన్నిటిని మరల వీ నూత్న విధమున ముద్రించు వరకును వానిని బతికించు సామర్థ్యము తొలఁగి పోవుచున్నదని బహుభంగుల విచారించుచున్నారు. కావున గ్రాంధిక భాషయందు గాని, లిపియందు గాని చేయునట్టి మార్పులవలన ఈ సమస్య యత్యంతము క్లిష్టతర మగుచుండును.

ఆంగ్లమునందు సహితము లౌకికభాషయందు నెన్నో షడును గలుగుచుండు దోషములు వివిధ పాశ్చాత్య దేశములందున బహువిధములఁ గాన్పించుచున్నను రాజకీయాది వ్యవహారము లందును నట్టి యపశబ్దముల కెట్టి యవకాశము కలుగనీయక ప్రాచీన సాంప్రదాయములనే సగౌరవముగ నాదరించుచున్న కారణమున నా భాషయే ప్రస్తుత మాధునిక ప్రపంచమునం దంతటను సామాన్యమగు వ్యావహారిక భాషయై వర్తిల్ల వెలుఁగుచున్నది. అట్లుగాక లౌకికభాషయందుఁ గలుగు మాఘు యపభ్రంశములనెల్ల సర్వ ప్రపంచ మవలంబింపవలసి వచ్చు నెడల నా భాష యంతరింత కావలసి వచ్చును.



# తెలుగులో వచన కవిత్వం

## శ్రీ కె. వి. రమణారెడ్డి

"నిస్సందేహంగా ఇకముందు పది సంవత్సరాలూ వచన గమకాలలో కొత్త పరిశోధనలకు వినియుక్తం కాబోతున్నవి."

1939 లో శ్రీ శ్రీ చెప్పింది మిడతంభొట్ల జోస్యం కాదు. పై వాక్యం ప్రత్యక్షర సత్యంగా పరిణమించింది. "నేటి తెనుగు కవిత : కొత్త పోకడలు" అనే శీర్షికతో, మద్రాసు రేడియో స్టేషను ప్రసారం చేసిన ఈ ప్రసంగాన్ని 'భారతి' ముద్రించుకొంది. నవీన కవులు (ఆ కాలానికి నవీనులు) పురాతన ఛ్ఛందస్సులను వదలి ముత్యాలసరాలు, ద్విపదలు, రగడలు, భుజంగ ప్రయాతం వంటి వృత్తాలు స్వీకరిస్తూ ఉండిన రోజులవి. ఈ ప్రయోగాల ద్వారా ప్రాచీన రీతులలోని భాషా కృత్రిమత్వం వైదొలగి కావ్యభాష వ్యావహారికానికి దాపుగా వచ్చింది. అయితే ఇది ప్రారంభమే గాని ముగింపుకాదు, తప్పటడుగులే గాని స్వచ్ఛంద గమనం కాదని శ్రీ శ్రీ గమనించాడు.

"గ్రాంథిక భాషను విసర్జించినట్లే ఈ గేయాలన్న కూడ మన కవులు ఎప్పుడు పరిత్యజిస్తారో ? సాహిత్య పరిణామం గుర్తిస్తే ఇందుకు ఎంతోకాలం పట్టదని చెప్పవచ్చును."

అడివి బాపిరాజు వంటి నవ కవులు వచన పదాలలోనికి "సాహసించబోయి సందేహిస్తున్నారు." "ముద్దుకృష్ణ మాత్రమే సాహసించాడు." "మల్లవరపు విశ్వేశ్వరరావు 'స్త్రీ' అనే కావ్యంలోను, 'చెప్పండి జవాబు' లోను వచనపు విరుపులతో రసవత్కావ్యం ఎలా సృష్టించవచ్చునో ప్రదర్శించాడు."

తనను గురించి రాసుకునేందుకు వినయం అడ్డు వచ్చినట్లుంది గాని, ఆ నాటికే పరమ స్వతంత్రంగా శ్రీ శ్రీ కవితా ! ఓ కవితా !', 'కొంపెల్ల జనార్ధనరావు కోసం' వంటి గొప్ప వచన గేయాలను రచించే ఉన్నాడు గదా !

1940 ప్రారంభానికి తెలుగులో వచన కవిత్వ యుగం జంకుతూ, జడుస్తూ నైనా మొదలైనదని భావించవచ్చు. అయితే ఉవ్వెత్తుగా దూకిపడే సముద్రపు అల వలె ముంచెత్తడమంటూ ఇంకా జరగలేదు. ప్రయోగశాలలోనే అనేక పరీక్షలకు లోనౌతూ ఉండింది. సంప్రదాయవాదుల నిరసనకూ అపహాస్యానికీ అగ్గంగాక తప్పలేదు. శ్రుతి సుభగత్వమనే నినాదాన్ని పలికి, ఛందస్సును వెనక వేసుకుని, మితులను సూచిస్తూ, దువ్వూరి రామిరెడ్డి వంటి హితైషులు విమర్శ సాగించారు. గణ ప్రస్తారము చేసుకొని లక్షాధిక నవ్య ఛందస్సులను ఆవిష్కరించుకొని కవిత్వము రాయవచ్చుగదా, ఈ అసంయమిత విజృంభణ ఎందుకో వారి కర్థంకాలేదు. "తెలుగు కవితలో క్రొత్త తెన్నులు" అనే వ్యాసంలో రామిరెడ్డిగారు ఇలా రాశారు :

"ఈ నవకవులు రచించు వచనపు తుంటలకు పద్యములని ఎట్లు పేరు వచ్చినది ? జామెట్రి వలన. ప్రోజు పేరాను లయిను ప్రకారము కత్తిరించి వివిధ పరిమితులుగా తుంటలుచేసి, ఒకదాని క్రింద నొకటి అతికించిన ప్రోజు పొయిట్రీగా మారును. ఇది జామెట్రి కవిత్వము. ఈ కవిత్వమున, తిక్కన చెప్పినట్లు చెవి ప్రధానముకాదు, కన్ను ప్రధానము. ఇది తను భంగమువలన గద్యమూ కాదు. ఛందోవిరహితమైనందున పద్యమూ కాదు. త్రిశంకుని వలె నడమంతరమున వ్రేలాడుచు రెంటికిం జెడిన రేవడ యైనది."

ప్రతి పాత కారుకూ కొత్త కారు పట్ల ఉండే తృణీకారభావ పూరితమైన అపహాస్యమే ఈ విమర్శలో కనిపిస్తూ

ఖంది గాని, తమ భావాలను పంచుకోనివారివల్ల ఉండవలసిన సహృదయత్వం లోపించి, ఈ విమర్శను నిందగా మారు స్తున్నది. అయితే రామిరెడ్డి హృదయావేదనను శంకించవలసిన పనిలేదు. ఆకార సమగ్రతనూ శ్రవోపేయత్వాన్నీ కవిత్వం నుండి శతాబ్దాలనుండీ రాబట్టుకొంటూ వచ్చి, ఇప్పుడు కావ్యం యొక్క ఆకృతికీ పదం యొక్క మాధుర్యానికీ ప్రమాదము ఏర్పడితే, ఎవరికైనా బాధ కోపం కలుగక మానవు. రాయప్రోలు ఆశించిన "సరళ మృదులాక్షరముల సమ్మేళన" ఇక్కడ మొక్కపోతున్నట్లు కనిపించేసరికి, 'నవ' కవులకు కోపం కలుగక తప్పలేదు.

రామిరెడ్డిగారు "వాఙ్మయ హిట్లరు" ను గురించి భయపడ్డారు. కవిత్వ విషయాలలో ప్రజాతంత్రం అనర్థ దాయక మన్నారు. ఇవి అసహ్యాలనలేము గాని, "యథార్థమైన కవిత్వమునకు అనివార్యముగా ఛందస్సు అనుగతమౌను" అని కవిత్వానికి గల 'సార్వకాలిక' 'సార్వలౌకిక' 'మూలసూత్రము' నొకదాన్ని విధించడంలో ఈ హిట్లరత్వాన్ని అప్రయత్నంగా ప్రదర్శించారు. లేకపోతే "అనివార్యము" అంటూ లేదేమిటి ? ఆయన కారణాలు అయినను లేకపోలేదు. "లయ కృత్రిమముగా కల్పించుకొన్న కవిలోపకరణము గాదు. అది సహజము ... లయ యొక్క శ్రుతి బద్ధత్వమే ఛందస్సు .... ఛందస్సులేని పద్యము విన్నప్పుడు ఉప్పులేని చప్పిడి కూరతో అన్నము తిన్నట్టులుండును. శ్రుతి రంజకత్వము అభావ మగును. ఆనంద దాయక హేతువులలో ఒకటి లుప్తమయి మన ఆనందము పరిపూర్ణము కాదు." ఛందస్సు లయా ఏక విషయాలుగా కనిపించినప్పుడు, ఇలాంటి తీవ్ర నిర్ణయమే చేయవలసి ఉంటుందేమో గాని, ఛందస్సుకు బయట గూడా లయను తదాశ్రితమైన శ్రుతి సుభగత్వాన్ని సాధించే వీలున్నప్పుడు మాత్రం ఛందస్సే కవిత్వానికి ఏకైక రూపం కాబోదు. తెలుగు కవిత్వంలో ఛందస్సు దాల్చిన ఇనుప తొడుగుల్ని నిరసించి, కావ్య భాషలో గేయాల అవతరణ తర్వాత కూడా మిగిలిఉన్న కృత్రిమత్వాన్ని నిరాకరించి, కావ్య గమనాన్ని నిరాఘాటం చేసేందుకు ఆధునిక కవులు చేబట్టిన రచనా పద్ధతినే వచన గేయమని, వచన పద్యమని, వచన గంధి అని, ముక్తచ్ఛందమని రకరకాల పేర్లతో పిలుస్తున్నాము.

"ఛందస్సుల చండశాసనానికి కూడా కాలం వెళ్లిపోయింది. కవి హృదయంలో రాగాలాపన ఎట్టి తీగలు సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి."

దువ్వూరి రామిరెడ్డి వంటి ఛందోవాదులకు భయం గొల్పిన ఈ మేనిఫెస్టో ఆధునికాంధ్ర కవిత్వానికి ప్రసాదించింది శ్రీ శ్రీ యే. "ఫిడేలు రాగాల డజన్" కు ఆయన రాసిన "ఇంట్రో" లోనిది ఈ ప్రకటన. మార్పును గుర్తించడంతో సమ ప్రజ్ఞను చూపినా, ఆ ఇద్దరిలో ఒకరు దానిని ఈసడించారు. ఇంకొకరు ఆహ్వానించారు. నిన్నటి విప్లవవాది నేటి సంప్రదాయవాదిగా ఘనీభవించడం గురించి మరొకచోట శ్రీ శ్రీ చేసిన వ్యాఖ్య, ఇలాంటి 'నవ' కవులకు వర్తిస్తుంది. సంయమనం (restraint) పేరుతో యథాస్థితిని శాశ్వతీకరించగోరిన నవ కవులు, తమ విప్లవం సాధించిన సత్ప్రయోజనాలను దాటి ముందుకు చూడలేక పోయారు. ఇది వ్యక్తుల విమర్శ అనుకొనేరు సుమా, భిన్న మనస్థితి. పరిశీలన మాత్రమే.

అందుచేతనే, ఈనాడు కూడా ఆ మనస్థితి కొందరిలో ఇంకా మిగిలే ఉంది. 1940 తర్వాత దాదాపు పాతికేళ్ళ కాలం గడిచింది. ఇంగ్లీషువా డన్నట్టుగా, వంతెన కింద ఎంతో నీరు ప్రవహించింది. శ్రీ శ్రీ కనుగొన్న భావి పరిణామ దృశ్యం ఇప్పుడు రేఖాసంస్పష్టంగా యదార్థత వహించింది. వచన గేయం స్థిరపడిపోయింది. ఆ నాళ్లలో దానిని ప్రయోగించ జూచినవారిలో కొందరు (పఠాభి కూడా) ఈనాడు మాత్రాచ్ఛందో రీతులను ప్రయోగిస్తున్నారు, నిజమే. 'అభ్యుదయ' (మార్చి 1958) లో చేకూరి రామారావు 'మాత్రాఛందస్సు ప్రాశస్త్యం' అనే వ్యాసంలో అన్నట్టు,

"కవిత్వమూ సంగీతమూ వేర్వేరు కళలనీ, అందుచేత కవిత్వం ఛందోబద్ధంగా ఉండకూడదనిన్నీ, స్వేచ్ఛగా ఉండాలనిన్నీ కొంద రభిప్రాయ పడ్డారు. అయితే ఈ వాదాన్ని అనుసరించినవారే తమ అభిప్రాయాలను మార్చుకొని మాత్రా ఛందస్సులనైనా సే మన్నట్టు కనిపిస్తున్నది."

అయితే కొత్త కవుల మాటో ? వాళ్ళకు మాత్రలే మింగుడు పడడం లేదంటే, గణాల గుణించాల మాటెందుకు, యతి ప్రాసల ఊసెందుకు ? పడిమిహారు తెలుగు కవులలో గూడా తిలక్, కుందుర్తిలాంటి వాళ్లు సవ్యసాచిత్వం ప్రదర్శిస్తున్నారు. వచన గేయంలోని గేయ గుణాన్ని ఆరుద్ర బాగా దెబ్బతీశాడు. ఊహాప్రహేళికలు (యస్వీ జోగారావు), కావ్యోపన్యాసాలు (రమణారెడ్డి) పేర్లతో వచన గేయం ప్రయుక్త మౌతూనే వస్తోంది. అరిసెరాల విశ్వం వంటి అత్యాధునికులు దానికి సిద్ధాంత పటిమను సమకూరుస్తున్నారు. కేశవ్‌రావ్, వరవరరావు, మురళీధర్, మాదిరాజు రంగారావు వంటి కవులు దానికి గల అవకాశాలను కొల్ల గొడుతున్నారు. కాబట్టి మాత్రా ఛందస్సు వచన గేయాన్ని పీటు గొట్టిన సూచనలు నా కెక్కడా కనిపించడంలేదు.

# తెనుగులో వచన కవిత్వం

అంతేగాదు. భాషా విషయాలలో ఆధునిక భావాలు లేని విమర్శకులు గూడా ఈ స్థితిని విధిలేక నైనా గుర్తించి, అందులోని గుణాలను చిత్తశుద్ధితో బయల్పరుస్తున్నారు. అంటే వచన గేయానికి మన్నికతోబాటు మన్నన (Respectability) కూడా లభిస్తోంది. 1955 ఆగస్టునెల 'భారతి' లో బైరాగి, తిలక్‌గార్ల గీతాలను రెంటిని ప్రస్తావిస్తూ, కురుగంటి సీతారామయ్య ఇలా రాశారు :

''రెండును గీతములని పిలువబడినను, గణ మాత్రా ఛందస్సులలో నేదియు వానిలో లేదు. కాని, యొక విలక్షణమైన లయ మాత్ర మున్నదని చెప్పక తప్పదు. ఆ లయయే వీనికి కావ్యత్వమును కల్పించినది. వీనిని భావ గద్యము లనదగును.''

ప్రాచీనులు నవీను లౌతుంటే, నవీనులు కొందరు ప్రాచీనతా రక్షణకు కాసెలు బిగించడంలో వింత ఏమీ లేదు. వచనగేయ కావ్యాలు మింగుడుపడని సమీక్షకులు, దిన పత్రికలలో అనేకు లున్నారు. సమీక్షల పేరిట వారు కవుల తలల మీద అక్షింతలు చల్లి ఆశీర్వదిస్తున్నా మనుకొంటారేమో గాని, నిజానికి మొట్టికాయలు గూడా అంత విసురుగా గట్టిగా తగలవేమో ! అదైనా మేలు. ఎందుకంటే, మెల్లమాత్రమే కాబట్టి. పూర్తి గుడ్డితనాన్ని ఉదాహరణ పూర్వకంగా ఈ విషయంలో చూపాలంటే ఇదుగో, 'గోరా' ను చూడండి ! 17—12—63 'ఆంధ్రభూమి' సంచికలో 'వినాయకుడి వీణ' ను మీటుతూ ఎంత రౌద్ర సంగీతం వినిపించాడో చూడండి ! ఆయన దూషించ దలచుకొన్నవా రెవరెవరో తెలుసా? (1) అభ్యుదయ కవులనిపించుకుందా మనుకునే ఎం. ఏ. చదివిన యువకులు (2) అందుపోనూ తెలుగు ఎం. ఏ. చదివినవాళ్లు (3) వాళ్లలోనూ వచన పద్యాలు రాసేవాళ్లు (4) ఇలాంటి శిష్య ప్రశిష్యులను చేరదీసే అభ్యుదయ కవిత్వ పీఠాధిపతులు. వచనం కూడా సరిగ్గా రాయలేనివాళ్లు తగుదునమ్మా అంటూ ''ఎగుడు దిగుడు వాక్యాలు వ్రాసుకుంటూ'' వచన పద్య సంఘాలు స్థాపించుకుంటున్నారట. ''వచన పద్యం కాబట్టి ఛందస్సు కానీ, కనీసం అంతర్లయ కాని ఉండనక్కరలేదు. అర్థం, భావం, అసలే అక్కరలేదు. నాలుగు గజిబిజి వాక్యాలను అడ్డదిడ్డంగా కత్తిరించి ఎగుడు దిగుడుగా పేరిస్తే చాలు కవిత్వమై కూర్చుంటుంది.'' ''అవి రాయడానికి భాష అంతగా రానక్కరలేదు. ఆఖరికి శబ్దస్వరూపం కూడా తెలియనక్కరలేదు.''

ఇలాగుంది తెలుగు విమర్శకుల స్థిమితమూ మనస్థితీ! నచ్చనివాడి కార్టూను గీసి, మీసాలూ, గడ్డమూ పెట్టి, ఏడు ఫలానా మనిషి అంటే నమ్మ శక్యంకానట్లే, ఈ విమర్శ కూడా విమర్శగా నమ్మ శక్యంకాదు—ఇది రక్కసి ప్రవృత్తి!

## 2

దువ్వూరి రామిరెడ్డి హయాం నుంచి 'గోరా' హయాం వరకు, సాంప్రదాయ నిహితులైన విమర్శకులకు ఇంత మనస్తాపం కలిగించిన వచన గేయాల పూర్వాపరాలను వెదకక తప్పదు.

సాంఘిక జీవిత పరిణామ క్రమానికీ భావరూపాల పరిణామ క్రమానికీ నేరుగా, తీరుగా కాకున్నా, డొంకతిరుగుడుగా హెచ్చు తగ్గులుగా నైనా సంబంధం ఉంటుంది. ఇది ప్రధానంగా వచన యుగం కావడం యాదృచ్ఛికమైన సంగతి కాదు. ప్రపంచ సాంఘిక చరిత్రలో 17 వ శతాబ్ది మధ్యకాలం నుంచీ మొదలై త్వరతోనే ఉన్నతం కాలేక పెట్టుబడిదారీ పరిణామానికి జతగా, నవల, చిన్న కథ, సాంఘిక ఇతివృత్తంగల వచన నాటకం వగైరా వగైరా రూపొందాయి. మత విశ్వాసాలూ, రాజరికమూ, భూ సంపన్నవర్గపు ఆధిక్యమూ ప్రబలంగా ఉండిన రోజుల్లో, ప్రకృతి సమస్తం గురించి మర్మ నావృత పొరలతో భావించిన రోజుల్లో, విజ్ఞానశాస్త్రం పెంపొందని రోజుల్లో, కావ్యానిది అగ్రతాంబూలంగా ఉండేది. యథార్థాలమీద భ్రమలు పెంచడం, అందమైన అబద్ధాలను ఊహాశక్తితో సృష్టించడం, సాహిత్యపరమ ధ్యేయంగా ఉండేది. అయితే ఇప్పటిరోజుల్లో, అబద్ధానికి అంత విలువలేదు. అందంగా చెప్పడం మాత్రం అప్పటికీ ఇప్పటికీ సాహిత్యానికి ధర్మంగా నిలిచిఉంది. సాంప్రదాయిక ఛందస్సూత్రాలతో వర్తమాన వాస్తవాన్ని సమస్తాన్నీ ఇమిడ్చి చెప్పే వీలు ఉండటంలేదు. యథార్థాన్ని వివరించి చెప్పడమే సాహిత్యపరుని ధర్మమౌతోంది. అంటే, శాస్త్రానికీ కళకూ పరిహద్దు చెరిగిపోతోం దనడం నా భావం కాదు. పూర్వం వాటిమధ్య ఉండిన విరోధభావం ఇప్పుడూ లేకపోలేదు గాని, అది క్రమంగా సన్నగిల్లుతున్నట్లు ఎందరో మేధావు లంటున్నారు. Two Cultures అనే గ్రంథంలో సి. పి. స్నో ప్రభృతులు ఈ సమన్వయాన్నే దర్శించగలుగుతున్నారు. ఈ యథార్థ దర్శనంలో కవిత్వ స్వరూపం మార్పుచెందక తప్పదు. వచనగేయ మనేది ఆ మార్పులకు పరాకాష్ఠ.

దువ్వూరి రామిరెడ్డి విజ్ఞులైన విమర్శకులు కాబట్టి, వచన గేయానికి గల మూలాల విషయంలో కొంత పరిశోధనకు పూనుకొన్నాడు. వాల్ట్ విట్మన్ Leaves of grass లో ప్రయోగించిచూపిన Vers Libre (ముక్తచ్ఛందం)

వచన గేయానికి వాల్మీకం అని కనుగొన్నాడు. కాదని ఎవడన గలడు గాని, తెలుగు కవిత్వంలో నవీన యుగావతరణం తర్వాత గూడా త్వరలోనే ఘనీభవించి స్వేచ్ఛ ప్రసారాన్ని నిరోధించిన కావ్యరూపానికి వ్యతిరేకంగా ఆధునిక కవులు తలపెట్టిన పితూరీలో వచనగేయ మనేది అంతర్భాగమేనని ఆయన గ్రహించ లేదేమో ! భావకవులు తెలుగు కవిత్వానికి స్వేచ్ఛను ప్రసాదించి నట్లే ప్రసాదించి, అచిరకాలంలోనే (1920 ల నుండి 1930 చివర వరకు) కావ్య భాషను అతి నాగరికం (Sophisticated) గానూ, కృత్రిమంగానూ మార్చివేశారు. ఏదో క్వాచిత్కంగా పల్లెపదాలకు (నండూరి, బసవరాజు) ప్రతిధ్వనుల్లాంటివి కల్పించారేమో, ద్విపదలను పద్యప్రాయంగా వాడారేమో, గేయ కవితను కూడా సమాదరించారేమో, అయితే ముఖ్యంగా వృత్తాలకు చిలవలూ పలవలూ కల్పించారు. మాత్రాబద్ధమైన ఛందస్సులను సృష్టించకపోలేదు. భావ కవిత్వ యుగాంత కాలంలోని కవులు కొందరు (సంపత్, గణపతిశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు వగైరా), మాత్రా ఛందోగతులలో చిత్ర విచిత్ర రీతులను కల్పించి గేయాలు రాశారు. అయితే ఇవేవీ సరిపోలేదు కనుకనే, ఆధునికుల్లోనూ ఆధునికులైన కవులు (శ్రీ శ్రీ, పఠాభి, శిష్ట్లా, ముద్దుకృష్ణ వగైరా) ఇంకొక అడుగు ముందుకు వేశారు. మాత్రా చ్ఛందస్సులనుండి వేసే ఘుందడుగు ఎక్కడికి దారితీయగలదో, ఆ ముక్తచ్ఛందో సీమలకే వచ్చి చేరారు. ఇది—వచన గేయావతరణ—నవ్య సాహిత్య పరిణామగతికి శిఖరాయమానమైన సిద్ధి. 1947 జనవరి 'భారతి' లో, 'కవిత్వంలో క్రొత్త రీతులు : వచనము లాంటి పద్యాలు' అనే వ్యాసం రాస్తూ, మల్లవరపు విశ్వేశ్వర రావుగారు ఇట్లన్నారు :

''ప్రబుద్ధ జీవితం యొక్క మెలకువలన్నీ కవిత్వ రచనలో ప్రతిబింబించాలంటే, మన కావ్య సాహిత్యంలో ప్రచారంలో ఉన్న అయిదారు ఛందస్సులూ సరిపోవడంలేదు. పైగా అవి అతకడమూ లేదు. అందువల్ల స్వతంత్రించి, విషయభావాలకు అనుగుణమైన క్రొత్త గమనాలు కనిపెట్టుతూ, నవ కవులు సంపూర్ణ వ్యక్తతకు మార్గాలు నిర్మించుకొంటున్నారు.''

ముక్తచ్ఛందో రూపాలను సృష్టించడంలో, ఈ ఆధునికులకు ఎలాంటి ఉద్దేశాలు ఉండినాయో, వాళ్లయి వాళ్లు వివరించిందాకా మనకు విస్పష్టంగా తెలియకపోవచ్చునేమో గాని, శ్రీ శ్రీ వాక్య మొకటి భావగర్భితంగా ఉంది : ''పద్యం శైలుబండి నడక వంటిది. గద్యం విమాన విహారం వంటిది.' పద్య గద్యాలను సంధానించినప్పుడు, సిద్ధించగల ప్రయోజనం ఒక్కటికాదు. సూక్ష్మాతిసూక్ష్మభావ విశ్లేషణానికి పరిపూర్ణమైన అవకాశం, పొల్లు మాటలను దాదాపు పూర్తిగా విసర్జించి వాడుకలోని పలుకుబళ్లకు అతి సమీపంగా కావ్య భాషను తీసుకెళ్లే వీలు, నియమితస్థానాల్లో యతి, ప్రాసా నిర్బంధం వైదొలగినప్పటి భావ వ్యక్తీకరణకు నిరాఘాటమైన వెసులుబాటు మరెన్నో !

అంతేగాని, ఛందస్సును నిర్వహించలేక నిష్బంధాలకు లోబడి కావ్యం రచించలేక వచన గేయాలను ఆశ్రయిస్తున్నారని వినవచ్చే విమర్శలు, ఎవరిపట్లనైనా నిజమౌనేమోగాని, దాని ప్రయోక్తలైన శ్రీ శ్రీ, పఠాభి, రెంక్, కుందుర్తి వంటి వారిపట్ల పచ్చి కల్ల. అత్యాధునికుల్లో గూడా నావంటి ఒకరిద్దరితో నేమి గాని, అనేకులకు ఛందస్సు భయం గొప్పే భారం కాదు. ఇలాంటి విమర్శలను మనస్సులో పెట్టుకొనే ఏమో, The Music of Poetry అనే వ్యాసంలో టి. ఎస్. ఇలియట్ ఇలా రాశాడు :

''As for 'free Verse', no verse is free for the man who wants to do a good job. A great deal of bad prose has been written under the name of free Verse Only a bad poet could welcome free verse as a liberation from form. It was a revolt against dead form, and a preparation for new form, or for the renewal of the old; it was an insistence upon the inner unity which is unique to every poem, against the outer unity which is typical.''

ముక్తచ్ఛందమనేది కవిని విశృంఖలుణ్ణి విధ్వంసకారునీ చేయదు, కావ్యరూపాన్ని గౌరవించని కవి, చెడ్డకవి అవుతాడు. కావ్యాన్ని విరూపమో కురూపమో చేయడంగాదు సమస్య. మార్పు చేర్పులకు వీలీయక శవప్రాయమైన కావ్య రూపాన్ని విసర్జించడం, కొత్త రూపాన్ని సాధించడంకోసమో. పాతదానికే ప్రాణప్రతిష్ఠ చేసి పునర్నవం చెయ్యడం కోసమో! కావ్యానికి గల ఐక్యతలలో బాహిరమైన ఐక్యతను గురించి బల్లగుద్ది చెప్పేవాళ్ళు ఛందస్సును ప్రస్తుతిస్తారు. ఆంతరంగికమైన ఐక్యతను గురించి నొక్కి చెప్పేవాళ్ళు, ఆ కావ్యం యొక్క విలక్షణత్వాన్ని అభిమానిస్తారు. ముక్త ఛందంవల ఈ ఆంతరంగిక ఐక్యత, విలక్షణత్వమూ కావ్యానికి సంప్రాప్తిస్తాయి, అని ఇలియట్ భావం.

ఇంగ్లాండులో 'జార్జియన్ పొయట్రీ' అని పేరు బడిన కావ్య సంప్రదాయం ఇలాంటి మృత రూపాన్ని ఆశ్రయించి ఉండింది. దానికి సవాలుగా బయలుదేరిన నవ్య ఆంగ

# తెనుగులో వచన కవిత్వం

౯౦ కొన్నేళ్లపాటు ఛందో స్వాతంత్ర్యాన్ని వరించింది. ఇలియట్, పౌండ్, లారెన్సు, ఆల్డింగ్టన్ ప్రభృతి కవులు అప్పట్లో 'ఇమేజిస్టులు' గా పేరు మోశారు. స్పష్టత, సందర్భ శుద్ధి, పటుత్వము లక్షణాలుగా కలిగి అప్రస్తుతమైన వ్యక్తి మనోద్రేకాలను నిరాకరించి, దర్శించినదాన్ని చిత్తశుద్ధితో చూపెట్టగోరిన ఈ ఉద్యమం, ముక్తచ్ఛందాన్ని ప్రయోగించింది. సానెట్, హీరాయిక్ కప్లెట్ వంటి సాంప్రదాయిక కావ్యరూపాలు వాడివాడి చేవదరగిపోయి ఉండినందుచేత, వాటికి కాస్త విరామం కలిగించడం జరిగింది. ఫ్రెంచి కవులూ అదే అవస్థకు లోనైనారు. కాబట్టి ఉభయులకూ, ఇప్పుడు పనికి వచ్చిన కావ్యరూపం కొంతవరకు పూర్వం పద్య నాటకాలలో ఉపయుక్తమైన బ్లాంక్ వెర్స్, కొంతవరకు వాల్ట్ విట్మన్ పెట్టిన వరవడి. ముఖ్యంగా రెండవది. 'Contemporary Poets' అనే కావ్య సంకలనానికి ఉపోద్ఘాతంలో, కెన్నెట్ అల్లాట్ ముక్తచ్ఛందాన్ని ఇలా నిర్వచించాడు :

"A Cadenced form of writing, buttressed with repetitions, perallelisms, and occasional rhymes, derived directly from Whitman and beyond him from the translators of the metrical portions of the Bible."

బైబిలులో ఛందోబద్ధమైన భాగాలను అనువదించిన వాళ్లనుండీ, వాల్ట్ విట్మన్ నుండి నేరుగానూ, ఈ పద్ధతిని ఆంగ్ల కవులు స్వీకరించారట. నియమిత స్థానాలలో గాకుండా కావ్యనుంతటా ప్రవహించి శ్రవణపేయత్వానికి తోడ్పడే ప్రాసలతోబాటు, ఒండొంటితో సానురూపర కలిగిన కావ చరణాలు సాధించే ఐక్యత, అక్కడక్కడగా పద్య పాదాలను పోలిన భాగా లుండటంవల్ల కలిగే వైచిత్రి—వీటి ఆధారంగానే ముక్తచ్ఛందానికి బటువు ఏర్పడిందని అల్లాట్ భావం.

వాల్ట్ విట్మన్ గురించి వివరాలకు పోకుండా ముఖ్య విషయాలను స్పృశిస్తే చాలు. Leaves of grass రచించక ముందునుంచీ, వృత్తగంధి గద్యమని వర్ణించదగిన (Poetic prose) రచనా పద్ధతిని చేబట్టినట్లు అతని నోటుబుక్స్ సాక్ష్య మిస్తున్నాయి. మామూలు జర్నలిస్టుల భాష, తన 'ఆత్మ' యొక్క భావనా సంపత్తినీ ప్రవక్తృ దృష్టినీ వెల్లడించజాలదనీ, సాంప్రదాయిక కావ్యభాషగానీ, ఛందస్సులు గానీ తన భావ సంఘర్షణను నిరూపించజాలవనీ విట్మన్ గ్రహించాడు. అది గద్యమూ కాదు. పద్యమూ కాదు. గద్యంగా కనిపించే పద్యం! పద్యగుణమే ప్రధానంగాని గద్య గుణం కాదు. అమెరికన్ ప్రజా సామాన్యం అవగత మొనర్చుకోగల ఉద్రిక్త ఉపన్యాస ధోరణితో, వివిధానుభూత, లయ స్వచ్ఛంద లయా వ్యూహం ద్వారా వ్యక్తీకరించి, పఠితల, శ్రోతల భావనను ఉన్నత సీమలకు ఎగయింపజేయ సంకల్పించాడు. "కళాసంగీతం" కంటె "హృదయ సంగీతం" మరింత సుభగమైనదని నమ్మాడు. లయా ప్రధానంగా రాశాడు. లయ నిరంతరాయ మైనందుచేత, భావ గోచరమైన దృశ్యం అవిచ్ఛిన్నమైనందుచేత, ఈ ముక్తచ్ఛందానికి గూడా కావ్యానికి గల వూపూ విసురూ, అందమూ శ్రవణసుఖమూ లభించాయి. మహోపన్యాస ధోరణి కావ్యచరణ నిర్మాణాన్ని శాసించింది. (Walt whitman : A Biography : H. S. Canby) విషయం ఇది కాగా, ప్రజాతంత్ర భావములకు దర్పణ మైనందుచేతనే, Leaves of grass కు ఇంగ్లాండులో బహుళ ప్రశస్తి చేకూరినట్లు రామిరెడ్డిగారు ఆ వ్యాసంలో రాశారు. నేనా గ్రంథమును మొట్టమొదట చదివినప్పుడు ఇటువంటి మహోన్నత భావములు ఛ్ఛందోబద్ధమై యుండిన మరెంత రమణీయముగా నుండెడివో యని తలంచితిని."

ఇంగ్లాండులోకూడా ముక్తచ్ఛందో ప్రాభవకాలం చాలా పరిమితమే ననాలి. ఎందుకంటే 1930ల తర్వాత మళ్లీ సాంప్రదాయక ఛందో రూపాలు తల ఎత్తడం జరిగింది. ఈనాడు ఫ్రీవెర్స్ అనేది అంతగా గౌరవ స్థానం పొందడం లేదు. అది వేరే విషయం. ఇంతకూ తెలుగు కవిత్వ పరిణామంలో వచన గేయానికి అంకురార్పణ చేసినవారు ఎవ్వరూ నేరుగా వాల్ట్ విట్మన్నుండి ప్రోత్సాహం పొందినట్లు కనిపించదు. బహుశా ఇంగ్లీషు కవిత్వంనుండి పొంది ఉండి ఉంటారు. అనుకరణోత్సాహం దీనికి కారణం కాదు. స్వభాషా కవిత్వంలో ఏర్పడిన దుస్థితికి ప్రతిచర్యగానే దీనిని భావించాలి. గాని, ఇంకో విధంగా కాదు.

నేటి వచన గేయానికి గల వేళ్లను వెదికి కనిపెట్టడంలో, ప్రాచీన సంస్కృతాంధ్ర కావ్యాలలోనూ ఛందో గ్రంథాలలోనూ కనుదగిలే రూపాలను కొన్నిటిని కొందరు ఉద్ధరిస్తున్నారు. పోలికలు చూపి తేడాలు చెప్పడం వరకే అయితే ఫరవాలేదు గాని, ఆ బోదెలనుండి ఈ శాఖలు మొలిచాయని భావిస్తే, అబద్ధాన్ని సత్యంగా భ్రమించిన వాళ్ల మౌతాము.

'అభ్యుదయ' (1956 జనవరి)లో 'వచన పద్యాలు : కొన్ని సూచనలు' అనే వ్యాసం రాసిన శ్రీ బాదరాజు రాధాకృష్ణగానీ, 'జయంతి' (జూలై 1960)లో 'వచన పద్యం' అనే వ్యాసం

రాసిన శ్రీ దామెర మల్లారెడ్డిగానీ ఈ భ్రమకు లోబడలేదు. ఇద్దరూ ప్రాచీన వచన రూప విశేషాలను వివరంగా వర్ణించారు. బూదరాజు రాధాకృష్ణగారిలాగంటారు.

''అటు సంస్కృతాలంకారికులు, ఇటు ఆంధ్ర లాక్షణికులు గద్య భేదాలను వక్కాణించినప్పుడు— పద్య భాగాలు అంతర్గర్భితంగా ఉన్న గద్యాలను 'వృత్తగంధి గద్య'మని పేర్కొని ఉన్నారు.....లాక్షణిక మర్యాదననుసరించి చూడగా 'ఉదాహరణ కావ్యాల'లోని 'కళికోత్కళిక'లనే మాత్రాఛ్ఛందస్సులు, పాల్కురికి సోమనాథాదులు రచించిన 'గద్యము'లూ, రగడలూ, వాటి వికార రూపాలుగా, గాన యోగ్యములుగా ఉన్నప్పటికీ, పద్యాలుగా పరిగణింపబడలేదని తెలుస్తున్నది. ఈ విధమైన రచనకు 'ఉత్కళికా ప్రాయగద్యం' అనిపేరు. ఇట్లా గద్య భేదాలుగా చెప్పబడిన నాల్గింటిలో రెండు గాన యోగ్యతచే పద్య కవితకు, లేక పద కవితకు సన్నిహితంగానే ఉన్నాయి.

'' 'అల్ప సమాసకము' అని లాక్షణికులు నిర్వచించిన 'చూర్ణిక' అన్న గద్యభేదాన్ని 'సంకీర్తనా చార్య'డైన అన్నమాచార్యుడు 'తాళగంధి చూర్ణిక'మని వ్యవహరించాడు. అంటే గద్య భేదాలలో మూడవదైన చూర్ణికగూడా తాళబద్ధమై గాన యోగ్యమైనదేనని గుర్తించాలి.....

''కాగా ముక్తకము' అన్న గద్యభేద మొక్కటే గాన యోగ్యం కానిదిగా ఉన్నది.''

వచన 'పద్యం' అన్నప్పుడు, పద్యశబ్దంవల్ల ప్రవ్యపేయత్వాన్ని ప్రయోజనంగా భావించినట్లవుతుంది. గాని, వచనంవలె 'చదువదగిన' పద్యాలనుకొన్నప్పుడు ప్రయోజనమేమీ ఉండదంటూ, రాధాకృష్ణ పై చారిత్రక సమాచారాన్ని అందించారు. అయితే, గాన యోగ్యత ఈ వచన గేయాలకు దాదాపు లేనట్లే అనుకోవాలి. పద్య కవితకుగానీ పదకవితకుగాని ఇవి సన్నిహితం కావు. సంగీత మనేది, అనుక్రమంగా మనకు పరిచితమైన ఛందస్సులను ఆశ్రయించుకొనే ఉండనక్కరలేదు. దానిని సాధించే అవకాశాలు ఛందస్సుకు బయట గూడా అనేకంగా ఉన్నాయి. మల్లారెడ్డి అన్నట్లు '' .... ఈ రచనలో (వచన పద్యంలో) ఆ సంగీతమూ ఆ నియమాలూ లేకపోయినా ఇందులో అంతర్వాహినిగా ఉన్న అంతర్లయ, రచనా శిల్పంలోని మెలకువలూ ఈ స్థితిని కలిగిస్తవి.'' వచనంలోని వచనత్వం పోయి ''పద్యం చదివిన అనుభూతి'' కలగాలంటే, యతిప్రాసలూ, మాత్రలూ, గణాలూ అక్కరలేదు.

''మహాకవి ఆశ్చర్యం'' అనే పేరుతో శ్రీ శ్రీ గారి అద్భుత వచన రచన నొకదానిని మల్లవరపు విశ్వేశ్వరరావుగారు పైన పేర్కొన్న వ్యాసంలో ఉదహరించి, ఇది ''పద్యంలాంటి వచనం'' అన్నారు. వచనకావ్య రచనకు గల సమర్థనలన్నీ క్రోడీకరించినట్లున్న ఈ గేయంలోని ఒక ఖండం చూద్దాం:

''.... ఫంఖాన్ని (గాయత్రి సాక్షిగా చెబుతున్నాను) ఎటు తిరిగితే అటు ఒరుగుతుంది. విన్యాసంలో వికారం. మాత్రలు మింగడం నాకు చేతగాదు. అల్లిక రంగవల్లి. అంకెలు మన సంకెళ్లు ....''

స్వచ్ఛంద మనోవ్యాపారాలకు అనుగుణమైన రచనా నిర్బద్ధత, వచన కావ్యం ద్వారా సాధ్యమౌతుంది. బహిరంగంగా ఆకారం వికారానికి లోనైనట్లు కనిపించినా, అంతరంగిక ఐక్యత భావం కానంతవరకు, వచన కావ్యం కాకుండాపోదు. కవి భావోద్రేకాన్ని కుదించే గుణ్ణి ఉండకపోయినా గాని, సొను ఖాళీలో చూస్తే పదులు రెండు గాక రెండుమూడు కనిపిస్తాయి. అంటే, నిర్మాణ కళ్యాణ, స్వాభావికంగాను (Spontaneous) వచ్చేదిగాను ఉద్రేకాన్ని అనేక విధాలుగా నియమించుకుంటూ రచన సాగిస్తారు. ఇక వచన సంగీతమా ? అది గణాలమీద, మాత్రలమీద, యతి ప్రాసల మీద మాత్రమే ఆధారపడుతుం దనుకునే వాళ్లకు తను చెప్పు తప్ప ఇతర ప్రమాణాలేవీ లేవు. సరి సరి నాదంక బడిన పద్యులనే గాని, వింత పద్యులను చెవి గాని, మనస్సు గాని హర్షించలేదు.—చిత్రాన్ని కన్ను హర్షించలేనట్లే !

నిజానికి మాటకూ, పాటకూ వైరుధ్యంలేదు. కవిత్వంలో వచనం అనివార్యం. పదాంలోనే గాక అర్థంలో గూడా సంగీతం ఉంది. అయితే వచన పద్ధతి ద్వారా సూచించదగిన అర్థం కంటె, పద్య పద్ధతి ద్వారా సూచించగలిగేది భిన్నమైనదీ, అధికమైనదీ. కవిత్వంలో సంభాషణాక్రమం ఉంది. అయితే అది నిత్య వ్యవహారంలోని సంభాషణాశైలికి సమరేమీ కాదు. కావ్యంలోని సంభాషణను విన్నప్పుడు ఆ శ్రోత, చదివినప్పుడు ఆ పఠిత నిపుణుకోవాలంటే, 'నేనే గనుక కవిత్వం చెప్పగలిగితే, ఇలాగే నేను మాట్లాడగోరుతాను'. అలా అన్నుకొన్నప్పుడే, ఆ కవిత్వంలోని సంభాషణ క్రమం ధన్యమౌతుంది. అంటే, తన కాలంలోని నిత్య సంభాషణలో గర్భితమై ఉన్న సంగీతమే, ఆ కవిత్వానికి ప్రాప్తిస్తుంది. అందమైన పదాలను కూరిస్తేనే సంగీతం పుట్టుకువస్తుం దనుకోవడం భ్రమ.

''The music of a word arises from its relation first to the words immediately preceding and following it, and indefinitely to the rest of its context; and from another

relation, that of its immediate meaning in that context to all other meanings which it has had in other contexts, to its greater or less wealth of association."

(The Music of poetry· T. S. Eliot)

అంటే, కవిత్వ గత సంగీత మనేది శబ్దార్థాలను ఆశ్రయించుకొని ఉంటుంది. గాని, శబ్దాశ్రితం మాత్రమే కాదు. ముత్తెపు సరులు పోహళించినట్లుగా "తమలోన దొరయు శబ్దములు గూర్చి" తేనే చాలదు. 'ప్రభావతీ ప్రద్యుమ్నము'లో పింగళి సూరన చేసిన వర్ణన, టి. ఎస్. ఇలియట్ భావాన్ని పూర్తిగా నిరాకరించదు.

"సీ. శబ్ద సంస్కార మెచ్చటను జాఱఁగనీక
పద మైత్రి యర్థ సంపదలఁ బొదలఁ
దలఁపెల్ల సక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తి దోషంబు పొంతఁ బోక
యాకాంక్షిత స్ఫూర్తి యాచరించుచును శా
ఖా చంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థ భావంబు పాడుకో నడుకుడు
సుసపత్తి యొందు నత్యార్జితముగ
తే. గీ. నొకటఁ బూర్వోత్తర విరోధ మొందకుండఁ
దత్త దవయవ వాక్య తాత్పర్య భేద
ములు మహా కావ్య తాత్పర్యమునకు నొనరఁ
బలుకనేర్పుటు బహు తపః ఫలముగాదె ?"

పాడడ మనేది ఒక్కటే కవిత్వానికి ధ్యేయం కాదు. అలా గయితే ప్రతి కావ్యమూ పద్యమో పదమో కావాలి. కవి స్వగతమే లోకంతో అతని సంభాషణ. ఆ సంభాషణ వచన గేయంతో సాగినంత సులువుగా ఒడుపుగా ఇంకొకదానిలో సాగదు. పైగా, దానికి సహజత్వం కూడా ఇక్కడ సిద్ధించి నంతగా ఇంకెక్కడా సిద్ధించదు. దామెర మల్లారెడ్డి రాసి నట్లు "రచనలో ఉండే వచనత్వంవల్ల దైనికంగా మనం వాడే పదాలూ, వస్తువులూ, అభివ్యక్తులూ, యథాతథంగా దీనిలోకి వస్తవి. ఛందో నియమాదులు లేకపోవడంవల్ల వ్యర్థ పదాలు దాదాపుగా రావనే చెప్పాలి. పాద పూరణం అన్న యిబ్బంది అసలే లేదు. భావాన్నిబట్టే వాక్య నిర్మాణం చేసుకో వచ్చు." చెప్పదలచిన భావాన్ని శాఖా చంక్రమణం లేకుండా చెప్పాలంటే, మాత్రాచ్ఛందస్సు కంటె వచన గేయమే ఎక్కువ యోగ్యమైనది.

వచనగేయాన్ని గురించి అతిశయోక్తులు పలికి, లేని మహత్వాన్ని దానికి ఆపాదించడం మంచిదికాదు. కావ్య స్వరూపంలో వచ్చిన ఈ మార్పును కావ్య స్వభావానికి అంట గట్టడం తగదు. ఈ రెంటి నడుమ సంబంధం లేదనను గాని, ఆ సంబంధం శ్రీ అరిపిరాల విశ్వం ఊహించిన సంబంధం కాదనుకుంటాను. 'కాలం గీస్తున్న గీతలు' అనే తమ కావ్య సంపుటికి చేర్చిన 'ఆ ముఖమ్' లో విశ్వం ఇలాగంటారు. "ఆవేశరహితంగా, పురాణ సంప్రదాయం నుంచి, కావలసిన మంచిని స్వీకరిస్తూ ఆలోచనాత్మక పరిణామాన్ని కోరే తత్త్వం (Evolutionists) ప్రస్తుత వచన కవితకు వెన్నెముక యీ పరిణామ వాదమే, ఈ సమన్వయ సౌమనస్య సిద్ధాంతమే."

ఈ వాక్యాల భావంతో ఎవరికీ పేచీ ఉండనక్కరలేదు గాని, దీనికీ వచన కవిత్వానికీ గల బాంధవ్య మేమిటో ? "ఆలోచనాత్మక పరిణామాన్ని కోరే తత్త్వం" పద్యంలోనూ, పదంలోనూ వెలువడగూడదా ? వచన కవిత్వం నుండి ఒక తత్వాన్ని రాబట్టే ప్రయత్నం వృథా పరిశ్రమ. అది ఆ కవి వైయక్తిక తత్వమే గాని, వచన కావ్యకర్తల సమిష్టి తత్వం కాదు. మార్క్సికవాదుల నుండి అభ్యుదయవాదుల వరకు ఈ ప్రక్రియను నేడు ప్రయోగిస్తున్నారని మరువగూడదు.

శ్రీ శ్రీ, తిలక్‌ల తర్వాత వచన గేయాన్ని కుందుర్తి ఆంజనేయులుగారికంటే బహుళంగానూ సామర్థ్యంతోనూ ప్రయోగించిన కవులు లేరేమో! గోపాల చక్రవర్తిగారి కావ్య సంపుటి "కలం కలలు"ను "హృదయం విప్పి" పరిచయం చేస్తూ, కుందుర్తి చెప్పిన మాటలు వెలలేని మాటలు. వచన గేయం రాసి మెప్పించడమంత కష్టమైన పనిలేదు. దానికి ఛందస్సు లేదుగా ఆదరువుగా? అసమర్థుని చేతిలో అది కుంటు బడుతుంది. లేకుంటే చస్తుబడుతుంది. ఒక్కోసారి చెడిపోయిన వచనంకంటే చెడిపోతుంది. ఇంకోసారి పద్య వాసనలు మస్తుగా ఒళ్లంతా పులుముకుని, అదీ ఇదీ కాకుండా పోతుంది. అంచేతనే కుందుర్తి ఇలాగంటారు.

"కేవలం పద ప్రయోగ కౌశలం, ఊహాశక్తి ప్రదర్శన, నిరంతర శబ్ద చిత్ర కల్పన, ఎక్కడికక్కడ ఓహో అనిపించగల నేర్పు ఉంటేనే, వచన గేయం రక్తి కడుతుంది".

అది ఎందరికోగాని లేకపోవడ మటుంచి, అద్యంతమూ అందాల ముద్దగా ఏ కావ్యాన్నీ తీర్చిదిద్దనక్కరలేదుకూడా. కాస్త మన్నూ కాస్త మిన్నూ కలగలిసినట్లు, వాస్తవాన్ని కల్పననూ, సామాన్యాన్నీ అసమాన్యాన్నీ కలగలుపుతాడు కవి. అందుచేత వచన కావ్యం, పద్యగద్యాల మేలికలయిక, నవీన యుగ భౌతిక మానసిక వాతావరణంలో కవిత్వ స్వరూపంలో సహజంగా కలిగిన మార్పు.

ఈ మార్పును టాల్‌స్టాయివంటి మహాశయుడు అభిలషించాడని, సోవియట్ సాహిత్య విమర్శకుడైన కాన్‌స్టాన్‌టిన్ పౌస్టోవస్కీగారి 'The golden Rose'లో నేను చదివాను.

"Where is the border line between prose and poetry, I shall never know. Why are poetry and prose so closely linked, and happiness and unhappiness?... Try all at once to blend poetry with prose..."

పౌస్టొవస్కీగారి అభిప్రాయాన్ని కూడా గమనిద్దాం:

"The summits of literature and true perfection can be reached only in an organic integration of poetry and prose, or, to be exact, in saturating prose with the essence of poetry with its well-springs, its pure breath, the alluring power of its beauty."

కవిత్వానికీ వచనానికీ రూపంలో చెరిగిపో మొదలైన ఎల్లలు అక్కడితో ఆగుతాయా? వచనంలోని మెరుగులను కవిత్వం స్వీకరించి కాయకల్ప చికిత్స చేసుకుంటున్నట్లే, కవిత్వం లోని సౌందర్య ప్రధాన దృక్పథాన్ని వచనం స్వీకరించి ఉత్సాహి కాగోరుతున్నది. కవిత్వానికి కావలసింది పటువు, బిగువూ, వచనానికి కావలసింది సొగసూ మెత్తనా. ఈ లోపపూరణం విడివిడిగా గాక, రెండూ సమ్మేళన పొందినప్పుడే సులువుగా జరుగుతుంది. శ్రీ శ్రీ గారిని గురించి ప్రస్తావిస్తూ, 'భువన ఘోషలో' పూర్వం నేను రాసిన చరణం, ఈ ఊహను మనస్సులో పెట్టుకుని రాసిందే :

''రసము పౌరుష పాటవంబును
లుప్తమై చను పద్యనాదము
గద్యలోపలి గర్జ దూరిచి,
నడక హొంవా నగిషి నేర్పరి
తనము పోయిన గద్య ముక్కున
కవనగరిమా కదను దూరిచి,
పద్య గద్యోద్వాహ వైభవ
శుభారంభకు డాయె శ్రీ శ్రీ!''

1939 'భారతి'లో శ్రీ శ్రీ చెప్పిన జోస్యం మిదతంభొట్ల జోస్యం కాలేదన్నది, 1964 వరకూ గడిచిన పాతికేళ్ళ కాలపు తెలుగు కవిత్వపు ముందు నడక రుజువు చేస్తున్నది. ఇది ఋజువని లోకం అంటున్నది.



# సాహిత్య భవితవ్యం

శ్రీ జి. వి. కృష్ణరావు

న సంసారస్య నిర్వాణాత్కించి దస్తివిశేషణం
న నిర్వాణస్య సంసారా త్కించిదస్తివిశేష
ణమ్॥

నిర్వాణస్యయా కోటిఃకోటిః సంసరణస్యచ
నతయోరంతరం కించి త్సుసూక్ష్మమపి
విద్యతే॥

—మూల మాధ్యమక కారికలు.

'సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్' అని భర్తృహరి కాబోలు అన్నాడు. ఈ వాక్యం కొన్ని సంవత్సరాల క్రిందట విడ్డూరంగా కనిపించింది. ''ప్రజాస్వామిక రాజ్యాలలో వ్యక్తులకు రాజ్యాలు లభించవు. కాని మంత్రిపదవులు, శాసనసభా సభ్యత్వాలు, రాయబారుల పదవులు, ఇంకా ఇతర పదవులు కోరుకోవచ్చును; లభించనూ వచ్చును. కాని, అవి అక్కరలేదు. కవిత్వం ఒకటి ఉంటే చాలు ననుకోవడ మేమిటి ? ఇది ఆలోచించి అంటున్న మాటేనా ?'' అని నాడు అనిపించింది. ఏ కొలదిమంది మాత్రమో తక్క తక్కిన సమాజమంతా నేడు ఇలాగే భావిస్తున్నది.

ఇంతకూ కవిత్వానికిగాని, మరితర లలితకళలకుగాని ఇంత ఉత్తమ స్థానం ఇవ్వవచ్చునా ? ఇవ్వవచ్చునంటే ఎందుకు ఇవ్వాలి ? 'చాలుంజాలు గవిత్వముల్ నుడువుచో సత్యంబు సాధింతురా ?' అని మరొక కవి ప్రశ్నిస్తున్నాడు. ఈ వాక్యం భర్తృహరి తాత్పర్యాన్ని అనుగమిస్తున్నదా, ఖండిస్తున్నదా ?

కవిత్వమంటే ఏమో చెప్పుకొనక యీ ప్రశ్నలకు సరియైన సమాధానం పొందలేము. మరి కవితా నిర్వచనానికి ప్రయత్నించటమంటే మహా కూపంలో పడటమే. అత్యంత ప్రాచీనకాలం నుంచి నేటివరకూ ఎందరో మనీషులు కవిత్వాన్ని ఎన్నోవిధాల నిర్వచిస్తూ వచ్చారు. అవిసంవాదకమై అందరికీ ఆమోదనీయమైన నిర్వచనం కనిపించటంలేదు. ఒకవేళ అలాంటిది ఉన్నదేమో తెలియదు. కాని, కవిత్వం విన్నప్పుడు గుర్తించవచ్చు ననుకొంటాను.

'ఇంతకూ కవిత్వాన్ని గుర్తించే లేమిటి ? అంతరాత్మ ఏమైనా చెబుతుందా ? ఏమని చెబుతుంది ? ఆ రహస్యం కొంచెం మాకుగూడ చెప్పండి' అని అనవచ్చును. ఎవరు ఎలా వెక్కిరించినా ఏది కవిత్వమో, ఏది కాదో చెప్పవలసింది హృదయమే. అయితే ఎవరి హృదయం చెప్పాలి ? నా హృదయమా, మీ హృదయమా, సమాజ హృదయమా ?

నా హృదయం మీకుగాని, మీ హృదయం నాకుగాని, సమాజ హృదయం మనకుగాని చెప్పలేదు. ఎవరి హృదయం వారికే చెబుతుంది. తన హృదయం తనకు ప్రమాణంకాని అన్య హృదయం కాదు. ప్రత్యయనేయ బుద్ధులు పొందేది శాస్త్రార్థమైతే కావచ్చునుగాని, కావ్యానుభూతి మాత్రం కాదు.

సరే కవిత్వ విషయంలో హృదయం ఏమి చెబుతుంది ? శబ్దపూర్వకమైన రచన విన్నప్పుడుగాని, చదివినప్పుడు గాని సమాధ్యవస్థ ఏర్పడాలి. ఆ సమాధ్యవస్థ కల్పించిన రచన కవిత్వమౌతుంది. కల్పించదో, కవిత్వం కాదు. ఇప్పుడు సమాధ్యవస్థ అంటే ఏమో నిర్వచిస్తేనే కాని తాత్పర్యం బోధపడదు.

గ్రహణము, గ్రాహ్యము, గ్రహీత అన్న భేదాలు పోయి గ్రహణం మాత్రం మిగిలిఉన్న స్థితిని సమాధి అంటారు. ఇలా అనగానే ఏదో మాటల గారడీ ప్రారంభమైనట్లు కనిపిస్తుంది. దృష్టాంతం చెప్పుకొంటే ఈ చిక్కు తొలగుతుంది.

'ఒకసారి ద్రోణుడు తన శిష్యుల అస్త్రవిద్యా కౌశలం తెల్సుకొనగోరి పిట్టబొమ్మను చెట్టుకొమ్మకు గట్టి ధర్మరాజాదులను బిలిచి—''మీరు ఆ పిట్టపై గురి పెట్టుకుని సిద్ధంగా ఉండండి. నేను చెప్పినప్పుడు కొట్టండి' అని హెచ్చరించాడట. అంత అందరూ విండ్లెక్కుపెట్టుకొని సిద్ధంగా ఉన్నారట. అప్పుడు ద్రోణుడు ధర్మరాజును సంబోధించి 'పిట్టతల కనబడుతున్నదా ?' అని ప్రశ్నించాడుట. 'ఆఁ కనిపిస్తున్నదండి',–'మరి నేనో ?' – 'ఆఁ'– 'మరి నీ తమ్ములు ?'– 'ఆఁ—'

వెంటనే ఆచార్యుడు అర్జునుని సంబోధించి—'పిట్ట తల కన బడుతున్నదా ?' అని అడిగాడుట. అతడు అవునన్నాడట. మరి నేనో ? అని ప్రశ్నించగా లేదని ఆ శిష్యుడు చెప్పాడట. అర్జునునకు అప్పుడు ఏర్పడిన దానిని సమాధ్యవస్థ అంటారు.

ఇలాంటి సమాధ్యవస్థల కల్పిస్తున్నదానిని కవిత్వమని చెప్పుకోవచ్చును. అంటే పాఠకుడు బాహ్య ప్రపంచం మరచి పోయి రచనలో నిమగ్నుడు కావాలి. ఇలా అన్నప్పుడు ఒక ప్రశ్న అంకురించవచ్చును. లెక్కలు చేసుకొనే విద్యార్థి, శాస్త్ర విషయం గాఢంగా ఆలోచించే శాస్త్రకారుడు, పనితో నిమగ్నుడైన శ్రామికుడు బాహ్య ప్రపంచాన్ని మరచిపోతున్నారు. వారికి కల్పిస్తున్నవి కూడ కవిత్వ మవుతవా ?

కావు—అవి బాహ్య ప్రపంచాన్ని మాత్రమే మరపిస్తున్నవి కాని, సమస్య ఒకటున్నది, నేను ఉన్నాను, చేస్తున్నాను అన్న వాటిని మరపించటంలేదు. గ్రహణ గ్రాహ్య గ్రహీతృభేదం ఉంటున్నది.

కొన్ని సందర్భాలలో నేను అన్న జ్ఞానం లోపించ వచ్చును. తన్ను తాను మరచిపోయి ఒక విషయాన్ని గూర్చి ఆలోచించవచ్చును. అప్పుడు గూడ గ్రహణము గ్రాహ్యము అన్నవి రెండూ ఉంటున్నవి. కవిత్వమని చెప్పబడే రచన చదువుతున్నప్పుడు పాఠకుడు తన్ను తాను మరచిపోతాడు. ఆ స్థితిలో తన సంగతి స్ఫురించదు. ఆరోగ్యవంతునకు శ్వాస ప్రశ్వాసాలు గమనంలో ఉంటవా ? కావ్య పఠనంలో గూడ అంతే. కావ్యార్థం మాత్రమే పాఠకుని మనో ముకురంలో భాసిస్తుంది.

అలా భాసిస్తున్నప్పుడు పాణినీయ ధ్వన్యాలోకాదులు పాటింపబడుతున్నవని కాని, ఉల్లంఘింపబడుతున్నవని గాని, కాళిదాసాదులు అనుకరింపబడుతున్నారని కాని తోచదు. గుణ దోషాలు గూడ ప్రత్యేకంగా కనిపించవు. ఆసక్తులమై ఒక పుస్తకం చదువుతున్నప్పుడు అల్పమైన అక్షర శైథిల్యాన్ని గమనించము. అది జి. పి. బాడిలో అచ్చయిందో, ఇ. బి. బాడిలో అచ్చయిందో, పాయింట్ స్మైపులో అచ్చయిందో అన్న విషయం స్ఫురించదు. ఇలాంటివే కావ్యానుభవ అనపకర్షకాలైన గుణదోషాలు.

ఆ భాసించే అర్థము ఏమిటి ? అది ప్రత్యక్షాది ప్రమాణసిద్ధమైన జ్ఞానం కాదు. రజ్జుసర్ప భ్రాంతి వంటి భ్రాంతి కాదు. ఒక్కొక్కప్పుడు ఇదా అదా అన్న సంశయం కలుగుతుంది. సాహిత్యానుభూతి అలాంటి సంశయ ప్రతీతి కాదు. స్వప్నంలో గజ తురగాదులను చూస్తాము. కావ్యంలో భావింపబడుతున్న అర్థం అలాంటిది కాదు. కనుకనే ప్రాచీనులు కావ్యమందు ఆస్వాదింపబడే అర్థం లౌకిక పదార్థ వ్యతిరిక్తమనీ, అది అనుకార ప్రతిబింబ ఆలేఖ్య సాదృశ్య ఆరోప అధ్యవసాయ ఉత్ప్రేక్షా స్వప్నమాయా ఇంద్రజాలాది విలక్షణమనీ పాఠకునకు కలుగుతున్న అనుభవం సమ్యక్ జ్ఞాన భ్రాంతి సంశయ అనవధారణ అనధ్యవసాయ విజ్ఞానభిన్న కలాంతరాలైన రూపసంవేదనమని అన్నారు.

భాసం, కాళిదం, షేక్స్పియర్ నాటకాల వంటి రచనలు మరికొంత విశేషానుభవం కలిగిస్తున్నవి. వానిని పూర్తిగా చదివేటప్పటికి పాఠకుడు ఆ పాత్రలందు తన్మయీభావం స్థాయీభావం పొందడమే కాక ఎన్నోరకాలైన స్థితి పొందుతున్నాడు. ఆ స్థితి ఆర్య నాగార్జునుడు పేర్కొన్నట్లు చతుష్కోటి వినిర్ముక్తమైన యావంతాలు, వినిర్ముక్తం, లేదు ఏ దృష్టి ఉండదు. అనే వల్లనో మాత్రమే ప్రత్యేకమైనా కనబడుతున్నది. కనుకనే కరుణం ఒక్కటే రసమని భవభూతి, శాంతమే మహా రసమని అభినవగుప్తుడు పేర్కొన్నారు. ఈ రెంటికంటె అత్యంత ప్రాచీనుడైన నాగార్జునుడు కావ్యద్వారా ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని ప్రస్తావించకపోయినా శూన్యతత్త్వాన్ని ఉపదేశించటంవల్ల ఆయన మతంలో శాంతమే రసరాజమని చెప్పుకోవచ్చును. కావ్యంవల్ల పొందబడుతున్న ఈ స్థితి సుషుప్తి, అపస్మారం, మదిరాపాన మైకం, మూర్ఛ మొదలైన వాటి కంటె ఎలా విలక్షణమని అనిపించవచ్చును. సుషుప్త్యాద్యవస్థలలో పంచేంద్రియ వ్యాపారం ప్రవర్తిల్లదు. కావ్యాస్వాదన కాలంలో జ్ఞానేంద్రియాలు జాగరూకాలై ఉంటవి. చిన్నరక్షర సంయోగాదులు సాగుతుంటవి. అనౌచిత్యం అసంభావ్యత సోకినంత గానే మనసు ఎదురుతిరిగి బాహ్య జగత్తులో పడి పోతుంది. కనుక కావ్యానుభూతికి సుషుప్త్యాదులకూ పోలికలేదు.

ఇంతకూ ఇలాంటి కావ్యానుభవం దేనికి ? కూడు పెడుతుందా ? గుడ్డ ఇస్తుందా ? జాతిని వీర్యవంతంచేస్తుందా?

కావ్యానుభూతి అలౌకికం. ఇలాంటి అనుభవం శాస్త్రాలవల్ల గాని, ఇక్షు రసాస్వాదన వంటి భౌతిక భోగాలవల్ల గాని, లభించదు. ఈ అనుభవం అనన్యం. శాస్త్రాదులు అనంత వృతిని (infinity) ఆమోదిస్తవి. కాని, ఆ అనంత వృతి స్వరూపం అవి బోధపరచలేవు. కావ్యం అలా కాక పాఠకుణ్ణి మూర్త ప్రపంచం నుంచి అమూర్త ప్రపంచానికీ, ఆ అమూర్త ప్రపంచంనుంచి అనంతానికీ చేరవేస్తుంది. అలా చేరవేయబడుతున్నప్పుడు పాఠకుడు పొందే ఆనందం ఇష్టార్థ

ప్రాప్తివల్ల కలుగును. విమానంలో ఎక్కి తిరిగితే రాదు. చంద్రమండలంలో మొదటిసారిగా అడుగు మోపినా పొడమదు. సహృదయుడు పొందే ఆ అనుభవం అనుభవైకవేద్యం.

భోజ్య పదార్థాలకు ఉప్పు రుచి కల్పిస్తున్నట్లే మానవ జీవితానికి లలితకళలే అర్థం, విలువ కల్పిస్తున్నవి. కసాయి వృత్తియందు సాధారణంగా మనకు జుగుప్స కలుగుతుంది. ఆ కసాయి వృత్తి పాటించిన ధర్మవ్యాధునికి లోకపూజ్యత సంప్రాప్తించింది. వ్యాసభారతి లేకపోతే అది సాధ్యపడేదా ? అలాగే దొంగలను, దొంగతనాన్ని మనం క్షమించము. డాస్టవోస్కీ ఆనెస్ట్ థీఫ్ అన్న కథ వ్రాసి ఆపశ్యతోహరునికి మనచేత అశ్రు తర్పణం విడిపించాడు. లేడీ మాక్బెత్ అన్న కథతో మరొక రష్యన్ రచయిత దారుణబంధకిపై మన కరుణావృష్టి కురిపించాడు. మన దేశంలోని సామాన్య ప్రజ గాని కున్న విలువలన్నీ భారత రామాయణాలవల్ల కలిగినవే. శాస్త్రం వస్తువుల ప్రయోజనం నిర్ణయిస్తే, కవిత్వాది లలితకళలు వాటికి విలువలను కల్పించి వ్యవస్థీకరిస్తున్నవి.

కావ్యం పాఠకునకు తన్మయీ భావం కలిగిస్తున్నది. కనుక, అది లతని సంకుచిత దృష్టిని పటాపంచలు చేసి మనో వైశద్యం కల్పించి, పశుత్వం దగ్గరనుంచి పశుపతిత్వం దాక సానుభూతితో గ్రహింపజేస్తున్నది. తన మూల సిద్ధాంతాలకు విరుద్ధాలైనప్పుడు ప్రియురాలి యుపదేశాలనైనా పాఠకుడు ప్రియతర వచనాలతో తప్పుకొని పోవచ్చును. కాని కావ్యమందట్లుగాదు కావ్యాన్నే హృదయమై పోతుంది. నాగార్జునుని పరిభాషలో చెప్పవలసి వస్తే సంసారానికి మూలభూతమైన దృష్టి సమూలం నశించకపోయినా శిథిలమవుతుంది. ఈ ప్రమాదం గుర్తించి ప్లేటో తన దృష్టికనుగుణంగా ప్రాయని కవులను తన ఆదర్శరాజ్యం నుంచి బహిష్కరిస్తానన్నాడు. మన అదృష్టం బాగుండి అతనికి ఆ అధికారం సంక్రమించలేదు. నియంతృక రాజ్యాధినేతలు లలితకళలకున్న యీ శక్తిని గుర్తించి వాటిని అనుశాసిస్తున్నారు. దీనివలన లలితకళా ఖండాలు లోపించి వాటి ఆభాసాలు మాత్రమే అచటి ప్రజలకు లభిస్తున్నవి.

పురుషార్థాల పర్యంతికఫలం ఆనందమే కదా. ఆ ఆనందాన్ని సాహిత్యం అప్పటి కప్పుడే సహృదయునకు అందిస్తున్నదని అభినవగుప్తుని అభాషణం. అలా కాదు, కావ్యం ఉపదేశమే ఇవ్వాలనటమంటే అమృతం అక్కరలేదు. మకరందమే కావాలని కోరటమేకదా !

ఈ సందర్భంలో మమ్మటుడు జ్ఞప్తికి రాకమానడు.

“కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మితతయోపదేశయుజే.”

అని ఆయన అన్నాడు. కీర్తి, అర్థసిద్ధి, వ్యవహార జ్ఞానము, అమంగళ పరిహారణము కవిత్వ ప్రయోజనాలని అందరి అభిమానం కొలదీ ఆయన పేర్కొన్నాడు. కాని వాస్తవానికి ఇవి నైకాంతికాలు. కవులకు మార్గాలు చూపిన మహాకవులు నామరూపాలు లేకుండ నశించినట్లు చరిత్రనుబట్టి అనుమానించవలసి వస్తున్నది. హోమరు భిక్షాటనం చేసి జీవించినట్లు ప్లేటో చెబుతున్నాడు. వ్యవహారజ్ఞానం, శివేతరక్షతి శాస్త్రాలవల్లనూ సిద్ధిస్తవి. కనుక ఆయన పేర్కొన్న ప్రయోజనాలలో అసందిగ్ధమైనది సద్యఃపర నిర్వృతి ఒక్కటే.

మరొక విశేషం—ఏ శాస్త్రానికైనా ఏ విద్యకైనా మూలం భావన. ఈ భావనను వర్ధిల్లజేసేవి స్వప్నాలు, కవిత్వాది లలిత కళలు మాత్రమే. ఇంతకూ కవిత్వాది లలితకళల వల్ల అలౌకిక అసంపృత్యనుభవం, జీవితానికి అర్థం, దృష్టి శైథిల్యం, సహానుభవం, సద్యః పరనిర్వృతి, భావుకత లభిస్తవి.

ఇంతవరకూ సిద్ధాంతాన్ని బట్టి నిష్పన్నమైన కావ్య స్వరూపం చెప్పుకొన్నాము. కాని సిద్ధాంతానికీ, ఆచరణకూ తేడా ఎప్పుడూ ఉంటుంది. త్రిభుజంలోని మూడు కోణాల మొత్తం 180 డిగ్రీలు ఉండాలి. కాని, కొలిచి చూచినప్పుడు కొంత వ్యత్యాసం కనిపించటం విద్యార్థుల కనుభవసిద్ధమే. అలాగే కవిత్వ విషయంలో గూడ.

మనస్సు లక్క వంటిది. లక్కకు ఘనత్వము, శైథిల్యం, ద్రవము అని మూడు అవస్థ లున్నవి. ఘనత్వావస్థలో లక్క ఏ ముద్రనూ స్వీకరించదు. శైథిల్యావస్థలో వేసిన ముద్రను స్వీకరిస్తుంది. కాని, గట్టి ఒరపిడి కలిగితే ఆ ముద్ర నిలువదు. ద్రవావస్థలో మరొక ద్రవ్య కణం అందులో పడి ఘనీభవించినప్పుడు ఆ కణం రాపిడికి రాలక అందే నిలిచిపోతుంది.

మనస్సుకు గూడ ఈ అవస్థలు చెప్పుకోవచ్చును. కొన్ని రచనలను కబుర్లు విన్నట్లు వింటాము. శబ్దాలంకార ప్రధానమైన పద్య కవిత్వం, అమూలాగ్రం చదివించటం ఒక్కటే విశేషంగా గలిగిన కథలు, నవలలు, నాటకాలు, ఈ కోవలో చేరుతవి. కొన్ని రచనలు చదువుతున్నప్పుడు మనశ్శైథిల్యం కలుగుతుంది. ఈ స్థితిలో బాహ్య ప్రపంచం మరచిపోతాము, కాని తన్మయీ భావం కలుగదు. అహంతకు ద్రుతి ఉండదు. వర్ణక కవిత తెలుగు ప్రబంధాలు (తన్మయీ భావం కలిగించే ఘట్టాలు వినా), షా నాటకాలు, పాఠకుల వ్యక్తిత్వాలను మరపింపక చదివించే కథలు, నవల, నాటకాలు, ఈ కోవకు చెందుతవి.

ఈ మాట కొందరికి కోపకారణం కావచ్చును. కాని ఎవరి అనుభవాన్ని వారు పరిశీలించుకొని పఠన సమయంలో అహంత లయించినదో లేదో గుర్తుకు తెచ్చుకోవాలి. తన్మయులై వర్ణనీయార్థంలో కరగిపోయా మనుకొంటే ఈ పైని చెప్పినది అయదార్థమే.

ఇంక మూడవజాతి రచనలు సమాధ్యవస్థను కల్పించి అహంతను లయింపజేసి తమ రమ పాత్రలలోనో, సన్నివేశాల లోనో, వర్ణనీయార్థాలలోనో దాదాపు మిళితం చేసివేస్తవి. ఈ స్థితిలో మనస్సు పూర్తిగా కరగిపోయిన లక్కవలె రచనా ప్రతిపాద్యాలైన అర్థా లన్నిటినీ తనలో లీనం చేసుకొంటుంది. ఇలా లీనమైపోయిన అర్థాలు ఆమరణం మనసులో నిలిచి పోతవి. ఉత్తర కాలంలో తిరిగి ద్రవత్వం పొందినప్పుడు గూడ వెనుకటివాటిని కోల్పోక క్రొత్తవాటిని గ్రహిస్తుంది. ప్రాత వాటితో క్రొత్తవాటిని చేర్చుకొని పరిపుష్టి పొందుతుంది. ఈ స్థితిని కల్పించే రచనలకు లక్ష్యాలుగా కాళిదాసుని కావ్యాలు, సంస్కృత నాటకాలు, టాల్‌స్టాయి, డాస్టవోస్కీ, చెకోవ్, టాగూరుల ఉత్తమ కథలు, వేలూరి శివరామశాస్త్రిగారి డిప్రెషన్ చెంబు, ఇబ్సన్, యు. జి. ఒనీల్, సింజ్, ఒకేసీల రూపకాలు పేర్కొనవచ్చును.

ఇక నాలవజాతి రచనలు సబీజ సమాజ వ్యవస్థ కల్పించి క్రమక్రమంగా నిర్బీజ సమాధ్యవస్థకు కొనిపోతవి. ఈ రచనలు పాఠకునకు తన్మయీభావం కలిగించి కట్టకడపట విషయ రహితమైన సమాధ్యవస్థ కల్పిస్తవి. సంస్కృతంలో భారత భాగవత రామాయణాలు, తెలుగులో భారతం, ఇంగ్లీషులో షేక్స్‌పియర్ విషాదాంత నాటకాలు, ముఖ్యంగా హేంలెట్,— కాఫ్కా వ్రాసిన ట్రయల్, కాజిల్ అన్న రచనలు ఈ కోవకు చెందుతవి. ఈ జాతి రచనలు ఉత్తమోత్తమాలు.

మొత్తంమీద సాహిత్యంగా పరిగణింపదలచిన రచనలను నాలుగు తరగతులుగా విభజించవచ్చును. మనఃకాఠిన్యం సడల్పక ఆసక్తిని మాత్రం కలిగించే రచనలు సామాన్యాలు. మనః శైథిల్యం మాత్రమే కల్పించేవి మధ్యమాలు. చిత్తద్రుతి కలిగించి తన్మయీభావ మాపాదించేవి ఉత్తమాలు. నిర్బీజ సమాధ్యవస్థ కల్పించేవి ఉత్తమోత్తమాలు.

ఈ విభాగం సామాజికుల హృదయస్పందనంపై ఆధారపడుతున్నది. మరి యీ హృదయాలు మనస్సులు ఒకే స్థాయిలో ఉండవు. కొందరి మనస్సులు సుశ్లథాలు, సుద్రవాలు, మరికొందరివి యీషచ్ఛ్లథాలు, యీషద్ద్రవాలు, వేరొక కొందరివి దుశ్శ్లథాలు, దుర్ద్రవాలు. దీనికి తోడు ఆగంతుకాలైన ఆధివ్యాధులు, కళోరదృష్టులు, విఘ్నాలు స్వాభావిక మానసిక స్వాస్థ్యమును చెరిచి కావ్యార్థాలను యథాతథం గ్రహించనీయవు. ఈ చిక్కులన్నీ పరిహరించటంకోసమే 'యేషాం కావ్యానుశీలనాభ్యాస వశాద్విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభావ యోగ్యతాతే సహృదయ సంవాద భాజః సహృదయాః' అని అభినవగుప్తుడు నిర్వచించాడు. ఈ నిరుక్తిలోని కావ్య శబ్దాన్ని కొందరు సంస్కృత కావ్యానికి పరిమితం చేయాలంటారు. వీరు—''గుణాః ప్రమాణం నదిశాం విభాగః'' అన్న సూక్తిని విస్మరించి సంవృతిని వరిస్తున్నారు. కనుక అభినవగుప్తుని నిర్వచనం యథాతథంగ్రాహ్యం.

ఈ సందర్భంలో మరొక అంశం సంస్మరణీయం. మానవుని మనస్సు కొంతవరకు అతని వయస్సుమీద ఆధారపడుతున్నది. బాల్యంలో వీరాద్భుతాలు రుచించినంతగా శృంగారాదులు రుచించవు. యౌవనంలో శృంగారాదులు మరులు కొలిపినంతగా అద్భుతాదులు మరులుకొలుపవు. కౌమారంలో కరుణాదులు నచ్చినంతగా ఇతరాలు నచ్చవు. వార్ధక్యంలో శాంతాదులు హత్తినట్లు శృంగారాదులు హత్తవు.

ఇంతవరకు పేర్కొన్న అంశాలను గమనించినప్పుడు రచనలలోని ఉత్తమోత్తమాది భేదాలను అసందిగ్ధంగా సర్వజన సమాదరణీయంగా నిర్ణయించటం దుష్కరమని బోధపడక మానదు. వ్యవస్థాభిలాషియైన సహృదయుడు రచనలలోని తారతమ్యాలను నిర్ణయించుకొనేటప్పుడు తన వయస్సును, అభిమతాలను స్మరించి, వాటికి విపరీతాలై ఇంతకు పూర్వం పేర్కొన్న అవస్థలలో కలుగుతున్న వాటినిబట్టి ఆయా కోవలకు చెందిన కృతులుగా పరిగణించవలసి ఉంటుంది. వయస్సు మున్నగువానికి అనుగుణాలైన రచనల విషయంలో పాఠకుడు తన నిర్ణయాన్ని ప్రామాణికంగా భావించుకోకపోవటం మేలు. దీనివలన ప్రమాదానికి తావుండదు.

విశిష్ట అనుభవ నిష్పాదకమైన సాహిత్య ప్రపంచానికీ, లౌకిక ప్రపంచానికీ సంబంధం ఏమిటి ? లౌకిక ప్రపంచవాసియైన కవి అలౌకిక అనుభవ ప్రతిపాదకమైన సాహిత్య సంసారానికి ఎలా ప్రజాపతి అవుతున్నాడు ?

సాహిత్యం శబ్దరూపి. శబ్దాలు, అర్థాలు లౌకికాలు. వీటి గుణదోషాలు లౌకికాలు. రసదోషాలు కూడ లౌకికాలే. కనుక సాహిత్యం గూడ లౌకికం కావాలి. ఇలా అన్నప్పుడు కొన్ని సందేహాలు కలుగక మానవు. కవిత్వంలో రెక్కల గుర్రాలు, చల్లని నిప్పులు, పగటి వెన్నెలలు మున్నైనవి ఉంటవి. లోకంలో కనిపించే కార్యకారణ భావం కావ్యలోకంలో కనిపించదు. లోకంలోని వస్తువులు సుఖమో, దుఃఖమో కలిగిస్తుంటే

కావ్యంలోని అర్థాలు ఆనందం మాత్రమే కలిగిస్తున్నవి. కనుక సాహిత్యం లౌకిక మెలా అవుతుంది ?

స్వప్నంలో ఈ విశేషాలు కనిపిస్తున్నవి. అయితే ఎల్ల స్వప్నాలు ఆనందప్రదాలు కావు కాని కదాచిత్కంగానైనా ఆనంద ప్రద స్వప్నాలు కలుగకపోవటంలేదు. ఇలాంటి స్వప్నం కూడ అలౌకికం కావాలి. కాని స్వప్నం కూడ లౌకికమే. సాపేక్షాలు లేదా హేతుప్రత్యయ సంజాతాలన్నీ లౌకికాలే. జాగ్రదవస్థ లేక నిద్ర, నిద్ర లేక స్వప్నం ఉండవు. వాస్తవానికి జాగ్రదవస్థలో ప్రాప్తించిన అర్థాలే సంరూపాన [1]ప్రాజ్ఞసంస్కారంలో (Unconscious) నిలచిఉండి నిద్రితుని తీరని కోరికలచే ప్రేరితాలై తైజసుని (Preconscious) శాసనాన్నిబట్టి వ్యత్యయంపొంది స్వప్నంలో గోచరిస్తున్నవి. అంతేకాని, ఆ భావం నుంచి ఉత్పన్నం కావటంలేదు. కనుకనే యోగదర్శనం స్వప్నాన్ని భావిత స్మర్తవ్యంగా పరిగణిస్తున్నది.

కనుక స్వప్నంవలెనే కావ్యమూ లౌకికమే. లౌకికమైన కావ్యం అలౌకికమైన అనుభూతిని ఎలా కలిగిస్తున్నది. ఈ ప్రశ్న కార్య కారణ భావం వలెనే అత్యంత క్లిష్టం, వివాదాస్పదం, బీజంవలని అంకురసిద్ధి అనుభవ ప్రసిద్ధం. అలాగే కావ్యపఠనం వలని అలౌకికానుభవం కూడ.

అయితే కావ్యావిర్భూతికీ, స్వప్నోద్భవానికీ కొంత సాదృశ్యం కనిపిస్తున్నది. ఆదూరవర్తి అయిన (స్వప్నానికి క్రిందటి పగటివేళగాని మూడు నాలుగు రోజులలోపల గాని జరిగిన) జాగ్రదవస్థాంతర సన్నివేశం అవలంబనంగా గొని స్వాపి అవాప్తకామం ప్రాజ్ఞ నిలీన సంస్కారాలలో తనకు అనుకూలమైన వాటిని మేలుకొలిపి వైశ్వానరునకు (Conscious) అవిరుద్ధమైన చతుర్విధాభినయం పట్టించి, తైజసుని సమక్షంలో నాటక మాడిస్తుంది. ఈ నాటకానికి తీరని కోరిక కవీ, సూత్రధారుడూ అవుతున్నాడు. కోరికకు ఇష్టమైన సంస్కారాలు నటులు. ప్రాజ్ఞతైజసులు సామాజికులు. ఈ నాటక ప్రయోగంతో సంతృప్తి పొందుతున్నది ప్రాజ్ఞతైజసులు మాత్రమే. మాండూక్యం ప్రాజ్ఞునకు దీనితో సంబంధం లేదని చెబుతున్నది. ఫ్రాయిడ్ ఉన్నదంటాడు. ప్రాజ్ఞునకు సంబంధం ఉన్నదా లేదా అన్న విషయం మనకు ముఖ్యం కాదు. వైశ్వానరునకు మాత్రం ఇందు కర్తృత్వం కాని, భోక్తృత్వం కాని లేదు. ఇది అటు మాండూక్యానికీ ఇటు ఫ్రాయిడ్‌కు సమ్మతమే. ఈ హేతువు వలన మందవేదనాలైన స్వప్నాలు వైశ్వానరుని ధారణలో నిలువవు. తీవ్ర వేదనాలైన స్వప్నాలు వైశ్వానరునకు గుర్తుంటవి. స్వప్నాలు తీవ్రతర వేదనా లైనప్పుడు అతడు మేల్కొంటున్నాడు. వైశ్వానరుకు గుర్తున్న స్వప్నాలు అర్థరహితంగా విచిత్రంగా కనిపిస్తవి. సంగ్రహంగా చెప్పాలంటే స్వప్నాలు ప్రాయికంగా తీవ్రతమ వేదనాలు కావు. పైగా జాగ్రదవస్థా బాధితాలు అవుతున్నవి. వాటిలో సాధారణీకృతి ఉండదు. స్వాపికోరుకొన్నప్పుడు కోరుకొన్న తీరున కోరుకొన్న స్వప్నాలు పొందలేడు. అంటే స్వప్నాలు స్వాపి ఇచ్ఛానువర్తులు కావు. వాటిని అతడు శాసించలేడు. అతడు వలదనుకొన్నా స్వప్నాలు రావచ్చు.

ఇక కావ్యావిర్భూతి—జీవితంలో విన్న విశేషంకాని, కన్న విశేషంగాని రచయితను ఆకర్షిస్తుంది. ఒక్కొక్కప్పుడు అది అతనిని కంపరంపెట్టవచ్చును. అలాంటి విశేషాన్ని రచయిత విమర్శక మననం చేస్తాడు. ఆ మననంతో ఒక విధమైన దృష్టి భావ తీవ్రత రచయితలో బయలుదేరుతుంది. దృష్టి ప్రబలమై విస్పష్టమైన కొలది ప్రాజ్ఞ భూమిలో భావనలు మోసులెత్తుతవి. ఇలా బయలుదేరుతున్న భావాంకురాలను వైశ్వానరగత నిత్యానౌచిత్యాజ్ఞానం, గుణదోష వివేచనాశక్తి పరిశీలిస్తూ అనర్థాలను సమయించి తక్కినవానికి బలం సమకూరుస్తుంది. దీనిలో భావ తీవ్రత అధిక మవుతుంది. అంటే తాపశక్తి పెరుగుతుంది. తపనం అతిశయించిన కొలది జంతుసదృశమైన మనస్సు క్రమంగా కాఠిన్యం కోల్పోయి శిథిలమై ద్రవించిపోతుంది. ఈ క్రమంలోనే అహంత శిథిలమై ద్రవించగా వర్ణనీయార్థం విస్పష్టతరమైన చిత్రీకృతి పొందుతుంది. అంటే మథితపయోధి నుంచి లోకోత్తర వస్తువు ఉద్భవించి దేవదానవులను అద్భుతానందాలలో ముంచినట్లు మథిత ప్రాజ్ఞ సముద్భూత వర్ణనీయార్థాలు లోకోత్తరాలై భాసిస్తూ ప్రాజ్ఞతైజస వైశ్వానరులను ఆనంద పరవశులను చేస్తవి. సంగీత లయతాళ నృత్త పండితుడైన నటుడు మౌళిస్థకుంభ పరిరక్షణలో, ప్రాలుమాలనట్లు రచయిత ఆ స్థితిలో రచనాక్రియను మానడు. తనకు కలుగుతున్న అనుభవాన్ని అతడు వ్రాస్తాడు. అయితే రచయిత ఎప్పుడు వ్రాస్తాడు ? అనుభవం కలిగిన తరువాత దానిని గ్రంథస్థం చేస్తాడా ? లేక అనుభవిస్తూ గ్రంథస్థం చేస్తాడా ? కాక రచనకు ఉపక్రమించిన తరువాత ఆ అనుభవమే రచనను నడుపుకొని పోతుందా ?

---

1. జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః .... స్థూలభుగ్వైశ్వానరః. స్వప్నస్థానోఽన్తః ప్రజ్ఞః ప్రవివిక్తభుక్తైజసః— యత్ర సుప్తో నకంచన కామం కామయతే నకంచన స్వప్నం పశ్యతి తత్ సుషుప్తం సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయోహ్యానందభుక్చేతోముఖః ప్రాజ్ఞః—

మాండూక్యం, 3—5 మంత్రాలు.

ఈ ప్రశ్నలకు ఇదమిత్థమని సమాధానం చెప్పలేము. ఇవి రచయిత స్వభావంమీద రచనమీద ఆధారపడుతవి. ధారణ కలిగిన రచయిత తన కృతి చిన్నదైనప్పుడు ముందు ఆ అనుభవం పొంది ఉత్తర కాలంలో దానిని గ్రంథస్థం కావించవచ్చును. లేదా కృతి పరిమాణంతో నిమిత్తంలేక అనుభవం పొందుతూ రచన సాగించవచ్చును—కాక మనస్సులో జరుగవలసిన వ్యాపారమంతా కాగితంమీదనే సాగించవచ్చును.

రచయిత కావిస్తున్న యీ సృష్టికీ, స్వాపి పొందుతున్న స్వప్నానికీ కొన్ని సాధర్మ్యాలు, మరికొన్ని వైధర్మ్యాలు ఉన్నవి. కావ్యార్థాలు స్వప్నార్థాలు జాగ్రదవస్థాంతర అర్థాల మీద ఆధారపడుతున్నవి. జాగ్రదవస్థ, లోకమూ లేక కవిత్వమూ లేదు. స్వప్నమూ లేదు. ఈ రెంటియందునూ బాహ్య జగత్తు విస్తృతమౌతున్నది. కావ్య స్వప్నార్థాలు రెండూ విచిత్రాలు, లౌకిక ధర్మాతిక్రమకాలు, ప్రమాతకు పారవశ్య కారకాలు, ఈ రెంటి అవిర్భూతికీ మూలం ప్రాజ్ఞుడే. ఒకసారి పొందిన కళను యథాతథంగా స్వాపి వేరొకసారి పొందలేడు. అలాగే రచయిత ఒకసారి సృష్టించిన అనవధారిత కృతిని వేరొకసారి యథాతథంగా సృష్టించలేడు. కాకున్న ఆ తాత్పర్యంలో వేరొక కృతిని సృష్టించవచ్చును.

ఇక వైధర్మ్యాలు—స్వాపి తన తీరని కోరికలకు దాసుడై కలలు కంటున్నాడు. కవి నిజ ద్రవణీయ దృష్టి ప్రచోదితుడై రచన సాగిస్తున్నాడు. స్వాపికి కల అనివార్యం. అందలి వేదనలూ అనివార్యాలే. కృతి సముద్భూతి అట్టిది కాదు. రచయితకు ఇష్టంలేనప్పుడు అతని సంకల్ప వికల్పాల మీదనే ఆధారపడుతున్నది. కనుకనే 'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః యథాస్మై రోచతే విశ్వంతథేదం పరివర్తతే' అని ప్రాచీనులు పేర్కొన్నారు. స్వప్నం వైయష్టికం, దురవబోధం, మార్మికం, జాగ్రదవస్థా బాధితం. కావ్యార్థం విశ్వజనీనం, సుజ్ఞానం, అర్థవంతం, జాగ్రదవస్థాబాధితం. స్వప్నం కుంభ గత నశ్వర దీపమైతే, కావ్యం స్నేహస్నిగ్ధవర్తులను వెలిగించే బాహ్యరత్నదీపం.

కవి శ్రుత దృష్టార్థ ప్రబుద్ధుడై ద్రవణీయ నవ్య నవ్య దృష్టితో సమాధ్యవస్థ పొంది కృతి నిర్మిస్తున్నాడు. కావ్యార్థం ప్రాజ్ఞునిలో నుండి బయలుదేరి తైజస వైశ్వానర గత సంస్కార పరిష్కృతమై పరిపూర్ణరూపం పొందుతున్నది. కవి తన రచనలోని వైశ్వానరగత సంస్కార పరిష్కృతాంశం మాత్రమే వివరించగలడు గాని ప్రాజ్ఞ సముద్భూతాంశం వివరించలేడు. అంటే ప్రతిభా సముత్పన్నాంశం వివరించలేడు. దానిని మరొకనికి నేర్పనూ లేడు. ఛందో వ్యాకరణాలంకారాది శాస్త్రాలు గూడ ఇక్కడ తమ అశక్తతను అంగీకరించక తప్పదు. 'రాజన్ భోజనం దేహి' అన్న నీరసవాక్యాన్ని ఏ శాస్త్రం కవిత్వంగా మారుస్తుంది ? ఒక్క కవి హృదయం మాత్రమే ఆ పని చేయగలదు. అయితే కవులందరు ఒకే తీరున దానిని కవిత్వంగా మార్చలేరు. కవిత్వ కృతి భిన్నత్వం పొందుతుంది.

ఇక లోకానికీ, కవిత్వానికీ కవికీ లోకానికీ ఉన్న సంబంధము పరిశీలనార్హం, లోకానికి అద్యంతాలు ఉన్నట్లు గోచరించవు. విశ్వంయొక్క గమ్యంకాని విశ్వగత విషయ సంఖ్యా ప్రయోజనాలు కాని బోధపడవు. ఈ విషయాన్ని విజ్ఞాన శాస్త్రాలన్నీ ముక్తకంఠంతో ఘోషిస్తున్నవి. తత్త్వశాస్త్రాల లోని కొన్ని మతాలు దీనిని అంగీకరించకపోవచ్చును. అయితే ఇవి నాగార్జునుడు, శంకరుడు, కాంటు మున్నైనవారి ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది. ఏది ఎలా ఉన్నా ఆకాశాన ఎన్ని నక్షత్రా లున్నవో, ఎందుకున్నవో ఎవరు చెబుతారు ? అగ్నికి ఔష్ణ్యం, జలానికి శైత్యం, పృథ్వికి గంధవత్వం, శిఖకు ఊర్ధ్వ ప్రసారణం దేనికి అంటే సమాధానం దొరకదు. ఆయా గుణకర్మలు వానికి స్వాభావికాలని సరిపెట్టుకోవాలి. ఇలాంటి లోకం కార్య కారణబద్ధమై విభిన్న వ్యక్తుల విభిన్న ప్రవృత్తులకు హేతు వవుతున్నది. సాహిత్య సంసారం అపారమే కాని ఏకకావ్య ప్రతిపాదిత ప్రపంచం ఆదిమధ్యాంత సహితం—అందలి సన్నివేశాలు, పాత్రలు, పరిమితాలు, సప్రయోజనాలు. లౌకిక నియతి కార్య కారణ భావం కావ్యంలో ఉల్లంఘితా లవుతాయి. నదీ ప్రవాహంలో తామర లుంటవి. లగ్నాలు చందన శీతలా లవుతాయి. శిలలు ద్రవిస్తాయి. చెట్లు అశ్రుపాతం కావిస్తాయి. సహృదయులు విభిన్న ప్రవృత్తు లయినా కావ్యం నియతంగా ఆనందం కలిగిస్తున్నది.

లోకానికీ, సాహిత్యానికీ, ఇన్ని వ్యత్యాసాలున్నా లోకం కావ్యానికి మూలమౌతున్నది. సూర్యకిరణం స్ఫటిక విశ్లేషితమై వర్ణసప్తకాన్ని ప్రసరిస్తున్నది గదా. ఇక కవికీ లోకానికీ ఉన్న సంబంధం—లోకానుభవ సంపత్తివల్ల కవికి రాగాది రంజిత ద్రవణీయ దృష్టి ఏర్పడుతున్నది. శ్రుతదృష్ట లౌకికార్థంవల్ల యీ దృష్టి ప్రబుద్ధమై కవికి సమాధ్యవస్థ కల్పిస్తున్నది. ఈ యవస్థలో అతని దృష్టి ప్రాజ్ఞ నిలీన లౌకికానుభూతులకు ఆత్మానుగుణదేశ కాల పాత్రాదికముతోబాటు ఆదిమధ్యాంతాలు కల్పించి కవిచే వాటిని ఆస్వాదింపజేస్తూ కృతిని రచింపజేస్తుంది. ఇలా శబ్దనిబద్ధమైన కృతి లౌకికం, ఆస్వాదనలో మాత్రమే ఇది ప్రాచీనులు పేర్కొన్నట్లు అలౌకికం.[3]

---

2. కావ్యార్థ నిష్ఠ రత్యాద్యాః స్థాయినః సంతి లౌకికాః,
దద్భేద్య నిష్ఠ స్త్వపరే తత్సమా అప్యలౌకికాః.
భక్తిరసాయనం—ద్వి. ఉ. 4.

# సాహిత్య భవితవ్యం

అనుభవసంపన్నుడైనా కవి ద్రవణీయ దృష్టి విరహితుడై సమాధ్యవస్థ పొందక కావ్యం నిర్మించలేడు. ఇందులో ఏది లోపించినా కావ్యత్వం లోపించక తప్పదు. పరినిష్ఠిత సమచిత్తులు లోకాన్ని ఆనందమయంగా దర్శించి పరవశులు కావచ్చును. కాని, అలాంటివారు కావ్య నిర్మాతలు కాలేరు. గాఢదృష్టి కలితులు కర్మణ్యులు అవుతారే కాని తన్మయీభావం పొందలేరు. తన్మయీభావయోగ్యత లేకపోవటంవల్ల వీరు కృతి నిర్మించినా అది శుష్కకాష్ఠం అవుతుం కాని కావ్యంకాదు. కావ్యాస్వాదనకు దృష్టి అక్కరలేదు కాని తన్మయీభావయోగ్యత మాత్రం అవసరం.

ఆధివ్యాధి పీడితులు, క్షుత్పిపాసార్దితులు అయినవారు యోగానికి వలెనే కావ్యనిర్మాణాస్వాదనలకు అనర్హులు, అశక్తులు. ఈ పరిశీలననుబట్టి సాహిత్య భవితవ్యాన్ని గూర్చి ఏమి చెప్పుకోవాలి ?

కావ్యావిర్భూతికి సమాహిత ద్రవణీయదృష్టి అవశ్యకం. కావ్యాస్వాదనకు పాఠకునియందు తన్మయీభావ యోగ్యతాస్తిత్వం ముఖ్యం. ప్రకృతి స్థితిగతులు నేటికి ఎంతవరకు పోషకంగా ఉన్నాయి ?

1914 నుండి ఇంతవరకూ వాటిల్లిన ప్రపంచ యుద్ధద్వితయంవల్ల ప్రపంచ మేధావుల విశ్వాసాలు, ఆదర్శాలు, లక్ష్యాలు బదాబదలై అనవస్థితి పొందాయి. ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి పూర్వం రచయితలకు సోషలిజంలోనో, కమ్యూనిజంలోనో, పరిష్కృత ప్రజాస్వామ్యంలోనో విశ్వాసం ఉండేది. అణవాయుధాలు వచ్చిన వెనుక ఆ విశ్వాసం సడలిపోయింది. సాయుధ సంఘర్షణ పరిహరించగలిగిన విశ్వకల్యాణప్రదలక్ష్యం కోసం రచయితలు అన్వేషణ సాగిస్తున్నారు. ఇంతవరకూ వారికి ఒక విస్పష్టదృష్టి ఏర్పడలేదు. విస్పష్టదృష్టి లేనప్పుడు రచన ఎలా వెలువడుతుంది? వెలువడినా అందులో జీవం ఎలా ఉంటుంది ?

వెనుకబడిన దేశాలకు ఈ చిక్కు లేకపోవచ్చును. అచటి రచయితలకు సోషలిజంలోనో, కమ్యూనిజంలోనో, ప్రాచీన జాతీయ వ్యవస్థా సముద్ధరణంలోనో వ్యవస్థిత దృష్టి ఉండి ఉండవచ్చును. నిజానికి అలాగే ఉన్నది. కాని, ఆ దృష్టి ఆ ప్రాంతీయులకు నచ్చవచ్చునేమో, కాని అది విశ్వజనీనం కానొల్లదు, కనుక అట్టి రచనలు విశ్వజనాదృతి పొందజాలవు. నిజానికి ఆ కృతులు ఆయా దేశపు ఎల్లలు దాటి అవతలికి పోవు. దీనినిబట్టి అగ్రగామి దేశాలలో గాని, వెనుకబడిన దేశాలలో గాని ఉత్తమ కృతులు వెలువడటానికి బొత్తిగా అవకాశాలు లేవని భావించరాదు. సత్కావ్యావిర్భూతికి అవకాశాలు తక్కువని చెప్పటమే ప్రకృత తాత్పర్యం.

ఇక రెండవ అంశం—కావ్యత్వం ఆస్వాదనలో గాని నిరూఢం కాదు. నేటి ప్రజలకు భౌతిక భోగాలలో ఉన్న ఆసక్తి మరి దేనిలోనూ లేదు. ప్రభుత్వాలు గూడ తమ ప్రజలు సగటున తల ఒకటికి వాడుకొన గలుగుతున్న విద్యుచ్ఛక్తి, వస్త్రాలు, ఆహార పదార్థాలు, మందులు, కార్లు, నివేశన ప్రదేశాలు, రేడియోలు మున్నుగా గల వస్తువుల పరిమాణాలనుబట్టి తాము సాధించిన అభ్యుదయాన్ని నిర్ణయిస్తున్నవి. బాధావిమోచనమేదైనా సేవ్యమేననీ పరమౌషధమనీ రోగి భావిస్తున్నట్లే అధికారమో, ఐశ్వర్యమో తత్సాధనమో అనుగ్రహించే దేదైనా అభీప్సణీయమని ఈనాడు సామాన్య ప్రజానీకమంతా భావిస్తున్నది. ఇప్పటి జీవిత వ్యవస్థ కూడ ఐశ్వర్య అధికార రూపసద్యః ఫలమివ్వని కర్మను పూర్తిగా త్రోసివేస్తున్నది. కావ్యంవల్ల గాని తక్కిన లలితకళాఖండాలవల్ల గాని లోకోత్తరానుభూతి కలుగుతున్నదే కాని లౌకికమైన సద్యః ఫలం మరొకటి కలగటంలేదు. కనుక భౌతిక భోగలాలసమైన ప్రజానీకం కావ్యాస్వాదనకు దూరమౌతున్నది.

భౌతికభోగాలు పరమార్థాలైనప్పుడు తృష్ణ పెచ్చరిల్లక తప్పదు. దానివలన వ్యగ్రత, సంశయం, ఆందోళన, భీతి కలుగుతున్నవి. వీటివల్ల మైత్రి కరుణ లోపిస్తున్నవి. ఈ లోపంవల్ల పాఠకులు కావ్య పఠన కాలంలో పొందవలసిన సమాధ్యవస్థ పొందలేక పోతున్నారు. ఈ దుఃస్థితికి రాజకీయ పక్షాభినివేశాలు అపూర్వ దోహదం కల్పిస్తున్నవి. వివిధ దేశాలలో కమ్యూనిస్టుపార్టీలు అవతరించిన తరువాత మత సాంఘిక సాంస్కృతిక రంగాలు స్వాతంత్ర్యం కోల్పోయాయి. తమ పక్షాలను బలపరచుకోవటానికి కమ్యూనిస్టుపార్టీలు విజ్ఞానశాస్త్రాల తత్త్వంనుంచి లలితకళల తత్త్వందాకా నిర్వచిస్తూ తదనుగుణంగా ఉన్నవే యోగ్యాలనీ, విరుద్ధాలనీ అభ్యుదయ నిరోధకాలనీ ప్రచారం ప్రారంభించాయి. ఆ పక్షాలనుచూచి తక్కినరాజకీయ పక్షాలుగూడ తమ తమ ఆశయాలకు అనుగుణమైన దురభిమానాలు రేకెత్తిస్తున్నవి. దీనిమూలాన ప్రజలలో సహనం, తన్మయీభావ యోగ్యత క్షీణిస్తున్నవి. ప్రాచీనులు జరన్మీమాంసకారులను సభాంతరస్తంభకుడ్య సదృశులనీ, రసాస్వాదనకు అయోగ్యులనీ అన్నారు. ఇవాళ అలాంటివారు రాజకీయపక్ష దురావేశపరులంటే అతిశయోక్తి కాదేమో.

రాజకీయ పక్షాలకు నేడు రాజ్యం కూడ తోడవుతున్నది. అంతర్గత శాంతి న్యాయ సంరక్షణమూ, విదేశ దండయాత్రా ప్రమాద నిరోధమూ మాత్రమే తన కర్తవ్యమని 19వ శతాబ్దాంతం వరకూ భావిస్తూ వచ్చిన రాజ్యం 20వ

శతాబ్ది ప్రథమపాద అంతిమభాగం నుంచి వివిధ రంగాలలో విశేషాధికారాలను స్వాయత్తం చేసుకొని విశ్వరూప ప్రదర్శనం ప్రారంభించింది. అమెరికా (యు. ఎస్. ఎ) వంటి రాజ్యం కూడ సాంస్కృతిక రంగంలో ప్రవేశించి తన విధానానికి సమ్మతమైన కృతులనే ఇతర దేశాలలో ప్రచారం చేస్తున్నది. ఇక కమ్యూనిస్టు రాజ్యాలు నిర్వహిస్తున్న పాత్ర చెప్పనక్కరలేదు. ఆ దేశాలలో ప్రభుత్వానికి వంతపాడే కృతులే ప్రచురణభాగ్యం పొందుతున్నవి. ఆ ప్రభుత్వాలు రచయితలను [illegible] [illegible]లనూ పూర్తిగా అనుశాసిస్తున్నవి. ఆ అనుశాసనాన్ని ఉల్లంఘించిన కృతులు అణచివేయబడుతున్నవి. ఎదురు తిరిగిన రచయితలు కారాగారాలకు వెళ్లక తప్పటంలేదు. భావ స్వాతంత్ర్యము లేనిచోట ఉత్తమ కృతులు ఎలా వెలువడుతవి? విప్లవానికి పూర్వం ఘన సాహిత్యంతో ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన రష్యా ఆ విప్లవానంతరం చెప్పుకోదగిన కృతులను ఉత్పాదించలేకపోయింది.

ప్రజాస్వామిక రాజ్యమైన భారతదేశంలో కూడ ప్రభుత్వం రాష్ట్ర స్థాయిలోను, అఖిలభారత స్థాయిలోను అకాడమీలను నియమించి తన అధికారాన్ని ప్రస్ఫుటం చేస్తున్నది. కొన్ని రాష్ట్రాలు పాఠ్యగ్రంథాలను కూడ తామే ప్రకటిస్తూ ప్రాథమిక విద్య నుంచి ఉన్నత విద్య వరకూ గల చదువు సంధ్యలను గుప్పిట బిగించుకొన్నవి. విశ్వవిద్యాలయాలు కూడ మరెంతోకాలం స్వతంత్రంగా ఉండవు. అయితే కమ్యూనిస్టు రాజ్యాలలో ఉన్న కఠిన శాసనాలు ఇంతవరకూ లేక పోవటం ఒక్కటే అభినంద్యం. ఇక మన అకాడమీలచే సమాదృతి పొందుతున్న కావ్యాల విశిష్టత ఎవరికి వారేఊహించుకోవచ్చును. ముంజేతి కంకణం ఉండగా అద్దం దేనికి?

ఇంతకుముందే పేర్కొన్న వాటికంటె ప్రబలమైన విశేషం మరొకటి ఉన్నది. ఉత్తమ కృతుల ఆవిర్భావానికి సమాజంలో కొంత నిలకడ అవసరం. సాంకేతిక విద్యా విజృంభణంతో మున్నెన్నడూ ఊహించనంత త్వరితంగా ఏ ఒక దేశమందో కాక ప్రపంచమం దంతటా విపరీత పరిణామాలు వస్తున్నవి. వెనుకటి సామాజిక వ్యవస్థలన్నీ బదాబదలయ్యాయి. నిన్నటి స్థితిగతులు నేడు లేవు. నేడున్నవి రేపుండవు. ఈ పరిణామం అంతంతకూ తీవ్రతరం, శీఘ్రతరం అవుతోంది. భౌతిక సుఖలాలసుడైన మానవుడు ఈ విపరీత త్వరిత పరిణామాలకు స్వాగతం చెబుతాడే గాని శ్రేయోదాయకాలు కావని నిరోధం కల్పించగలడా? మన దేశం శాంతిని కాంక్షించి సైనిక వ్యయం తగ్గించుకొని తాను కోరుకొన్న మార్గాన జీవించటానికి యత్నించింది. కాని చైనా తన సైన్యాలను పంపి దురాక్రమణ జరిపింది. దానితో ఆత్మరక్షణకోసం మన దేశం సైన్యాన్ని పెంచుకోవలసి వచ్చింది. అత్యయిక స్థితిని ప్రకటించి చైనా అనుసరించిన మార్గాన్నే అనుసరించి యుద్ధ సన్నద్ధం కావలసి వస్తున్నది. స్వాతంత్ర్యం కాపాడుకోదలచిన దేశాలకు సాంకేతిక విద్యా బలిష్ఠ రాజ్యాల ప్రమాదం నుంచి రక్షించుకోవాలంటే ఆ సాంకేతిక విద్యాభివృద్ధి కంటె గత్యంతరం ఉన్నదా? ఏది ఏమైనా ప్రపంచవ్యాప్తంగా విపరీత పరిణామం మహా ప్రవాహంవలె వచ్చిపడుతున్నప్పుడు ఏకైకంగా వ్యక్తులుగాని, రాజ్యాలుగాని దానిని నిరోధించటం అసంభవంగా కనిపిస్తున్నది.

స్థితిగతులు ఇంత త్వరితంగా మారుతున్నప్పుడు రచయితలకుగాని, పాఠకులకు గాని విస్పష్ట దృష్టి, విలువలు ఉండటానికి వీలున్నదా? ఈ ఇరుపక్షాలు విభ్రాంతులై ప్రతిదీ తాత్కాలికమని భావించవా? ఇంతమాత్రాన రచనాసృష్టి మొదలంటు స్తంభించిపోతుందని చెప్పలేము. చెప్పరాదు. కాని జీవితం నిలకడలేక త్వరితగతిని మారుతున్నప్పుడు తదనుగుణమైన మార్పులే సాహిత్యంలోను లలితకళలలోను వస్తవి. సమాధ్యవస్త్వాపాదకాలైన కృతులకు అవకాశం తక్కువ. రసాస్వాదన శక్తి కూడ సన్నగిల్లక తప్పదు. వెనుకటిలో వలె నవ్య కృతులు ఇకమీదట ఎక్కువ కాలంపాటు నిలవటం అసంభవంగా కనిపిస్తున్నది. ఇంతకుమున్ను సమాదృతాలైన కృతులనే అయినట్లు, కానట్లు విశ్వవిద్యాలయాలు ఆదరించవచ్చును. క్రొత్తగా వెలువడే రచనలు స్వల్పకాలం గడిచి ఆమీద విస్మృతిపథంలో లీనమైపోతవి. ఈ రచనలయందలి వస్తువిల్వలు కూడ పత్రికా వార్తలవలె ఉద్వేజకాలుగా ఉంటవి. అంటే పత్రికా రచనమే (Journalism) సాహిత్యంగా చెలామణి అవుతుంది. ఈ లక్షణాలు ఇప్పుడే కొంతవరకు గోచరిస్తున్నవి.

# తిక్కన రచనా కాలము

శ్రీ వేదము వేంకటరాయశా

నేను ఆగష్టునెల 'భారతి' లో వ్రాసిన విషయములో తిక్కన రచనా కాలమును గురించి శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు సెప్టెంబరు భారతిలో కొన్ని సంశయములను లేవనెత్తి వానికి నివృత్తి కోరిరి. వెంటనే వ్రాయుటకు ప్రారంభింపగా ఏవేవో నూతనాంశములు స్ఫురింపసాగినవి. మరల నొకమారు ఆయా శాసనములను చూచుకొని ఇదే శ్రీ రెడ్డిగారికి సమాధానము వ్రాయుచున్నాను.

(1) విజయాదిత్యుడు విజయగండ గోపాలుడు.

'అల్లుందిక్క' లేక అల్లు తిరుకాళదేవ మహారాజునకు తమ్ముడు విజయాదిత్య మహారాజని నెల్లూరి శాసనములలో కనబడినందున, విజయాదిత్య గండగోపాలు డితడే యనియు, వీరిరువురునే 'తిక్కన బయ్యనలు' గా నుందురేమో యనియు నేను ప్రతిపాదించిన దానిని ఆక్షేపించి శ్రీ రెడ్డిగారు 'అట్లేనాటికిని తలంప వీలులేదని కందుకూరు తాలూకా పెంట్రాల శిలాశాసనము (నెల్లూరు శాసనములు, కందుకూరు 62) శాసించుచున్నది' అని వ్రాసి ఆ శాసనము నుండి 'శ్రీ మన్మహా మండలేశ్వర ఇమ్మడి గండ గోపాళ విజయాదిత్య మహారాజులకు రాజ్యాభివృద్ధి ....' (సం 2 పు. 60) అని ఉదహరించినారు.

'వీరు వారే' అని శాసనములో వ్రాసిపెట్టి యుండునా? అట్లుండిన ఎట్టి కష్టమును లేదు గదా. మన పరిశోధన ఎందులకు ? మనము చారిత్రక పునర్నిర్మాణమును గుర్తింప వలసి యున్నది. అందులకు నా యుపపత్తులను నేను చూపితిని. ఈ శాసనమును ప్రమాణముగా గ్రహించి శ్రీ రెడ్డిగారు కాదనుచున్నారు. కాదనుటకు ఈ శాసనము బొత్తిగా చాలదు. పూర్తి శాసన మిదిగో—(సం 2 కందుకూరు శా. 62. పుట 60. అని అచ్చు తప్పు. పుట 599)—''శ్రీ శుభవ రుషంబులు ౧౧౮౨ అగునేంటి రౌద్రి సంవత్సర చైత్రశుద్ధ ౫ గురువారాన శ్రీ మన్మహా మండలేశ్వర ముక్కంటి కాడువెట్టి వంశావతారులైన అంటుంవారి విజయాదిత్య దేవుని మనుమండు మధుసూదనదేవ మహారాజు శ్రీ మన్మహా మండలేశ్వర ఇమ్మడి గండ గోపాళ విజయాదిత్యదేవ మహారాజులకు రాజ్యాభివృద్ధిగాను శ్రీమతు వేదమార్గ ప్రతిష్ఠాచార్యులైన మార్గము పహిండిముక్కల వీర తిరువేంగళ కుమారులు పురుషకారాన మార్గ నారాయణ పెరుమాండ్ల పురోహితులకు వెలిగండ్లయున మార్గ నారాయణపురము అగ్రహారము అచంద్రార్కముగా నిస్తిమి.''

దీనినిబట్టి ఏమి తేలుచున్నది ? ఇమ్మడి విజయాదిత్య గండగోపాలుడను రాజు ఆ కాలమున పాలించుచుండెనని మాత్రమే గాని ఇక నేమియు కాదుగదా. అట్లేనాటికిని తలంప వీలు లేదు' అని దీనినిబట్టి ఎట్లు వ్రాయగలరు ? మరియొకని సోదరుడని యో, లేక అట్టి భావమునకు ఏదైన ఆధారమో దొరికిన గదా. లేదే ! దీనిబట్టి నేను కావించిన నిర్ణయమునకు ఎట్టి బాధకమును లేదు. ఇది రౌద్రి (క్రీ. శ. 1260) సంవత్సరముది గదా, నేనుదాహరించిన శాసనము అంతకు చాల ముందుది, ప్లవంగ (1247—48) రావూరు (20). అన్న పాలించుచుండగా నితడు యువరాజు, ఇప్పుడు పన్నెండేండ్ల తర్వాత రాజు. ఇందులో అన్న పేరెట్లు కనబడును ? అల్లుందిరుకాళత్తి దేవుకు గండగోపాల బిరుదాంకుడు గదా, తమ్ముడు ఇప్పుడు రాజై, ఇమ్మడి గండగోపాలుడగుటలో నాశ్చర్యమేమి ?

మరియొక విషయమును గుర్తింపవలెను. మొదటి తిక్కరాజు గండగోపాల బిరుదాంకుడు గదా, అల్లుం దిక్కరాజు కూడ గండగోపాల బిరుదాంకుడే గదా, అటు తర్వాతివాడైన యీ విజయాదిత్యుడు ఇమ్మడి గండగోపాల బిరుదెట్లు తాల్చినాడు ? ఇతడు మూడవవాడుగా గదా కావలెను. లేకపోయిన ఇతనికి ముందొక విజయాదిత్య గండగోపాలు డుండెనా ? కాడే ! కాబట్టి అల్లుం దిక్కరాజు నుండియే లెక్కపెట్టుకొని తన్ను ఇమ్మడి గండగోపాలుడని చెప్పించుకొన్నాడు.

శాసనములను పరికింతము:— (K. V. 38) క్రీ. శ. 1227—28 మొదటి తిక్కరాజు 'గండగోపాల తిరుకాళదేవ చోడరాజు' అనబడెను. (K. V. 45) 1229—30 లో మరలనట్లే తర్వాత కొన్ని శాసనములలో 'మధురాంతక పొత్తపి

ప్రాంతమున నెల్లూరులోని రాపూరులో నుండిన యీతడు 1249లో కడపకు చేరుకొన్నాడు గదా. అంతకు ముందుండియే యీతడు దేశ సంచారము చేయుచుండెననుటకు క్రీ. శ. 1239లో గుంటూరు జిల్లా పువ్వాడ (సత్తెనపల్లి తాలూకా) మహేశ్వరునికి కీతడు దానమిచ్చినట్లు కలదు. (247 of 1934-35). ఇందువలన నీతడు తండ్రి జీవిత కాలమందే అల్లుం(డ) చేత తఱుమబడెనా యని సందేహము కలుగుచున్నది. ఆ రాజు చివరి దినములలో వ్యాధిగ్రస్తుడైనట్లు కూడ తెలియుట చేత ఏదో అంతఃపుర విద్రోహము జరిగి యుండవలెను. రాపూరు శాసనము వలన, గుంటూరిలో 1239లో నుండిన యీతడు 1243-44నకు మరల తన మండలమునకు వచ్చి, అట్లు తర్వాత కడప మండలమునకు పోయి యుండును. కడపలోనే గాక ఇతడు 1249లో వినుకొండలో కూడ నుండినట్లు శాసనములు దొరికి యున్నవి. (338 of 1934-35) ఇది నరులకంపాడులో దేవదానము. కాబట్టి 1249కి చాలా ముందే, ఇది అల్లుండిక్క రాజు మూడవ సంవత్సరము కాబట్టి 1249- -3 = 1246 నాటికే, అనగా తండ్రి గతించిన తర్వాతనే దేశాంతరగతుడాయెననియు, నాటి నుండి నెల్లూరి రాజ్యము అల్లుం డిక్క రాజు పాలనలో పడిన దనియు విశదము.

క్రీ. శ. 1249వ సంవత్సరమున నెల్లూరి చరిత్రలో పెక్కు విశేషములు జరిగినట్లున్నది. ఒకవైపు విజయగండ గోపాలుడు రాజ్యమునకు వచ్చినట్లు నగా, కాకతీయ గణపతి దండయాత్ర కూడ ఆ సంవత్సరమే జరిగినట్లున్నది. కాకతీయ సేనాధిపతి సామంత భోజుడను నాతడు కంచిని 1449లో తాకెను. (IA, XXi పుటలు 197 నుండి) ఈ సామంత భోజుని శాసన మొకటి కాళహస్తిలో కూడ నున్నది. ఈ కాలమున గణపతి చక్రవర్తి దక్షిణదేశ దండయాత్ర ఎందుకు వచ్చెనో మనకు సిద్ధేశ్వరచరిత్ర వలన తెలియుచున్నది. తిక్కన బయ్యనలను జయించి మనుమసిద్ధికి నెల్లూరి రాజ్యము నిప్పించుట కొఱకే గదా. మనుమసిద్ధి గణపతి సాయమపేక్షించెనని తర్వాతి కాలపు సిద్ధేశ్వర చరిత్రయే గాక సమకాలిక శాసనములును చెప్పుచున్నవి. (1) మనుమసిద్ధి నందవారు శాసనము, క్రి. శ. 1257—58 నాటిది (AR 580 of 1907) ఇట్లు చెప్పుచున్నది.

''యస్సాహాయ్యం విధిత్సుః గణపతి నృపతేః స్వేచ్ఛయా సంగరాగ్రే గోదావర్యాం పరితి నృపతిః చన్నయా షాల్య నిశ్చిత్య కాళింగం స్వాస్కళింగా నభిముఖ మకరో దేవ వీరస్త దాసీవ్''

ఈ గోదావరీ సంగర మెప్పుడు జరిగినదో గాని మనుమసిద్ధి స్వకార్యసిద్ధికై గణపతిని ఎంతగా ఆశ్రయించెనో, ఎట్లు స్నేహము సంపాదించెనో తెలియుచున్నది. తిక్కన పోయి భారతమును పఠించి గణపతిని ప్రార్థింపగా, మనుమసిద్ధి గణపతి సైన్యమునకే సేనాధిపతిగా నుండి కాళింగులను జయింపగా, గణపతియే బయలుదేరివచ్చి తిక్కన బియ్యనలను జయించినట్లు, చెప్పుటకు గణపతి నాయుని వల్లిశాసనము, తారీఖులేనిది, సాయపడుచున్నది.— ''మహా మండలేశ్వరులైన కాకతి గణపతిదేవ మహారాజులు దిగ్విజయము సేసి పర మండలములు సాధించి దక్షిణ దిగ్భాగమున నెల్లూరు గల్పి తద్విరోధులైన పడిహారి బయ్యన తిక్కనల వెరసిన శాత్రవ వీర బలం గండుక క్రీడా వినోదము సలిపి ద్రవిళ మండలమును కులోత్తుంగ రాజేంద్ర చోడనిచ్చికొని నెల్లూరిరాజు చేత ఏనుంగులం గాన్కగా గొనివచ్చి. . . ''దీనింగూర్చి వివరముగా చర్చించి, రాజేంద్ర కులోత్తుంగ చోడదేవుడెవడు, అతనిని ఏల గణపతి ద్రవిళ మండలమున పట్టమలసి వచ్చెను, ఈ తిక్కన బయ్యనలకును అతనికిని ఎట్టి సంబంధము కలదు అను విషయమును గూర్చి శ్రీ నేలటూరు వేంకట రమణయ్యగారు, తారణ, మాఘ భారతిలో 'కాకతి గణపతి దేవుడు— కులోత్తుంగ రాజేంద్ర చోళుడు' అను వ్యాసమును వ్రాసియున్నారు. సిద్ధేశ్వర చరిత్ర సోమదేవ రాజీయముల భేదములను గుర్తించుచు, తిక్కన బయ్యనలు 'సిద్ధిరాయుని పెదదొరి' అని పైదాని యందును 'పట్టె యునిచి' అని దానికి ప్రత్యక్ష విరుద్ధముగా తర్వాతి దాని యందును, 'దాయాదు' లనుమాట యుదాహృత సిద్ధేశ్వర చరిత్ర గ్రంథ భాగమున కానరాదు, అన్యత్ర కానవచ్చునేమో' అనియు హెచ్చరించి యున్నారు. అక్కన బయ్యనలే తిక్కన బయ్యనలను నిర్ణయమునకు వారు మఱియొక విధమున వచ్చిరి. పైగా వీరు మనుమసిద్ధికి దాయాదులు కారనియు, శాసనమును బట్టి 'పడిహారులు' (ప్రతీహారులు) అనియు తెలియవచ్చునది గదా. పై శాసనమందు కులోత్తుంగ రాజేంద్ర చోడ డొక్కడే యుండగా సిద్ధేశ్వర చరిత్ర యందు వెలనాటిని గెల్చిన తర్వాత నెల్లూరికి వచ్చినట్లును, సోమదేవ రాజీయమందు 'వెలనాటి ధరణిపతుల' అనియు నుండుటను గుర్తించి, ''సిద్ధేశ్వర చరిత్ర వెలనాటి ధరణీశ్వరు డొక్కడనియే తెలుపుచుండగా సోమదేవ రాజీయము 'ధరణిపతులు' 'వారల' 'అరుల'నని పెక్కుఱు వెలనాటిపై ప్రభుత్వము నల్పుచుండినట్లు చెప్పుటకు గారణము విశదముగాదు'' అని పరిశీలించి తుదకు ఈ నిర్ణయమును చేసినారు. ''పై మూడు అంశములందు తప్ప తక్కిన తావుల నీరెండు గ్రంథములకును భేదము గానరాదు. తక్కిన విషయమంతయు రెంటికిని సామాన్యమే. వీనియందుక్తమైన విషయము సత్యమనియు చరిత్రాత్మక మనియు గణపతిదేవుడు వేయించిన నాయునిపల్లి శిలాశాసనము రుజువు సేయుచున్నది. శాసనములోని బయ్యన తిక్కనలే సిద్ధేశ్వర చరిత్ర సోమదేవ రాజీయములందు పేర్కొనబడిన యక్కన బయ్యనలు. తిక్కనకు బదు లక్కనయని పేరు ప్రమాద వశమున గ్రంథస్థమైనది. బయ్యన తిక్కన శాసన నామక్రమము గ్రంథములందు అ(తి)క్కన బయ్యనలని తారుమారైనది. ఇవి యంతగ పాటింప దగిన యంశములు గావు. మిగిలిన విషయములు గ్రంథముల యందుండునవియే శాసనములందును గానవచ్చుచున్నవి.'' (భారతి— తారణ మాఘము. పుట 164).

తర్వాత వెలనాటి చరిత్రను చర్చించి, కులోత్తుంగ రాజేంద్రచోడుని గుర్తించి, వెలనాటి పృథ్వీశ్వరుని తిక్క రాజు చోళచక్రవర్తి సాయమున చంపి 'చోళ చక్రవర్తి ప్రాసాదమున ఏలువ గుంటూరు మున్నగు రాష్ట్రములను స్వాధీన' పరచుకొనెననియు వ్రాసిరి. పై జేర్కొన్న బడిన విషయముల నన్నిటిని సమాలోచనము జేసి చూడగా నెల్లూరు తెలుగు చోళరాజులు చోళచక్రవర్తియనుగ్రహమును బొంది తత్పూర్వము వెలనాటి రాజుల పాలనయందుండిన గుంటూరి ప్రాంత దేశమును దమ యధికారము క్రిందికి దెచ్చుకొని రని తోచుచున్నది. (పుట 55) పార్థివ జ్యేష్ఠము). . . 'పృథ్వీశ్వరునికి తర్వాత. . . పోయిన రాజ్యమును మరల ప్రతిష్ఠ సేయ దలపెట్టిన వారిలో ప్రముఖుడు కులోత్తుంగ రాజేంద్రు చోళుడు. . . ఇతడు కంచి పర్యంతము [illegible] క్రీ. శ. 1230 ప్రాంతమున నొకమారును, 1256 ప్రాంతమున నొకమారును రెండు పర్యాయములు దండు వెడలి పోయినట్లు తెలియవచ్చుచున్నది. (ఆషాఢము పు. 57). . . వెలనాటి రాజులకు గాకతీయులతో నొక ప్రక్కను, నెల్లూరు తెలుగు చోళులతో మఱియొక ప్రక్కను తరతరములు నుండియు వైరము గలదు. . వారి రాజ్యమున పశ్చిమ భాగము తెలుగు చోళుల యధీనమున నుండెను. వెంగి మండల మంతయు కాకతీయులు కబళించిరి. (పుట 65). . ముమ్మడి కులోత్తుంగ రాజేంద్ర చోళుడు. . . పోయిన రాజ్యమును మరల సంపాదించుకొనుటకు దన కుల క్రమాగత శత్రువు లైన కాకతీయులకును, నెల్లూరు చోడులకును శత్రువైన కళింగ భూపాలుడగు ముమ్మడి యని యంకభీము నాశ్రయించి యతని వెంబడి ద్రావిడ దేశమునకు బోయెను. కాని హొయ్యల చోళ నెల్లూరు చోళ సైన్యము లేకీభవించి యుద్ధము సేయగా నెదుర్కొన జాలక పరాజయమునంది కళింగ సైన్యములతో గూడ వెనుదిరిగి స్వదేశమునకు బోయి చేరెను.'' (పుట 67)

నాయనిపల్లి గణపతి శాసనములో తారీఖు లేదుగాని ఈ విషయములు ఎప్పుడు జరిగినవో ఒక విధముగా ఊహించుటకు అవకాశములు గలవు. ఇంతః అకు చూడగా నిర్వచనోత్తర రామాయణ దశకుమార చరిత్రలలో గణపతి ప్రస్తావముగా అక్కన బయ్యనల సంగతి గాని ఏదియు లేక విజయుని మాత్రము గెలిచినట్లుండుట వలన, క్రీ. శ. 1243కు తర్వాత, తండ్రి మరణానంతరము మనుమసిద్ధి రాజ్యమునకు రాగా ఆతనిని తిక్కరాజును విజయాదిత్యుడును దాక్షిణాత్యులు సాయమున నెదుర్కొనగా మనుమసిద్ధి వారిని ఎదుర్కొని 'ప్రాయేరు' ఏటికు తతిమి విజయము గాంచెను. తర్వాతనే బయ్యనలు క్రీ. శ. 1244—46ల నడుమ రేగి నెల్లూరిని ఆక్రమించిరి గదా. కాబట్టి క్రీ. శ. 1243లో మనుమసిద్ధి రాజ్యమునకు వచ్చి విజయాదిత్యుని ఓడించి మరలివచ్చి, రాజ్యము పూర్తిగా నష్టమై పోయి తాను విదేశాంతరగతుడగుటకు ముందు, అనగా క్రీ. శ. 1243—46 మధ్యకాలమున నిర్వచనోత్తర రామాయణమును అంకితము నందియుండును.

ఈ మధ్యలో దీనికి తర్వాత కేతన దశకుమార చరిత్రను తిక్కన అంకితమంది యుండును. క్రీ. శ. 1246కు ముందే ఈ గ్రంథములు రచన యని ఇప్పుడు దృఢముగా చెప్పవచ్చును. తిక్కన గంగని జయించుట 'మహారాష్ట్ర సామంత సారంగుం దోలి తురంగముం గొనుట'యు ఈ కాలమందే అని నిర్ణయింప వలయును. తర్వాత అల్లుండి తిక్కరాజు ఆతని సోదరుడును బలపడి క్రీ. శ. 1246నకు కొంత ముందు, [illegible] మనుమసిద్ధి కాకతీయుల నాశ్రయించి వారి సాయముతో క్రీ. శ. 1249 టికి మరల నెల్లూర పునరభిషేకమును జేసికొనెను. తిక్కన బయ్యనలకు వెలనాటి కులోత్తుంగ రాజేంద్రుని యొక్కయు [illegible] రాజు [illegible] యందలి [illegible] సాయము కలిగినట్లు తెలియుచున్నది. వెలనాటిని జయించి కులోత్తుంగ రాజేంద్రుని [illegible] గోదావరి తీరమును మనుమసిద్ధి ఓడించె [illegible] సందులూరు శాసనమునందు తెలియుచున్నది గదా. క్రీ. శ. 1249 నాటికి గణపతి దక్షిణదేశమును [illegible] అతని శాసనము వలన తెలియుచున్నది గదా [illegible] శాసనములు [illegible] చేత తిక్కరాజు గతించి బయ్యన [illegible] విజృంభించిన కాలమున, అటుపిమ్మట, కాకతీయులు [illegible] రని తలంచవలెను. పైగా నాయనిపల్లి శాసనమునందలి వ్రాత లనుబట్టి [illegible] బయ్యనలను గూర్చి [illegible] టకు లేదు. శాసనము 'ఉద్బోధితుడైన [illegible] తిక్కనం వెరసి [illegible] క్రీడా [illegible] సలిపి' అని యున్నది. విజయాదిత్యుడు తర్వాత [illegible] యున్నాడు. తిక్కరాజు లేడు. తిక్కరాజు సమరమందే గతించెనో లేక తత్పూర్వమే గతించెనో గాని శాసనము ప్రకారము [illegible] (=చేసెను) శాత్రవుల శిరంబుల నని గ్రహించుట యుక్తము.

తిక్కన బయ్యనలను గూర్చి వ్రాయుచు శ్రీ చాగంటి శేషయ్యగారు [illegible] శాసనము నుదాహరించి (నెల్లూరు జిల్లా, ఒంగోలు తాలూకా, నె. శా. సం. 1125 పుట) [illegible] మండలేశ్వర బయ్యన మహారాజ [illegible] బయ్యన మహారాజను చూపినారు. శాసనమందు తారీఖు లేనందున 'ఏ దెప్పుడో ఏ కాలమునానో, మనుమసిద్ధికిని వీరికిని సంబంధమున్నదో లేదో చెప్పజాలము' అని వ్రాసినారు. (అం. క. ల. 2 సం. పు. 218) తిక్కన బయ్యనలు గాక బయ్యన [illegible] చేసెను, నాటి రాజకీయములలో ఏమి పాత్ర లేనో తెలియ నందునను తిక్కన బయ్యనలను వీరిని గ్రహించుట సాధ్యము కాదు.

(2) రణ మరణము మనుమసిద్ధిదే.

వీరగండ గోపాలదిరుదము ఏ కోడమలో [illegible] విజయాదిత్యుడు రణమరణమును 1263 లో పొందినాడని శ్రీ రెడ్డిగారు ఎట్లు ప్రతిపాదింపగల్గిరో నా కాశ్చర్యముగా నున్నది. ఏలయన క్రీ. శ. 1262—63 లో గతించియుండిన

యొడల అతడెట్లు క్రీ. శ. 1278—9 లో తన 29 వ యేట నందలూరిలో శాసనము వేయించి యుండగలడు. ఈతడు మతియొకడనుటకు బొత్తిగా అవకాశము లేదు. తర్వాతి చరిత్రను అరయుదము.

మనుమసిద్ధి విజయాదిత్యులు శత్రువులనుట నిర్వివాదాంశము. తిక్కన సఖ్యము త్రోసివేయరానిది గాన దానిం గూర్చిన విచారము అనవసరము. రణాంగణ మందినవాడు విజయాదిత్యుడా, మనుమసిద్ధియా యనునదే శ్రీ రెడ్డిగారు లేవనెత్తిన ప్రశ్న. ఈ క్రింది కారణములచేత విజయాదిత్యుడు కాడని నిశ్చయించుచున్నాను.

(1) విజయాదిత్యుడు విజయగండ గోపాలుడుగాని వీరగండ గోపాలుడు కాడు. అట్లనుటకు ఒక్క శాసనముగాని లేదు. 'విజయ' 'వీర' కానేరదు. 'వీర' శబ్ద మాతని బిరుదములతో కలియలేదు.

(2) మనుమసిద్ధికి ''గండగోపాల '' బిరుదున్నట్లు శాసనములలో లేదు అని వీరు పెంట్రాల శిలాశాసనముల నుదాహరించి, అందుచేత 'వీరగండ గోపాల పిపిన దాపదహన' యన్న సుందరపాండ్యుని చిదంబర శాసనగత బిరుదము మనుమసిద్ధిని సూచించుటలేదని, అందువలన పెంట్రాల శిలాశాసనములలో ఒకదానిలో విజయాదిత్యుని పేరుండుటచేత, చంపబడినవాడు విజయాదిత్యుడని ప్రతిపాదించినారు. చాల పొరపాటు. పెంట్రాల (కందుకూరు తాలూకా) లో నాలుగు శాసనములు మనకు ముఖ్యములు. (1) నెం 60. కాళయుక్తిది. శ్రీ మన్మహా మండలేశ్వర భుజబల వీర మన్మసిద్ధయదేవ మహారాజులు చేసిన దానము (1258—59 ?), (2) నెం. 61, సిద్ధార్థి, ఈ మన్మసిద్ధి 'రాజ్యాభివృద్ధికి' గాను చేయబడినదె (1259—60 ?); (3) నెం. 62 రౌద్రి, శ్రీ మన్మహా మండలేశ్వర ఇమ్మడిగండ గోపాల విజయాదిత్య దేవమహారాజులకు రాజ్యాభివృద్ధి (కి) గాను చేయబడినది. (1260—61); (4) నెం 63. దుర్మతి—'భుజబల వీర మన్మయసిద్ధియ దేవ చోడ మహారాజులకు రాజ్యాభివృద్ధికిగాను' చేయ బడినది. ఈ నాలుగింటిలో మూడు మనుమసిద్ధివి. ఒకటే విజయాదిత్యునిది. అట్లని శాసన సంపాదకులే ఇట్లు హెచ్చరించి యున్నారు. పుట. 605. నెల్లూరి శాసనములు. (NoI) "In this series of Pentrala inscriptions ......The appearance of Gandagopala in the course of Vira Manma Siddhaya's reign is not understood." అని. వారికే సందేహము నాటికే కలిగినది. రౌద్రి శాసనకర్త వేఱని వారికి తోచినది.

ఇది సరియే. ఎందువలన ననగా ఈ నెల్లూరి శాసనములలో ఎచ్చటను మనుమసిద్ధి పేరుతో కలసి గండగోపాల బిరుదము కానరాదు. అంతమాత్రము చేత గండగోపాల బిరుదముగాని మనుమసిద్ధికి లేదని సిద్ధాంతము చెయుట పొరపాటు. పెంట్రాల శాసనోక్త పురుషులు ఇరువురు. ఒకడు మనుమసిద్ధి, రెండవవాడు విజయాదిత్యుడు. మొదటి రెండును మనుమసిద్ధివి, మూడవది విజయునిది. ఇట్లే నాలుగును ఒక్క యూరిలోనే దొరకుట కూడ గొప్ప చరిత్రాంశమునకే దారితీయునేమో. పైగా 1257—58 లో మనుమసిద్ధి (గణపతి సాహాయ్యమును కోరుచు) నందలూరిలో నున్నాడు. నందలూరిని కలిపి నెల్లూరిని ఏలుచుండెనో లేక అప్పటి నుండి నెల్లూరిని మరల జయించి వచ్చెనో నిర్ణయింప వలసి యున్నది. క్రీ. శ. 1249 కి తర్వాత మరల నితనికి రాజ్యము పోయినట్లున్నది. 1249—1257 మధ్యకాలమున నితని శాసనములు పాకనాటిలో కానరావు. ఈతడు 1257 లోనే గాక 1249 లో కూడ నందలూరిలో నున్నట్లు మఱియొక శాసనము (598 of 1907) వలన తెలియుచున్నది. ఇందు మనుమసిద్ధికి 'మధురాన్తక పొత్తప్పిచ్చోళ గండగోపాళ మనుమ శిత్తరశర్' అని స్పష్టముగా నున్నది. నెల్లూరిజిల్లా శాసనములలో లేకపోవుట యొక కొఱత కాదు. పైగా నెల్లూరి శాసనములలో ఈ బిరుదుల నన్నిటిని వదలక పూర్తిగా వ్రాయుట కానరాదు. కొంత అశ్రద్ధ కనబడుచున్నది. మొదటి తిక్కరాజు శాసనములలో కూడ కొన్ని గండగోపాల బిరుదములేనివి కలవు. అతనికి పూర్వ మీ బిరుద మున్నట్లు కానరాదు. అతని తోనే ప్రారంభమైనట్లున్నది. అతని తర్వాత అల్లునంద్రుడు తాల్చినాడు. కాని ఇంత బాధ ఎందులకు. తిక్కనయే నిర్వచనోత్తర రామాయణమున సందేహమునకు అవకాశములేని యట్లు వ్రాసినాడు. తండ్రి కొమ్మాళ్ళకు ఇరువురకును గండగోపాల బిరుదమున్నది. తిక్కరాజును గూర్చి 'రాయగండ గోపాలు ..... దిక్కధరణి విభు ....' (ప్రథ. ఆ. 33) అనియు మనుమసిద్ధిని గూర్చి సప్తమాశ్వాసాంతమున (160 పద్యము) 'ఫలితామర తరు శోభా తులిత భుజుం ..... రాయగండ గోపాలుడిలన్' అనియు తిక్కన వ్రాసినది చాలును. గండగోపాల బిరుదము కుదిరినది. 'వీర' ను చూతము. మనుమసిద్ధికి 'భుజబల వీర' బిరుదమున్నది. విజయాదిత్యునికి 'వీర' ఎచ్చటను లేదు. వీరగండ గోపాలు డొకడు, విజయాదిత్యుడు కానివాడు ఈ కాలమున స్పష్టముగా నుండెనని గూడూరు (మలాం) శాసనము నెం. 67 (N D I) అతని తొమ్మిదవ సంవత్సరమునది చెప్పుచున్నది. ఇచ్చటనే విజయగండ గోపాలునివి కూడ నుండుటచే ఇరువురు భిన్నులనుట నిక్కము. మొదట 'గండగోపాలుడు' గా నుండి విజయాదిత్యునిమీది పగయు పంతమును అధికరించుకొలది వీరపదము నీతడు తాల్చినాడని ఈ శాసనముచే నిర్ణయింపవచ్చును.

ఇందులకు అనుగుణముగానే జటావర్మ సుందర పాండ్యుని శాసనములను చూచినచో కొన్నిటిలో 'గండగోపాల' యనియు, కొన్నిట 'వీరగండ గోపాల' యనియు కనబడుచునే యున్నది. ''హత్వా చేరమ పాణ్డ్య హోయ్సళ పతిం విద్రావ్య చోళేశ్వరం జిత్వా కాటక గణ్డగోప గణపత్యాదీన

రాతి నపి వీరసున్దర పాణ్డ్య దేవ నృపతిః కృత్వా తులారోహణం చక్రే తాణ్డ విన శ్మశాంక కలికా చూడస్య హైమీం సభామ్'' [South Indian Inscripsions iv —625, 626, 630). కొన్నిట 'వీర' చేర్చియు, కొన్నిట వదలియు, కొన్నిట 'కాంచీపతి' యనియు నీతని శాసనములలో కలదు. 'వీరగండ గోపాల విపినదాః దహన కాఞ్చీపుర వరాధీశ్వర, గణపతి హరిణ శార్దూల, నెల్లూరు పుర విరచిత వీరాభిషేక, ప్రణతరాజ ప్రతిష్ఠాపన' (S. I. I. iv 631) గణ్డగోపాలుని చంపుటచేతనే తాను కాంచీపుర వరాధీశ్వరుడైనట్లు ఇందు స్పష్టము. నెల్లూరినుండి కంచి వఱకు వీరి రాజ్యము కదా. ఈ కాలమున నెల్లూరివారి శాసనములు కంచిలో చాల గలవు. తమిళ శాసనములలో 'వీర' ను వదలి 'కణ్డర్ గండగోపాలన్' అని కలదు. ఇచ్చట కణ్డర్ లనగా గండపెండేరమని యర్థము. భాషాంతరీకరణ మొనర్చి వ్రాయుట గమనింపదగినది. ఇందు వలన మనుమసిద్ధి వీరుడో తెలియగలదు. దీనిని గుఱించి వ్రాయుచు శ్రీ నీలకంఠశాస్త్రిగారు—

'......and it is quite possible that Vira in the Sanskrit expression is not an integral part of the name' అని తమ The Pandyan Kingdom లో (పుట 169) వ్రాసియున్నారు.

పైగా జటావర్మ చంపినది కాకతి గణపతితో చేసిన (వీర)గండ గోపాలుని గదా. విజయగండగోపాలుడు కాకతీయులతో వైరి నెఱపిన ట్లెచ్చటను లేదు.

(3) విజయగండ గోపాలుడు క్రీ. శ. 1263 లో చావలేదని ముందే వివరింపబడినది. ఇతని చివరిశాసనము క్రీ. శ. 1232 ది. (A R137 of 1916) ఇతని శాసనములు నెల్లూరు కడప కంచి త్రిపురాంతకములలో గలవు.

(4) సుందరపాండ్యుడు (జటావర్మ) గండగోపాలుని చంపిన తర్వాత నెల్లూరి రాజ్యమును ఆతని తమ్ములకు (సహోదరులకు ?) ఇచ్చెనని యొక తమిళ శాసనము కలదు. (ఇదికూడ చిదంబరము నటరాజాలయములోనిదే. ఎంగ్రేఫీ డిపార్టుమెంటువారు ప్రకటింపలేదు. 'సెందమిళ్' అను తమిళ పత్రికలో ప్రకటింపబడినది.) ఆ వాక్యములు. 'వాక్కియల్ సెందమిఴ్ సుందర పాండియన్ వాళమరిల్। వీక్కియవన్ కణ్డర్ గండగోపాలనై విణ్ణులకిన్। పొక్కియ పిన్పవన్ తంబియర్ పోట్రు పురన్దరంశ। వాక్కియ వార్తై పదినాలులకము వానదుఃలే॥ ఈ 'తంబియవర్' ఎవరోగాని మనుమసిద్ధికి సహోదరులుండినట్లు కానరాదు. దాయాదులుగా నుండియుందురు.

(5) క్రీ. శ. 1263 కు తర్వాత ఈ 'తంబియర్' ఎంతకాలము పాలించిరో తెలియదు గాని, కడపటి చోళ చక్రవర్తి మూడవ వీరరాజేంద్రచోళుడు 1268 వఱకు పాలించుచుండెను. ఈతడు మొదటి తిక్కరాజునకును మనుమసిద్ధికిని కూడ సమకాలికుడు. (చూ. నెల్లూరు శా. క 39, 85, 90 ు 48) ఆ సంవత్సరము కాకతి రుద్రమదేవి సామంతుడు నాగదేవమహారాజు నెల్లూరిని జయించి పాలింప నారంభించెను. ఐదారేండ్లు పాలించినట్లు తెలియుచున్నది. (నె. శా. A 51, K. V. 48, N 21) క్రీ. శ. 1279—80 ప్రాంతము నుండియు ఈ నాగరాజు కమ్మనాటిలో కనబడుచున్నాడు. ఒంగోలు తాలూకాలో 1280 వఱకు నీతని శాసనములున్నవి. క్రీ. శ. 1278 నాటికి మనుమసిద్ధి కుమారుడు రెండవ తిరుకాళదేవుడు (రెండవ తిక్కరాజు) లలయేర్తినాడు గదా (గూడూరు తాలూకా మడమనూరు శాసనము.) ఇత డెట్లు రాజ్యమునకు వచ్చెనో గాని ఒకటి కనబడుచున్నది. నెల్లూరిని ఇమ్మడి తిరుకాళదేవుడు పట్టుకొన్న కాలమునకు సరిగా విజయగండ గోపాలదేవుడు సంతలూరు ప్రాంతమున కాయుస్థ రాజ్యముపై దాడి సలిపినట్లు ఆతని 29 వ సంవత్సరపు శాసనము దొరికియున్నది. (A R 423 of 1911) నెల్లూరుజిల్లాలోని గూడూరు తాలూకాయును, కాళహస్తి, తిరుపతి ప్రాంతములు (అనగా ఉర్వాతి విజయనగర రాజుల నాటు చంద్రగిరి రాజ్యము) విజయగండ గోపాలుని స్వాధీనమున నుండినట్లు శాసనము లున్నవి. నెల్లూరులో ఉత్తర భాగము నాగదేవరాజు స్వాధీనమున నుండెను గదా. దీనినిబట్టి రెండవ తిక్కరాజు గూడూరు, నెల్లూరు ప్రాంత దేశమును పట్టుకొనగానే విజయుడు ప్రతిక్రియ గానో లేక తిక్కరాజు యొక్క సహాయులను బాధించుటకో అటు దండెత్తి యుండునని చరిత్రకారుల యభిప్రాయము. క్రీ. శ. 1263 లో మనుమసిద్ధి చావలేదని శ్రీ రెడ్డిగారూహించిరి గదా అట్లుండిన మొదల ఈ కాలమున రాజ్యమును మరల జయించుటకు తాను రాక కుమారుని పంపునా ?

(6) చిరమున శాసనము క్రీ. శ. 1284—85 నాటిది గదా. ఇందలి విజయగండ గోపాలుని నిర్దేశించి శ్రీ రెడ్డిగారు ఇమ్మడి మనుమసిద్ధి క్రీ. శ. 1284—85 వఱకు జీవించియుండెననియు, 'విజయగండ గోపాల మహారాజు రాజ్యమున మఱియొక రాజ్యము స్థాపించినట్లు కలదు.' అనియు, 'విజయగండ గోపాలుని రాజ్యమున (మనుమసిద్ధి మొదలగు) రాజులు యుద్ధము చేసి జయించినట్లు కనబడుచున్నది' అనియు వ్రాసినారు.

ఇదంతయు చారిత్రక విషయములను నెమ్మదిగా సమన్వయపఱచుకొనకపోవుటచే కలిగిన గందరగోళము. ఇచ్చట శ్రీ రెడ్డిగారు బొత్తిగా విస్మరించిన విషయము ఒకటి కలదు. క్రీ. శ. 1278—9 నాటికే రెండవ తిక్కరాజు, మనుమసిద్ధి రాజ్యమునకు వచ్చియుండగా, అంతకు ఎంతో ముందే గతించిన మనుమసిద్ధి వచ్చి యుద్ధమెట్లు చెయును ? తండ్రి యుండగానే కుమారుడు రాజ్యమునకు వచ్చి ఆతడు అంతలో అస్తమించి మరల తండ్రి రాజ్య ప్రయత్నము చేసెననుటకు ఆధారము ఎక్కడ నున్నది ? కాబట్టి ఇదంతయు అసంభవము. ఇది వీరికి ఏ ప్రమాణము

చేత తోచినదోగాని ఆ శాసనములో ఎవరో రాజ్యము స్థాపించి నట్లు గాని, యుద్ధము చేసినట్లుగాని, అన్నిటిని మించి మనుమసిద్ధికి దీనితో సంబంధమున్నదని తలంచుటకుగాని ఆధార మేమియు లేదు. ఆ శాసనమిదిగో (నె. శా. పుట 233—34).

''శక వరుషంబులు ౧౨౦౪ గునేంటి భాద్రపద శుద్ధ త్రయోదశి గురువారమునాండు స్వస్తి పర్ణవంశోద్భవ భారద్వాజ గోత్ర పవిత్ర ఖట్వాంగ ధ్వజ వృషభ లాంచన కాంచీపుర వరా ధీశ్వర కామకోట్యంబికా లబ్ధ వరప్రసాద జగద గోపాళ నామాది ప్రశస్తి సహితం శ్రీ మన్మహా మండలేశ్వరం విజయగండ గోపాళ మహారాజు రాజ్యమున స్వస్తిగుణమణి కిరణాలం కృత కేయూర హార ఒరయూరి పురవరాధీశ్వర గండరగండ ప్రజమెచ్చు గండ పండిత పుండరీక షండ మార్తాండ బురాగండ నితల గోలుగండ బద్య మహారాజ స్థాపనాచార్య నామాది ప్రశస్తి సహితం శ్రీమతు గొల్లపూండి కేశిమనాయని కొడుకులు శ్రీ కామయ నాయకుండును, దేవి నాయకుండును ధర్మప్రవృత్తి యైన చిఱుమున మల్లికార్జున దేవరగుడి రంగభోగార్థముగాను భోగమువారికిచ్చిన వరచేను ....''

తర్వాత దానము యొక్క వివరములు, ఇచ్చట రాజులు గాని, మనుమసిద్ధిగాని, యుద్ధము చేయుటగాని బొత్తిగా కనబడవే ! అట్లుండగా శ్రీ రెడ్డిగారు ఎట్లు ఈ అభి ప్రాయమునకు వచ్చిరో నా ఊహకు అందుట లేదు. ఏదో ఒక దా నికి మఱియొకటి అనుకొనియుందురు. 'బద్యమహారాజ స్థాపనాచార్య' అన్నది కూడ గొల్లపూండి నాయకులకు వర్తించు చున్నది. ఈ బద్యమహారాజెవరో తర్వాత చూతము. మనుమ సిద్ధి మాత్రము కానరాడు గదా !

(7) ఈ విజయగండ గోపాలుడు నాటివాడే యగునో కాడో, మరి ఆత్మకూరు తాలూకాలో చిరమన కెట్లు రాగలి గెనో పరిశోధింపవలసియున్నది గాని, మనుమసిద్ధియొక్క శత్రువైన యెడల తన రాజ్యసంవత్సరమును ఇందు చెప్పక పోవుట యెందులకో ! విచార్యము. కాని, క్రీ. శ. 1278—9 లో నందలూరి వఱకు వచ్చిన విజయాదిత్యుడు 1281 వఱకు జీవించియుండినట్లు కంచి శాసనముచే తెలియవచ్చుట చేత, నందలూరు ప్రాంతమునుండి ఆత్మకూరు చిరమనలో శాసనము వేయించి యుండదగును. దీర్ఘకాలము జీవించి యుండినట్లున్నాడు.

ఈ కాలమున నొక మనుమగండ గోపాలుడు కనబడు చున్నాడు గాని అతడు మన రెండవ మనుమసిద్ధి మాత్రము కాడు. క్రీ. శ. 1279 లో నెల్లూరిని మరల గ్రహించిన రెండవ తిక్కరాజు ఎంతకాలము పాలించెనో తెలియదు గాని మనుమగండ గోపాలుని శాసనములు మాత్రము శ 1204 (క్రీ. శ. 1282—3) నుండి కనబడుటచే నీతని రాజ్యకాలము మూడు నాలుగేండ్లవఱకు మించలేదని విశదము. మనుమ గండ గోపాలు డెంతకాలము పాలించెనోగాని ఇతని తర్వాత రాజ గండ గోపాల బిరుదాంకుడు మధురాన్తక పొత్తపి చోళ రంగ నాథుడు నెల్లూరులో క్రీ. శ. 1290 లో పాలించుచుండెను. మనుమగండ గోపాలుని అంత్యకాలమెప్పుడో గాని ఇతనిది కూడ రణ మరణమే. కాకతి రుద్రమదేవి కాలమున ప్రతాప రుద్రుని సకల సేనాధిపతియైన అడిదము మల్లు అను నతడు 'మనుమగండ గోపాల శిరఃఖండన' యను బిరుదును ధరించి యున్నాడు. (SI I X 479).

(3) తిక్కన భారత రచనా కాలము.

'సత్య మెట్టిదో తెలుప వేడికోలు' అని జిజ్ఞాసువులై శ్రీ రెడ్డిగారు కోరినందున ఇంతదూరము వివరించి వ్రాయ వలసి వచ్చినది. సత్యమే చరిత్ర కెక్కును. సత్యేతర మెక్కదు గదా. అది నవలలకు పనికివచ్చును. ''శ్రీ శాస్త్రిగారి పరి శోధన ప్రకారము ఇమ్మడి మనుమసిద్ధి క్రీ. శ. 1284—85 ప్రాంతము వఱకు సజీవుడై యుండి తిక్కన కావ్య మును కృతి నందియుండవలెనని అనిపించుచున్నది'' అని రెడ్డిగారు వ్రాయుటకు బొత్తిగా ఆధారములేదు అనుటకే గాని అనిపించుటకుగాని నా రచనలో ఎచ్చటను అవకాశము లేదు. తిక్కనచే మనుమసిద్ధి నిర్వచనోత్తర రామాయణమును కృతి నందినది క్రీ. శ. 1243—46 ల నడిమి కాలమని స్పష్టీక రించితిని గదా. మనుమసిద్ధి మరణము క్రీ. శ. 1263 కు లేక కొంత ముందని గంట వాయించినట్లు తెలిపితిని గదా. ఇంక నెట్లు వ్రాయవలయునో తెలియుట లేదు.

మనుమసిద్ధి మరణానంతరమే మహాభారత రచన యని ఇదివరలో వ్రాసితిని. తిక్కన ఒయ్యనేని అల్లుని తిక్కరాజును ఆతని సోదరుడు సని తెల్పితిని గదా. భారతము నాంధ్రీకరించి, కాకతి గణపతికి దానిని వినిపించి అతని సాయమును తిక్కన సంపాదించెనని సిద్ధేశ్వర చరిత్రాదులలో నుండుటచే, క్రీ. శ. 1249 కి ముందే మరల నెల్లూరికి గణపతి వచ్చియుండుట చేత క్రీ. శ. 1246—49 నడిమి కాలమున మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడగుటకు ముందు, నిర్వచనోత్తర రామాయణ దశకుమార చరిత్రలకు తర్వాత, తిక్కన భారతాంధ్రీకరణ మును ప్రారంభించి, గణపతి చక్రవర్తిని సందర్శించిన సందర్భ మున అతనికి వినిపించియుండుట సుసంభవమే. జరిగి యుండునని తలంచుటకు అవకాశము కలదు. భారతాంధ్రీకర

ణము పూర్తియగు లోపల మనుమసిద్ధి గతించి తర్వాత తిక్కన హరిహరనాథుని కంకితమిచ్చియుండునని పండితాభిప్రాయముగా నుండెను.

కాని ఇంతదూరము తర్కించిన తర్వాత నా కొకటి తోచుచున్నది. తిక్కన భారతములో మనుమసిద్ధి ప్రస్తావము లేకపోయినను, స్వప్నములో తిక్కనకు కనబడిన 'తండ్రి' నాటి విషాద విషమ రాజకీయ పరిస్థితులను వేటినిగాని సూచింపక భగవంతుని యనుగ్రహప్రకారమును తెలిపి తన వెంట వచ్చిన ఆ దేవునే చూపుటయు, దేవుడు దర్శన మిచ్చుటయు, అంకితము కోరుటయు, తిక్కన 'ఇమ్మహాభారతంబు సమస్త దురితాపహంబును నభిమత శుభావహంబును గావున నొక్క మహాఫలంబు గోరి జనమేజయుండు .... వినిన కథ' అని వ్రాసి మరల తాను ఆ భారతమునే వ్రాసి వినిపించుటయు చూడగా తానును ఏదో 'మహాఫలము' ను కోరియే వ్రాసి వినిపించినట్లు ధ్వనించుచున్నది. ఏదో అనిష్టము తొలగిపోవుటకు చేసిన పనిగా కనబడుచున్నది. 'తిక్కన బయ్యనలను జయించుటయే యైయుండినయెడల అది సిద్ధించుటకే భారతాంధ్రీకరణమై యుండును. దానినే గణపతిచక్రవర్తికి వినిపించియుండును. దశకుమారచరిత్ర యందు గణపత్యాదుల ప్రస్తావము లేనట్లే అనంతర రాజకీయ కల్లోలాదికములకు గాని, రణ మరణ మందిన మనుమసిద్ధికి గాని ఎట్టి సూచనయు భారత మందు లేదు. సిద్ధేశ్వర చరిత్రలోని వృత్తాంతము— గణపతి 'తిక్కన బయనలను' నిర్జించుట చరిత్రాంశముగా తేలినది గదా. కాబట్టి—తిక్కనయు భారతములో సోమయాజి యని మాత్రము వ్రాసికొని, మనుమసిద్ధిని రాజ్యమందు తాను కుదురుపరచినట్లు చెప్పకపోవుటచేత భారతము కూడ మనుమసిద్ధి యుండగానే, అతని రాజ్యలబ్ధి కొఱకే భగవదారాధనగా వ్రాసి యుండునేమో ! ఇది యొక క్రొక్కువంటిది గావునను, స్వప్నవృత్తాంతమునుబట్టి అంకితము దేవునికే దైవనిర్ణీతమైనందునవలనను రాజు అంకితము కోరలేదని తోచుచున్నది. 'తిక్కన బయ్యనం' చరిత్ర సత్యమై యుండగా, మనుమసిద్ధి గణపతి సాయమును కోరినది శాసనస్థమై యుండగా, తిక్కన భారతము నంత దీక్షతో వ్రాసియుండగా, గణపతికి భారతమును వినిపించినది మాత్ర మెట్లు అసత్యమగును ? గణపతిని దర్శించు నాటికే తిక్కన సోమయాజి యైనాడని సిద్ధేశ్వర చరిత్ర వ్యక్తము చేయుచున్నది. 'అట్టి మహాత్ముని నా సోమయాజి' అని.

ఇదంతయు క్రీ. శ. 1263 కు ముందేయని తేలుచున్నది గదా. ఇంకను సూక్ష్మముగా పోయిన 'తిక్కన బయ్యన'లు ఇరువురును—అల్లుండిక్క విజయాదిత్యులు—సజీవులై యుండిన కాలమునకు క్రీ. శ. 1249 కి ముందే జరిగి యుండవలెను. మనుమసిద్ధి పాండ్యుల తోడి రణమున మరణమందిన కాలమునకు తిక్కనయున్నాడో గతించెనో. ఏలయన భారతము రచించు నాటికి తిక్కనకు తండ్రి లేడు. నిర్వచనోత్తర రామాయణము నాటికే తిక్కనను మనుమసిద్ధి మామ యని పిలిచెడు వాడు. క్రీ. శ. 1243 నాటికే మహావీరుడై విజయములు గాంచిన మనుమసిద్ధి బాలుడుగా నుండడు. 1243 నుండి 1263 వఱకు దాదాపిరువది ఏండ్లు రాజ్యమునకై పోరాడియున్నాడు. ఇరువది ఏండ్లకే రాజ్యమునకు వచ్చెనని తలంచినను గతించునాటికి మనుమసిద్ధికి నలువదియైన నుండవలదా. కాని అల్లుని తమ్ముడు 1281 వఱకో లేక 1284 వఱకో జీవించియుండినట్లు కనుబడుచుండుటచేత అల్లునికన్న చిన్నవాడైనను, అల్లుని తమ్మునితో సమ వయస్కుడై యుండవచ్చును గదా. విజయాదిత్యుడు దాదాపు నలువది యేండ్లు (1243—1283) పోరాడి యున్నాడు గదా. 1243 నాటికి ఇరువదేండ్ల వాడన్నను అఱువదేండ్లు జీవించి యుండవలయును. కాని నాటి రాజకీయ వాతావరణమును చూచిన యెడల అంతకన్న పెద్దవాడైయే యుండవలెనని తోచుచున్నది. మనుమసిద్ధియు రణ మరణ మందు నాటికి దాదాపేబది యేండ్లవాడుగా నుండియుండును నాటికి తిక్కన సోమయాజి గతించియుండును. లేనిచో ఆంధ్ర మహాభారతానంతరము ఆయన ఏమియు వ్రాసినట్లులేదు. ఏవేవో గ్రంథములు ఆయనకు ఆరోపితములైనవి. తర్వాతి వారికి మార్గదర్శకుడై పూజ్యుడైన కవిబ్రహ్మయొక్క గ్రంథములు నశించిపోవునా? కావునను, ఇతర కారణములచేతను వానిని పండితులు తిక్కనవి కావని తలంచినారు.

పైగా తిక్కన ఒక కాళయుక్తి సంవత్సరము గతించి నట్లొక పద్యము వెంకంజీగారి సంచయమున దొరకి యున్నది.

"అంబర రవి శశి శాకా
బ్దంబులు చనఁ గాళయుక్తి భాద్రపదపు మా
సంబున నంబరమణి సిం
బంబున దగు తిక్కయజ్వ బ్రహ్మము చేరెన్."

దీనింబట్టి శా. శ. 1120, క్రీ. శ. 1198 అగుచున్నది. కాళయుకి - - - కీ. శ. 1198 నిధన కాలమగుట అసంభవముగదా. తర్వాతి కాళయుక్తి యగునేని క్రీ. శ. 1258 అగుచున్నది. క్రీ. శ. 1249 కి ముందే భారత రచనయేని నాటికి గణపతి నెల్లూరి పయికువచ్చి కంచిని కూడ జయించినను విజయాదిత్యుడు పట్టు పడలేదు. మనుమసిద్ధియు నెల్లూర పాలింపలేదు. పెంట్రాల శాసనములనాటికి మరల వచ్చియున్నాడు. మరల నొక సంవత్సరము శౌద్రిలో, మధ్య, 1260 కి విజయాదిత్యుడు ఉచ్చటనే శాసనము వేసియున్నాడు. మరల దుర్ముఖిలో మనుమసిద్ధి వచ్చియున్నాడు. ఇట్లు రాజులను పోటీలు వేసికొని అయారి సమములు వేయించుట, పైగా 'లమ రాజ్యాభివృద్ధికి' అని వ్రాయించుకొనుట చూడగా యుద్ధములలో పరస్పరము జయించుచు ఓడిపోవుచునుండిరని తోచుచున్నది. తుదకు ఇదంతయు 1263 నాటి ముత్తుకూరు రణరంగమునకు దారితీసియుండును. గణపత్యాదులు మనుమసిద్ధికి సాయము వచ్చినను దైవము ప్రతికూలమైనది. తిక్కన సోమయాజిని పోషించిన ప్రభువునకు ఆయువు తీరినది. కాగా రాజకీయ విప్లవవాదులచే నెమ్మదిలేక తిక్కనకవి భారతానంతరము ఏమియు వ్రాసి యుండడు. క్రీ. శ. 1258 (కాళయుక్తియే) నాటికి మనుమసిద్ధి కందుకూరు సీమలో నుండుట, అడ్డులేక మూడేండ్లుండిన యనంతరము విజయాదిత్యుడు వచ్చుట చూడగా, క్రీ. శ. 1249 లో నొకసారి విజయము గాంచినను క్రీ. శ. 1258 (కాళయుక్తి) నాటికి మనుమసిద్ధి నెల్లూరిలో స్థిరపడినట్లున్నాడు. ఆ సంవత్సరమే, కార్య సాఫల్యానంతరమే తిక్కన సోమయాజియు 'బ్రహ్మము' చేరి యుండును. ఇది ఈ చారిత్రక పునర్నిర్మాణమునకు సరిపడుచున్నది.

కావున తిక్కన 1280 ప్రాంతమున గ్రంథ రచనలు చేయుచు మనుమసిద్ధికి అంకితమిచ్చుచు కాలక్షేపము చేయుచుండెననుట ఎంతమాత్రము కుదరదని శ్రీ రెడ్డిగారికి నా విన్నపము.

సారాంశము—(1) విజయాదిత్య గండ గోపాలుడు ఒక్కరే. (2) సుందరపాండ్యునిచే చంపబడినవాడు విజయాదిత్యుడు కాడు (3) వీరగండ గోపాలుడు మనుమసిద్ధియే. (4) నిర్వచనోత్తర రామాయణ దశకుమార చరిత్రల రచనా కాలము క్రీ. శ. 1243—46 లకు నడుమ. (5) ఆంధ్ర మహా భారత రచనా కాలము క్రీ. శ. 1246—49 లకు నడుమ. (6) తిక్కన నిధన కాలము క్రీ. శ. 1258. (7) మనుమసిద్ధి నిధనకాలము 1263. (8) రెండవ తిక్కరాజు రాజ్యమునకు వచ్చినది 1279— జక్కన తాత కాలము

శ్రీ రెడ్డిగారు ప్రతిపాదించినవి కుదురవు.



# ఈనాటి సంరంభము

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

## 15

నవ్యాధునికులు కవిత్వ రచన కుండిన సంకెళ్ళు నిశ్శేషంగా తెంచిపారేశారు. ఈ యత్నంలో వీ రవలంబించిన రీతుల్ని పట్టుకుని పలువురు కవులు పలు ముఖాలగా రచన సాగించారు. ఆరుద్ర అనే భాగవతుల శంకరశాస్త్రిగారు స్వేచ్ఛా రచనతో ప్రత్యేక తంత్రాన్ని జోడించి రచించారు. గణ ఛందస్సుని గాని, మాత్రాచ్ఛందస్సుని గాని స్వీకరింపలేదన్న కారణము వల్ల స్వేచ్ఛా రచన చేశా రన్నాను. ఈ రచనమీద వారు నిర్మించిన తంత్రము (1) ఊహలకు బదులు వస్తువునీ, అనుభవాన్నీ వాడడము. తత్వాలు రచిస్తూ 'గొర్రె లైదొక పెద్ద పులిని కొట్టి నెత్తురు త్రావెరా' అన్న రచనని 'పంచేంద్రియాలూ మనస్సుని పట్టేశాయి' అన్న ఊహకి బదులు వాడుకున్నారు మన సాధువులు. అయితే ఆ పాట అంతా వింటే అర్థము సులువుగా బోధపడని పాదాలు చాలా ఉంటాయి. ఆరుద్ర రచనలో ఊహా స్రవంతికీ, వారు పట్టి తెచ్చే వస్తువుల—లేదా అనుభవాల—వరసకీ సమాంతరమూ (Parallel) నిరంతరాయ గుణమూ కూడా ఉంటాయి. "నీవు ఎక్కదలచుకున్న రైలు, ఎప్పుడూ ఒకే జీవితకాలం లేటు, ఏళ్ళూ ఊళ్ళూ నిరీక్షించలేక ఎక్కేస్తావేదో ఒక బండీ, నీ ఆదర్శాల లగేజీ ఎక్సెసంటాడు టి. ఐ. సీ. నీ ఈప్సితాల ట్రంకుపెట్లు కలల బ్రేకులో పారెయ్యాలి .... నువ్వు వెళ్లదలుచుకున్న ఊరు నువ్వు బ్రతికుండగా చేరజాలదా రైలు, దేవుడా! ఇంత చేశావా అని ఉన్న ఊళ్ళోనే ఉండు." ఆధునాతన నాగరిక జీవితోపకరణాలు వ్యాకరణం, గణితం, జామెట్రీ, 'టూ వే స్విచ్‌లూ' 'సీళ్ళూ, టెంపరరీ డ్యూటీ, .... సర్వమూ ఆరుద్ర తంత్రానికి మహాభక్తుల ప్రపత్తితో లొంగి వస్తాయి. ఈతంత్రంలో రెండో శాఖ: రచనను వస్తు సమితి ఉపయోగానికి సమాంతరంగా సర్దడము. గోడ గడియారానికి 'కీ' ఇవ్వడాన్ని జ్ఞాపకం చేసుకోండి. ఏ త్రిప్పు అయినా దాని కది స్వతంత్రము. అన్నీ చేరి స్ప్రింగుని చుట్టి బిగిస్తాయి, గడియారము పనిచేస్తుంది. అన్ని తిప్పులూ సరిగ్గా ఒకే పాత ఉండవు. చివ్వర కొంచెం డెక్కుతూ తిప్పుతాం స్ప్రింగు బిగవదేమో ననీ, తెగిపోతుందేమో ననీను. ఇదుగో ఆరుద్రగారు మనకి 'కీ' యిస్తున్నారు. "అపత్కాలం, చీకటి దుకూలం, ఆలస్యం నీ, ఓటమి రహస్యం, ఆరంభించిరి, నీచ మానవులు, అత్యాచార వ్యూహమ్ములన్, అరంభించర దేలకో, సుజను లాయా వ్యూహవిచ్ఛేదనం .... విజ్ఞానం, వికసించిన మూడవకన్ను వివేకం నీకున్న ఒకే ఒక్కదను". బంధ కవిత్వమనే దానిలో కల్తీరింపు తంత్రం తప్ప ఏ కునకకు దాని అర్థమూ, వీటికి ఎంతో కొంత వైచిత్రీ ఉండవు. గడియారం చిన్న ముల్లుకి పండ్రెండే మజిలీలు. మజిలీ మజిలీ సమానము. దేనికి దానికి ప్రాధాన్య ముంది. ఇరవై నాలుగ్గైతే రోజు. ఇదిగో ఒక రోజుకు ఆరుద్ర ఊహాగంటలు. (హోరలు అనండి వైరి సమాసం నచ్చకపోతే) "ఇది నాగలి, ఇది దాగలి, ఇదే పునాది సైతానుకు ఇదే సమాధి" ఇలాగే ఇరవై నాలుగు గంటలూ (పొరపాటున కాబోలు 'ఇది స్వర్ణం' అనే ఇరవై అయిదో గంట చేర్చారు) సాగిపోయి రచనని పూర్తిచేస్తాయి. ఈ రీతిగానే అలారం: "లోహాలో లోయలో ఓహో పటాలం, పటాలం ...." అంటూ సాగుతుందీ, పెద్దముల్లూ లోలకం, గడియారపు ప్రధాన భాగాల పనులతో రచనా తంత్రానికి పోలిక ఉంటుంది. ఇక్కడే చెప్పకపోతే చదువరులు 'ఆరుద్ర రచన ఇంత మాత్రమే' అనుకుంటారు, కనక చెపుతున్నా. 'అలారం' లాగే ఆ రచన కూడా చదువరి మనస్సుకి అలారం, హెచ్చరిక; గంటల ముల్లు, గంటల పరిమాణపు పాదములను మాత్రమే కాక జనత గంటలను ఉపయోగించవలసిన పద్ధతిని సూచిస్తుంది' 'ఇది నాగలి, ఇది దాగలి' అంటూ. ఇసుక గడియారం తరతరాల మానవులకు చెప్పవలసిన—పలుమంది చెప్పిన—, పరమసత్యాన్ని సన్నగా ధీమాగా చెపుతుంది. ఆరుద్రకు ప్రపంచమునిండా తెలివైన వస్తువులే కనబడతాయి. వాటి బ్రతుకును

పట్టి మనకి చూపిస్తూ మనకి ఇంట్రావీనస్ ఇంజెక్షను ఇవ్వాలని ఆయన ప్రయత్నం. ఈ వస్తువులు - చిత్రం— మానవ నిర్మితాలు. వాటి బ్రతుకే ఉపదేశము చేస్తుందన డమూ, ఆ ఉపదేశాన్ని అన్వయించడము ఆరుద్ర ఆశయాల్లో ఒకటి. అధునాతన ప్రపంచానికీ మానవ జీవితానికీ నడిచే జ్వాలాతోరణము ఆరుద్ర రచనలలోని ఈ శాఖ.

ఆధునిక జీవిత సంరంభాన్ని ఈ సాంకేతిక పద్ధతిలో వర్ణిస్తూ ఇప్పటి విలువలూ, సంస్థలూ, ఆశయాలూ నిలవ వని ఆరుద్రగారు చెపుతున్నారు. సాంకేతిక పద్ధతులవల్ల, ఒక్కొక్కప్పుడు వారు నిర్దేశించిన అభిప్రాయం మరుగుపడి పోతుంది. పురుషుల III క్లాస్ బోగీలో చెట్ల గురించి (దన వంతులు) చిల్లలు కల (రజాకార్ల) గురించి సంభాషణ రెయిన్లో జరుగుతూండగా, చెయిన్సు (సంయమం) లేని మగాళ్ల ముందు, చెదపురుగులు (పరాన్నభుక్కులు) గాని మగాళ్ల ముందు, నిటారుగా నించొని, తన బట్టలు నింపాదిగా తాపీగా ఒలచుకునే నిటారుగా నిస్సిగ్గుగా నించొనే నీతి మంతురాలు (తాను తప్పుచేయని స్త్రీ). ఇది బందరునుంచి బెజవాడ పోయే రైలులో రజాకార్లచేత మానభంగమూ, నగ్న ప్రదర్శనమూ పొందిన స్త్రీ చేసిన చేత అంటారు. ఇలాగ ఒక తెరమాటునుంచే తెలంగాణా తిరుగుబాటునీ ధనికుల భవిష్య త్పతనాన్నీ సూచిస్తారు ఈయన.

ఉద్ధతుని దారుణపు టూహల్నీ, వ్యర్థజీవుల యదార్థ దృశ్యాల్నీ కూడా చిత్రించారీయన. 'తోలించు తోలించు తెల్ల గుర్రాలని (white horse wh'sky) గళాసు ల్లోకి. అప్రతిష్టతో, నిందలతో తడిసిన జీవితాన్ని విప్పి లోకంమీద ఆరవేస్తాను. "సభ్యత విడాకులిచ్చిన సత్యాలను నేసి ధరిస్తాను" అంటాడట రాక్షసుడు స్వగతంలో. ప్రజను పీడించి బలిసి బ్రదికిన సిరిమంతుడి మరణశాసనమట ! 'చనిపోతున్నా ఒకరూ ఏడవరేం. కాలం కాగితమ్మై, దివా కరుడు స్టాంపైతే నా దస్తావేజు (జీవితానుభవం) మీద రేరాజే రాజముద్ర (అన్ని కాలాలికీ అన్ని దేశాలికీ చెందిన ధనికుడు వీడు !).... ఈ నక్షత్రాలతో నా మరణశాసనాన్ని లిఖిస్తున్నాను. .... అరగనట్టి తరగనట్టి అనుభవాల భూమిచ్చా ఏలుకొండి, గుండెల కుంపటిపై (మీ) శ్రమ నెసరుపెట్టి .... రాచ పీను గను తోడు లేనిదే కదలను, మీ కష్టాలను కక్కకట్టి నాతోటే కాటికి తెండి. ఇప్పుడు చెప్పను ఏమేమిటి రాశానో, స్మశా నంలో సగం కాలి పైకి లేచు శవాన్ని కాటికాపు భవిష్యపు దుడ్డుకర్రతో పడగొడితే పగిలిన నా కపాలంలోంచే, వినబడు తోంది నా మరణశాసనం" జోలపాట వినండి : పులికోరల చలి గాలులు ఆపిందికి కవచంలా, నడిపేని పెడి బతికే నీ వొంటిని గుడ్డ లేదు.... రైలుదారి మదుము (తూము) లోని మంచు పొరల ముసుగు తన్ని పల్లక (మెదలక) లొంగో కొడకా. మీద పెళ్లు రెళ్లవేడి అదే నీకు చలిమంటా. నిద్రపో నిద్రపో మన ఖర్మం కాదులే, (ధనికుల జులుం) అర్థం ఏ కవములే, శాంతి పొద్దు పొడిస్తే సుఖం పలుకు మేలుకొలుపు, అందాకా భూలోకం పరుపుమీద, ఆకాశం కప్పుకొని, కదలి హాహారు గుర్రుపెట్టి, నిద్రపో చిట్టిపాపా." శ్రీ శ్రీ భిక్షువర్షీయసీ, ఈ జోలపాట వ్యర్థజీవిత యథార్థ దృశ్యాలు. 'ఆరుద్ర 'చోపుదార్ గల్లీసిల్లి' (భోగంవీధి వ్యభిచారిణి) అలాంటిదే. 'నిలబడి ఉన్నది, ముస్తాబై గుమ్మం ముందర, ముండా మోసిన విశాఖపట్నపు ముదుతలుదేరిన ముఖమండలంపై చెరిగీ చెరగని కుంకంబొట్టు చోబుదార్ గల్లిపిల్ల' అని ప్రారంభిస్తుంది. వీరివే (రాజకీయ) పాలనముమీద ఉపాలంభ గీతా లున్నాయి. వట్టి తిట్లతో ప్రయోజన మేమిటీ ? మనుష్యుల మనుస్సుల్ని మార్చే రచనలు చేయగలిగితే, యత్నిస్తే ఏమేనా ఉన్నది. లేకుంటే రాజకీయ పోరాటం ఉండనే ఉన్నది. అంతేకానీ అన్ని దేశాలకీ, అన్ని పరిస్థితులకీ పనికివచ్చే "పాలితుల మెదళ్లకు దళ్ళుకట్టి వాళ్ల చూపు దారిలో కాపలావాళ్లని పెట్టి, వాళ్ల కళ్ల కిటికీలు మూసి మేకులుకొట్టి, పరిపాలించబోతోంది రేపటి రాజ్యం" అని ఎంత శక్తివంతంగా తిట్టినా అదే అస్త్రం పిమ్మీదకీ తిరుగుతుంది! "ఆశయాలకు ఆనకట్టలు, ఆవేశాలకు చన్నీళ్ళు, అభిప్రాయా లకు సంకెళ్ళు!, ఆలోచనలకు బేడీలు, ఆదర్శాలకు ఉరిత్రాడు, ఉత్సాహానికి కంట్రోలు, ఉద్రేకాలకు రేషను, ఇహంలో నో వేకెన్సీ, పరంలో నో ఎడ్మిషన్, కళ్ళకు కటకటాలు, కనిక రానికి కారాగారం, కడుపులోకి కంకర" అనేది ఏ దేశంలో నైనా, ఏ పరిస్థితుల్లోనైనా ఊదగలిగిన తూరాబాకా.

ఆరుద్ర వస్తుప్రయోగ రచనాతంత్రాన్ని "రాంగేయ" యట "మిస్ డెమోక్రసి" లో పట్టేరు కొంత. అయితే అక్కడ వస్తువులు మారిపోయాయి అడుగడుక్కీ. 'అందంగా మందంగా సెంట్రల్ పే కమీషన్ చందంగా, నడుస్తోంది ఓ తరుణి అందాల బరిణి. కమ్యూనిష్టు జండాలా ఓష్ఠం, ఇండి యన్ కాన్‌స్టిట్యూషన్‌లా శరీర సౌష్టవం, గాంధీ టోపీలా కొన తేరిన ముక్కు, బ్రాందీ బాటిల్ లాగ పొడవైన నెక్కు, వాహ్ ఆమె కెంత టెక్కు ? బుగ్గల్లో ఆవడి ఆదర్శాల నిగ్గులు, మొహంలో కొత్త మంత్రివరేణ్యునిలా సిగ్గులు, ప్రయివేటు రంగంలా విశాల ఫాలఫలకం, పబ్లిక్ సెక్టార్‌లా అందులో చిన్న తిలకం." ఈ వరసిని పోతుంది. విమర్శించేవారే కాక,

విమర్శకి గురియైనవారూ నవ్వుకోవచ్చు ఈ రచన చూసి. ఇలాటివి కోరతగ్గవి.

మొదటినుంచీ బ్రహ్మముడిగానే కూర్చున్నారు శ్రీరంగం నారాయణబాబు. సమావేశాల్లో అంతర్ముఖీ ఉండే వ్యక్తి కలం పట్టగానే బ్రహ్మరాత ఎలాగు రాస్తాడు ? ఆయన వేసే ముళ్లు విప్పడం ఇప్పటికి ఎవరికీ చేతకాలేదు. 'ముళ్లు ఎలాగ వేశి ఉంటారు' అన్న జిజ్ఞాసే బ్రహ్మముడిని గురించి విన్నవాళ్ళు చెయ్యగలిగిన పని. ఈయన 'రుధిరజ్యోతి' వ్రాతప్రతి ఆరుద్ర సౌజన్యంవల్ల నాకు చూడ లభించింది. మొదటి పుటలో ''నీ పాటల కత్తులలోనే నా హృదయం నెత్తురులీని నే వెలిగించిన ఈ దీపపు కాంతిని నర్తింపుమురా శ్రీ శ్రీ'' అన్నారు. పోలిక మాత్రము ఉపయోగిస్తారు తప్ప పోలికలో మంచీ వోఘాయిత్యమూ అన్న ద్వంద్వాలు లేవు ఈయనకు. ''రేయి ముసుగు పుడమి కొనగి దివసావసానకాష్ఠ జ్వాలల్లో కాలం సహగమనం చేసింది. ఆరిన చితిలోని బూడిద, వెన్నెల (కాంత) యొక్క జారిన ముక్కుపుడక ఒకటే చుక్క. ఇక్కడ పోలిక (లేదా ఉత్ప్రేక్ష) క్షణంలో మారింది. (చితి ఉన్న ఆ) స్మశానాటుల (లో) వ్రాలిన రాబందులె శరన్మేఘములు. (ఇంకొక) సమాధిలో మృతశిశు వట్టులు జలదాంతరశశి. (ఏదో శక్తి) వ్యోమ మార్గముల సంచరించినది. మూగ కేకలు వేసింది .... విలయవేళల ప్రళయతాండవం చేసే శివునకు వెనుక పాట పాడే కవులుంటే కావాలంటూ. ఆ పిలుపు నారాయణ బాబుకి అందినది. మొగ్గే తొడుగని మొలక ప్రాయంలోనే పెండ్లి చేసేసి చిన్న పిల్లల్ని వధించే సంఘాన్ని దహించి రుధిర జ్యోతి వెలిగించమన్నారు. ఒకరాత్రి పేదవాని కడుపు మంటగా చుక్క, గాజుపెంకుగా నెలవంక, బాలిక చూలాలి అశువులే గాలి, బాలవితంతువు ఉశవలె పాలపుంత గోచరించాయి. ఉపమానమూ ఉపమేయమూ సమాంతరంగా సాగిపోతున్నాయి. ఈ గమనమే పోలిక, పరస్పర సామాన్య గుణము ప్రత్యేకపు పోలికలలో ఉంటే ఏదో కొంచెము లీలగా, ప్రాణాలకు గాలి తోనూ, మంటకు చుక్కతోనూ. రచనను నడిపేది కవి ఉత్క్రోషము. రోడ్డుపక్క కుష్ఠురోగి, (తనకు రాణి వంటి) బండరాయిని 'నా వలపులరాణి' అని పాట పాడతాడు. కాదామరి ! మానవు లెవరూ చేరువకు రారైరి. ఏమి చేసినా సహించే బండరాయే వాని వలపులరాణి. 'నిశాగీతిలో' 'అంధుని కనురెప్పలపై కన్నీరు నా గీతం' అన్నారు. అందని సౌందర్యానికి అన్వేషణ అన్న మాట వీరి యత్నం. 'పాతాళమ్మున పతితులు పలవించే మాటల జాలిపాట, పాడవలెనని వీరి ఆశయము. 'కాలం నాగు (పాము) వినువీథుల్లో వెన్నెల పడగ విప్పింది'టా, గగనమ్మున చుక్కలు తెల్లని మసూచి కుండ (పొక్కు) లటా, (ఈ) 'బాధకు వెక్కివెక్కి రోదించిన' దట ఆకాశము, 'కాలిన ప్రేయసి దేహం కమురు కం'పట ఈ లోకం, గంగిరెద్దు బ్రతుకును ముక్కున తాడై విధి లాగుతుందట, బ్రతుకంటే చీకటిలో దీర్ఘమైన చావనీ ఈయన నమ్మకమూ, దక్ష యజ్ఞము ఈయన బ్రతుకు. కనుకనే ప్రకృతి దృశ్యాలన్నీ విలయతాండవంచేసే శివుని కాలిగజ్జెల మోతలుగా అన్వయించారూ, రోడ్డుప్రక్క కుష్ఠురోగి ప్రేయసి బండనీ, చాలీచాలని బిచ్చకత్తె చీరనీ, మగడూ పెళ్లాం జగడాలు చూపే ఎండా వానల్నీ, ప్రేయసి చిరునామా తెలిసినా చేసే దేమీ లేక ఊహాగానం సేయగ ఊరవతల కెళ్లిన కవినీ, జీవన వైతరిణినీ, పాటగా పాడేరు. 'స్వర్గం నరకం, చావు బ్రతుకు, గొప్ప బీద వ్యత్యాసం, తారతమ్యం చేయ' నని ప్రతిజ్ఞ చేసుకొన్నారు. మర ఫిరంగినె మహతిగ మీటి, (జీవిత) కదన కుతూహలరాగం వినిపించారు. 'ఏదో కీచకభావం సైరంధ్రీ గీతాన్నె చెరబడితె చూస్తూ—ధర్మరాజులాగ— ఊరుకున్నారు. ప్రేయసి అయిన బండను నిమరడానికేనా లేని కుష్ఠురోగి వేళ్ళూ, యమునెక్కడో దింపేసి తన మాత్రం ఎదురయ్యే 'ఇనుపసరకు' యెనుబోతూ, కళ్ల జోడు పెట్టుకున్న గరుడ పురాణ బ్రాహ్మడు ఘూకమూ, పాడలేని గులకరాళ్ల పాతవడ్డ సెలయేరూ, ఊరేగే పీరుల్లా ఏత చేత గీత వడ్డ తాటివనం, నారాయణబాబు కళ్లజోడు చూపుకే దొరికిన విచిత్రపు సరుకు.

ఆరుద్రగారి విశేషణాలకు బదులు విశేష్యములు వాడే తంత్రమూ, నారాయణబాబు 'నీచోపమ' అన్వేషణమూ, వారు వర్ణించే వస్తువులమీద రాతి తెరల్ని పరుస్తాయి. ఈ తెరల్ని బద్దలుకొట్టి, వర్ణ్యవస్తు స్వరూపాన్ని పాఠకులు గుర్తించుకోవలసి ఉంటుంది. పాఠకుల ఎదురుగా ఉండేది రచన మాత్రమే కదా ? కవుల సంకేతాలు వారికి తెలియడానికి మార్గమేదీ ? మాటలూ, వాటి చేరికవల్లా అవి ఉపయోగించబడ్డ సందర్భమువల్లా స్ఫురించే విశేషార్థాలునూ. చదువరి వీటిని చదివి, ఆలోచించుకుని, ఎంత మట్టుకు అర్థమైతే అంత అర్థమూ చేసుకుంటాడూ, అర్థము కాకపోతే ఆ రచనను దాటుకు పోతాడు. ''కలత'' యట ఆరుద్ర రచన. దీనిని చదవండి : ''కళ్లల్లో దూలం నుండి, వ్రేళ్లాడే రెండు రాజు మామిడి కోర్కెలు, తలలో తెగ రొదచేసే ఒక వెయ్యి రెక్కల చేతికవ్వం, ఆవ లింతంత ఎత్తయిన చెట్లక్రింద, పలవ రింతంత ఇరుకు కాలంలో, ఒక పచ్చని పైదానం, రెండు వెచ్చని ప్రాణాలు, అయిదువేల వెలుతురు సంవత్సరాలు, కైవారంలో, యాభై చీకటి గజాల ఆవరణలో రెండు బుసకొట్టే క్షణాలు, ఒక పురి విప్పిన ఘోరం.'' 'కవ్వం'

దాకా తెలుస్తోంది. ఆవ లింతంత ఎత్తయిన చెట్లూ పలవ రింతంత ఇరుకైన కాలం, గొప్ప వర్ణనలు. అలాగే యత్నించిన 'అయిదు వెలుతురు సంవత్సరాల క్రైవారంలో యాభై చీకటి గజాల ఆవరణ' అన్నది ఆ శక్తి లేక 'దానికంటే నేను చిన్న' అంటూన్నది. రెండు వెచ్చని ప్రాణాలు అంటే సంకేత స్థలం దగ్గర చేరిన ప్రియులనిపిస్తోంది. రెండు బుసకొట్టే క్షణాలా ? అంటే ఆ స్త్రీ పెండ్లాడిన భర్త కోపమా ? పురి విప్పిన ఘోరం వారిద్దరి హత్యా ? ఏమో ! మైదానము సంకేత స్థలం కాజాలదు. రహస్యం కాదు గనుక. అయిదు వెలుతురు సంవత్సరాలు కథలో ఇమడవు, రచయిత వర్ణనా శక్తికి ధూపాలే. మైదానంలో చీకటా ? వారధి వాపోలు ఆరుద్ర రచనలను గురించి అనుమానాలు వెలిబుచ్చితే ఆరుద్ర తన రచన నొకదానిని వివరించినట్లు జ్ఞాపకము. 'ఏమిటో చెప్పుకో' అన్న ఆటకు అందరు చదువర్లూ కలసి రారు .... ఇలాటి తెరచాటు రచనలు చాలా వస్తున్నాయి వచన గీతా లుగా. రాజకీయాల వ్యాఖ్యానం చెయ్యడంలో, బ్రిటిషు పాలనలో ఉండినంత అన్వేషణను తప్పుకో నక్కరలేదు, ప్రతి వాడూ ప్రభుత్వాన్ని విమర్శించేవాడే నాయెను.. మరి "మృత్యువు కోటలో చీకటి తోటలో చిగురించిన హాసంలా, మృత్యువు వేటలో చీకటిబాటలో సకిలించిన మోసంలో, మృత్యువు మూటలో చీకటిపేటలో సవరించిన మెరుపుల్లా ...." అన్న రచన నేమనాలో నాకు స్ఫురించడములేదు. 'అగ్నిశ్రీ' గారి రచన: "పావురాయి పట్టబోవ కీచురాయి చేజిక్కెను, రోలు తయారీకి బూన పోలై అది కూర్చున్నది.... చెరువది కాలిన పెనమై చేపలు గట్టెక్కినై .... పిడచలు గట్టెను నాలిక, గుడగుడమనె గొంతేమో వెర్రి కుదిరినది, రోకలి తలచుట్టర ధన్వంత్రీ" ! 'చంద్రమల్లిక' గారిది : దుర్దమ కర్దమ మర్దిత మార్దళ ధింధిం ఝణుతక, ధింధిం ధింధింతక శిశిర శిథిల విచికిలదళ, వికిర లాస్యవతీ సత్యవతీ ధృతి అనుపమ ఘోరాకృతి." ఏదో విసరాలని విసరిన రాయి ఇది వినండి. "సెగలతో పొగ చూరిన మొగాల నిండా సగం కాల్లు కన్నులలో లంకారాజ్యం, రోమక పట్నం కాల్పులు, పృథులమైన మైథిలీ స్తనాన్ని చూచి లోభించిన కాకంచేసిన రావం. ఇదంతా ఏమిటి అర్థం కాదంటావు, మట్టిబుర్ర నీది." పన్యాలవా రన్నట్లు 'హక్కులూ, ఆశయాలూ దండలుగట్టి వీధి పోయేవా రందరూ' వేసుకుంటున్నారు.

దీని వెనకాల తత్వం ఏమిటి ? అని ఆలోచిస్తే నాకు తట్టిన జవాబు : 'ఏదో ఒక వైచిత్రి'. సుదీర్ఘమైన సర్గ బంధాలు చదివి, వాటి ఉపదేశాల్ని గ్రహించేటంత తీరుబాటు లేక పత్రికా పఠనంతో సంతుష్టిపడే ఆధునికులు ఖండ కావ్యం, కవనికా, నాటికా, వ్యాసమూ చదివేరు. వారికన్నా ఓపిక తక్కువ అధునాతనులకు. ఒకసారి చూడగలరు పత్రిక. అట్టమీద ఆకర్షణ ఉండాలి. రేఖా చిత్రాలలో సంపులు బాగుం డాలి. చూస్తే చాలు అంటే సవనాలి రచనలు. రమణీ యార్థ ప్రతిపాదన కాదు రమణీ—, అర్థ—, వైచిత్రి ప్రతిపాదకం కావాలి శబ్దాలు. రసోదయం వరకూ ఆగరు, ఆగలేరు. కనుక ప్రతిపద వైచిత్రి కావాలి అధునాతన పాఠ కునికి. 'కెమెరాలు కన్ను గీటుతున్నాయి, పావడసందాగ చిక్కగా, సెంటమేర్ల సన్నని చిరునవ్వులు, కాగడాల వెల్తురులో కల్తీలా చూసే జనులూ, జాష్యత చెరలో చిక్కిన చేయు బ్రతుకు, నట్టు పాస్తుచేరు పరగాగాలా ఉపోదరం, ప్రేమతితో విప్లవలో క్షేమంగా ప్రవేశము, ఒత్తిడెలు విన్నాళ్ళ ఓపి నలుగుదురా, పక్షోరం ఒకటే ఉంది. ఏదో ఒకటి నుస్సే చెయ్య, పెట్టింనదె వెరిపోవు కాలం, యక్షగానములోని రాక్షసునట్లు, బొమ్మలుయనగారి పిడుగు, ముడికట్లుకున్న దైన్యం .... ఇన్నవి ఈ అధునాతన రచనంలో నాకు తగిలిన విచిత్రపు మాటలు. వినడానికి ఓపికలేని, కనడానికి తొందరపోని క్షణచిత్తపు జన్మన పాలకు, దృష్టిని లాగే గాలం, ఈ కాలం. సౌందర్య సామగ్రి పాతగిలిపోతే దొరికే సరుకు సంతా పట్టి కవిత్వానికి మసాలా వేసే నేటి పాశ్చాత్య రచయితల తత్వం, కైపు దిగని కామానికి పణ్యాంగన భూదేవి స్తనం అంటూ వ్యభిచారాన్ని ఆహారంగా కోరే ఆకలి, మాటల్ని రచనా డబ్బాలలో నేసి గలగల లాడించే ఉత్సాహమూ, ఉసుకొల్పని ప్రభుత్వానికి పేర్లుపెట్టి ప్రచారంచేసే చిలిపితనమూ, అశక్తరచనా చాపల్యమూ, పిడివ్యాల్లు భావాల గుంపుల్ని వెనుకబడ్డ సమాసాల పురుల్ని నిర్మించే కార్మిక కర్షక సంఘబలమూ, లవ్వాల రిజర్వేషనూ, జంకూ శంకం (భూ) దానమూ, అన్నీ తరంగాలై ఈనాటి పఠువరిని తాకు తున్నాయి.

తెలుగువారికి వెక్కిరించడమూ, బూతాడడమూ తప్ప హాయిగా నవ్వడము గురజాడవారి కన్యాశుల్కం వచ్చేవరకూ తెలియదు. ఏ నన్నెచోడుడో నాలుగు పదాలు రాసినా ఆనంగని మొన్న మొన్నటి వరకూ మనకు తెలియలేదు. నవకవులలో వెటకారము చెయ్యడము జంసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు బాగా నేర్చారు. ఒక వ్యక్తికున్న విపరీత గుణాలు కనిపించే టట్లు వాటిని పెంచి, వేరే పరిస్థితుల్లో వాటి వైకల్యాన్ని పొదిగి చూపించి చేసేది అవహాస్యమూ, వెటకారమూను. ఆ గుణాల్ని మానవత్వపు లోపాల్నిగా అన్వయించి అందరూ ఆనందించటానికి వెండితెర మీద చూపడము హాస్యము. రుక్మిణీనాథ శాస్త్రిగారి పేరడీలు అపహాస కావ్యాలు—వికట

కవిత్వమన్న వ్యాసంలో మాచిరాజు దేవీప్రసాద్‌గారు వివరించారు. ఒక కవి రచనలో పోలిక మార్చి, ఒక్క మాటను మార్చి, పద్యములోని పాదము మార్చి, సందర్భాన్ని మార్చి, చివ్వరదాకా తెలియని పోలికని (జగ్గ కవిలాగ) ఆఖరి పాదంతో స్ఫురింపజేసి కొట్టి, తెలుగు కవులు—ఆధునికులూ, పూర్వులూ కూడాను—సాధించిన హాస్యమును సూచించారు.

మాచిరాజు వారికి హాస్యము కులక్రమాగత విద్య కాబోలు. బండరాముడు అనే రామచంద్రమూర్తి గారిని తెలుగువారు మరిచిపోలేరనే అనుకుంటాను. వారి సోదరి కూడా వనభోజనాల్లో నిండా భోజనం చేసినవారికి 'చాలా బాధ' హాస్యపు మాటలవల్ల కలిగించేవారట. దేవీ ప్రసాద్‌కి ఆ ప్రసాదము లభించడము మన అదృష్టము. ''ఏ దేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం'' అని ప్రారంభించి, శ్రీ శ్రీ ఒక గేయం వ్రాశారు. దానిలోని తొలి పాదాల జోరు శక్తివంతం. ఆ శక్తినే ఇంకొక ముఖంగా ఉపయోగించారు మాచిరాజువారు. ''ఏ దారి చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం రహదారి చరిత్ర సమస్తం ధూళిధూసర పరివ్యస్తం, రహదారి చరిత్ర సమస్తం పైజమ్మాలను పాడు చేయడం ....'' ఇలాగే ప్రతిదానికీని. అయితే దేవి ప్రసాద్ గారి స్వంత ముక్తకాలూ, ఖండ కావ్యాలూ ఉజ్జ్వలంగా ఉంటాయి. ''నేను రెస్టారెంటు కేగి వస్తాను లంటె, ఆల్ రయిట్, మెక్కిరండి పొందనుచు పంపి, మధ్య సాంబారులోనె మైమరచియుండ, పచ్చ జెండాను పట్టి వూపాడు వెధవ గార్డుగాడు. వాడొట్టి బ్లాగర్డుగాడు''. ''సిజరు పీల్చటందు సిద్ధహస్తుడతండు'', నవ్య విధి విధాత, సవ్యసాచి, దినము కొక్క టిన్ను కొనగ కుబేరుండు, ముష్టి అగ్గిపుల్ల, ముష్టి ఎత్తు'' కళారాధకుడు, సంక్రాంతి కాన్కలు, చిత్రంగాలలో తప్పక ఉండవలసినది. పదేళ్ళనుంచి భార్య సంగతి ప్రేయసికి, ప్రేయసి సంగితి భార్యకీ తెలియకుండా గడిపి ఒకనాడు పట్నాన కేసుదెంచి ఇద్దరికీ ప్రేమలేఖలు వ్రాసి పడేశాడు—దాని దిందులో దీన్ని దాన్లోను బెట్టి.

అభ్యుదయ కవిత్వము, ప్రజా కవిత్వము అంటూ ఉద్యమాలు బయలుదేరేయి. మొదటలో ఇవి కమ్యూనిస్టు రచయితల నడుమనే ఉండేవి. హఠాత్తుగా కమ్యూనిస్టులు గురజాడ అప్పారావుగారు ''నాది ప్రజల ఉద్యమము'' అని అన్నట్టుగా గుర్తించి ఆయన్ని తమలో Posthumous మెంబరుగా చేర్చేసుకున్నారు. కారణాలు ఏవయితే నేమి, అంతవరకూ అభ్యుదయ రచయితలకు దూరంగా ఉన్నవారు వారితో చేరేరు. ఒకొక్కరు చొప్పున రచయిత లందరూ సుముఖంగానో, విముఖంగానో అభ్యుదయ రచయితల సంఘంతో సంబంధము పెట్టుకున్నారు. అయితే ఆ సంఘ కార్యకర్తలు తమ రచయితల దృష్టి వైశాల్యము పెంచో, రచనాశక్తి పెంచడానికో వేసవి పాఠశాల నడిపేరు పెదపూడిలో. తెలుగు నాటి రచయితలు—పిలిచిన నాటికో నాలుగు రోజుల తనో—వచ్చి వివిధ విషయాలను గురించి ఉపన్యసించారు.

వాఙ్మయ ప్రయోజనము శివేతర క్షతయే, సద్యః పర నిర్వృతయే కాక ఉపదేశ (పూర్వకత్వ) మే అని అభ్యుదయ వాదుల నమ్మకము. కవి సంఘంలోనివాడూ, సంఘం ప్రాపు పొందేవాడూ కనుక, సంఘంలో ఉన్న దీనుల పక్షము వహించి తన రచనలవల్ల సాంఘికంగానూ వారి నుద్ధరించాలని వారి ఆశయము. పెదపూడిలో చేరిన యువ రచయిత లందరి దగ్గరా కూలివారి సమ్మెలను గూర్చిన రచనలే కానవచ్చాయి. ''పరివర్తనము'' అనే నాటకంలో కూడా కవి తన వైయక్తిక భావాల్ని కవిత్వంగా వెలువరిస్తూ సంతోషించుకో కూడదనీ, సంఘసేవకే తన శక్తిని వినియోగించాలనీ సందేశించారు రచయితలు. కళయొక్క ప్రయోజనము సంఘసేవట. రాగము కళ కాదు. లతాలంకారము కళ కాదు, బుర్ర కదగా వ్రాస్తేనే కళ. సంఘసేవకి ప్రోద్బలిస్తేనే కళ.

కథావివాద మటుంచి, జాతీయోద్యమము ప్రారంభమైనప్పటినుంచి ప్రజా ప్రబోధము జరుగుతూనే ఉంది. బలిజేపల్లి లక్ష్మీకాంతము, వడ్డాది సీతారామాంజనేయులు, దామోజీపురపు వెంకటనరసింహారావు, గరిమెళ్ల సత్యనారాయణ, మద్దూరి అన్నపూర్ణయ్య వంటి దేశభక్తు లందరూ ప్రజా ప్రబోధము చేసినవారే. అభ్యుదయ రచయితలు వీరి నెవరినీ లెక్కపెట్టరు. కారణము నాకు ఒక్కటే స్ఫురిస్తున్నది. వా రందరూ వీరివలె వర్గ కలహాన్ని కార్మిక కర్షక అభ్యుదయాన్నీ జండాకట్టి ప్రచారం చేయలేదు. ప్రజా ప్రబోధమంటే శ్రామికవర్గానికి మకుటము పెట్టడము మాత్రమే అనటానికి వీలులేదు. మనిషిలో, జాతులలో, పల్లెలలో, సంస్థలలో మార్పు రావలసి ఉన్నది. జాతి అంతా పటిష్టమూ జాగరితమూ అయి ధనికవర్గ మొక్కటే పురోగతికి అటంకమై యుండిన దేశాలలో ఆచరణలోకి వచ్చిన బలవంత సంస్కారము, హీన సంస్కార దేశాలలో పదవీధారులను మారుస్తుంది తప్ప జాతి పురోభివృద్ధికి దారి వెయ్యదు. అందరూ తమకు కావలసిన మేలునే ముందు నిలబెట్టుతున్నారా అనిపిస్తోంది, ఈనాటి పరిస్థితుల్ని గమనిస్తే. నాదే నిజము, నీది కల్పితము అనడానికి వీలా? ''పీటి నకళ్ళు'' అన్న వచన పద్యంలో రచయిత దీపంలాంటి గ్రామంలో, దేదీప్యమానంగా వెలుగుతున్న కిరణాలు, వాళ్ళ రైతులు .... పిట్టకు గూడు చెట్టుకు. నీరు, గూటినుండి పిట్టను తోలకు, పల్లెనుండి రైతులను పిలువకు, గూట పిట్ట పొదుగుతుంది, మేడకు అది బెదురుతుంది. నాగరికుడా! పత్తిని పిండి బండికెత్తావు, ప్రత్తిమొక్క నీవెంట రాదుసుమా, వద్దు వద్దు ఆ రాట్నం, ఆ కదురు, ఆ ముసలమ్మను కదిలించబోకు, ఆ పల్లె నేటిది కాదు. వాసుకి భూమిని మోస్తున్నది, జాతిని పల్లెలు మోస్తున్నవి. పల్లె దొసగు పల్లే తీర్చును, పిల్లని యేడ్పును తల్లే మాన్పును, అతని ఏడ్పు ఢిల్లీ తీర్పకు, అయ్యో నడాన నవ్వైపోవును. పల్లెల్లో పెరిగిన మొక్కకు, నగరంలో పాదులు పెట్టకు. అదిగో వస్తున్నది సభ్యత ముంపు, ఈ రైతు ఈ నాగలి ఏమైపోవును, నాగార్జున సాగరాన, కొండమీది మ్యూజియంలో, వీటికి నకళ్ళు తీసి

ఉంచుము'' అన్నారు. పల్లెటూరి వెన్నెలలో వేణువులాగా లేదూ ఇది ? కాళోజీ గొడవ వినండి : 'మనసులో గల మాట యేదో పైకి పల్కుచు పల్కినట్టుల, చేసి చూపెడు శీలముం గల మాయ యెఱుంగని మానవునకు, సాటిలే దిలచోయిలేదిల, 'అనుభవమంతా ఒకచోట, అధికారంబది యొకచోట' 'తప్పు' దిద్దగలేను దారి జూపగలేను, తప్పుచేసినవాని దండింపగాలేను, కష్టపడు వారలను కాపాడగా లేను, ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు ?' 'దొంగలు దొంగలు ఊళ్లు పంచుకుని దొరలై వెలిగే దెన్నాళ్ళు ? కలము పోటున కదపజాలని కావ్యగాన మింకెన్నాళ్ళు ?' 'కుటిలమతులు దేబె మొగాలు జగతిలో రెండేరెండు రకాలు, చతురవర్గ విలాసం కొరకు దేబెల సర్వస్వం ముడిసరుకు'. ఇదంతా అభ్యుదయాకాంక్ష కాదా ? గోపాలుర హృదయాల్ని తట్టి వెదురు గొట్టము వేణువైందీ, వారికి గొడుగైన గట్టు గోవర్ధన మైందీ, స్వార్థ భావము వీడి సకల మానవసేవ చేయమంటారు కాళోజీ. 'కోటి రత్నాల వీణ తెలంగాణా' కోసము ప్రాణములొడ్డి నిలిచి జైళ్లలో కృశించిన దాశరథి గొంతు వినండి : 'పీడిత ప్రజా వాణికి 'మైక్' అమర్చి అభివాదులంకున్ వినిపింపజేసెదన్' అన్నారూ, 'చిరభేదా గాథ మహాంబుధి విరిసిన బడబానల పద్మంలో వెలసే విప్లవ బ్రహ్మ నవజగత్తు పుట్టిస్తాడో ! భవ జగత్తు గిట్టిస్తాడో ?' అని సందేహం వెలిబుచ్చారు. 'అన్నార్తులు అనాథలుండని, ఆ నవయుగ మదెంత దూరమో, కరువంటూ కాటకమంటూ కనుపించని కాలా లెప్పుడో ? అని ఎదురు చూచారూ, 'రానున్నది ఏది నిజం ? అది ఒకటే సోషలిజం' అన్నారు.

అనంతంగా ఉన్న అధునాతన కవు లేమంటున్నారు ? 'తొలినాటి సంద్రాలు ఇంకిపోతున్నాయిలే' అని పురిపండావారు, 'నిష్ప్రయోజక ప్రతిభావంతుల జీవితాలు నిష్ఫూరాలుగా నా దేశ జనులలో నిలిచిపోయినవి' అని శిష్ట్లావారు. 'అరాజకంబయి లౌకిక లోహపు హద్దులు మారగ ఘోష పెట్టినవి' అన్నారు దేశిరాజువారు, 'మానవ మేధస్సుకు సంకెళ్లను తగిలించిన గత సాంఘిక శిలా శాసనం వడగొట్టను ... నా నిప్పుల కంఠం విప్లవగీతం పలికిందని రామదాసుగారు, పసిఫిక్ రంగంలో, బర్మా అడవుల్లో .... ప్రతి అణువూ ప్రసవించిన యుద్ధాగ్నులు మీకోసం' అని దీనుల్ని హెచ్చవేశారు. ఆయనే, 'సోమరులను, పామరులను నర నరము కదిలించే నరులిందరి నడిపించే విప్లవకర మంగళకర మహాశక్తి ఒస్తున్నది.' అని ఏల్చూరివారు, 'ఈ జగతిలో నూత్న జగతి కల్పిస్తాను' అని అనిశెట్టివారు, 'మన్య విప్లవం మా చరిత్రలో వీచిన ఝంఝానిల వీచిక' అని కందుర్తివారు, 'మానవ స్వాతంత్ర్య 'మాగ్నకార్టా' పైన రక్తాక్షరములతో వ్రాలు చేశాను' అని తెన్నేటివారు, 'కర్షకుడు లేచెరా, నావికుడు లేచెరా, రగిలిందిరా హైదరాబాదునన్, తిరువాన్కూరదే కాశ్మీర ప్రజలు లెచ్చిన ఉప్పిదే' నని సుంకరవారు, 'కోటి గొంతు లోక గొంతుగా శాంతికై .... విప్పండిరా' అని ప్రయాగ. 'కుందనపు కుర్చీ' లో కూర్చున్న లోకమా కూర్చోని కూర్చోని కుళ్లిపోతావులే' అని రెంటాలవారు. ఇవన్నీ ప్రజావాఙ్మయ, అభ్యుదయ కవితా, వాహినులు ! కార్మిక కర్షక—, పీడిత—, ప్రజలకు ఈ సందేశాలు అందునా ? ఇవి వారిని ఉత్తేజపరుచునా ? నా మట్టుకు నాకు, ఇవి కవులకు కవిత్వము లనిపిస్తోంది. వారిని విప్లవ కవిత్వం వ్రాయండని ప్రోత్సహించేవివి. "నీ వెక్కడ వూరింట్లో నా డక్కడ నాలు గంతస్తుల మేడమీద. లేరా గడ్డపాఱ పట్టుకుని" అంటే చాలామందికి ఉత్సాహం. లేచిన గడ్డపాఱను ఆపడానికి చాలదు లేపిన అలుసు గొంతు ! వినగా వినగా శేషశాస్త్రులవారితోపాటు మనకు లనిపించే దిది : నడచిన తొంటెదారులు కనంబడ నట్టిలు క్రొత్తదారు లేర్పడినవి, దారిచూపెడి దొరల్తమ నీలపు కంటి యద్దము ల్తొడుగుచు చూచి చూపెదరు, తోయుధి నేలను నేలతోయుధిన్ బడినటు లయ్యె—''

కనుక, శ్రీ. శ్రీ తో 'ఇజాలను నమ్మకండి సోదరులారా, నిజము మాట చెపుతాను వినండి. ప్రిజమ్‌లో చిక్కపడ్డ ధవళాలోకం బుజుమార్గం చెడి వక్రగమన వర్ణ వ్యంజిత మైనట్లే, అజరామరమౌ నిత్య సత్య తేజస్సిలపై ఇజ — ఇజాల పోటాపోటీ ఆరాటంలో విభజితమై పూర్ణత్వమేది చూర్ణమౌ తుంది' అనుకుందాం. లేకుంటే, భారతాన్ని స్వర్లోకపు పంచల్లో నిలపాలని పంచిట్లే పూరించే పాంచజన్య శంఖధ్వని అరణ్యమున రోదన మైనదనీ, తెలుగునాట భక్తి రసం తెప్పలుగా పారుతోంది, ద్రెయినేజీ స్కీము లేక దొంబరుగా మారుతోందనీ, అంతులేని చెంద్రాళ్ళగ లర్థభావ దుర్ద్యోతక డమడమాల సమాసాల మాసల్లో గణాచార్లు కవితను కొలుస్తున్నారనీ; కట్టెదుట అర్ధాంగి కట్టనీ మ లేక అతుకుబొంతల జాట్టి ల్లాడిపోతుండ కావ్య నాయిక మేని కనకాంబరపు చీరె కుచ్చెళ్ళు సవరించి ప్రేమ కవిరాయళ్ళు కులుకుతున్నారనీ; పంచాయతీరాజ్య పర్వదినము— నీకూ నాకూ తెలిసిన వారి చేతుల్లోంచే—వచ్చి ఎదుట మూతి ముడిచి పొంచి కూర్చున్నదనీ; చనువిచ్చిన లన్నాయికి శనిలాగ దాపురించి పాఠ్య పుస్తకాలల్లో ప్రణయలేఖ లందిస్తూ దారుల్లో కాపువేసి కారుల్లో వెంటనంటి అంగరక్షకోద్యోగం వెలిగించే నవయుగ వైతాళికు లెక్కువౌతున్నారనీ; సిఫారసుల సైంధవులూ స్త్రీ పక్షపాతి అధికారులూ స్వార్థపరులూ కమిషన్ ఇంజనీర్లూ, లక్ష్మీదాసులూ పెచ్చు పెరుగుతున్నారనీ గుర్తించి కవిత్వమనే యముని కొరడా పట్టిన మల్లారెడ్డి దానిని పార్టీలకు ఎరువివ్వడ మేమీ ?

ఎవరో చెపితే వినే రోజులు ఎప్పుడో పోయాయి. అయినా చెప్పేవారు చెపుతూనే ఉంటారు. చెప్పవలసిన అందం ఉంటే శక్తివంతంగా చెప్పండి.

స మా ప ము

## అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వము:

# శతకాలూ - ముక్తకాలూ

### డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

ఈ నవ్యయుగంలో శతకాలు ఎన్నోరాలేదు. అయితే ప్రకీర్ణక వస్తువునూ ప్రకీర్ణక భావములనూ అందంగా కూర్చడానికి శతకాలు అవసరమే. ఈ అందాన్ని సేకరించుకోవడము వల్లనే కాళహస్తీశ్వర శతకము, ఆంధ్రనాయక శతకము, దాశరథీ శతకము వంటివి ఈ నాటికీ చదువరులం నలరిస్తున్నాయి.. మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి గారిది ఆశుపద్యరచనా ధార. మెఱుపుల్లాంటి భావాలు 'ఒక లంబోదరు సృష్టిచేసి సంతుష్టిపడక నన్నొక లంబోదరుణ్ణి సృష్టించావు ప్రభూ; మరి ఆతణ్ణి భరించినట్లుగానే నన్ను భరించు' 'శ్రీ కృష్ణ మేఘుంబునా హృదయాకాశము గ్రమ్మి శోక బహుళగ్రీష్మాతపం బార్పుతన్' వంటివి అడపాదడపా మెరిసినా, 'ఒక చిన్నము కష్టమనంగ నెట్టిదో ఎఱుగని,' 'తెలుపన్నేర్తునె యొక్క జీవనమునందే నన్ను నీ వెన్నిమారులు సృష్టించి లయింప జేసితి' అంటూ దూకుడుగా దాటుకుపోయే వైఖరే ఎక్కువపాలులో వుంటుంది వీరి రచనలలో.

విశ్వనాథవారి 'మా స్వామి' 1926 నాటిది. వారి భావ సౌందర్యాతిశయము ఏ కృతిలో ఎక్కువగా కూడినదీ అని నన్నడిగితే, 'ఈ కృతిలో' అంటాను. శతకములోని పద్యాలభావాలు క్రమాభివృద్ధితో చదువరిని సద్యఃపరనిర్వృతికి తీసుకుపోనక్కరలేదు. ఏ పద్యానికాపద్యమే దానికాళ్లమీద అది నిలబడాలి. ప్రతిపద్యములోనూ, రసలేశమున్న చాలును వానజల్లు ఉండనక్కరలేదు, ఉంటే మంచిదే. సత్యనారాయణగారిది ఉఱుములా మెఱుములా రచన. కథాగమనము— స్రవంతివలె— (ఇంచుమించు) ఒకే మట్టములో సాగవలసినచోట ఆయన రచన దుముకులాటకు ఉత్సహిస్తుంది. ఆ ఉత్సాహము అక్కడ విపరీతమైనా శతకంలోని పద్యముయొక్క చిన్న శరీరములో చక్కగా అమిరిపోతుంది. ఆంధ్ర విష్ణువులో "సాగర మేఖలా చారుకుచద్వయీశాలి ఆంధ్రావని చక్రవర్తి" అన్న వర్ణన నాకు పైనించి ఎక్కణ్ణించో పద్యముమీద పడ్డట్టు వినపడింది. ఇక్కడ సరిగా అలాంటివర్ణనే 'ప్రాలేయాచల కన్యకా కుచతటీ పర్యంక నిద్రాగతరబై' నట్టిది సంప్రదాయ పద్ధతిలోని వర్ణనయై దాటుకుపోతున్నది. 'నీవే రాజవు నేను సత్కవిని దంష్ట్రీ ! నిన్ను వర్ణించెదన్, నీవే దైవము నేను భక్తుడను దంష్ట్రీ నిన్ను ధ్యానించెదన్' అన్నతర్వాత ప్రభువు భూమి ఈయన కర్షకులూ అయి భక్తి ఒకమెట్టుదిగినా, "నీవే భూమివి నేను గర్షకుడ దంష్ట్రీ ! నిన్ను బండించెదన్ నా వైదగ్ధ్యము నీవచూతు, కృపసంధానించు విశ్వేశ్వరా !" అన్న రెండుపంక్తుల ఉత్సాహములో కలిసిపోయి వేరుగా కానరాదు. ఇక "చలిమిన్నేటి కెలంకులందు సొగసుంజాబిల్లి పూరేక వంకలు సింగారముగా నమర్చి చెవులన్ గంపింపగా బాపపోగులు మేనన్ బులితోలు వైచి కొని కొంగుల్ జారప్రేమంపు జూపుల సంధ్యాసతి జూచునీ సొగసు మమ్మున్ బ్రోచు విశ్వేశ్వరా" అని నిరంతరాయముగా సాగేచోటా "స్వామీ నా బ్రతుకెండి నీ కరుణ వర్షాగాఢ జీమూత మాలా మాధుర్యములేది దుఃఖమయవేళా గ్రీష్మ సూర్యాత పౌష్ణ్య మందత్వముచేత బీడువడి యంతా వెక్కిలై యున్నదింకేమో సాగుకు గుంభవృష్టిపడక నీరాదు, విశ్వేశ్వరా !" అని మొరపెట్టేచోటా పద్యాలువచ్చి లాగుతాయా యీడుస్తాయా అంటే అదొకమాటా ?

సత్యనారాయణగారు మూడో పద్యంలో 'నా వైదగ్ధ్యము నీవచూతు కృపసంధానించు విశ్వేశ్వరా' అని వ్రాసినందుకే కాబోలు— గ్ధ్వ్యాత్త, ంప్ర, గ్వ్య, ంహ, ధ్మ, ద్వై, క్త్య, శ్పూ, వంటి— దుష్కర ప్రాసలు వాడి రచించారు, 'నీ కారుణ్యము సాటితెత్తును' అంటూ ఉపక్రమించిన పద్యాలలోనూ మరికొన్నిచోట్లా సమాస నిర్మాణ వైదగ్ధ్యము చూపేరు. కాని ఈ విశ్వేశ్వర శతకము ప్రధానంగా సంసార బాధా నివారణకోసము రచించినట్లు "ఈ నా భార్యయు బిల్లలున్ బ్రతుకుత్రోవేదని జూపించుమంటే నేడే చనియేగిరీంద్రములనో నిద్రింతు, నే వాగులందో నీరానెద, నే ఫలావళులతో తిందున్, బర్ణముల్ మేసెదన్, నీ నిష్ఠగతి నీవుగాక మరి లేనే లేను విశ్వేశ్వరా !" వంటి పద్యాలవల్ల తెలుస్తుంది. లోకపు కడగండ్లను గూర్చినవి పద్యాలు చాలానే ఉన్నాయి. అయితే జీవుని నైజాన్ని "తెలిపూ బానుపులందు నొత్తిగిలి నిద్రింపన్, జగాలేత వెన్నెలలో జల్లని పిల్లగాలి పొరలో నెమ్మేను చేర్పన్ నెలంతల తే నవ్వుల సోగ బుగ్గ గిలిగింతల్ వెట్ట, నెంతెంత కోర్కులు నా కున్నవో, అంత నిన్నుగను కోర్కుల్ వేవు, విశ్వేశ్వరా" అనీ, "నీ కారుణ్యము కోసమై ఎధురతంత్రీ వీణ వాయించు బాలాకృత్యంబుగ నంగలార్చినది నాలన్ నాదు జిహ్వాగ్రవాణి కింక్షింకిణి నూపుర స్వనము లెంతే దట్టమై పోయెనే నీ కారుణ్యము చూచి నా కసలు నోరే రాదు విశ్వేశ్వరా !" అనీ బయలుపెట్టిన పద్యాలు—ఒకమారు చదివితే తగులముతే

ఉయ్యే పద్యాలు—హెచ్చు ఉన్నాయి. ఈ శతకములో. ఇది ఆధునికముగా ఎందుకని లెక్కించావూ అని అడిగితే, చెప్పే పద్ధతిమీద కంటె చెప్పే వస్తువు—అదిన్నీ కవి అనుభవము—మీదనే కవిగారు ఎక్కువ వూతము పెట్టియుండటము వల్ల నని జవాబు. దుష్కర ప్రాసలూ దీర్ఘ సమాసాలూ ఉన్న పద్యాలలోనూ కవిగారి వేదనామాత్రము స్ఫుటంగా కనబడుతూంది. పౌరాణిక వస్తువును వాడి తద్వారా కూర్చిన గొప్ప ఉన్నప్పటికీ, పరిమాణంలో కవి స్వానుభవానికి చాలదు.

మోచర్ల రామకృష్ణయ్యగారి 'అమృతకలశము' వాస్తవానికి శ్రీకృష్ణ శతకము. అయితే మకుటము తీసేశారూ, ఒకే వృత్తం వాడక (గద్యలేని) చంపూ కావ్యంగా తయారుచేశారు. వస్తువు పౌరాణికమే ఎక్కువ. అయితే "నావాగ్రంగము నెక్కి యొక్క క్షణమైనన్ నిల్చి, లావణ్య లీలావిర్భూత గరిన్ నటించి యొక బ్రహ్మానంద గీతంబు కృష్ణా, వాయింపగదోయి నీ మురళిపై, 'నా చిత్తముకురాన .... ఒదిగి ప్రతిఫలింపవోయి కృష్ణ' వంటి జీవుని ప్రగాఢాశయాలు శక్తివంతంగా వచ్చాయి. ఈ కావ్యానికీ, శతకాలకూ గల తేడా ఆధునిక కవిత్వ ప్రభావమే నంటున్నాను. ముదిగొండ వీరభద్రమూర్తిగారి 'వేణుగోపాల శతకము' ప్రౌఢము, మన పెద్ద శతకాలలో ఎంచవలసినది. అయితే నూటికి నూరుపాళ్ళా పూర్వ సంప్రదాయపు శతకమే, ఆధునికము కాదు.

యెమ్మనూరి చిః వెంకటరెడ్డిగారి 'దక్షిణానిలము, 'అలసముగ దక్షిణా నిలము మా గడ్డపై వీచెనమ్మా! యిపుడె!" అన్న ధ్రువమును మూడేసి జంపె వరుసల పాదముల చివ్వర వాడిన గేయ చరణాలు 103 కూర్చిన శతకము. 'దక్షిణానిలము వీచె' నన్న వార్తను మిషగా గ్రహించి ప్రకృతి సౌందర్యాన్ని చక్కగా ప్రౌఢంగా రచించారు రెడ్డిగారు. ఉత్సాహము పాండిత్యము హాయిగా రంగరించుకున్నాయి ఈ శతకములో. "కవిలోక భావ సంక్రాంతి తెర లెత్తికొన, శివరమ్య భారత శిలాన్యముల నింప, చలితాభ్యుదయ నాట్య సంకేతముల చెంప" వీచెనట దక్షిణానిలము. 'తరతరమ్ముల భావదాస్యము తొలగించి', 'జగతి యంతయు నొక్క సంసారమని పల్కు' ఆసహాయ కృషిక భావావేశముల జాడ' వంటి సమకాలిక రాజకీయాభిప్రాయాలూ ఉన్నాయి దీనిలో. అయితే అచ్చుపోతా లోహమూ కొత్తలు. వీరి శైలి ప్రౌఢసుందరము. "దళిత మానవతా ప్రతప్త జీవన తటాకములలో, భంగలోకములలో, సముదీర్ణతమములో, చంద్రికా సముదీర్ణతలు బెంచి" వీచెనట దక్షిణానిలము. ఇది 1960 నాటిది.

## ముక్తకాలు

కవితా సౌందర్యదృష్టిలో శతక పద్యాలకన్న ముక్తకాలు చాలా నయము. మానవ స్వభావాన్ని తెరమీది కెక్కించి చూపిస్తాయి. తెలుగులో ముక్తకాలు తమంతట తాము రచించిన కవులు ఉన్నారేమో నే నెరుగను. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు మొదట శాలివాహన సప్తశతిని తేటగీతములూ, ఆటవెలదులూ గానూ తెలుగుచేసి భారతిలో ప్రచురించారు. చాటువుల కంటె ఎక్కువగా యత్నాన్ని పురికొల్పేవీ, శతక పద్యభావాలకన్న సౌందర్యమును ఎక్కువగా బింబించేవీ, ఈ పద్యాలు ఆధునిక కవిత్వంలో కొత్తదారి వేర్పరచాయి. అనంతకృష్ణశర్మగారి మితభాషిత్వము వల్లనే కాక మూల ప్రాకృత పద్యాల చిన్న సైజువల్ల కూడా ఈ సప్తశతి పద్యాలు తెలుగులో చిన్నవైనాయి. అల్పాక్షరముల అధికార్థ రచనకీ పద్ధతి అనుకూలము. ఇవి ప్రాకృత పద్యాలకు తెలుగుసేత కనుక ఆధునిక కవిత్వ పరిశీలనా సందర్భములో మనము వీటిని ఎక్కువగా పరిశీలించుకో నక్కరలేదు. రచించిన కవులు ఇంచుమించు పద్యము పద్యానికీ వేరే కనుక ఇవన్నీ ప్రాకృత వాఙ్మయాకాశములో చుక్కలవలె మెరిసినట్టివనిన్నీ ఒకే కవి రచించియుంటే ఇంత వైవిధ్యము కూడడము సాధ్యము కాదనిన్నీ గుర్తించుకుని దాటిపోదాము.

విశ్వనాథవారు సప్తశతిని కాక పంచశతిని రచించారు. బైరను కవివలె ఆంధ్ర ప్రశస్తి, నండూరి వలె కిన్నెరసాని పాటలూ, కాళిదాసువలె ఋతు సంహారమూ, శశిదూతమూ, కుమారాభ్యుదయమూ, జయదేవునివలె శృంగారవీథీ, శాలివాహనుని వలె 'పంచశతి', ధూర్జటివలె మాస్వామి రచించారూ, మల్లంపలి, కట్టమంచి, కొమర్రాజు వంటి మేధావనువులకు తమ గ్రంథాలను అంకితము లిచ్చారు. వీరి పూనిక గౌరవింపదగినది. మొదటలోనే వీరు ఒక హెచ్చరిక చేస్తున్నారు. "ఉర్విలోన మహాకవి యోగివంటివాడు, సర్వమ్ము భావనావధిగ జూచు(ను), అల్పులంబోలె బ్రతుకులో ననుభవించె నను కొనుట వట్టి పామరమైన యూహ" అని. ఈయన రచన లన్నిటిలోనూ ఈ అభిప్రాయము పూసలలోని దారము. మహాకవి సర్వమునూ భావనావధిగ చూడవలెనా? బ్రతుకులోని అనుభవమును కావ్యగత మొనర్చుట అల్పుల పనా? కాళిదాసు వింధ్యాద్రిశోభనూ హిమాలయ సౌందర్యమునూ అనుభవించకుండా రచించాడా ఋతుసంహారమూ కుమార సంభవమూ? వేమన్నదంతా భావనావధి రచనేనా? ఓమర్ ఖయామను అల్పుడా? .... విశ్వనాథవారి సాహిత్య అభిప్రాయాలు అతి పెలుసు. వాటి జోలి మనకు ఇక్కడ వద్దు. అయితే వీరి పంచశతిలోని వస్తువు భావనావధిగ చూచి రచించినదా? లేక బ్రతుకులో చూచినట్టిదా? అన్న ప్రశ్నను ఆదికి ముందు మన యెదుట పెట్టి పంచశతి పరిశీలనకు ఒక దారి చూపిస్తున్నారు వీరు. "కొన్ని వ్యంగ్యముల్ ధ్వనులును గొన్ని వట్టి వర్ణనలు, కొన్ని రమణీయ వాచ్య సరణి వ్రాసెద" నని రెండో పద్యంలోనే భావనావధిగ కాక 'వట్టి వర్ణనలు'గ వ్రాసెదనని ఈయన చెప్పడాన్నిబట్టి పై పద్యంలోని భావం కేవలం ఆదర్శసూచకమేనని మనము గ్రహించవచ్చును. విశ్వనాథ పంచశతిలో బ్రతుకులో కవిచూచి అనుభవించేనవి చెప్పడానికి వీరిచ్చే వస్తువు— కవికి సమకాలికము— చాలావున్నది. రైలుస్టేషను, పరీక్షనంబరు, తెలుకు రంగు, ఎంయురురెయిడు షెల్లీరు, మ్యాలుపిల్లల విప్లవమ్ము,

సర్కసు, పత్రిక, రేడియో, పార్టీవాదము, పిక్చర్సు, యంత్రయుగము, ఉపన్యాసములు, టిక్కెట్టు, ప్రజాస్వామికము, విద్యాధికారి, సిఫార్సు, యడ్వర్ టైజుమెంటు, తెలుగువాచకము ఈ నాడు ప్రత్యక్షమయ్యే వస్తువులే. "వీనికి మదిలేదు వర్ణభేద, ముల్లమునను శాఖా భేదముజ్జ్వలంబు," "అవును తనదేమి పోయినదంత రెడ్డిబిడ్డ చనుదెంచి మార్కులు వేయుడనిన వేయరాదేమి ? వాడేమొ విజయి తనకు గడకుజెడియె బరీక్షాధికారి పదవి" "అకట ప్రాజెక్టుకట్టు దిక్కనుచు లేకజాజువారెడు గోదావరీ జలంబు" అని అనుకోగల కాలమిదే. కనుక "బ్రతుకులో ననుభవించె" ననడానికి వీలిచ్చే వస్తువు (అదంతా భావనా వధియేమీకాదు) విశ్వనాథ పంచశతిలో ధారాళంగావున్నది.

ఉండవలెను గూడ. సమకాలిక ప్రపంచముతో సంబంధములేని ఊహాలు వేలవిడిచినసాము. ప్రబంధకవుల స్త్రీల సౌందర్య వర్ణనలు నూటికి తొంభైతొమ్మిదిపాళ్లు ఇలాటివే. వారిలో గ్రుడ్డికవి అయినా బట్టీపట్టిన సంస్కృతకవుల అలంకారపు పేకముక్కలతో దృశ్యాలసెట్లు నిర్మించగలడు. ఇంట్లో వీణానాదము కంకణారావమూ వినలేని చెవిటిఅయినా పొలములోని మధుపమ్ముల చూడకుండానే జుమ్మను వినగలడు. చిరపరిచిత ఊహాసౌందర్యపు కోతిగంతులు కొన్నిశతాబ్దాలపాటు తెలుగు చదువరులనుపట్టి వారిరుచిని చెడిపినవి. ఆ వ్యర్థపుటడుగు లింకాఎందుకు ? సౌందర్యము విశ్వమంతటా వ్యాపించివున్నది. కళ్ళూ చెవులూ గుర్తించలేని సౌందర్యాన్ని మనస్సు గుర్తించగలదా ? అనుభవము కవికి విషముకాదు, మరి అతని శరీరపు నెత్తురు. లలిత లవంగలతా పరిశీలన కోమల మలయ సమీరపు కౌగిలింతా, విద్యోతమానోగ్ర ఖద్యోత కిరణ జిద్విద్యు ద్యుచ్ఛతి టావిభవమూ అతన్నిమనలనుకంటె చక్కగా స్పృశిస్తాయి. అతడు ఆ స్పర్శ ఇతరులకు చక్కగా తగిలే భాషారచన చెయ్యగలడు, మనము చెయ్యలేము. మన దళసరి చర్మానికి మందబుద్ధికీ తోచని సౌందర్యము కవికి గిలిగింత పెట్టుతుంది. మనలను పలకరించక దాటుకుపోయే సౌందర్యము అతణ్ణి పలకరిస్తుంది. ఆ సౌందర్యాన్ని చక్కని మాటలతో మనకి అందిస్తాడుకవి. కవికిగల అదనపు చైతన్యాన్నే మనభాషలో మనము భావన అంటాము. కవిభావన మానవ చైతన్యపు యౌవనదశ. కవి మొక్కపాటివారివలె నీలికొండల గుసగుసలను కూడావిని తన్మయుడయేవాడు గాని తన గొప్పకోసము కొండలను పలికించేవాడుకాడు. కవిభావన ఇంద్రజాలముకాదు, ప్రకృతి సౌందర్య వర్షావసరము. కవి అనుభవమే పండి భావన అవుతుంది. అనుభవపు మొలకువులను పండువెన్నెలగా ప్రసరించేది భావన. అనుభవానికి వెలిఅయిన భావన— స్వాతంత్ర్య సంపాదనకోసము బానిస తనయేలికల ముందుచేసే నృత్యములాంటిది. అది— మెప్పునే కలిగిస్తుంది గాని ఆనందాన్నివ్వదు.

శాలివాహన గాథా సప్తశతిని బట్టియే విశ్వనాథవారు తమ రచనలకు పంచశతి అనిపేరు పెట్టినారు. ఆ పద్యముల వలె ఈ పద్యములుకూడా 'ఏ పద్యమున్న కథయు" పాటవలెనే ఇవి చిన్నవి. అయితే అవి పలువురు కవులు రచించినవి. ఇవి ఒక్క కవి భావనావధిని బింబిస్తాయి. వీనిలో సప్తశతిలో వలెనే "ఎన యింటి కెదురుగా నుండినవారల కూతునకును నిజముగం దేల్కొట్టినదని యడిగి తెలిసికొని వనరుట నీ జాలిగుండె వలననె ప్రియుడా," "పేరంటమునకు వచ్చినవారి పడుచు దాల్చినట్టి వలువబాగడమీ నేరిచిన యంతనేరువవౌరా! మే మాడువారమయ్యును ప్రియుడా !" వంటివ్యంగ్య ఉపాలంభనములూ, "రయిలులో గూరుచున్నట్టి రమణియొక్క కోతివలె నున్న యేడాది కొడుకుమీద శిశువులపైని వాత్సల్య మెంత నెఱపవచ్చునో యంతయు నెఱపినతడూ," "ముట్టుకో నీయక తొలగి కసరికొట్టుతూకూడా పయ్యెద కొంగుతో బతికి నేలో విసరు పద్మగంధి," "అతడు ప్రక్కనుండి యూలకించుచు నుండెనంచు దెలిసి అతని భార్యతో "పూవుబోడి ! నీపతిపూవుటమ్మువాడు నన్నదమ్ములు" అనే పక్కింటియామే, "మెల్లనేడాది తిరుగని పిల్లవాడు కాళ్లపైవంగి నెందుగా గాంచుచుండ దానుకొట్టిన నవ్వెడు" తండ్రీ, "కాకర పాదు వంటి— వేసంగిలోకూడ వేడినీళ్ళు కావలయు బావా," వంటి సమకాలిక నమ్మకాలు బింబించే వ్యక్తులూ, (కవివ్యంగ్యోపాలంభనల రూపాన్నవున్న) నీతులూ, 'క్రొత్తగా గుడ్లుపెట్టిన గూటిని' వదలి తిండికికూడా పోనితొండ, 'అగ్ని హోత్రాలు లేకుండ నక్షరంబు' సాగని సత్కవి—, వర్ణనలూ, ఉన్నాయి. భావనావధిచేరిన పద్యాలు "అందరును కోకిలను మెత్తురంచ తండు, కోకిలను దిట్టుచును వ్రాసె గ్రొత్తపాట (మునివాణిక్యమువారు !) యెవరుచెప్పిరో కోకిల కీవిషయము, వానియెలనాగగొంతులో వచ్చి కూయు !", "ఊరి భార్యలెల్ల నూహించి యూమె మంచంబుతో నిడిరి స్మశానమందు, నటపిశాచ కాంత లాలోచనముచేసి పడతిమఱల నూరినడుమ నిడిరి" "నన్నుంచుకొనిన వానికి గన్నుంగప్పుటయు నంత కష్టము కాదే, నిన్నువిడిచి యెవరెవ్వరో నన్నడిగిరటంచు జెప్పినంజాలు సఖా" "నిన్ను నాకిత్తునన్నారు మున్నుచెలియ ! యెందుకో మఱి తప్పిపోయినదిగాని" "యెందుకో యేల ? నీవన్న నేను చెల్లెలను మఱి పూర్వజన్మమందునన్ కాని" వంటివి కొన్ని వున్నాయి. ఇవి సప్తశతిలోనివేనేమో ననిపించే "రమణి ! నే నంత పామంతురాంకాను. ఇల్లువదలి రానాస్కారమింతలేదు, దాని దుంపతెగిరితే జగానవెల్ల వనితలును నందగాంద్రకే భార్యలైరె" వంటివీ ఉన్నాయి. గాథా సప్తశతిలోని పలుకుబడులు 'వార్ధకమ్మున యౌవనవతికి భర్త' 'పశువుకొంత నయమువాడు, వంటివి ఉన్నవీ, పొయ్యిఊదే పద్యమూ, నాథు రొమ్ముమీద కొంతమేల్కొని యుండిన పద్యమూ వంటివి పోలికలూ ఉన్నవి.

అయితే సప్తశతి పద్యాలకూ పంచశతి పద్యాలకూ— పగలూ రాత్రికివలె— కనిపించే వ్యత్యాసమూ ఆ కవుల నిరంజన చైతన్యదృష్టి, విశ్వనాథవారి 'నిర్నిరంజన' ఆవేశ దృష్టిని. ఆ కవులు "గురజాడ వారిలాగ లోకమనే రంగంలో చిత్రకోటి రీతులను ఆటాడే పాత్రముల సాగనుకనిపెట్టడము అల

మాటు'' చేసుకున్నారు. కనుక వారుచిత్రించే వ్యక్తులలో సొగసు లేని వ్యక్తే వ్యంగ్యము. స్నేహమూ ప్రేమా అనే రెండు వెలుగులు మనుష్యులమీదికి సప్తశతి కవులు ప్రసరించి కాంచినారు. కనుక ప్రతివ్యక్తిలోనూ వింతసొగసులు బయలుదేరినవి. విశ్వనాథవారు తమ నీతులూ, తమ నమ్మకాలూ, తము కొలబద్ద లూతో మానవులను కొలిచి శతక కవుల పద్ధతిలో రచన సాగించినారు. 'ఔరా పెండ్లము ! ఊరున నూరేగింపునకుం గ్రొత్తయుడుపులు వలయున్, కోరికగలశతి నాకదేం దేరెడిచో బనికి రాని చీరలు చాలున్'' అని (అందపు టంశలోకసముగా కాకుండా) తీవ్రమైన అభిప్రాయంగా పిలిచి ఇస్తారు కొన్నిపద్యాల్లోవీరు. సప్తశతిలోని వ్యక్తుల వర్ణనము మనకు నచ్చుతుందని అనలేము. అయితే నారిమీద స్నేహమూ ప్రేమా మాత్రము మనకి తప్పకుండా కలిగి, చిన్నపిల్లనాటి ఉప్పొంగుమాటలు ఏవో నచ్చి నట్టు నారివిచిత్ర వర్ణనము చూచి నవ్వుతాము. సప్తశతిలోనిది 'వానిమీద బడియె పనిత గోదావరి జలఊరేవు దిగెడు సాకు పెట్టి, కనికరమును దప్పుకొనెరాదని వాడు, నట్టిగాని దాని గౌగిలించె'' అన్నది ఒకగాథ. విశ్వనాథవారి రచనలో ఇలాంటి సన్నివేశమే రూపముమారి ''లవునవు బిరాలు కొమ్మనున్నట్టి పూవులాపె కందవు, పూజకై యందులోన దమరుమాత్ కోసి పెట్టినేం దప్పుకాదు, కాంతసిగ్గున గొనుటంత కన్నగాదు'' అన్న ప్రౌఢభార్య ఉపాలంభనముగా కనబడుతుంది. ఆమెకు వచ్చిన కోపము కవిగారికి సంక్రమించుటవల్ల 'కోసి పెటవ' అనీ, 'కాంత పైటను గొనుటంత కన్నగాదు' అనీ అయినా స్ఫురించినదికాదు ! వారి కవిత్వముకంటె నా పైత్యము బాగున్నదనికాదు నా సూచన, కోపగించడము చూపుతారు గాని విశ్వనాథవారు, కోపకారణాన్ని వెండితెరమీద కెక్కించి మనకా సొగసు చూపించరనీ ! శాలివాహన సప్తశతి కి నిరంజన చైతన్యదృష్టియే జీవము. ఆవేశాలూ అభిప్రాయాలూ ప్రవేశిస్తే కవి అభిప్రాయ మాయనదీ చదువరుల అభిప్రాయాలు చదువరులవీని.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి ''విశ్వదాభిరామ వినుర వేమ'' పద్యాలూ (1945, 46) సప్తశతి గాథల చాలవే. లోకపు వాస్తవస్థితిని గుర్తించి దానినిచెప్పక తాను నిర్మించుకున్న భావనా మందిరంలోననో, 'జలదంపు నీలంపు నిగ్గుల' లోనో కాలముగడిపేస్తున్నారనీ, ''నీ కనుల్ నింగికేరు సరుచు నిచ్చెనలనీ'' అందరూ అన్నారట. ఇది సత్యముకాదనీ తన కనుల్ 'లోకమ్ము దొలిచిచూచు చాకుతుదల'నీ చూపే ఉద్దేశముతో కృష్ణశాస్త్రిగారు వేమనపద్యాలు వ్రాశారు. ఈయనను కలలో ఉత్సాహపరచినకవి'' ''నవ్వింపునవ్వు, మరిమరి కవ్వింపుము కంచు కనలు గర్జింపుము మైదువ్వుము రువ్వుము రవ్వల దివ్వెల వెలిగింపు తేటతెనుగు తెరువులన్'' అన్నాడు. ఇతరులను నవ్వించడము కష్టముకాదు. మిషనులాగ నడిస్తేనూ నత్తి అభినయిస్తేను, బాలుర ననుకరిస్తేనూ 'నే నైతే, మహాకవినే, నా పద్యాలుమట్టుకు వీరికెవ్వరికీ కొలికబడవం టేనూ నవ్వుతారు ప్రజ. తానుకూడా నవ్వగలిగేటట్లుగా నవ్వించడము అందము, కష్టము కూడను. అతిసామాన్యమైనటువంటి తనకలను చూపిస్తే నవ్వరు ప్రజ, వెక్కిరిస్తారేమో కూడాను. తనకుమాత్రమే విచిత్రంగా కనబడేవాన్ని వర్ణిస్తే ఆవ్వులి నడతారు ప్రజ, నవ్వరు నవ్వగలిగినంత పరిచయమును కల్పించే టట్లు రచించాలి కవి. లేకుంటే, ఏదో చూపిచ్చి కడుపు పట్టు, కుని నవ్వేవాణ్ణి చూపిస్తే అన్నట్టుంటుంది చదువరికి.

కృష్ణశాస్త్రిగారు ''వర్తించరి రాజావారు చేసెద్ద గంటమొదలి పంక్తి నిరిచునట్టి, వేసుకుని నిగిడి మాసిన దుబ్బులే'' అని గర్జించారు, 'కుంటరాజుగారు పెండ్లిపెద్దలు, పింగళయ్యగారి పెత్తనమ్ము, సరుదు పదువ వెదకు పదువయా' అని కలచినారా, 'సంపదలంటె పదవలయు రాజకంటె పాజ రంకుపెడు. మనదేశానికి నేడు మేండ్రా' అని మన్నేరా; ''సకలమునమున్న చెప్పుడు చెప్పులు నెన్నడు నవాక్కు లన్నివన్ను భక్తవరుని చెప్పు బ్రహ్మణుడనా'' అని మన్నేరా, ''అప్పుడు సన్నభక్తి ఉప్పుడు తినభక్తి బ్రహ్మవర్తి యుప్పుడు గాయులుదేరె ఒక్కదేవునకును చిక్కడు ఎప్పుడంటి'' అనీ ''మనుషులు పోయిషిల ఊపుంక్ ఎదాయులు నొక్కుచుండి లోలువెక్కి రంపుకుట్టు సాయిబయ్య కొట్టు బడాయాలు' అనీ నన్నేరా, ''దివ్య గుణములతడు వెలాగి వర్ణించ వెల్లవెల్ల బోయె దేవదేవు, దమ్మబార్యయంచు అప్రమ కాటోలంచు విశ్వదాభిరామ వినురవేమ' అనీ, 'నాటకాంతోప నారివేసము వేయు పురుషునట్టు యుండు పోతురాజు, ఎత్తయుప్పు నిట్టి మునుపు లతావుమే' లని నవ్వించారు. మొత్తముమీద వారిపద్యాలు 'అను కున్న లన్నీ ఆకరి కడుపైన, అరిసెకున్న లన్నీ ఎసటిరాం. ఇరువురికిని నడుమ పరితూపు వేగిరెర' అంటూ తోడన్న పేర్చ నూపేటని అని అనవచ్చు. వారు చూపించే ప్రత్యేక వ్యక్తుల ఉపకరణాల్ని చూచి నవ్వుతాముగాని ఆవ్యక్తులలో దీపించే మానవ స్వభావపు లపకలవకలను చూచికాదు మనము నవ్వేది. గాథా సప్తశతి సాధించినదదీ. కృష్ణపక్షములోని 'ఈరడము' 'వరిచేడె' కొంతవరకూ గాథం తత్వాన్ని పరిమళిస్తున్నాయి.

ఈ యిద్దరి రచనలూ చూచేకాబోలు శ్రీశ్రీ (1945) ''అందంగా మధురుని ష్యందంగా, సరిత్ర హృదయ సం స్పందంగా, కందాలొక వంద రచించిందికి మనసయ్యె''నట. శతకమువైపు తిరిగింది గాథాసప్తశతి అనుసరణలో ప్రారంభించిన ఈ ఉద్యమము. చక్రపాణి శ్రీ. శ్రీలో వస్తుమాటలు : ''భారద్వాజస గోత్రుడ వారబ్దసబేశ తాండవాడంబర మంజీరా రవాను రణసస్మేరా వనమూర్తి నీవు సిరిసిరిరావూ.'' ప్రబంధ కాలపు పలుకులువచ్చాయి ! శ్రీ. శ్రీ ఉద్యమము ''భవిముద్ర సవద్గతులన్ చదివెడు సుదారులకు హృదయ తృష్ణ శమింపన్ నవనవముగు శతకము వ్రాసివేయు''డుము. ఈయన యత్నము మాత్రము వైచిత్రిని వె లయించడమే అయింది. అప్పటికి దేశీయ కవిత్వాలూ భావకవిత్వాలూ ఆవేశంతోవచ్చి తొక్కుకుపోయాయి. వాటిమీద ఎవరికీ ఆసక్తి కుదరడములేదు. ఆస్థితిలోనే ఈయన ''కుర్చీలు విరిగిపోతే కూర్చోడం మాననట్లు గొప్పరచనలన్ కూర్చేశక్తి నశిస్తే

# శతకాలూ - ముక్తకాలూ

చేర్చెది నాకింతచెత్త" నన్నారు. 'పనిలేని యట్టిమంగలి మును కొని మార్జాలశీర్షమును గొరిగెడు తీరున రాస్తానేదో, రాసిన దానికి కోపమేల సిరిసిరిమువ్వా" అన్నారు. కాలక్షేపానికి రాసిన దానిలో కలము చెప్పినట్లు రచన సాగిందా అనికూడా అనిపిస్తుంది. "హిప్పోపొటోమసొక్క బిషప్పును గని యడిగెనిట్లు" స్వామీ! మీ రెల్లప్పుడు చెప్పిందాన్నే చెప్పడ మెంచేత ననుచు సిరిసిరి మువ్వా.' పకారద్వయ ప్రాసవల్ల వచ్చాడా బిషప్పు, కవి ఊహ లోనే వున్నాడా అనిపిస్తుంది. అలాటిదే మరొకటి : "భోషాణప్పెట్టెల్లో ఘోషా స్త్రీలను బిగించి గొళ్ళెం వేస్తూ భేషు బలే బీగాలని శ్లేషించెను సాయబొకడు సిరిసిరి మువ్వా." ఇదీ ప్రాసక్రీడయేననిపిస్తుంది.

వేమన్న పద్యాలూ, సిరిసిరిమువ్వ పద్యాలు చూచే కాబోలు కొమరవోలు వెంకట సుబ్బారావుగారు 'చెకుముకిరవ్వా' అన్న అంత్య పదాలతో కందపద్యాలు రాశారు. వీరిరచన ధారాపాతంగా సాగుతుందని "కారేరాజులు ? వారున్నారె ? సిరిగొంచు పోయి నారే? ఎవడీ ధారుణినేవిని వానికి చేరెడి దేమున్నదింక చెకుముకి రవ్వా" అన్నపద్యము సూచిస్తుంది. వీరి ఉద్దేశము మాత్రము "ఈ లొల్లి మెట్ట వేదాంతాలే మన కొంపలెల్ల త్రవ్వెనికైనా మేలుకొనండీ తూరుపుచేలను రక్తనది ముంచె చెకుముకిరవ్వా" అని ప్రబోధించుటకే. "తోవేటి" అన్న కలముపేరుతో, 'నక్షీంద్రా' అన్న అంత్య పదముతో కందాలురాశారు ఎవరో. (శ్రీ. శ్రీ తన సిరిసిరిమువ్వ పద్యాలకుముందు "నీ కొక సిగరె ట్టిస్తా నాకొక శతకమ్ము వ్రాసియిమ్మన నిమ్మా" అని ఆంధ్రజ్యోతి మాసపత్రిక సంపాదకుడడిగినట్లు వ్రాశారు.) ఇదేమో "పొగ చుట్టయినా యివ్వని మగస్త్రీ పై శతక"మట. సినీమామేడకి కాంక్రీటుగోడ, హల్వాలోవా లాగున, యిన పొక్షర భరితము, స్టారను కందకు దురదంటివాడు, టాకీయను సేకాటకి జోకరు, ఘోర అందము,వంటి అసంప్రదాయము లైనా శక్తివంతమైన మాటలు వాడేరీకవి యెవరో.... 'వాస్తవమ్ము నార్లవారి మాట' అన్నమకుటముతో నార్ల వెంకటేశ్వరరావుగారు పద్యాలు వ్రాయడానికి వేమనకవిపట్ల వారికిగల భక్తి గౌరవాలే కారణం. వేమనరచనలు సప్తశతి రచనల వంటివికావు. వేమనపద్యాలు సమకాలిక జీవితమువిూద ఆయన అభిప్రాయాలు. సప్తశతి పద్యాలు సమకాలిక చిత్రములే, అభి ప్రాయములు కావు—వాటినిచూచి అభిప్రాయాలేర్పరుచు కోవడమూ మానడమూ మనవంతు. పై ఆధునికులు సప్తశతిని అనుకరించారని అనలేముగాని సప్తశతి పద్ధతినీ ఏ కొంతో దిగుమతి చేసినవారు విశ్వనాథవారే. మిగిలినవారు శతక పద్ధతిని తమ అభిప్రాయాల్నే వెలిబుచ్చారు. అభిప్రాయాలు కవిత కాదు, బోధనము. మన జిజ్ఞాసకవితతోనే బోధనతోకాదు. కనుక ఈ వాఙ్మయమునకు విన్నమొన్న చేరిన చివురులు పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి 'శతపత్రము' చూతాము. ఈయన శాలివాహన సప్తశతి అందాన్ని బాగాపట్టుకున్నారు. 'చిన్నదానను ఏమిరాచితివా పసరునిన్ను విడలేను— పట్టదు పిసరు ఇంట నుండవు— నేడు రేయెండ కొసరునాకు వచ్చెను— ప్రియుడి ప్రాణమ్ము కెసరు'వంటి అమాయిక ముగ్ధ ప్రేమాలాపాలూ, 'మించుబోడిరో ! గ్రుడ్లప్పగించి చూతు నా వయిపు ప్రొద్దు తిరుగుడుఁ బూవువోలె యాశపడితిని నిన్ను గన్నంతనేను అంతలో నేల యగుదువే యత్తపత్తి' వంటి శృంగారచేష్టలూ, 'ఒడలు పసిడిచాయ హొయలెల్ల బయలుగా సీమచీరకట్టు చిన్నదాని చేదుకొనుట బదులు చేదుగా జూచెను వడుకునూలు కట్టువాడు ప్రియుడు' వంటి స్వభావోక్తులూ ఉన్నాయి. 'పేరుపేరున నక్క పెండ్లికొడుకు వందనమ్మిడు పెద్దల వరుసలోను గ్రొత్తగా గాపురమైన యత్తనవతి యాదర మ్మున దీర్ఘాయువని హసించె' వంటి నర్మోక్తులు కొంత తక్కువ. 'గట్టిగా తోడుపెట్టిన గడ్డపెరుగు తీసుకొనివచ్చి బొట్టెను దిట్టి మగడువట్టి జావైన యా పాడుపడుచు పెరుగు వాడు కనుబెట్టినాడని వగచెభార్య' వంటి నర్మచిత్రాలు చాలా ఉన్నాయి. సప్తశతిలోని అనుకోని ఎదురు తిరుగుళ్ళు తొలిభాగానికి అనుకూలములేలయి చిన్న కథలలోని క్లైమాక్సు (పతాక దశ) వంటివేకాగా ఇందులోనివి యాంటీ క్లైమాక్సు (ప్రతి పతాకలు)గా తయారైనాయి : 'పాట వినుచుండ మూతలు వడెను కనులు తెఱచినను మూసినను నొక్కతీరె నీవు కోకిలమ్మవు, ఇదియు నిక్కువ మటన్న చాన నయనమ్ములయ్యె కషాయితములు,' 'పిసినిన్నపు కణిక, నీ చేయిజూచి జారినది గుండె, యొాతెల్లచాన ! యనిన భ్రష్టుడా ! రమ్మ, నా ప్రేమ పాత్రమైన శిలువ, యాశ్రయమిడునని చెలియపలికె ?' చక్కగా ఉంది. రెండు నాల్కలపతాక (డబుల్ క్లైమాక్సు) ఇది వినండి ! 'సుందరీ ! యంచు పిల్తురు చూచువారు న్యాయమును జెప్పు ! నేను సుందరినె ? యన్న చెలికి, నెదవిప్పి, యామె నెచ్చెలి వచించె, 'పరమసత్యము— నాట్య సుందరివి ! నీవు." ఇలాంటిదే ఇంకొకటి ! 'చేరవచ్చువానిఁ జెంపపెట్టుగగొట్టి తోడచూచె, జారితోడఁ జూప, చట్టు తగులుచోట జలయున్న చనుమాట నిజము; ఆపెయయ్యె— సజలనయన.' సప్తశతి శక్తిని బాగాపట్టేరు సుబ్బరామశాస్త్రిగారు. అయితే ఈ కాలానికి తగిన ప్రకీర్ణక పద్యాలు, ఉక్తివైచిత్రికాక భావవైచిత్రిని బింబించే పద్యాలు, శతకములుకాదు సహస్రములు వీరు రాయవచ్చును. వస్తువు కావలసినంత ఉన్నది.

## వచన ముక్తకాలు

సమకాలిక ప్రపంచాన్ని గమనించి వ్యక్తుల వర్తనా వైవిధ్యాన్ని గుర్తించి తద్వారా గోచరించగల సొగసును చూపించే పద్యాలు చూచాము. భాషను పరిశీలించి మాటల్ని జోడించడమువల్ల, బయలుదేరే వింతసొగసులు చూచిన చిత్రకవి తిక్కవరపు పట్టాభిరామరెడ్డిగారు (పఠాభి). అనుప్రాసల సొగసులూ, శ్లేషల సొగసులూ ప్రబంధకవులు చాలా చూశారు. అయితే "పతివ్రతకున్నూ పతితకున్నూ వర్ణభేదము మట్టుకేను" అనగా విన్నప్పుడు అటులోకంలోని సత్యమూ ఇటుభాష

లోని సత్యమూ మనము ఎరగని సాహచర్యాన్ని ప్రదర్శిస్తాయి. "ఏది పాటలన్న నాక యిష్టము" అని విన్నప్పుడు 'అలాగా, పోనీ తెమ్మం'టాము, వెంటనే 'పాటలు వ్రాయటం నాపని' అని వినబడగానే దీని సత్యము ఒకవేపునుంచీ, మాటల తిరగనేత ఇంకొకవేపునించీ వచ్చి కలుస్తాయి. 'ఓపికవాణి పికుగల యోపిక వాణికిలేదు' అని ప్రబంధకవి హరిశ్చంద్రలో అన్నప్పుడు 'పికవాణి' అన్న పదము సార్థకమైతే ఈ అందము సమకూడి యుండును అక్కడ. 'రాజాజి'లోని 'రాజి', రామాయణంలోని మాయ, భాగవతములోని భావము (లేదా గతము) రెండుజడల తలలు గదా !

'వరాభి పంచాగము' అనే వ్రాతప్రతి శ్రీ. శ్రీ. సౌజన్యమువల్ల నాకు చూడలభించింది. 'వరాభి'గారి స్నేహాన్ని అర్థిస్తూ వారి పంచాగములోని 'కణములు' మనవి చేసేస్తున్నాను. "యుద్ధమ్ముమలన, వసుధలోన, సువర్ణంబులోపించి, వధ మాత్రము నిలంబడి యున్నదట ! 'ద్రవ్యం యావత్తూ పోయింది, ద్రవంఅయి' 'ద్రవ్యం'లో 'యా'వత్తూ పోతే మిగిలేది 'ద్రవం'కాదా మరి ? 'వెలయాలు చాలాప్రియము, ఆలు చాలా సరసము' 'చిరకాల సత్యము ! 'దంతికన్నా వదంతి పెద్దది' కాదామరి. 'సారాయి తాగినవాడు, షరాయి విడిపోతున్నా, తాను వయ్యారాయి అనుకుంటాడ'ట. శ్రీ. శ్రీది 'తురాయికంటె ఆకురాయికంటె కీచురాయికంటె హిమాంశురాయి గొప్పవాడు' అన్నరచనపక్కన ఈ రచన అందం చక్కగా కనబడుతుంది.

వరాభి పంచాంగంలో, 'నిత్యమూ నాకు ఆలు బహువచనంగనే ఇష్టము,' 'గణితంకన్నా మణితము ఇష్టము' 'నాయకుని కావాల్సని అనలేదు, పక్క దక్షిణ నాయకునిగా తప్ప' వంటి ఒంటిమలికి బాణాలున్నా, 'మందువల్ల యుద్ధంలో మనుష్యులు చస్తారు' వంటి జోడుగుళ్లబారులే యెక్కువ. 'ఇంతి' నడుమునున్నట ( ఆ మాటలో నడుము అక్షరము నున్న కాదా ?) 'కరగ్రహణానికి ముందువేలు కావాలంటాడు ఈ నాటి వరుడు' 'నారికీ నారినారికీ మధ్యనారవుంది.' 'వలంటీర్లకు పడవటం తగ్గి ఏడవటం హెచ్చింది.' 'పరువు ప్రతిష్టగల ఆట క్రికెట్టు' 'వరుని హృదయములో దయఉన్నది !' ఇదంతా కవిత్వంగా లెక్కగట్టుతున్నావేం అంటే ఇది వచనముకాదు, గద్య కాదు. ఆలోచనవల్ల హాస్యరసోత్పత్తి కలుగుతుంది వీటిలో. "మాయా ప్రపంచములో మనుచున్నట్టి మానిసియొక్క తిరుగుబాటు సినిమా"ట ! శ్లేషరచన అనురచన కవిత్వమంటారే, ఇదికాదా ? "ఖయూం రుబాయితను సిరాలోకాటు సారాయితో రాశాడు"ట. "ఝాన్సీదళంలోని కురంగనేత్రలంతా ఫిరంగి నేత్రలుగా మారారుట". "కాంచనం కాంత కాదంబరి అనేవి జగత్తులో ముఖ్యాలు, మిగిలింది సేను"ట. ఇది కవిత్వం కాకుంటే మరేది ?

ఈ నడుమ (నవంబరు 62 భారతిలో) దేవరకొండ బాలగంగాధర తిలక్‌గారు 'న్యూ సింబల్స్' అన్న శీర్షికతో ముక్తకాలే వచనంలో వ్రాశారు. 'అమెరికాలో డాలర్లు పండును. ఇండియాలో సంతానం పండును.' అంటూ ప్రారంభించారు. 'దరిద్రం సముద్రంలో వేదనల తెరచాపలెత్తి ప్రయాణించే జీవన నౌకలకి మృత్యువే లైట్‌హౌసు." అన్నారు మిశ్రరూపకము. 'ఆశ ఉత్తరధ్రువం విధి దక్షిణధ్రువం, మనిషి రెండింటి మధ్యా బంతిలా యెగిరిపడే ప్రహసనం.' అభిప్రాయమే అయినా జీవితసత్యంలాగా మెఱుగుపెట్టారు. 'చంద్రగోళం చవిటి పర్రమీద వెతగ్గా ప్రబంధ నాయికల ఉపాలంభనలు దొరికినవట. విశ్వనాథవారు వెనక్కినడవగా నడవగా వేదకాలం యింకా వెనక్కి వెనక్కి పోయిందట" అన్నది సింబల్‌కాదు స్పష్టమే. వచన ముక్తకము పదునెక్కుతున్నది తిలక్‌చేతిలో. 'నందరాంగుల జాగృతిలో విద్యార్థులనిమ్నోన్నతాలు గుర్తిస్తారు' 'భూమధ్య రేఖకన్న ఆడదాని భ్రూమధ్యరేఖదగ్గర వేడిఎక్కువ' అన్నవి సప్తశతి పద్యాలకు దగ్గర. ఒకవిధమైన నడక వీటికి సామెతలపాటి దీర్ఘాయువు నిస్తుంది.

చోళ ద్రావిడ పాండ్యరాజ్య మహీభృత్ శుద్ధాంత కాంతావయః
కేళీసక్తత దంగ రాగిత కురంగీ నాభినీలీభవ
ల్లీలావారి భవాభి రామయయి కాళిందీనదిం బోలుచున్
గ్రాలుం భూనవవేణికా విధమునన్ గావేరి లీలావతీ!

—నారవ సూరన వనమాలి విలాసము.

# శోభకృత్ - స్వాగతము

శ్రీ అక్కపెద్ది సత్యనారాయణ

స్వాగతము నీకు శోభకృత్ వత్సరమ్మ!
స్వాగతము నీకు మంగళస్వామి! రాజ!
స్వాగతము మంత్రిమణి! మంద! శనిమనీషి!
స్వాగతము సైన్యపతి! నీకు వందనాల!

మీ రాజ్యంబున చీనిమందలకు సామీచీన్యమెట్లుండునో!
మా రాజ్యంబును ముట్టడింతురటవే! మాయల్ ప్రపంచించి వి
స్తారాస్త్ర ప్రచయంబుతో విషశిఖల్ ధారాప్రపాతంబుగా
నారంభింతురె మృత్యువాత్యలు లయాహంకారహుంకారులై!

మహిజుడు రాజు, మందమతి మందుడు మంత్రియుకేమి కావలెన్
దవాన విషార్చులేకురియు తల్లడమంది ప్రజల్ భయార్తులై
తహతహలాడి పోవుదురు తాదృశ సంకటముల్ హరించి ఓ
సుహృదయమూర్తి! శాంతినిడి శోభకృదబ్దము పేరు నిల్పుమా!

కాలము సర్వకారణముగా వచియింతురు ద్రష్టలెల్ల, పో
గాలమువచ్చి కయ్యమునకై యుబలాటము పొందుచీను లి
య్యాలము సర్వనాశమని యాగరు దుర్దశ ప్రోత్సహింపగా
ఈలయవేళ మాకు జయమిమ్మ నవాబ్దమ! సాధుశబ్దమా!

స్వస్తి భారతధర్మ సమస్తమునకు
స్వస్తి నగరాజ శిఖర సర్వస్వమునకు
స్వస్తి దేవతానిలయ ప్రశస్త భువికి
స్వస్తి విద్యావివేక కృతాప్తమతికి.

**అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వము:**

# జాతీయ రచనలు

## శ్రీ డాక్టర్ పాద గోపాలకృష్ణమూర్తి

### 6

వందేమాతరోద్యమము నవ్యకవిత్వావిర్భావానికి కొంత కారణమైనదని మనవిచేశాను. అంతవరకు దేశీయుల వ్యవహారంలో 'వంగ దేశమూ, పాంచాలమూ, మహారాష్ట్రమూ' అంటూ విడివిడిగా ఉండిన రాష్ట్రాల నన్నిటినీ రంగరించి 'మాతృదేశము' నుగా కూర్చి అర్చించినది వందే మాతరోద్యమమే. దీనిని తమ శ్రేయస్సుకు విరోధినిగా గుర్తించి బ్రిటిషు వారు 'వందేమాతరం' అన్న పలుకునే నిషేధించారూ, భారతీయ తత్వానికి అనుకూలమే కావడమువల్ల ఇది—ఆంగ్లులకు వ్యతిరేకోద్యమంగా విజృంభించింది. బహిరంగంగా ప్రభుత్వాన్ని వ్యతిరేకించలేకపోయినా, 'దేశసేవ చేయండి' అన్న దాని ప్రబోధపు నీడలో మాతృదేశ సంకీర్తనమూ, దైన్య స్థితి వర్ణించి ప్రజలను ఉత్తేజితులను చేసినారు కవులు.

గురజాడవారు అట్టి కవులలో ప్రథములు. 'దేశమును ప్రేమించుమన్నా' అన్న వారి గేయము వందేమాతరోద్యమ ఫలమే. దీనిలో ధ్వని రూపంగా కాక మిశ్రసమ్మితంగా ఉపదేశపూర్వకంగానే మాటలతో కాక చేతలతో ప్రజకు మేలు చెయ్యమనీ, ఒళ్లువంచి పాటుపడి దేశిసరుకులు నింపమనీ, వెనక్కి చూడక ముందుకి అడుగు వెయ్యమనీ, ఐకమత్యం నేర్వమనీ, దేశాభిమానమంటే దేశీయుల యెడ నభిమానమనీ, కవిత్వ మన్నది దేశీయులను ప్రబోధించాలనీ చెప్పారాయన. స్వాతంత్ర్యము వచ్చిన ఈనాడు కూడా ఆ మాటలకు వాడి తగ్గలేదు. ఈనాడున్నూ, దేశీయులు నేర్వవలసిన వవే. దేశ స్వాతంత్ర్యము కోసము యుద్ధము అవసరమని ఆయన గుర్తించారు. "ఉసురులకు విసిగితివో ? యుద్ధమ్ము కలదు, దేశము కొరకు పోరుము" అన్న అంతర్వాణిని పలికించారు గాని తమకు కాలము దాటిపోయిందని విచారించారు. వ్యక్తుల దౌర్జన్యాన్ని రాజుల దౌర్జన్యాన్నీ 'మాన్యంబులీయ్య సమర్థు డొక్కడు లేడు, మాన్యములెర్రువ సమర్థులంత' అని ఉపాలంభంగానూ 'పదుగురు కోతి వెంబడి సంచరింపరే, వాహకు లేరే శవంబునకును' అని తిట్టుకవిత్వముతోనూ మొరపెట్టుకునే దశనుండి 'అన్యాయానికి ఎదురు తిరగండి' అని తోడివారిని ప్రబోధించే స్థితికి కవిని నానబెట్టి, వందేమాతరోద్యమము గురజాడద్వారా తెలుగులో వినబడింది.

అయితే, భారతదేశాన్ని మొత్తంగా ప్రబోధించ యత్నించిన మొదటి ఉద్యమము—1857 స్వాతంత్ర్య యుద్ధం తర్వాత—వందేమాతరోద్యమమే కావడము చేతనూ, "వందే మాతరం (మన్దే రాజ్యం)" అన్న నినాదాలను ప్రభుత్వము నిషేధించి ఉండుటచేతనూ ఆ ఉద్యమము తెలుగు దేశములో ఎక్కువగా వ్యాపించలేదు. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రము ఏర్పడాలన్న ఉద్యమము పై ఉద్యమానికి ఛాయగా నైతేనేమి, ఆంధ్రులకు, అపరజులకు లభించగల సౌకర్యాలు మాత్రమే లభిస్తున్నాయన్న అమర్షమువల్ల నైతేనేమి, వేరుతన్ని పెరిగింది. నెల్లూరులో 1913 లో జరిగిన ఆంధ్ర సభలో ప్రత్యేకాంధ్రరాష్ట్ర తీర్మానము ఉదయము వెగ్గక పోతే, రాయప్రోలు సుబ్బారావుగారు 'నిండారబారు నఖండ గోదావరి దాగిన చాళుక్య నాగరికత, పల్లె పదాల జీవము నిల్పుకొన్న పలినాటి వీరుల రక్తనాళ పటిమ, పాడైన పెనుకోట గోడల దీర్ఘ నిద్రలు వోవు కాకతి ప్రాభవమ్మును, కడలేక యేడ్చు తుంగాభద్ర కెరటాల మణగిన ప్రాజ్య సామ్రాజ్య భరమూ, ఆంధ్రుల హృదయాలు వినేటట్టుగా దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి కంఠంలోంచి పలికితే మధ్యాహ్నసభలో ఏకగ్రీవంగా ఆమోదింపబడిందట. గ్రంథాలయ సర్వస్వమనే పత్రిక రాయప్రోలువారి శంఖారావాన్ని తెలుగువారి కందించింది. మృదువులైన పదాలూ, మెత్తని ప్రవాహశయ్యా, మనస్సు ద్వారా హృదయానికి చేరగల వస్తుధ్వనీ అది మేల్కొల్పగల భావ విభూతీ ఆనాటి రాయప్రోలు రచనలలో మేళవించాయి. అవిన్నీ పుంఖాను పుంఖాలుగా వచ్చాయి. దేశీయోద్యమము ఆంధ్రోద్యమంగా రూపు దాల్చింది. కృష్ణవేణీ హరితసస్య పృథివీ, గౌతమీ పుణ్య కల్యాణ కంఠసీమా, తుంగభద్రా తరంగరంగమూ శమీ పూజలతో, పూనవ్వులతో, ఆటపాటలతో ముఖరితము లైనాయి. జాతి బ్రతికియుండిన నాటి చైతన్య మహిమ మహాచైతన్య స్ఫురణమూ భావావేశమునూ కూడా

కలిగిస్తుంది. రాయప్రోలువారి పద్యాలు ఈ రెండు ఫలాల్నీ పండించి, దేశమంతటా అందించాయి. వీరి "శ్రీలు పొంగిన జీవగడ్డయి, పాలుపారిన భాగ్యసీమై" అన్న గేయము వాచ్య ప్రబోధముతో సంతుష్టి చెందక 'సూత్ర యుగముల శుద్ధ వాసన క్షాత్ర యుగముల చండ శౌర్యము' అను కండగల చిక్కని తెనుంగుల కలిపి పాడి, గురజాడవారి నిసర్గవాణిని కూడా మరపించి తాను వినపడినది. దువ్వూరి రామిరెడ్డి గారు స్వాతంత్ర్య రథము, భారతమాత అని చాలా పద్యాలు రాశారూ, Battle of Blenhemను జ్ఞప్తికితెచ్చే కొండ వీటి కథ వ్రాశారు. దేశ ప్రబోధమూ, రాష్ట్రీయ ప్రబోధమూ, జాతి ప్రబోధమూ త్రిశూలంపు మొనలవలె నిక్కి వాడిదేరినవి. బెసెంటమ్మ 'హోం రూల్' ఉద్యమమూ గాంధి మహాత్ముని సహాయ నిరాకరణోద్యమమూ అసంతృప్త భారతీయ హృదయాలకు చిచ్చు ముట్టించాయి. ఎండ కన్నెరుగని నారీమణులూ, లేత శరీరపు విద్యార్థులూ, నోరులేని కర్షక జనమూ ఉప్పెన కెరటాలవలె ఆంగ్ల పాలనమీద పడ్డాయి. ఈ సంరంభంలో కోటి గొంతులు విచ్చి మ్రోగాయి. బలిజేపల్లి లక్ష్మీకాంతముగారి 'స్వరాజ్య సమస్య' అన్న పద్యాల పుస్తకము చదవవలసిన గ్రంథము. 'సకల రత్న ప్రభాచటులాంబరంబైన హిమనగం బాత పత్రముగ మెరయ, చేరి భాగీరథీ సింధునదీ తటుల్ విమలవీచీ చామరములు వీవ, ప్రాక్పశ్చిమాగ్ర భూముల నొల్చి గభీరవారి ధీశ్వరులు కైవార మొసగ, ఆర్ష సంతతి యుదాత్తాను దాత్తములైన స్వరముల స్వస్తివాచనము లిడగ ముప్పదియు మూడుకోట్ల ముద్దు సుతులు, సమత తనయాజ్ఞ శిరసావహింప, సింహళద్వీప పీఠికాసీన యగుచు, కరుణ జగమేలుగాత మా భరతమాత' అని దేశ మాతృస్తవమునే కాక "గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రాది పావనోదక ముగ్గుబాలు ద్రావి, నన్నపార్యాది మాన్య కవిత్రయముచేత నల్లనల్లన మాటలాడనేర్చి, ఆంధ్రరాష్ట్ర స్థాపనాచార్యవర్యుడౌ విష్ణువర్ధను భుజాపీఠి నెక్కి, ఆంధ్రసేవాపరాయణ కృష్ణరాయాదిపతులచే సకల సంపదల బొదవి, కడుపు చల్లగ గాంచి పెక్కంద్ర సుతుల బాహు విక్రమతేజః ప్రభావధనుల నిస్సమాన మహోన్నతి నెగడినట్టి ఆంధ్రమాతా నమస్కారమమ్మ నీకు' అని ఆంధ్ర మాతృస్తవమును అందముగా చేసివారు బలిజేపల్లివారు. వారి నాటక కవిత్వము రసభావ సమంచితము. నదీ ప్రవాహ సదృశము. ఆ సుందర సంస్కారము దేశ సేవకు పూనినట్లయితే లోకులు బ్రహ్మరథము పట్టరా ? ప్రతి సభలోనూ ప్రార్థనా పద్యాలు ఈ రెండుగావే వెలసినవి. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి 'రసపుత్ర విజయములోని' 'అల హిమాద్రియుం వింధ్య మారావళియుం చుట్టు పెట్టని గోడలై పెంపుమీర, లలిమించు కైబర్ బోలాన్ కొండకనుమలు ద్వారంబుల విధాన తనరుచుండ', అన్న పద్యమూ ఇతరుల పద్యాలూ వీటి యెత్తు నందుకోలేదు. నాటికి నేడు జాషువా కవి 'సగరమాంధాత్రాది షట్చక్రవర్తుల యంకసీమల నిల్చి నట్టి సాధ్వి, బుద్ధాది ముని జనంబుల తపంబున మోద బాష్పము ల్విడిచిన భక్తురాలు, కాళిదాసాది సత్కవి కుమారుల గాంచి కీర్తినందిన పెద్ద గేస్తురాలు, కమలనాభుని వేణుగాన సుధాంభోధి మునిగితేలిన పరిపూతదేహ, సింధు గంగానదీ జల క్షీరములను కురిసి బిడ్డల బోషించుకొనుచు నున్న పచ్చి బాలెంతరాలు మా భరతమాత, మాతలకు మాత సకల సంపత్సమేత' అంటూ సాధ్వి, భక్తురాలు, గేస్తురాలు, బాలింతరాలు అని స్త్రీమూర్తి అందపు ఛాయలను గుచ్చెత్తే వరకూ ఆ పద్యాల్ని మరపించే పద్యము రాలేదు.

దేశముయొక్క ప్రస్తుత దీన దశను వర్ణించడము ద్వారా కరుణా, తద్వారా ధర్మామర్షమూ కలిగించడము దేశీయ కవిత్వానికి రెండో ఆయుధము. ఓలేటి నారాయణమూర్తిగారు దుర్గాదాసై 'విశ్వ విఖ్యాత సహా విశ్వేశ్వరుని గుడి కటకటా తల్లిలో గలసిపోయె' నని రంగస్థలముమీద అరుస్తుంటే ప్రేక్షకులలో కలకలము పుట్టేది రసపుత్ర విజయనాటక ప్రదర్శనాలలో. 'సూత్రయుగముల శుద్ధ వాసన క్షాత్రయుగముల చండ శౌర్యము చిత్రదాస్యముచే చరిత్రల చేరిపోయెర తమ్ముడా' అని వింటే గుండె గుబ గుబలాడుతుంది. 'అచ్చరలొచ్చి నచ్చిన గాయలాడుకుండే రాజ్యములో రయ్యో కొయ్యోడ, కిన్నరులొచ్చి కీర్తనపాడే కీర్తివంత రాజ్యమురో రయ్యో కొయ్యోడ' అని పాడితే వెర్రి గొల్లడు కూడ ఉద్రూత లూగుతాడు. దీనికి తోడు 'మూరుమంది మలబార్ వాసులాను, కూరినా డొక్క పెట్టెలోన, గాలి, దూరనీయుడు ఇంచుకైన, నోట, నీరు పోయుడు దేవువాన' అంటూ పరపాలకుల దౌర్జన్యాలను గిరిమొల్ల సత్యనారాయణవలె దండ గుచ్చితే ఈ ధర్మామర్షము అగ్నిపర్వత మవుతుంది.

చారిత్రిక క్షేత్రాలూ, పుణ్యక్షేత్రాలూ శిథిలమైనా యని చూపడము దేశము వన్నె తరిగి కృశించినదని చెప్పడమూ, అన్యాపదేశముగా 'దేశాన్ని నీవు పునర్నిర్మించవలెనోయి' అని చెప్పడమూ అవుతుంది. 'అది తటాకము కాదాంధ్ర కుమార అరివీర దుస్సాధ్యమైనట్టి పరిఖ, అద్ది కుంకుమముగా దాంధ్ర కుమార తెలుగు వెత్తుటి గడ్డ దెరలిన దుమ్ము' అని శేషాద్రి రమణకవులూ, 'కుక్కలు చింపు విస్తరిగ కూలిన యోర్గలు కోటకంటివే, ముక్కువ ఊపిరుండియును

మూతితీ మీసము గల్గు వాంధ్రుడా' అని వానమామలై వరదాచార్యులూ 'గడ్డి మొలిచెం బురి చారల గద్దెమీద' అని జాషువా, 'శిలలు ద్రవించి యేడ్చినవి జీర్ణము లైనవి తుంగభద్ర లోపల, గుడి గోపురమ్ములు సభాస్థలులైనవి కొండముచ్చు గుంపులకు' అని కొడాలి సుబ్బారావూ పలికినప్పుడు మనలో పుట్టే కలవరము కార్యదీక్షతోగాని సర్దుకోదు. పద్మనాభ యుద్ధమును స్మరిస్తూ 'భయద దాస్య విశృంఖలా బంధితుడవు, ఓయి! జీవచ్ఛవాంధ్రుడా ! ఒక్కమారు ఒంక నిమ్మట నింత కవోష్ణ బాష్ప మలినధార స్వాతంత్ర్య సంప్రాప్తి కొరకు' అన్న పురిపండావారి పలుకు అందుకు సాక్ష్యమే కదా ? .... చారిత్రిక క్షేత్రాలు ఒకప్పుడు ఉన్నతదశలో ఉండినవని కీర్తించడము ధ్వనిపూర్వకముగా ఈనాటి దుర్దశను నిర్దేశిస్తూ కంత పెట్టడమే అవుతుంది. దేవులపల్లి రామానుజరావు ఓరుగల్లును గురించి 'అల్లది స్వేచ్ఛకై వెల్లారి వెరజాణ పతియించె నిచటనే భారతంబు' అన్నప్పుడు తిక్కన మహాకవి సద్యత్నము మెఱుపు కొట్టుతుంది. కొండవీడులో 'గజపతి ప్రౌఢో గ్ర కరి ఘటాశుండా విధూతాంబు నిచయ బిందూత్కారము' ద్వారా విశ్వనాథవారు ఆ 'మోహంపు టురిత్రాడు దుర్గ' ప్రాచీన శోభను చూపిస్తున్నారు. 'వరదరాజమ్మ కంబముపొంత నిలిపిన మగని పేరిటి సుధామల సరస్సులో' జాషువాగారు విజయనగరపు రత్నాల విపణివీథిని ప్రతిఫలింపజేసినారు. ఈ పూర్వోన్నత్యానికి తోరుసు ఈనాటి దైన్యము. రెండూ రెండు చక్రములై దేశసేవా శకటమును నడపవలెనని రచయితల కోరిక.

ఈ సంరంభములో వచ్చింది విశ్వనాథవారి ఆంధ్ర ప్రశస్తి. ఆ రావడము సభలలో తుఫానులాగ క్షణక్షణావరోహణాలతో, కంఠ గాద్గదికతతో, ఉరుములతో, ఆవులతో, పరువులతో వచ్చింది. ప్రబోధమూ, సంగీతమూ, కవనమూ, వాచికాభినయమూ చేరి తెలుగువారికి ఒక వింత ఘోషగా వినబడింది ఆంధ్ర ప్రశస్తి. ఉత్సాహపూరితు లాంధ్రులు విని హర్షించారూ, అనుకరించారూ, ఆనందించారు. ఆనాటి తీవ్రవాదుల దేశభక్తి గేయాలూ, పద్యాలూ చేసిన అపాయకర వాచ్య ప్రబోధ వాతావరణంలో అరచాటుగా దేశభక్తిని ఉద్బోధించే ఈ ఖండకావ్యాలు యువకులకు ప్రచ్ఛన్నాయుధాలయాయి. అందరూ విన్నారూ, వినిపించారు.

ఈనాడు ఆ ఉద్వేగమూ సంరంభమూ లేవు. రచనలు సముద్ర తరంగాల్లాగ వచ్చాయీ ఉద్యమాలు ఝంఝూమారుతాల్లాగ వీచాయి. రచనాదర్శాలు బోనులో కెక్కాయీ సమర్థించినవారు సమర్థించారూ, విమర్శించినవారు విమర్శించారు. ఈనాటి తత్వంలో వెనక్కిచూసి పరీక్ష చేసుకోవలసి వస్తోంది మనం ఆంధ్ర ప్రశస్తిని. కాలాన్నిబట్టి ఆ కావ్యానికి వచ్చిన ప్రశస్తి జారిపోతుంది ఈనాటి సమీక్షలో. అయితే, అది తప్పనిసరి.

ఆంధ్ర ప్రశస్తిలో తెలుగునాటి చరిత్రలో కవికి నచ్చిన భావఘట్టాలను ఇతివృత్తముగా గ్రహించి రచించిన ఖండకావ్యాలు పన్నెండున్నాయి. 'ఆంధ్ర విష్ణువు' శ్రీకాకుళము రాజధానిగా ఏలుతూ సరదార్ల విజ్ఞప్తులు విని—శ్రీశైల ప్రాంతాటవిలో విధ్వంసము కలిగిస్తూ ఉండిన—నిశుంభుడనే రాక్షసుణ్ణి ఆంధ్రవిష్ణువనే రాజు చంపిన కథ. దీపకర్ణి మహారాజు వేటకు పోయి ఒక యక్షిణివల్ల శాతవాహన కుమారుణ్ణి పొందడము 'శాతవాహనుడు'. మాధవవర్మ మహారాజు తన కుమారుడు పేదరాలి కొడుకు దుర్మరణానికి కారణ మైనాడని ఎరిగి మరణదండన నామోదించుట 'మాధవవర్మ'. 'నన్నయభట్టు' భారతావతరణ దృశ్యము. 'ప్రోలరాజు కథ' కాకతి ప్రోలరాజును అతని కుమారుడే అయిన రుద్రుడు తెలియక పొడిచిన కథ. 'చంద్రవంక యుద్ధము', 'యమదంష్ట్రిక', పల్నాటి యుద్ధమూ, రాయచూరు ముట్టడీ నాటి కథలు. కొండవీటి పొగమబ్బులు, ముఖలింగము, వేగిక్షేత్రము అన్నవి కవి ఆయా క్షేత్రములను దర్శించినప్పుడు ఆయనకు కలిగిన భావాలు. కాబట్టి ఆంధ్ర ప్రశస్తిని కథాకావ్యాలూ, భావకావ్యాలూ అని రెండు భాగాలుగా చూసుకోవచ్చును మనము. కథాకావ్యాలు ఏదో కథను వినిపించేవి. ఇవి మొదలుపెట్టిన దగ్గరనుంచీ చివ్వరి వరకూ చదువరి అపేక్షను పోషిస్తూ లాగి చివ్వర, వాటి పరిణామ సౌందర్యమువల్ల సద్యః పరనిర్వృతిని కలిగించాలి. చివరిదాకా వినాలని ఆసక్తి కలిగిస్తూ చివ్వర విన్న ఫలాన్ని కలిగించని కథకు ప్రయోజన మేమిటి ? సత్యనారాయణగారి కథా కావ్యాలలో మాధవవర్మ మనలను పట్టి లాగుతుంది చివరి వరకూ. విజయవాటిక కోటవీథిలో రాజపుత్రుడు కొత్తగా కొన్న తురంగములు పూన్చిన రథముమీద వాహ్యాళి పోతాడని రాజభటులు ప్రజను వీథి పక్కలకు ఒత్తుతూన్నారు. నిమేష మంద మెఱుములుఱుములై వచ్చి రాసుతుని స్యందనము కదలి దాటిపోయినది. తచ్చక్ర ఘట్టితాంగుడయి నెత్తు రోడికలు గట్ట పడినాడు ఒకడు. అంతలో సూర్యుడు అస్తమించినాడూ అస్తగిరి గహ్వర స్థితాంధకారము కృష్ణ సర్పమువలె దిక్కులన్నిటినీ ఆక్రమించినది. మరునాడు పేదరాలు కొడుకు శవాన్ని తీసుకువచ్చి చూపి న్యాయమో,—జరిగిన అన్యాయానికి ఇంకా కలిపి—అన్యాయమో చెయ్యమని కోరి రాజు ధర్మాసనము ముందు పడి చచ్చిపోయింది. ప్రాడ్వివాకులను ధర్మ

నిర్ణయము చేయుమని కోరినాడు మాధవవర్మ. వారు ‘ప్రాణమున్కు ప్రాణముమ బదులు కోరుమనీ, ‘స్మృతికి భూమీ జాని సుతుడని కాదనీ లేదు’ అనీ అన్నారు. తీర్పు వినినంత నేపు ధాత్రీపతి మోము కనుతుదలనైనా కదలిక కలగలేదు. తీక్ష్ణ మార్తాండమూర్తి ఆకాశమధ్య సౌధాగ్రము చేరేడు. కృష్ణవేణి ఇంద్రకీలాద్రి ఒడ్డు తాకి మొరసినది. ధర్మాసనమున నున్నపు డెంత గంభీరుడో, దిగి అంత దుఃఖదళితుడైనాడు రాజు. నాటి దినసాంతమున యువరాజు మేనిరక్తము అసృగుదిత ప్రవాహమై పారింది. నటశివ నూపుర రవాను కారి చిటచిటచిట నినదోద్భట కనకము విజయవాడలో వర్షము కురిసినది. కథలోని పాత్రల భావములమూ, చదువరి భావములనూ రంగరించి కథలోని ప్రకృతి వర్ణనమువల్ల ధ్వనింపజేయడము సత్యనారాయణగారి ప్రత్యేక శక్తి. తీర్పును విని విజయవాడ ప్రజా పచివులూ మాత్రమే కాక తీక్ష్ణ మార్తాండమూర్తి ఒడ్డులొరసి ఎగసే కృష్ణవేణి కూడా ఉద్రిక్తులౌతారు. ప్రకృతి చైతన్యానికి తమ కథతో గల సానుభూతిని విశ్వనాథవారు పద్యకావ్యాల్లో కంటె ఏకవీర, వేయిపడగలు, వంటి గద్య కావ్యాలలో ఎక్కువ ఉపయోగించుకున్నారు. చివరకు వీరి చేయి సంస్కరించిన ‘వక్రరేఖ’ (ముదిమాణిక్యంవారి నవం)లో కూడా ఈ రకపు భావధ్వని స్రోత వినపడుతుంది పలుమార్లు. వచనములో రచయిత వాక్యాన్ని ఇష్టము వచ్చినట్లు వంచి నిశితము చేయగలడు. పద్య మనగానే గణాలూ, యతులూ, ప్రాసలూ తెచ్చే నిర్బంధాలూ సంప్రదాయాలు మోసుకొచ్చి మన ముందు పడవేసిన ఉత్ప్రేక్షలూ సమాసాలూ, దూరాన్వయాలూ, పాదపూరణావసరమూ, భాషా—, అన్వయ—, వ్యతిక్రమాలూ ప్రవేశించి కవిని చెప్ప గలిగినట్లుగా చెప్పవలసి వచ్చినట్లుగా చెప్పనివ్వవు. కవి వచన పద్ధతిగా ఉన్న రచనను పద్యశయ్యలో ఇమిడ్చి లాగితే ఛందస్సు సమకూర్చగల అందపుగతి చెక్కుకుపోయి పద్య సౌందర్యము నష్టమవుతుంది. సత్యనారాయణగారి అసంఖ్యాక పద్య రచనలలో ఈ చికాకులన్నీ కానవస్తాయి. ‘ప్రవహించినావు, నైశ్చల్యము, నైష్ఫల్యము, మురుమ్మరించు, పావిత్ర్యము, నైర్మల్యంచె, శీతలింపించె, ప్రతిఫలింపించె, తెండా, ఆంధ్యము, పట్టుబడలేనేలేదు, ఎరిగిలేను, ప్రహ్వీకరింపబడియె, చెల్లరేగు, (శోకాతి విషణ్ణులై) మనెదరు, మృగీమదము వంటి పదాలు వచన రచనలో వాడరు వారు. మరి పద్యాలతో ఎందుకు వచ్చాయన్నమాటా ? ‘కాషాయ రమ్యవల్కల హంతా శన క్రియా సంపిహితాశ్వత్థ సామిధేని’ అంటూ అలంకార సాధన కోసము అల్పపు పోలికనైనా సరే ఉపయోగించడమూ, ‘గంగాంభోజాలూ కృష్ణవేణీ ప్లవమ్ని రేజాలూ పెన్నానదీ సముత్పన్న కైరవాలూ కళింద తనయా వ్యాకోచ (!) నీలాంబుజాలూ సాగరమేఖలా చారు కుచద్వయీహారాయి ఆంధ్రావని చక్రవర్తీ’ అంటూ లేని పదార్థాల్ని చూచి వచ్చినట్టు వర్ణించడమూ కవిగారి అప్రాచీనాచారాభిమానాన్ని తెలుపుతాయి గాని తెలుగుకవి పట్టిన సౌందర్యహారతికి ఒక స్నేహబిందువునైనా చేర్చవు. సౌందర్యము వర్ణించడానికి కలము పట్టినవాడల్లా యక్ష తనయేందు జయంత వసంత కంతుల వరకూ వెళ్లిపోవచ్చును కల్పాంతముదాకా ! వెళ్లనూండడమేనా అని ! కుపిత శంకరనేత్ర కుహరాగ్ని దగ్ధ మన్మథ దేవునకును ప్రాణ ప్రతిష్ఠ యట ఋషికన్య. మన్మథుడు మగవాడు, ఈమె ఆడది, ప్రాణము స్త్రీయా ? నాకు తెలియదు. “సిద్ధ ఖేచర యక్షకాంతలా సొగసు ప్రాకార మార్గమనుసరించెదరు” ట ! ఎవరి కోసం మనుసరిస్తారూ ? వారికి ఆలయాలా మున్నా ? భూలోకానికి దిగకపోతే నాటినుంచీ నేటి వరకూ వారికి దిక్కేదీ ! కవుల ఆట సామగ్రితో అల్లిపెట్టిన దంతా కవిత్వమే ! గౌతమీపుత్ర శాతకర్ణి సైన్యములో “కంచు రథాలపై తెలుగువారన్నన్న యొక్కొక్కడే మావన్ గల్గను ముష్టిఘాతముల దిజ్మత్త ద్విపేంద్రములన్” ట ! ఈ రకపు గొప్పలే టప్పాలు కొట్టుకుంటూ ఎన్ని శతాబ్దాలు నడుపుకు వచ్చారు ప్రబంధ కవులు తెలుగు కవిత్వాన్ని ! చుట్టుచూపు వచ్చిన ఈనాడు కూడా, సమకాలిక నాగరిక జాతులకు చూపడానికి తెలుగు కవిసమ్రాట్టుల కవితా సామగ్రి యిదేనా ? కొండవీటి పొగ మబ్బులు ‘దగ్ధాంధ్రరాజ్య నిత్యవిధూత ధూమములు, ‘బురుజు కొమ్ముల వీడిపోలేని రెడ్లకీరితి’ యట, ‘దాగ్ధవదాంధ్ర స్వతంత్రతకారము’ యట. పోయే మబ్బులకు పోయే వాటన్నిటితోనూ పోలికే ? వస్తు సామరస్య మవసరములేదు ! సంస్కృత సమాసాలు భావాలు తక్కువై నీరసపు టాలోచనలు యొముకల్లాగ పొడుచుకు వస్తూంటే అవి తోచకుండా కప్పిన బొంతల వలె పనికివచ్చాయి తెలుగు కవులకు. ఆ సమాసాలను వాడుటే గొప్ప అని నేటి కవులు కూడా భావించడము తెలుగు సరస్వతి దురదృష్టము. ‘హిమక్షితిధర కన్యకా సౌందర్యధనుడు శ్రీశైలరాజు’ ఆంధ్రపతిచేత సేవింపబడ్డాడట నిశంభునిమీది దండయాత్ర సందర్భములో. ఆంధ్రరాజు శ్రీశైలస్వామిని సేవించడము చుట్టూ సమాసపు మొత్తలేలనో ? తెలుగులో వ్రాసిఉంటే కనబడును భావముయొక్క సత్తువ. “సముద్భవ నినాద బధిరి తాశావయంబులు పగిలిపో” వు నట్లుగా నిశంభునిపై పిట్టపిడుగు పడిందట. “సముద్భవ వినాదము” రణోద్భవ వివాదము కాదు ! సముద్భవము ! సంస్కృత రక్ష

లేరు ! ''దైత్యాధిపునకు'' 'దైతేయేంద్ర' 'దైత్యేంద్రుడు' అన్నమాట లున్నాయి. ఉన్నవా డొక్క దైత్యుడేనే ? వీడి ఆధిపత్యాన్ని నిరూపిస్తూ సాకిపోడానికేనా దైత్యు లితరులు లేరు ! 'పురరాజ్య లక్ష్మి' ట. పురరాజ్యము ! 'అమృత వాసనాలహరి' అవును. అసలే లేని నదీ నీరేజముల నుంచి వచ్చేది అమృతవాసనాలహరీ కల్లోలమే కదా ? 'అహిత మహావహిమ', వాక్కుల కోలాహలంలో అర్థము వినపడ నియ్యవు సమాసాలు.

విశ్వనాథవారి కథా కావ్యాలు 'మాధవవర్మ' పాటి లాగవు చదువరిని. కారణము వారి రచనా వైశిష్ట్యమూ స్వేచ్ఛానూ. తను ఊహలను పెరుచుకుంటూ ముందుకు వెళ్లిపోవడమే కాని అవి చదువరికి పట్టునా ? అని తామే చదువరులై ఆయన చూసుకోరేమో అనిపిస్తుంది నాకు. వా రుపయోగించే విభక్తులు ఒకదానికి బదులు ఇంకొకటి తయారవుతూంటాయి, వ్యూహాలు చప్పగా తేలిపోతాయీ పరుషంగా ఎబ్బెట్టుగా ఉంటూంటాయీ, కవిగారి వ్యాఖ్యానాన్ని పలుకుతాయి పాత్రలు. ''అసుపలు కాంధ్రవిష్ణుని ముఖాగత మయ్యెనొ లేదో దాని వించునె సరదార్లు దైత్యుడు నిశుంభుడు చచ్చెను జచ్చెనంచు లోనుకొనుటొండె జాగుగ ద దానవ దివ్య జయారవ ప్రతిధ్వనితమయ్యె నాంధ్ర సభాభవనంబు సాంద్రమై'' అన్నారు. సత్యనారాయణగారు ఈ కావ్యమును సభాముఖాన వినిపించినప్పుడు, 'నిశుంభుడు చచ్చెను చచ్చె నంచు' అన్న మాటలు మహాఝంకారంతో సరదార్లు పలికి నట్లే గట్టిగా పలుకుతారు. తీరా చూస్తే (కిరాత) సరదార్లు లోపమనుకున్నమాటలు అవి ! పైకి వచ్చినవి 'తదానవ దివ్య జయారవములు'. అనుకున్నవారు కొత్తవారైన కిరాత సరదార్లు అయి అన్నవారు రాజా తత్వము తెలిసిన శ్రీకాకుళపు సరదార్లు అవడము శోభ. 'సాతవాహనుడు' లో యక్షుడు దీపకర్ణితో ''నీ వలివాక్కి శక్తిమతి నిద్రితశయ్యను సర్పశిష్టయై ప్రాణములం త్యజించుట శుభ ప్రతిపాదక మయ్యె నేటికిన్'' అని మహా యెబ్బెట్టుగా పెండ్లి దివిటీ సామ్యముగా చెప్తాడు. ''శక్తి మతిపోయిన నాటనుండి నీకు, పాపము, ఆశాకిరణమే లేదు. ఇదుగో ఈనాటికీ బాలుడు'' అని యక్షునిచేత ననిపించే నేర్పు విశ్వనాథ వారికి లేదనను నేను, ఎవ్వరూ అనరు ! లేనిదల్లా లక్ష్యము. తాము అన్నది ఎటు లాగుతోందో రెండోసారి చూసుకో రనుకుంటాను. లేకుంటే, శక్తిమతి తొంగలి రెప్పలను ఆ బాలునికి అమర్చిన వారు యక్షునిచేత వామెను తగలేయిస్తారా ? దీపకర్ణి బాలునితో సన్నమాటలలో ''ఈ రాఘవుండు గడింపని పీ కీరితి, వంశకర్తగుట సామాన్యంబె లే రెండవయ్యున వంశ్యుల్ రఘు వంశమైన యది కాదా, ఆ మహారాజాపై'' నన్నవి కవిగారి వ్యాఖ్యానపు టాలోచనలు, దీపకర్ణి నోట పుత్రలాభ సమయంలో—ఉపాధ్యాయుని బోధనలు—ఇవి రాణించవు. 'గౌతమీపుత్రలో' 'అనుచు గుసగుసలాడి నా రాంధ్రభటులు' అని, 'కొంద అవి జయారావములందు మునిగె' నన్నారు. ఈ చప్పని ఊహ ఎందుకో ?

సత్యనారాయణగారికి కథాకావ్యాలు తీర్చడములో శ్రద్ధ ఎంతో, భావ కావ్యాలు తీర్చే శ్రద్ధా అంతే. అయితే కథలలో పేలవ వస్తువూ పేలవ సమాసాలూ దాటుకు పోతామూ మొత్తపు కథ వరిగించగల ఫలశ్రుతి అనుభవము నాటినట్లు ఎక్కువ నష్టము కాదు. భావాన్ని నిశ్రేణిగా అమర్చి చదువరికి కూడా ఆ భావాలు కలగడానికి చేసే భావ కావ్య రచనలో కవిగారి భావలహరి నిరంతరాయంగా భావౌన్నత్యాన్ని సాధిస్తూనే పోవాలి గాని పేలవపు టాలోచనలు ప్రవేశించరాదు. కథాకావ్యం కంటె భావ కావ్యం సాంద్రతరముగా ఉంటేనే దాని రచన సార్థకము అవుతుంది. లేకపోతే, ఏ ఘట్టములో రచన పలచనైతే అక్కడ కవి కనబడిపోతూ చదువరి తన్మయతకి విరుపులు ఏర్పడతాయి. 'మే: క్షేత్రము' లో 'ఏరాజా వంచెనో యిచట శౌర్యపు పాయసమ్ములు నాగుల చవితినాళ్ల' అన్నారు. నాగులచవితికి పాయసము వండే ఆచారము తెలుగునాట లేదు. మరి మన మెరుగని ఆచారపు భుజాలమీద నిలబడి పొందవలసిన భావ సౌందర్యాన్ని ఆచార నవ్యతను దాటేసి పొందగలగడము ఎలాగ సంభవించగలదూ? 'ఏ యెఱ్ఱి సంజలో నెలమి పల్లవ రాజ రమణులు కాళ్ల పారాణు లిడిరో' అన్నారు. ఏమీ ? పల్లవ రాజరమణులు ప్రతి దినమూ పారాణి పెట్టుకుంటూనే ఉండరూ ? యెఱ్ఱిసంజ శుభాశీర్వాదానికి ఒక యెఱ్ఱి సంజ ప్రత్యేకత ఏముంది— ఏ యెఱ్ఱిసంజ అవడానికి ? అయితే రాణులు ముత్తైదువల కాళ్లకు మాత్రము పర్వదినాల్లో పారాణి పెట్టి మొక్కుతారు. అప్పుడు ఎఱ్ఱసంజ 'ఆ పారాణి యెరుపు రాణులచేతా మదుటాకాలా చిరకాలము నిల్చుగాక' అంటే శోభ. 'ఏ యెఱ్ఱి సంజలో నెలమి పల్లవరాణి రమణుల కాళ్ల పారాణు లిడెనో' అనో అంతకంటె బాగానో తీర్చి ఉండవలసినదేమో ? నాలుగో పాదములో మూడు పాదాలలోనూ చూపిన కారణపు మిష ఏమీ సూచించకుండానే 'ఏ రెండు జాముల ఘమని వేడిమి వచ్చి కలిసిపోయెనో త్రిలింగ ప్రభువుల' అన్నారు. కవిగారు కలిపి పామ్మన్నారనా కలిసిపోయింది ? వీరి సీసపద్యాల పాదాలు

మూడు పడిచేసరికి నాలుగోది ఇంకోదారి తీస్తుందా అనిపిస్తుంది 'ముఖలింగమూ' 'వేగిక్షేత్రమూ' చదివితే.

కవియొక్క భావాలు కవిత్వము కావు. చదువరులకు కూడా ఆ భావాలు కలగడానికి చేసిన రచన కవిత్వము. సత్యనారాయణగారు ఛందో బందోబస్తును మించి 'రచించే' యత్నము ఒకపట్టాన ఎక్కువగా చెయ్యరేమో ననిపిస్తుంది నాకు. ఒక ఉదాహరణము చెప్తాను చిత్తగించండి. 'శృంగారవీథి' లో రాస "అస్మదురోజముల్ మృదుశ్రీ చరణాంకితంబులుగ (కృష్ణుడు) నృత్యముచేసె సకింకిణీధ్వనిన్" అన్నది. వజ్రము దొరికింది సత్యనారాయణగారికి ! కృష్ణుని పాదాలవలెనే వారి రచనాకన్య రాధాస్తన మండలీ శృంగార వీథిలో నృత్యము చేయబోయింది. అయితే యిక్కడి అందమంతా శ్రీకృష్ణుని నాట్యములో కాదు. ప్రభువు కాళియుని పడగలమీద కూడా కింకిణీధ్వనితో నృత్యము చేసినాడు. అందమంతా, స్వామి నృత్యముచేసిన సుందర రంగపు తెరవెనుక రాధ హృదయపు టానందములో ఉన్నది. అది శృంగార వీథిలో దారితప్పిన కవిగారికి అక్కడ స్ఫురించలే దంటాను. అయితే ఈ ఊహ పరిణతికి రాలేదన్న తపనలో పక్వమై పక్వమై చివరికి 'వేయి పడగలు' లో 'నీ చరణ యుగంబు నాదు చన్నుల మీద మోపి బాధ హరింపు హరింపు మాధవా' అన్న గిరిక ప్రార్థనగా పునీతమై వచ్చినది. రాణి లవ కులమును నిందించుకొన్న దన్నారు. సత్యనారాయణగారు ధన్యులు. ఆయన కూడా తన పౌరుషమును నిందించుకునే ఉంటారు. కృష్ణశిరసి మండనమైన ఉదార పదపల్లవమును మించిపోయి పరాంకోటినందిన రాధికాస్తనమండలాంకిత బాలకృష్ణ మృదుశ్రీ చరణ పల్లవములు ఆనంద కందములు అవేకూ కవికీ మనకూ కూడాను ! .... భావ కావ్యాలు క్లిష్టముగా ఉంటాయి కనక దిద్ది తీర్చి అతి జాగరూకతతో నడిపితేనే కాని అవి చదువరిని చివరిదాకా లాగవు. సత్యనారాయణగారిది ఉఱుములా మెఱుములా తత్వము. కావ్యాన్ని వెన్నెలలో నావ ప్రయాణంగా నడిపించడముకన్న జరాలున జలధాలరలతో కిన్నెరసానివలె—పల్లటీలు కొట్టించడము ఆయనకు ఎక్కువ ఇష్టము. అందువల్ల వెన్నెలరాత్రిని కంటె మెఱుముల రాత్రిని ఎక్కువ స్ఫురింపజేస్తాయి వారి రచనలు. మెఱుపుకూ మెఱుపుకూ నడిమి చీకటిని పోలిన ఊహలూ ఆలోచనలూ పాఠకుణ్ణి ఈడుస్తాయి కానీ లాగవు. ఆంధ్రవిష్ణువు వృషత్క శేఖరము హృదయమున నాటు నింతలోన నిశుంభ దైత్యాధిపునకు లోచనాంతములందు మార్తాండ నీలోత్పల బంధు కాంతులూ అస్పృశ్యదమైన వక్షస్థలమునందు చారు కౌస్తుభ మణిచ్ఛవులూ, గర్భగోళమున విశ్వవహన భారమూ, హృద్వీథిలో అఖిల వేదాంత విద్యాశ్రయ వైరాగ్య విస్ఫూర్తి కలిగినవట. విష్ణువైన ఆంధ్రవిష్ణుని బాణము స్పృశించి హృదయ ఛేదనము చేయు నింతలోన నిశుంభునికి సాలోక్య సామీప్యముల బాధ లేకుండా పూర్తి సారూప్యత కలిగిపోయినది. వాల్మీకాదులు విష్ణు శస్త్రహతులకు సారూప్యత చెప్పలేదు. విశ్వనాథవారు (వారి సొమ్మేం పోయిందీ ?) ఇచ్చేశారు. ఇది వారి నందరినీ దాటుకుపోయిన మెఱుగని స్తోత్ర పాఠకులు అనవచ్చును. ఇక విష్ణుదేవుని గతి చూడండి : లక్ష్మీకుచ కుంకుమారుణ కరమును అవతార వంశాంకురాల తర్పణాలకు వాడించారు విశ్వనాథవారు. యాక్కురారీ ! విశ్వనాథవారికి తర్పణ కర్మలంటే ఉన్న ప్రీతి ఆ ప్రభువున కున్నదో లేదో మరి ! ఇదొక కొత్త గుణము మెఱిసింది స్వామికి పిరి వేకప్ ధర్మమా అని ! 'చెలియలికట్ట' లో పశ్చాత్తప్తురాలైన రత్నావళి కూడా తద్దినాల కోసమే అర్థిస్తుంది. తమ అభిమానాలనూ అలవాట్లనూ తమ చేతబడిన పాత్రలకు ఆరోపించడము శ్లాఘనీయమైన గుణము కాదేమో ? 'ఆకూత లన్నన్న చంపవు చంపుమన్'' అన్నప్పటి 'అన్నన్న' 'కుమారాభ్యుదయము' లో (దేవతల ) అన్నన్న పురుగుల కన్న గనాకష్టమైతిమే యని దుఃఖ మందువారు' అనడములోనూ, ఆంధ్రప్రశస్తిలో 'అన్నన్న ఒక్కొక్కడే గుద్ది చంపు మత్తద్విపంబులన్' లోనూ వేరై కవిగారి అలవాటుగా కనబడిపోతుంది .... ఇలలోనూ కలలోనూ లేని ఊహలు వాటి దారిని అవి వెళ్లిపోతాయి గాని చదువరులను పలకరించవు. కోటలూ పేటలూ వంటి మానవ నిర్మాణాలకే పౌరాతన్యము మనం లెక్కవేసుకుంటున్నాము. సత్యనారాయణగారు వేగి క్షేత్రములోని గాలి పౌరాతన్యమును తలచుకొని నిర్విణ్ణులైనారు. సూర్యబింబమే సాంద్రవాయుగోళ మంటున్నారు వైజ్ఞానికులు ! అయితే గాలి పౌరాతన్యము ఆంధ్రప్రశస్తికి చాలా ముందుది. "ప్రాక్సముద్రమం దానిన నీరు పశ్చిమ మహాంబుధి ద్రావుము' అన్నారు శాతవాహనుణ్ణి. వాడు పాపము మేఘవాహనుడేనా అయినాడు కాడు, మేఘము సముద్రమునుంచి గ్రహించిన నీటిని త్రాగేవాడు ! ఇప్పుడు ప్రాక్సముద్రమూ పశ్చిమ మహాంబుధీ లభించాయి అతనికి నీరు త్రాగడానికి. కవి మనసులోని వూహ మాటల్లోకి రానక్కర లేదా ?' ఉజ్జ్వలతకు లెక్కపెట్టని ఆలోచనలూ ఆవేశము నిల్పని భావాలూ కవి కల్పించిన కొత్త సమయాలూ ప్రవేశిస్తే కవి స్ఫురణా రచనాగుణస్ఫురణా కల్పించవా పాఠకులకు ? (ఆంధ్ర విష్ణువులో నాలుగో పద్యమూ, శాతవాహనుడులో నాలుగో, పదో, పండ్రెండో పద్యాలూ, మాధవ వర్మలో పేదరాలి మొదటి పద్యములో రెండో సగమూ, ఆఖరిది కాని చివరి పద్యములో మొదటి పాదమూ, వేగి క్షేత్రములో ఎనిమిదో పద్యమూ చూడండి.) చిత్ర మేమిటంటే ఈయనకు శక్తివంతమైన రచన చెయ్యడమూ బాగా తెలును ! "పాడిన గీతమే మరల బాడెదం గూడిన భావమే మరి గూడెద నేమి సేయువాలె గుండియ శోషిలి దుఃఖ

వేదనల్ గాడిన నా హృదంతర ముఖంబున హా తొలినాటి కీర్తి వాపాడిన నాదు వాక్కు తెగబాఱెడు నూత్న పథాల వెంబడిన్'' అంటూ వినేవారి మనస్సును కళ్లెము లగిల్చి పట్టినట్లు పట్టగలరు. ''నా జాతి పూర్వప్రథా జీవదహితమై శక్తి నాడులయందు చచ్చిపోయె, నా మాతృభూమి తేజో మహాశ్చ్యుతిని బ్రహ్మక్షత్రతేజంబు మంటగలిసె, మాతృభాష నానా దుష్ట భాషల యౌద్ధత్యమును ఓల సహించి .... నా తల్లివేల వేనాటి వాచాలముల్ పై మెరుంగులు చూచి భ్రమసిపోయె, ఏమి మిగిలిన దీనాటి కిట్టు పొంగు తొలయు వర్షానదీ గభీరోదకముల దైన్య గర్భ చారిత్రముల్ దక్క భిన్నగిరి శిఖర దుర్గపరిదీనగీతి దక్క'' నని గుండె పిండగలరు. 'దగ్ధాంధ్రరాజ్య నిత్య విధూత ధూమమ్ముమలె గొండ బురుజుల కెలన లేచి' న కొండవీటి పొగమబ్బును చూపిస్తారు. 'గజపతి ప్రౌఢోగ్ర కరిఘటాశుండా విధూతాంబు నిచయ బిందూత్క' రాన్ని 'అలకనవపాత్రు నంటిరాజిన కృష్ణరాయ బాహోగ్ర జాగ్రన్మహాగ్నినీ స్మృతికి తెస్తారు. ''సాయం సమారంభ వేళాలోచిస్సుల మందవాయు వ్వుడు లీలా వీచికా శ్రేణులలో సౌరాష్ట్రేశ్వరు శేషదుర్గ శిఖరాంచన్మౌళి భాగంబుపై తారామార్గ మలంకరించిన త్రైలింగరాజ్య ధ్వజ స్ఫారోదంచిత లోహితచ్ఛటల'' ను కళ్లకు కట్టి చూపిస్తారు. శక్తి కావలసినంత, శ్రద్ధ మాత్ర మంతంత. అందుకే వారి రచనలలో శిఖరాల పక్కన లోయ లుంటాయి. చదువరికి ప్రయాస, పరీక్ష! కొడాలి సుబ్బారావుగారు విశ్వనాథ వారికి ఏకలవ్య శిష్యులు. విశ్వనాథ 'వేగి క్షేత్రము' వంటి ఖండ కావ్యాలవల్ల ప్రభావితులై 'హంపీ క్షేత్రము' రచించారు. వారి పద్యాలలో పెక్కులు ఎత్తుబడి, అన్వయక్రమములలో కూడా విశ్వనాథవారి పద్యాలను అనుసరించినవి కలవు. అయితే విశ్వనాథవారి దూరపు మాటలూ, వాక్యాల మడతలూ, విమార్గ గమనాలూ వీరు అనుకరించలేదు. కామరాజుగడ్డ శివయోగానందరావుగారితో చేరి వీరు కొన్ని తొలి రచనలు చేసినా హంపీ క్షేత్రముతోనే వీరి ప్రతిభాప్రకాశము జరిగింది. హంపిని దర్శించి, ఆ శిథిలాలలో కాళ్లు నొప్పులెత్తేవరకూ తిరిగి ఆ క్షేత్ర దుర్దశకు పనవి పనవి తమ కన్నీటికి గుండెలయను చేర్చి నైసర్గిక పథాలలో నడిపించారు తమ కావ్య కన్యకను. వీరి చూపులో 'ఒక కొండరాజు పేరోలగంబున గట్టు కొలిచియుండిన లాగు' కుదిరింది, శిలలు ద్రవించి యేడిచ్చినవి, నాడు మండిన మంటతో తిమ్మరుసు కచ్చేరి మసీదుగ మారింది, బాకుపోటున చిమ్మబడిన నెత్తురు జల్లు రాజవీథిని వెల్లవేసినది, 'లంజదిబ్బ' రాకాసి రేడంటరాని మంటను చూపినది, కొండకోనలు వాల్మీకి యమృతంపు వాన చినుకును శబ్దించినవి, కిన్నరాంగనా పాదముల 'పారాణి చిక్కన చెమటలో కరగి' చార పోసినది. హంపీక్షేత్ర రంగమున శతాబ్దాల గమనములో తెరలెత్తిన గాథలు ఈయన మనోరంగమున వరుసగా తెరలు దించుకొన్నవి. 'హంపీస్థానమ' లో శివ కంటుల బొబ్బటిలంగ జెబ్బుయల్ చాక నిల్చిపోయిన చోట బ్రహ్మ విద్యాఫల ప్రాప్తిప్రభలబిమ్మ విద్యారణ్య మాధవ స్వామి హక్కరాయలను ప్రతిష్ఠ జేసెనట. విద్యారణ్యులు' తెల్గు భువన ప్రళయంబున కడ్డుకట్ట వేసిన మహనీయునికి అంకితములైన పద్యాలు. 'కనకాభిషేకము' తలమీద గోష్పాద మంతైన జుట్టు లింగకాయ బొట్టు లేక మంత్రివేష మహోపహించిన శ్రీనాథ కవిరాజుకు ప్రౌఢరాయల మందిరమున జరిగిన ఉత్సవగాథ. సుబ్బారావుగారు కవిసార్వభౌమునికి ఉపరూపము నూహించినారు! కనుకనే శ్రీనాథుని నోట వీరి నోట వలెనే 'పూర్వాంధ్రరాజ్య సంపూర్ణ శౌర్యానల ప్రత్యక్ష పుణ్య ప్రభావములు, 'హిందూ మతోద్ధారణోందూదయ వికాస చారిత్రాధ్యాత్మ ప్రచారము' లూ వెలువడ్డవి. వాదములో ఓడిన డిండిమభట్టు ఢక్క పగిలించగా 'పలయంబులువై విరళీకృతంబులై కదలెను శబ్దముల్.' 'రాజ్య ప్రదానము' లో కృష్ణరాయలకు ఎదురుతిరిగిన నాగమనాయుని మీద అతని కొడుకు విశ్వనాథ నాయకుని విజయమును వినిచి, కవిగారు వాస్తవముగా రాజు విశ్వనాథనాయకునిపైన చూపిన అనురాగమును పొడిగించి నాగమ నాయకునికి కూడా పంచినారు. ప్రభుసేవను చెయ్యడములో విశ్వనాథుడు నొక్కిపెట్టినప్పటికీ, నరపాలుని సభలో కట్టు తెగి 'సలసల వేడి నెత్తురులు చారలు గట్టిన' కన్నీటి బొట్లు కవిగారిని ఈ లతిక్రమణానికి కూడా వెట్టినవని ఊహిస్తున్నాను. 'తళ్లికోట యుద్ధము' లో 'శంభుస్వామి వైరాగ్య దీక్షా పాట్యంబులు .... జేష్ఠసేవి సంచారముల్' మహదాంధ్రరాజ్య లయమూ వర్ణించబడినవి. తక్కిన నాలుగూ ఆవెగొండె కావ్య, పశ్చాత్తాపము, పాణిగ్రహణము, కృష్ణరాయలు, విజయనగరపు కథలు. కొడాలివారు కవిగా కాక ఆంధ్రుడుగా విచారించారు, తెలుగునాటి రాజకీయ పతనానికి. అయినా కావ్యము వ్రాయడములో నైసర్గిక విర్వేదాన్ని మించి చూసే యత్నము చేయలే దాయన. కనుకనే ముక్కు మూసుకొని చెట్టుల గుట్టుల బట్టి' 'ఇతడటయ్యా రెడ్ల కవిరాజు' 'వేదాలు తలక్రిందు వెలిగించినాడంట' 'రాజుకై కొడుకు పరాభవించిన తండ్రి' 'కాదందురా చేతకాని మాట' 'యువరాజు చావగానే తన కబ్బెనా పదవి?' 'అయ్య కొరకు పడిన శ్రమ' వంటి వ్యవహారపు జాతీయములు తరుచు వినబడతాయి ఈయన కథా కావ్యాలలో. భావ కావ్యాలలో సత్యనారాయణగారి వలెనే ఈయన, నదీ ప్రవాహము వలె భావాల్ని ప్రవహించనియ్యక పేటికి వాటిని విడదీసి యిస్తారు. అవి ఇంచుమించు చాటు పద్యముల ధోరణిలో నడిచినవి 'హంపీ క్షేత్రపు' తొలి భాగములో. భావావేశములో సాంద్రమైనవే అయినా ఖండకావ్యములుగా తీర్చక క్లోజప్పులు వలెనే వాటిని తీర్చివారు కవిగారు. కావ్యాల్లో కథాకూడా రసవంతముగా కథ సాగుతున్నప్పుడు దండవలె గుచ్చినా, రెండు రెండు తునకలను చేర్చడములో చుక్కలు ఉపయోగించారు. కనుక ఖండకావ్య రచనోద్యోగమునకు కాక కథనోద్యోగముకే సుబ్బారావుగారు ప్రాముకొని యుండిరనిపిస్తున్నది.

# జాతీయ రచనలు

తుమ్మల సీతారామమూర్తిగారి రాష్ట్రగానము 1938లో వచ్చింది. సత్యవాక్కులు శ్రీ చౌదరిగారు 'తెలుగులెంక' అన్న చిన్న పేరును స్వీకరించిన నిగర్వ మూర్తి. 'తెలుగుదేశము, తెలుగుభాష, తెలుగు చరిత్ర, తెలుగు ప్రజ, తెలుగు సంస్కృతి' అనినంతనే, వారికి ఒడలు పులకరించును. మరి రాష్ట్రగానమును గొంతువిచ్చి ఆయన వ్రాసినారంటే దాని శక్తి కేమి లోటు ?

'కుల తత్త్వములు చుట్టుకొని యార్ష్యంకు దింప నైకమత్యము సర్వ మారిపోయె', 'సరవిద్యలంటూక బాహాబల ప్రౌఢిగల బాలచంద్రుని గడియ తేరు' 'తన కళాలిప్స కద్దము వోలె రాణింప గల్పించె భువనైక శిల్పవీధి' 'కైవల్య కళ్యాణ ఘంటాపథము గన్న యోగి వేమన్న నీ యొడిని గులికె' నంటూ నిసర్గ సుందరమైన శైలితో సూటిగా చెపుతుంది వీరి కవితాకన్య. వీరు సంప్రదాయముచే ప్రాచీనులే యైనా స్వానుతాప వర్ణనమువల్ల నవీను లైనారు. సమకాలిక చర్య లను నిసర్గ సుందరమూ సూటియైన పలుకులతో వివరించినారూ, దేశీయుల వెన్ను చరిచినారూ ముందుకు నెట్టినారు. సెలయేరువలె పీనుల వింధై వేగవంతమై చల్లగనే ప్రవహించే వీరి రాష్ట్రగానము ప్రాతస్మరణీయము. దాని ప్రతి పద్యములోనూ వీరే. విశ్వరంగముపై నిలిచి చేతులు జోడించి "నీ రమణీయమూర్తి కమనీయ వచస్స్ఫురణంబు దాతృతాగౌరవ మద్వితీయ రసికత్వ విభూతి విశిష్ట శౌర్య విద్యా రుచిరత్వ మెంత కొనియాడిన మత్కవితా పిపాస చల్లారదదేమి తల్లి ! ఇది యారక మారక యుల్లె నిల్చుతన్" అంటున్నారు. "తథాస్తు" అని దీవించునుగాక తెలుగుతల్లికి తల్లి.

శ్రీనివాస సోదరుల ఓరుగల్లు కోట 1942 నాటిది. 'ఇన్నాళ్ళకును వాడని అష్టదళ పద్మము' వంటి శిల్పములూ, వేణుగోపాల ప్రతిమా, నందికేశ్వరుడూ, దేవాలయములూ, నర్తకీ ప్రతిమలూ గురించి పద్యాలు వ్రాశారు. ఒక నర్తకి 'ఒక్కటే మచ్చు నాట్యము నొలుక' బోసెనట. 'ఏమి చూచిన యానందమే యిదంత ?' అని యామె నడిగి ఆ శిథిల శిల్పపు కిటికీలోనుంచి నాటి సభా భవనాల చైతన్య శోభను ధ్వనిస్తున్నారు. ఓరుగంట ప్రతి శిలా శబ్దించే 'ఆంధ్ర నాగరకత విజయపు చరిత్ర చదివికొన జేతగాని' జడుని చూచి నవ్వుతున్నారు. క్రీడాభిరామమునాటి కోలాహలము కవుల దృష్టి ముందూ (వారి లేఖినీ నర్తనముతో మన ముందూ) సాక్షాత్కరిస్తోంది ఓరుగల్లు కోటలో. ఈ చైతన్యమంతా 'నిజం బా ! నిద్రబోవుచునుంటినో ... మేలుకొని యుంటినా!' అని అనుమానించి 'నాదు మిత్రులెల్ల నన్ను వంచించి యెటు వోయినారో, యిపుడు !' అన్న తన్మయభావము వల్లనే తన్మయత్వాన్ని స్ఫురింపజేస్తున్నారు. 'తెలివిగలిగి కనులు తెరచి చూచెడులోన, స్వర్గలోకము తెరచాటు కేగె.' 'ఇంద్రావనథము వందనారావ మెదుట గన్పట్టినపుడు' వీరి మది యైరావతంబు కొరకు' తడవినదట. ప్రతాపేంద్రుడు ప్రాతస్స్నానము సేయు కాసారము తన చిత్త కమలమును నేడు ముచ్చ ముడిగించుకొని మూగదైనదట. గణపతిదేవుడే స్వయముగా కదలివాగా, 'భేరికా భాంకృతి సెలంగి పృథివి రజము గగనమును గప్పి, అడవులు నగరులై, ఉద్ధత క్రుద్ధకాల సర్పోత్కరమువు బుసలు కొట్టెనట 'విక్రమ సింహపురీ యుగడ్డ !' బంబర రసికావతంసములు ! మాటలు నేం ? ధ్వని ప్రధాను లౌదురు గద ! .... తరి తోడన గ్రోలుడు తెల్గు వెల్గునన్.

దేశీయ కవిత్వానికి మణిమకుటము నిన్న వచ్చిన 'తుది విజయంమనది నిజం.' కాళోజీ గుండెలో పేరుకున్న జనతాభిమానము 'గొడవ' నుండి రణభేరిగా మారినది. 'కన్య కుమారీ కన్నులు రుద్రాక్షలు—ఎందులకని ? ఉత్తరదిశలో ఉఱుములు—ధనుష్కోటి టంకారము—ఏమిటి కథ?—వాయవ్యములో అరుపులు. మీనాక్షి రక్తాక్షిగ మారినదే, ఎందుకు ? అహోబిలో ఆర్తి. కామాక్షి కన్నులలో క్రోధాగ్నులు—కారణ మేమిటి ?—ఉదయాద్రిలో అవమానము. చాముండీ రణచండిక హుంకరించె—లేపాక్షి బసవయ్య లేచి కాల్ద్రువ్వుచుండె—నందీశ్వరు గంగడోలు నిండ రక్తము చారలు!' 'ఇల పుట్టిన నాటినుండి ఇలవేల్పుగ నిల్చి మనల ఇరుగుపొరుగు దుండగాల కొరగాకుండగ కాచిన హిమతంతుని కాపదయట, పదపదపద ఆదుకొనగ. ఆంధ్రావళి అండదండ అస్సామునకు లందింపగ, నయ్యర్లకు తోడ్తోడుగ నాయర్లను నిలిపివుంచ, బదరీనాథుని రక్షకు మధురను కంచిని కదుపగ, కాశ్మీరమునకు జంటగ కన్యకుమారిని నిలుపగ, బిహారీల రణభేరిగ మహారాష్ట్రము హుంకరింప, గురుగోవిందుని గర్జన ఘూర్జరు లను కదలింపగ, కర్ణాటక చాముండియె కలకత్తా కాళి కాగ, కైలాసము పిలుపును విని కాకతి చిందులు త్రొక్కగ, ఏడు కొండ లెలుగెత్తుచు, హిమవంతుని పురికొల్పగ, శ్రీనగరము చేయూతకు శ్రీరంగము ఎగిరి దుముక, శ్రీశైలము గంతు లిడుచు శిత నగము నాదుకొనగ, కలము కుంచె కదలింపుము.' 'సరిహద్దును కాపాడే జైసేనా జైహింద్, అద్దాకును కాపాడే లచ్చన్నా జయ్‌హింద్, ఈశాన్యము రక్షించే ఎంకన్నా జయ్‌హింద్, ప్రాణాలకు లెక్కించని పంజాబీ జైయ్‌హింద్, అరచేతిలో తల ఉన్న అస్సామీ జయ్‌హింద్, సాదోబా జయ్‌హింద్, మదోజీ జైహింద్, మల్హారా జైహింద్.' 'చిరుతిండ్లను మానుకొన్న చిట్టి చేతుల చిల్లర, రేసుకోర్సు మానుకున్న లక్షాధికారి బ్యాంకునోటు, పేకాటలు మానుకున్న చీకటన్న పాతరలు' బిచ్చగాడు దులుపుకొన్న లచ్చిపెరాణిపైన, మంత్రాంగం చేతి పాదుపు మహిమతో మిగిలిన కోట్లు, నీ కెంతో ఉత్సాహం' ప్రోత్సాహం కానున్నది కనగలిగిన కాళోజీ 'ముందంజ వేయవలసిన సమయాన ఇజాలు అడ్డుపడతాయా తమ్ముడూ' అంటూ, ఈ యశ్రుఝరులతో ఇరులతో రొదలతో సొదలతో వినముతో సిగ్గుతో బ్రదికే జనాన్ని 'హిమవంతుని కాపదయట పదపద పద' మంటున్నాడు. పదండి ముందుకు, పదండి తోసుకు, పదండి, పదండి పైపైకి.

# పాత కథ

## శ్రీ వాకాటి పాండురంగరావ్

ఒంటిగంటయినట్లుంది—అని చాపమీద పక్కకు పొర్లింది పార్వతి. చేతిగా జొక్కటి వుటుక్కు మన్నది. ఆ గాజు ముక్కల్ని ఏరి పక్కకు పెట్టింది. ఒంటిగంటయిన ట్లుంది—అని పార్వతి అనుకుంది కదూ, అంతమాత్రంచేత సరిగ్గా ఆవేళకు ఏదో పెద్దపనుందని అనుకోనక్కర్లేదు. ఒంటి గంటంటే, ఆఫీసులో వాళ్లాయనకు టిఫినువేళయిందని గుర్తుకు రావడమన్నమాట. ఈ గుర్తుకు రావడం అన్నది చాల గొడవయిన అంశం. గుర్తుకొచ్చే విషయాలు సముద్రపు ఒడ్డున అలల్లా వస్తాయి; చైనా సైనికుల్లా నిరంతరంగా వస్తాయి .... ఒంటిగంటంటే ఆయనకు టిఫినువేళ .... కాని తను ఇవాళ ఆయనకేమీ టిఫిన్ చేసివ్వలేదు. ఎందుచేత ? ఏదయినా చెయ్యడానికి పిండి లేదు గనుక, నూనె లేదు గనుకా. పోనీ పచ్చడీ అన్నమయినా పెట్టుకెళ్లమంది తను. 'అబ్బే, వద్దులే, ఏదో కేంటీన్‌లో తింటాలే—' అన్నా రాయన .... కేంటీన్ అనేసరికి ఓ రెండువేం యుగాలకు ముందొక సాయంకాలం ఆయన మల్లెపూల పొట్లంతోబాటు తెచ్చిన జాంగిరీల పొట్లం, గుర్తుకొస్తుంది .... పొర్లి పడు కుంది పార్వతి. పడుకోలేక లేచింది. కూచుంది. మళ్లీ పడుకుంది.

"ఒంటిగంటయిందోయ్ సూర్యం !" అన్నాడు సీ—త్రీ ......" "నాకు పనుందోయ్, నువ్వెళ్ళు ...." అన్నాడు సూర్యం అనబడే సీ—టూ. సీ టూ—అంటే కూచునే స్థలం మాత్రం కాదు. కన్‌స్ట్రక్షన్ సెక్షన్—క్లర్క్—నెంబర్ టూ అని అర్థం. అయినా గుమాస్తాలకి పేర్లెందుకు—నెంబర్లు చాలు! ఒంటిగంటయిందని సీత్రీ చెప్పక్కర్లేదు సూర్యానికి. అతడి కడుపే చెప్పింది. కాని ఏం చెయ్యడం ? జేబులో ఉన్న మూడు నయాపైసలతో హోటలు కెడితే కాఫీకప్పు వాస నయినా చూడనివ్వరే .... ! ఈ భూప్రపంచమ్మీద తన స్థిర చరాస్తులన్నీ కలిపి రొఖ్ఖరూపేణా మూడు నయాపైసలని తెలిస్తే నలుగురిలో తను చులకనయిపోడూ—మరి ఇదంతా ఒక పెద్ద నాటకమాయె, అందులో తన దొక వేషమాయె, పాత్రోచితంగా అభినయించకపోతే అభిమానం అవే ఆ రసం రసాభాసయిపోదూ ? అందుచేత సీ త్రీ చెప్పినా, ఆకలి చెప్పినా, అవతలి గదిలో కొందరు కమ్మటి టిఫిన్లు తింటున్నా—సూర్యం కుర్చీకే అతుక్కుని కూర్చున్నాడు. పైపెచ్చు తన ముందర టేబిలుమీద ఒక పెద్ద కాగితాన్ని పరుచుకుని కూచున్నాడు. దాన్నిండా గళ్ళూ, అంకెలూ ఉన్నాయి. వైకుంఠ ఏకాదశినాడు ఆడతారే పరమపదసోపాన పటము—దానిలా ఉంది ఆ కాగితం. అదొక సాంవత్సరిక స్టేటుమెంటన్నమాట. ఆ ఆఫీసులో ఆ స్టేటుమెంటుని లెంచన్‌గా తయారుచేయ గలవాడు సూర్యం ఒక్కడే. ఆ గర్వం—సూర్యం కూడా—పడ తాడు—కాని వెంటనే అనుకుంటాడు— ఛ.... ఇవేవిటి, ఇంత కన్న పెద్ద కార్యాలు సాధించవలసిన వాడిని, కేవలం అజ్ఞాత వాసంలో ఉన్న కారణపురుషుడిని, ఎప్పుడో రాబోయే దేని కోసమో పుట్టినవాడిని, నే నెక్కడ—ఈ స్టేట్‌మెం టెక్కడ, నే నెక్కడ ఈ బోడి ఆఫీ సెక్కడ—అని అనుకుంటాడు సూర్యం. అనుకుని ఆ స్టేట్‌మెంట్‌లో అక్కడో పదం ఇక్కడో అంకె వేస్తాడు. ఇప్పటికి తన చేతిమీదుగా వెళుతున్నది ఇది ఆరో స్టేటుమెంటు. ఈ స్టేటుమెంటుల్లో ఒక చిత్రముంది. ఇవి కావాలని ఎవరు ఎందుకు అడుగుతారో సూర్యానికి అర్థ మవదు. అందులో తాను వేసేదల్లా లబద్ధాల అంకెలు. ఇలాటివన్నీ ఏ ఢిల్లీలోనో ఒక పెద్దాఫీసులో చేరతాయి—పూర్వజన్మ కర్మలన్నీ చేరినట్లు, అప్పుమీద అప్పు చేరినట్లు... కాని ఈ అంకెలమీదనే దేశం ఆధారపడి ఉంది మరి. ఏ పార్ల మెంటులోనో ఒకాయన ఆవలిస్తూ అడుగుతాడు— "ఫలానా సంవత్సరంలో మొత్తం ఎన్ని కేసులు పట్టుకున్నారు. ఎన్ని వదిలేశారు ?" ఆవళంగా గౌరవనీయులైన మంత్రి ఓ పెద్ద బృహత్ స్టేట్‌మెంటు నుండి ఇట్టే లపలపమని లంకెలు చదివేస్తారు. ఆ అంకెల్ని గొప్ప రిపోర్టర్లు నవ్వుకుంటూ రాసుకుని గొప్పగొప్ప పత్రికలకి పంపిస్తారు. గొప్ప గొప్ప పత్రి కల సంపాదకులు నవ్వుకుంటూ పెద్ద పెద్ద శీర్షికలతో అచ్చు వేయిస్తారు. ఎందు చూచినా ఈ అంకెలే ఈ శీర్షికలే కని పించేసరికి పత్రికలు చదివే కుటుంబరావూ, అప్పారావు వాటిని వేదవాక్యాలని నమ్ముతారు. దరిమిలా మన దేశం ఇన్ని కిల్లీ మీటర్లు ముందుకొచ్చింది, ఇన్ని మిలిమీటర్లు పైకి లేచింది, అని స్వాతంత్ర్య గణితంలోకి పోతారు. కాని ఆ అంకెల తమాషా అంతా వాటి వెనక ఉన్న సూర్యానికి తెలుసు. అతడు కూడా నవ్వుకుంటాడు పత్రికా సంపాదకుడిలా ....

# బొప్పుడి శిథిలశాసనమందలి పాకనాటి బల్లరాజు కాలము

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

సత్కవి నన్నిచోడుని కాల నిర్ణయచర్చలో బొప్పుడి శాసన చోడవంశము నెవ్వరు ఇంతవరకు ప్రమాణ ముగా స్వీకరించినట్లు కనబడలేదు. ఆ పాకనాటి— కమ్మనాటి శిథిలచోడ వంశ చరిత్ర నిప్పుడు పరిశీ లింతము.

తప్పులతో కూడుకొన్న సంస్కృతమూలము నంతను ప్రకటించుటకంటె ముఖ్య ప్రమాణ చరి త్రను మాత్రమే ఉల్లేఖించి, ఉన్నంతలో బల్లేరాజుల వంశవృక్షములు చూపుట మేలు.

19—10—1157 తేదీ చంద్రగ్రహణ కాల ములో 'నన్నిచోడ (సు) ధి' శ్రీ కేశవస్వామికి సూదనిపాటి గ్రామములో పది 'ఖండుక'ల (పుట్ల) భూమిని దానమిచ్చుట కమ్మనాటి బొప్పుడి శాసనచరిత్ర తెల్పు చున్నది. శాసనదాత నన్నిచోడ సుధికి కన్నరచోడదేవుడు, శ్రీ చోడదేవుడు అను తమ్ములున్నను, వీరి తండ్రిపేరు శిథిలచోడ వంశములో చెడిపోయినందున స్పష్టముగా తెలియుటలేదు.

గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాలోని బొప్పుడి శాసన చోడవంశమునకును, చెన్నుపల్లి శాసనచోడవంశమునకును మధ్య వ్యక్తిభేదము లేదను పక్షములో నన్నిచోడుల తండ్రి 'త్రిభువనమల్లి దేవ చోడుడు' కాబోలన వీలున్నది.

అట్లు రెండు చోడవంశములకు భేదము లేదను నెడల మొదటి భార్య మాచ (ల) మకు నన్నిచోడ— కన్నరచోడదేవులు (ఇద్దరు) కుమారులు కలుగగా, రెండవ భార్య త్రిభువనదేవికి శ్రీచోడదేవుడు ఒక్కడు మాత్రమే కలిగినట్లు చెప్ప వీలున్నది.

కావ్యావతారికలోని కావ్యకర్త వంశ చరిత్రను బొప్పుడిశాసనమందలి శిథిల చోడవంశ చరిత్రతో పోల్చిచూచినప్పుడు 'చోడబల్లి—బల్లభూవల్లభుడు' భిన్న పురుషులు కారన వీలున్నది. నామైకదేశే నామ గ్రహణము తప్పుకాదు.

'........అజాయత తతో రాజా సత్యపరాక్రమః త్యాగి పోత స్తత స్త [స్య] .....బల్లో బభూవతుః. బల్ల భూవల్లభ శ్శూర స్తయోర్ద్ధర్మ్మ పరాయణః మహీం ...సాహస్రపాక [నాడు] మపాలయత్....కామచోడ.... కరికాల.......విజయాదిత్య పిడువత్యా ఖ్యాతః.....' (S. I. I. Vol. VI. P. 241–243)

'అన పోతనకు ఇద్దరు బల్లరాజులు పుట్టిరి. వారిద్దరిలో ధర్మపరాయణుడును, శూరుడును అగు (చోడ) బల్లరాజు (ఏకవింశతి) సహస్ర పాక నాటి భూమిని పరిపాలించెను........'

ఇక్కడనుండి శిథిలచోడవంశ మారంభమగు చున్నది. అయినను, బల్లభూవల్లభుని తమ్ముడగు బల్ల భూవల్లభుడు కూడ అన్నవలె శూరుడై కమ్మ రాష్ట్రము పాలించిన ట్లూహింప వీలున్నది.

బొప్పుడి శాసనములో శిథిలమైన కమ్మనాటి బల్లచోడుని వంశ చరిత్రను విడిచిపెట్టి శిథిలము కాని పాకనాటి (చోడ) బల్లభూవల్లభుని వంశ చరి త్రను పరిశీలింతము.

సత్కావి నన్నిచోడరాజు తన తండ్రి 'పాకనా డిరువదియొక్క వేయిటి కధీశుఁడు నాజను చోడబల్లి' అని కావ్యావతారికలో చెప్పినట్లే శాసనదాత తన ముత్తాత 'పాకనా డిరువదియొక్కవేయిభూమి నేలిన (చోడ) బల్ల భూవల్లభు'డని దానశాసనములో చెప్పి వాడనుట నిర్వివాదము. ఇతని కుమారుడైన నన్నిచోడరాజు పేరు శిథిల భాగములో చెప్పెనో లేదో తెలియదు. శిథిలమైనది.

తెలియకపోయినను, క్రీ. శ. 1145—6. తేదీ నెల్లూరుజిల్లా దర్శి తాలూకా మన్నేపల్లి శాసన చోడవంశమును బొప్పుడి శాసన శిథిల చోడవంశము క్రింద చేర్చినచో అప్పుడు 'బల్లరాజు తనూజుఁడు (పొత్తపి) నన్నిచోడు'ని కందుకూరు పాకనాటి (విషయ) చరిత్ర గోచరించును.

**నన్నూరుపాడు శిల**

- (౧) కం(టు) వెంకరాజు
  - (1) చాగి వెంకన
  - (2) బల్లెరాజు
  - నన్నిచోడుడు
  - సూరపరాజు
  - రాజమహేంద్ర పోతపిచోడుడు క్రీ. శ. 1907 శాసనకర

**బొప్పుడి, మన్నేపల్లి శిలలు** — **పెద్ద చెరుకూరు శిల**

దశవర్మ (పొత్తపిపాకనాడు)

- (పా? (వె)ంక(న)
  - త్యాగి పోతన
    - బల్ల(రాజు) పాకనాడు
      - పొత్తపి నన్నిచోడుడు
      - వెంక(న)
      - కామనాయకుడు
      - బల్లిచోడుడు క్రీ. శ.1145–66 శాసనకర్త
    - బల్ల(య)
      - కామచోడుడు
      - కరికాలుడు
      - విజయాదిత్యుడు
      - పిడువత్యాఖ్యాత
      - వన్నిచోడ (ను)ధి క్రీ. శ 1157 శాసనకర్త
    - చోడబల్లి
      - నన్నిచోడుడు
      - సూరపరాజు
        - రాజరాజ మహిపతి
        - ఘటంకారుడు
          - మల్లిదేవుడు
          - నన్నిచోడుడు
          - మల్లిదేవుడు శాసనకర

పెద్ద చెరుకూరు శాసనములో పునర్భావ కాలము లేదను మిషతో కాకతీయ గణపతి దీర్ఘ రాజ్య కాలమ్ము నాధారము చేసికొని 'చోడబల్లి తనూజుఁడు నన్నిచోడ' సత్కావికాలము క్రీ. శ.1160–70 ప్రాంతమనగా క్రీ. శ.12 శతాబ్దమని హేమాహేమీలు నిర్ణయించుట సరికాదు.

బహుశా క్రీ. శ.1157 తేది కమ్మనాటి 'వన్నిచోడ—మధి' వే తండ్రిపేరు శిథిలమైవందువ చోడబల్లి కుమారుడై యుండవచ్చుననుకొని, ఆ కాలమును పెద్ద చెరుకూరు చోడవంశములో చొప్పించి సరిపెట్టినారు. కాబోలమటకు పై శాసన చోడవంశ సమకాలములు తోడ్పడుచున్నవి.

# బొప్పుడి శిథిల శాసనమందలి పాకనాటి బల్లరాజు కాలము

## కందుకూరు చోడవంశ వృక్షము

దశవర్మ
|
వెంకన
|
త్యాగిపోతన
|
(చోడ) బల్లరాజు
పాకవాడు
(కందుకూరు)
|
నన్నిచోడడు

మూరసరాజు

రాజమహేంద్రచోడడు
క్రీ. శ. 1097

(ట్య)
దావ రాజధాని

ఘటం కారుడు
|
మల్లిదేవుడు
నన్నిచోడడు
|
మల్లిదేవుడు
కందుకూరి పురవరేశ్వరుడు

వెంకన
|
కామనాయకుడు
|
చోడవల్లి
క్రీ. శ.
1145

బల్లరాజు
(కమ్మనాడు)
|
కామచోడడు
|
కరికాలుడు
|
విజయాదిత్యుడు
|
పిడవత్త్యాఖ్యాత
[త్రిభువనమల్ల
దేవుడు]
|
నన్నిచోడ సుధి
కాణో (ట్య) దావ రాజధాని
క్రీ. శ. 1157

అన్ని శాసనములలోని 'బల్ల, బల్లె, చోడబల్లి' పేర్లు మారుపేర్లు కావని స్పష్టమగుచున్నది. అట్లే 'పొత్తపి నన్నిచోడు' నన్నిచోడు' పేర్లును, 'రాజమహేంద్రపొత్తపిచోడు, రాజరాజ మహీపతిః' పేర్లును మారుపేర్లు కావు.

నన్నూరుపాడు శాసన చోడవంశములో మూల పురుషు లిద్దరు 'వెంక' రాజులగుటచేత శిల్పి చెక్కునప్పుడు తప్పుగా మొదటి '(కంట్ర వంక్య) వెంక రాజు' స్థానము మూడవ స్థానమునకు మార్చి చెక్కినట్లు బొప్పుడి శాసనమందలి 'చాగి (వెంకన)—త్యాగి (పోతన)' బిరుదనామము దృఢపరచు చున్నది.

బొప్పుడి శాసనములో 'తస్య పుత్రో భూ [త్వాంకః] శంకరకింకరః....శ్రీమాన్ సర్వ్వాముర్వ్వీ మహీపలతు' ...... అనుటనుబట్టి అతను శంకర కింకరుడైన 'వేంక' రాజనుట కాక్షేపము లేదు. పగ సాధించువాడగుటచేత అతనిని 'కంటు వెంకరాజు' అన్నట్లే, 'చాగి—త్యాగి' యగుటచేత మరియొకనిని చాగి వెంకన లేక 'త్యాగిపోతన' అన్నట్లు వాడుకపేర్లు చెప్పుచున్నవి. కాబట్టి, నన్నూరుపాడు శాసనములో చోడవంశము తారుమారైనట్లు గుర్తించి క్రమముగా కూర్చుట మార్పుకాదు. సాదృశ్య చరిత్ర.

..........................................పాకనాం
డిరువదియొక్క వేయిటి క
ధీశుఁడు నాఁజను చోడబల్లికిం
........శ్రీసతికిన్ తనూజు (డు)
..........సత్కవి నన్నిచోడుఁడట.'

కావ్యావతారిక చరిత్రతో శాసన చరిత్ర చక్కగా సరిపోవుచున్నది. తల్లిపేరు లేదు.




శాసనచోడవంశ చరిత్రలో కావ్యావతారికలో చెప్పినట్లు కవి తల్లి 'శ్రీసతి' పేరు లేకపోయినను (కందుకూరు) 'పాకనాటి భూమి' నేలిన తండ్రి 'బల్ల భూవల్లభుడు—చోడబల్లి' పేరున్నట్లు శిథిల శాసన చోడ వంశ చరిత్ర వాచ్యముగా చెప్పుచున్నది. పరిశోధకులందరీ కందుకూరు—దర్శి పాకనాటి శాసన చరిత్రను గుర్తింపకపోవడము శోచనీయము. కావ్య వ్యంగ్య చరిత్రలో చోడకవి శ్లేషగా 'కనిగిరి పతి' ఉదయ్యాద్రి ప్రభు (శృంగము—ప్రభుత్వము) రాజ్యము సూచించినాడనుట దర్శి శాసనచోడ వంశవిదర్శనము. కందుకూరు—పాకనాంటి విషయ (ము) లోనివే అవి. స్కంధపురి ప్రబంధము కుమార సంభవకథ కాబోలును!

క్రీ. శ.1145—66 తేదీ (౮) మన్నేపల్లి శాసన చోడవంశములో కవిరాజశిఖామణి తేంకణాదిత్యుని పేరు చెప్పకపోయినను, ఆ కవి 'పొత్తపి నన్నిచోడు'నే తద్వంశ మూల పురుషుడుగా పేర్కొన్నట్లు స్పష్టమగుచున్నది. అతని తండ్రి 'పాకనాటి నేలిన (బల్లి) బల్ల' చోడరాజని క్రీ. శ. 1157 తేదీ బొప్పుడి శాసన శిథిల చోడ వంశ చరిత్ర సూచించుచున్నది. కాబట్టి క్రీ. శ. 1097 తేదీ నన్నూరుపాడు శాసన కర్త పొత్తపిచోడుని తాత, (కవి) పొత్తపి నన్నిచోడుడు క్రీ. శ. 11 శతాబ్దికి చెందిన వాడగునే కాని క్రీ. శ. 12 శతాబ్దికి చెందిన వాడెంతమాత్రము కాడు.

భాషా తత్త్వవేత్తలు "ఇంతవరకును చేసిన చర్చ చేత తేలిన సారాంశము—నన్నెచోడుఁడు

(1) శాసనాధారములచేత దొరకఁడు. శాసనములచే విధిలేక గ్రహించినను నన్నయకు పూర్వుఁడు కాఁడు. అనంతరుఁడు;

(2) షష్ఠ్యంత రచనచేత తిక్కన కేతనల కనంతరుఁడు. అనుట........."

—శ్రీ వేదం నన్నెచోడుని కవిత్వము.

ఇప్పుడీ నాలుగు శాసనములచే విధిలేక గ్రహించినఁ (పొత్తపి నన్నిచోడుడుఁ నన్నయకుఁ) పూర్వుడు కాక పోయినను 'అనంతరుఁడు' మాత్రము కాడు. సాక్షాత్తు సమకాలికుడు. సందేహము లేదు. నన్నయ—మల్లయ కవులకు నడిమివాడు. నన్నయ—కేతయ్యలకు నడిమి వాడు కాడు.

గ్రంథాంతరంగికమైన గర్భకవి ప్రతిజ్ఞా పాలన కాలమును బట్టి చూచిన క్రీ. శ. 1045—70 తేది పురుషాంతరకాలములో క్రీ. శ. 1054 తేదీ 'రగడ' కాలమునాటికి కుమార సంభవ రచన తుద ముట్టి నట్లేర్పడుచున్నది.

క్రీ. శ. 1157 తేదీ బొప్పుడి శాసన శిథిల చోడవంశమందు 'ఇరువదియొక్క వేయిటి నేలిన బల్ల భూవల్లభుడు' చిక్కినాడు కాబట్టి, కుమార సంభవ విమర్శకులు (భాషా తత్త్వవేత్తలు) ఇక 'పెద్ద చెరుకూరి శాసనమున' 'బాఁకనాఁడిరువదియొక్క వేయిటి కధీశ్వరుఁడు'.చోడబల్లి దొరికినాఁడందురే. అది యెట్లు?—అని శాసన చరిత్ర వాక్రుచ్చుటకు వీలెంతమాత్రము లేదు. ఉన్న నాలుగు శాసన చోడ వంశములు సమకాలిక చరిత్రను సమన్వయము చేయుచున్నవని మరచిపోరాదు. కాగా కల్పిత భాషా చరిత్ర చెల్లదు.

# రెండవ అమ్మరాజ విజయాదిత్యుని సిరియూరు (కడలి) తామ్రశాసనము

**శ్రీ మునునూరి సాంబశివరామమూర్తి**

రాజోలు తాలూకా, కడలి గ్రామ కాపురస్థులు పంచాయితీ బోర్డు ప్రెసిడెంటుగారున్ను అయిన శ్రీ కాశీభట్ల సూర్యనారాయణమూర్తిగారు తమ నివేశన స్థలమందుగల పాటిమట్టిలో నిలువులోతున దొరకిన యీ తామ్ర శాసనమును తూర్పు గోదావరి జిల్లా పరిషత్ సెకండ్రీ సెక్షన్ తెలుగు పండితులు శ్రీ చెఱుకుమిల్లి సీతా రామచంద్రమూర్తిగారి ద్వారా నాకు 1964 అక్టోబరు మాసమున యిచ్చియున్నారు. అయితే యీ శాసనములోని అన్ని ఱేకులును అదివరలోనే(మహాద్రావక సంపర్కమున గాబోలు) శైథిల్యావస్థను బొంది అక్షర స్వరూప నిర్ణయమున కాటంకము గలుగుటచేతను, అదివరలో నాచేతనున్న "వరణ ఏన్డి" తామ్ర శాసనమును ముందుగా ప్రకటింపవలసిన బాధ్యత యున్నందునను ఆ సమయమందే (సుగర్ ఫ్యాక్టరీలోని) నా యుద్యోగ ధర్మమును నిర్వహింపవలసిన వాడనగుట చేతను ఈ శాసనము ప్రకటనమున నాలసించినందులకు మన్నింతురుగాక యను మనవితో పై వారిరువురకును నా కృతజ్ఞతాభివందనముల దెల్పుకొనుచున్నాను.

## శాసనస్వరూపము

అయిదు ఱాగి ఱేకులు గల శాసనము. అందు మొదటి ఱేకు మొదటి ప్రక్కను అయిదవ ఱేకు రెండు ప్రక్కలను ఎట్టి శాసనాకరములుగాని, గుఱ్ఱుతులుగాని లేవు. మిగిలిన ఏడు ప్రక్కలలోను గల మొదటి ఆరింటను ఒక్కొక్క ప్రక్కకు 8 పంక్తుల వంతున 6 × 8 = 48 పంక్తులును ఏడవ ప్రక్క 7 పంక్తులును మొత్తము 48 + 7 = 55 పంక్తుల శాసనము. ఈ అయిదు ఱేకులును రాజముద్రికగల కడియముచే బంధింపబడియుండి తాళపత్ర గ్రంథమువలె పుటల త్రిప్పి చదువుకొనుట కనువుగా నున్నవి. ప్రతి ఱేకును 23 × 9.3 సెం. మీ కొలత గలిగియుండి ఎడమ ప్రక్కను 3.5 to 5.5 సెం. మీ. మధ్య రంధ్రము గలిగి రాజముద్రికగల కడియమును పైకి క్రిందికిని త్రిప్ప వీలు కలిగించుచున్నది. ప్రతి ఱేకునకు చుట్టు నూలువాసి జవ 2 నూళ్ల ఎత్తు గలిగి శాసనాక్షరముల భద్రపఱచుచున్నది. కడియము వెలుపల 11 సెం. మీ. లో 9 సెం.మీ వ్యాసము గలిగియున్నది. ఆ ఱేకులు మొత్తము 1300 గ్రాములు, కడియము రాజముద్రికతో సహా 1,000 గ్రా. ను మొత్తము 2,300 గ్రాములు బరువు. కడియము రాజముద్రిక మాత్రము పోతపోయబడిన మిశ్రమ లోహము.

## రాజముద్రిక

కడియమునంటియున్న 2 సెం. మీ. ఎత్తు గల కర్ణికాగ్రముపై. 7 సెం. మీ. వ్యాసముగల రాజముద్రిక. అందు మధ్య భాగమున అడ్డుగ "శ్రీ త్రిభువనాంకుశ" అను అక్షర శ్రేణియు, పై భాగమున కుడి మొగమైయున్న వరాహ రాజమును, దాని కెదురుగా నెలవంకయు, వెనుకవైపు అంకుశమును, ఆ అక్షర శ్రేణికి దిగువను అష్ట దళాంచిత పద్మమును, చుట్టును నూలువాసి జవయు ఉబ్బెత్తుగా పోత పోయబడినవి. కర్ణిక దిగువ భాగమున కడియము నతికియున్నచోట 2 నూళ్లవాసి

(జవ) కడియమును; దాని క్రింద కడియము పైకి నాలుగు వైపుల నాలుగు పెద్ద దళములు, పర స్థలముల నాలుగు చిన్న దళములు మొత్తము ఎనిమిది దళములు అధోముఖముగా నున్నవి.

## శా స న లి పి

శాసనాక్షరములు చాళుక్య కాలపు (సంధి కాలపు) వేంగీ లిపియే. అందుచే పూర్తిగ "వరణ ఏన్డీ" తామ్రశాసన లిపినే బోలియున్నది. అక్షరములు వరుస, గుండ్రకత్తి, లోతు సమానమే. పూర్వపు శాసనాక్షరమైన "ఱ" యను యక్షరము గూడ యున్నది. గుణిత ప్రకటితము వ్రాయవలెనన్న ఈ యొక్క శాసనమందలి 55 పంక్తులను విశదీకరించి ఆ యా గుణ్తులు వాడుక విధాన భేదములు వివరించుటకు వంద పంక్తులు దాటియుండుటచే విస్తర భీతికి జంకి వదలియుంటిని. ఆ గుణిత ప్రకరణమును వివిధ కాలములందలి శాసనము లనేక ముఖమున పరిశీలించి వేరుగా వ్రాయుటకు బూనుకొంటిని.

## లే ఖ నా దో ష ము లు

ఈ శాసనమందును ("వరణ ఏన్డీ" తామ్ర శాసన మందువలెనే) లేఖాచార్యుని పేరు లేదు. సర్వ సాధారణముగా ప్రతి శాసనమందును, ఆజ్ఞప్తి, నిర్మిత, లేఖకుల నామములుల్లేఖితము గావలయును. వాటికి ప్రత్యేకాధికారులు ప్రతి రాజు కాలమునను గలరు. అట్టివి లోపించినచో ఆ కాలమందలి రాజ్యవిద్వరముల బాగుగా పరిశీలింపవలసిన యవసరము పూర్తిగా నున్నది. అంతేగాక ఈ శాసనము పరిశుభ్రత కొఱకు పరహస్తగతమగుటచే వారి ప్రభావమున మొదలుకే మోసము దెచ్చినది. రాగితేకులు తాటాకు లగుటయేగాక రంధ్రములుగూడ బడియున్నవి. అందువలన గొన్నిచోట్ల అక్షరముల బోల్చుటకైనను వీలుగా కున్నది. 1 తేకు 2 వైపున ఒక రంధ్రము పలు తావుల గుంట్లును గలవు. 2—1 పూర్తిగా అరిగి అక్షరపు లోతు పూర్తిగా తగ్గెను. రెండు రంధ్రములు ముఖ్యమైన తావున రంధ్రములైనవి. 2—2 ముఖ్యమైనచోట రెండు రంధ్రములును పలు తావులు పూర్తిగా శిథిల మవుటచే 1,2,3,4,5 పంక్తులు అక్షరముల గుర్తించుట చాల కష్టమగుచున్నది. 3.1. చాలవరకు సగము వరకు ప్రతి పంక్తి యందున మధ్యమున పూర్తిగా శిథిలమై యొక్క యక్షరమైనను గుర్తించుటకు లేనేలేదు. అందువలన దాన గృహీత వంశ వర్ణనయు వారి ప్రతిభయు పూర్తిగా దెబ్బతిన్నవి. దానస్థల నిర్ణయమును విషయము లేకనాడు పూర్తిగా బోయినది. 3, 2 న గూడ రెండు రంధ్రములు గలవు. ఈ కారణములచే లేఖన దోషములు గుర్తించుట కష్టమైనను నిల్చియున్న ప్రదేశ మందలి అక్షర లేఖన దోషముల వివరించెద. వర్గయుక్కులకు బదులు సరళముల వాడెను. ఉ. "అవభృథ" అనుటకు అవభృత్త అనియు; క్రాముడు విడుచుట ఇన్ద్ర=ఇన్ద; "రకార సంయుక్తము విడచుట: ఉ. తన్నిజ్జి'త్య—తన్నిర్జిత్య; అక్షరముల మార్పు: ఉ. నృపః=నృమః; దుష్టాంభోద=దుష్టాంభోజ; విద్విగ్భూపతి=విద్విగ్భూమితి; స్వాదాంగ్గ = స్వాగాంగ్గ; భూభృచ్ఛృంగ్గ= భూభృచ్ఛింగ; నమస్క్రియాం=నమస్కృయాం; వేదాంర్త్ధ=వేదాత్మ్ధ, క్రిమిః=కృమిః; అక్షరముల పెంపుదల: ఉ. గన్ధరగన్ధ=గన్ధర గన్ధర; అక్షర విలోపము: ఉ. ఏకాకినం హని ఏకాకినహని : ఆజ్ఞప్తి కటరాజస్య = ఆజ్ఞప్తిః కటకరాజస్య. తుడుపులు, సవరణలు : ఉ. 4—1—4 "అస్యో" వ్రాసి దానిపైన "సీమా" అని వ్రాసెను. 4—2—4 "పాపాదపేత" అని వ్రాయుటలో "పాపా" పిదప "పే" వ్రాసి తిరిగి సవరించుటలో కుడివైపునగల పూర్ధ్వ రేఖను అక్షరముపైగల "ఏ" ను చెక్కివేసెను. 1—2—5 'భ్రాతా' వ్రాసిన పిదప "వి" వ్రాసి దానిని "కు" గా మార్చుటకై అక్షర శిరోభాగమందలి "ఇ" కారపు గుఱుతును చెక్కివేయ ప్రయత్నించెను. 2—2—3 "విద్విగ్భూపతి" యనుచోట "మి" వ్రాసి దానిపైననే "ప" వ్రాసెను. అందువల్ల ఆ తావున గల యక్షరము స్థిరము గావింప గష్టము.

## శా స న భా ష

పూర్తిగా సంస్కృతము. గద్య పద్యాత్మకము. దానము చేయబడిన గ్రామము, పరిహద్దులు మాత్రమే తెలుగు. ఇది మనోహరమైన కావ్య రూపముగ వర్ణింపబడినది. [ఇందు గద్య, చూర్ణికలు, ఆర్యా, శార్దూల, రథోద్ధత, అనుష్టుభ, శాలినీ, వసంత తిలకాది

వృత్తములేగాక చతుష్షష్టి మాత్రాత్మకమైన ఆర్యా వృత్తములు నుపయోగింపబడినవి. ఉపజాతి వృత్తమును వాడెను.

## శాసన విషయములు

(i) 1—2—1 మొదలు 1—2—4 వరకును గల 4 పంక్తులు చాళుక్య వంశ ప్రశస్తి. (1965 ఏప్రియల్ నెలలో భారతి 31 పేజీలో ప్రచురించిన) "వరణ్ ఏన్డి" తామ్ర శాసనమందలి 1—6 పంక్తుల కేమాత్రమును భేదములేదు.

(ii) 1—2—4 మొదలు 3—1—5 వరకునుగల 10 పంక్తులున్ను చాళుక్య వంశానుక్రమణిక. ఇందు వర్ణనలుగాని శ్లోకములుగాని లేవు. సులభ గ్రాహ్యమైన గద్య. ఇందు ప్రతి రాజునకును అంతకు ముందేలిన రాజుతో గల పితా—పుత్ర సంబంధము పూర్తిగా దెలుపబడెను.

సత్యాశ్రయవల్లభేన్ద్రుని సోదరుడైన కుబ్జ విష్ణువర్ధనుడు పదునెనిమిదేండ్లు వేంగీ మణ్డలమును పాలించెను. ఆతని కుమారుడు ముప్పదిమూడు వత్సరములు; ఆతని తమ్ముడు ఇన్ద్ర రాజు ఏడు దినములు, ఆతని కుమారుడు (రెండవ) విష్ణువర్ధనుడు తొమ్మిదేండ్లును; అతని పుత్రుడు మంగి యువరాజిరువదియైదు సంవత్సరములు; అతని కుమారుడు (రెండవ) జయసింహుడు పదమూడేండ్లును; అతని సవతి తమ్ముడు కొక్కిలి ఆఱు మాసములు; ఆతని పెద్దన్న గారైన (మూడవ) విష్ణువర్ధనుడు ఆతని తఱిమివేసి ముప్పదియేడేండ్లు; అతని కుమారుడు విజయాదిత్య భట్టారకుడు పదునెనిమిదేండ్లు; ఆతని నిజ పుత్రుడు (నాలుగవ) విష్ణువర్ధనుడు ముప్పదియారేండ్లును, వాని కుమారుడు (రెండవ విజయాదిత్యుడు) నరేంద్ర మృగరాజు నలుబది యెనిమిది సంవత్సరములును; ఆతని పుత్రుడు కలి విష్ణువర్ధనుడు సంవత్సరమున్నరయు; ఆతని కుమారుడు గుణాంక నల్ల విజయాదిత్యుడు నలువది నాలుగు వత్సరములు; ఆతని తమ్ముడైన (యువరాజ) విక్రమాదిత్య పుత్రుడైన చాలుక్య భీముడు ముప్పదేండ్లును; వాని కుమారుడు (కొల్లభిగండ) విజయాదిత్యుడు ఆఱు మాసములును; ఆతని పుత్రుడు అమ్మరాజ (విష్ణువర్ధనుడు) ఏడేండ్లును; ఆతని కుమారుడు బేట విజయాదిత్యుడు ఒక పక్షము రోజులును; ఆపిదప తాడప రాజొక మాసమును; వానిని జయించి చాలుక్య భీమ తనయుడైన రెండవ విక్రమాదిత్యుడు ఒక్క సంవత్సరమును వేంగీ దేశమును పాలించిరి. అంతలో సామంతులు, శబర నాయకులు, దణ్డనాయకులు మొదలైన వారెల్లరును ఈ రాజ్యము మాది మాది యని కలహించి యల్ల కల్లోలము గావించిరి. ఏడేండ్లు రాజరికముగావించిరి. ఆ సమయమున పట్టాభిషిక్తుడైన యుద్ధమల్లు నవమానించి అంతకుముందే (కొల్లభిగండ భాస్కర, నాలుగవ) విజయాదిత్యుని కుమారుడును, (అమ్మరాజ విష్ణువర్ధనుని సవతి తమ్ముడు) అగు (రెండవ చాలుక్య) భీమ (విష్ణువర్ధనుడు) రాజు ఆ సామన్తాదుల రాజ విప్లవమునుండి "పదునెనిమిది" సంవత్సరములు రాజ్యమును కాపాడెను. శాలివాహన శకాబ్దము 867 సం. పుష్య కృష్ణ త్రయోదశి అనూరాధా నక్షత్రమున శుక్రవారమునందు ఆచంద్రార్కముగా అమ్మరాజునకు (రెండవ అమ్మరాజు) ఆఱవ విజయాదిత్యుడు) పట్టము గట్టబడెను.

(iii) దాత గుణ గణ వర్ణన— 2—2—1 మొదలు 3—1—3 వరకు, 11 పంక్తులు. గద్య, పద్యాత్మకము—"లతాంగి నీకాంక్షయేవ" యనుటచే అనుకూలనాయక సంగమకాంక్షతో నాయకుని కలియునట్లు విద్యాభ్యాస కాలమందే (రాజ్య) లక్ష్మి స్వయముగా అర్హరీతుల నభిషిక్తుడై పట్టము గట్టబడిన "రాజమహేంద్రుని" పొందెను. ఛేదింపబడిన మత్త గజ కుంభ స్థలములనుండి జాఱెడి మంచిముత్యముల సరములతో నలంకరింపబడినట్టియు, శత్రు రాజుల రక్తంపు టెఱుపు జాయ గల మైపూతతో నిండియున్నట్టియు, శత్రువులచే దిగన్తముల వఱకును (ధైర్య, శౌర్య, సాహసోపేత గుణ గణ కీర్తనీయమై) యింపైన కీర్తిచే నిండిన మంచి (నిండు) మనసుగల జయలక్ష్మి యుద్ధ రంగమందు "గండర గండుని" కుల స్త్రీవలె స్వీకరించెను. దాయాదులనెడి చిదుగులకు దావాగ్ని జిహ్వలవంటివాడు, చోరులకు నిలయమై ప్రవేశింపరాని తావుల మొత్తమునకు వాడియైన అంపపు కోతవంటివాడును, దోషులైన విద్రోహులకు

ప్రచండ మార్తాండునివంటివాడు, పర్వత శిఖరాగ్రము లందలి గుహలయందు దాగియున్న కాఱు మబ్బులకు ప్రళయకాలమందలి ఝుంఝూనిలము వంటివాడును ఏ **"రాజమహేన్ద్ర భూతలపతి"** యొక్క కోప మధికముగా విజృంభించునో అట్టి యతడు సమస్త శత్రురాజుల శిరముల నెలకొన్న (నవ) రత్న సంచ యము, తుమ్మెదల గుంపు పద్మముల జేరునట్లు దాకుచున్న పాద పద్మ యుగళము కలవాడును, అందర (శత్రు రాజుల) నేత్రద్వయమును తుమ్మెద జంటలు పద్మముల జేరునటుల తమ విలోకనముల నా కమల చరణముల జేర్చువారగుచున్నారో అట్టి సమస్త భువ నాశ్రయ శ్రీ విజయాదిత్య (మహారాజాధిరాజ రాజ మహేన్ద్ర పరమ) భట్టారక పరబ్రహ్మణ్యుడు మాతా పితృ పాదాను ధ్యాతుడై (పాగుణార విషయ వాసులైన) రాష్ట్రకూట ప్రముఖ కుటుంబములవారి (గ్రామాధి కారులను) అందరను బిలిపించి యిట్లాజ్ఞాపించెను.

(iv) <u>ప్రతి గృహీత వంశోన్నతి-గుణ గణ వర్ణన:</u> 3—1—3 మొదలు 4—1—1 వరకును 15 పంక్తులు. పద్యాత్మకము............ సత్యమును పలుకువాడును, బ్రాహ్మణ వంశమం దుత్తముడను పేరు గాంచిన వాడును......... ... ...వేద విదులలో గొప్పవాడును, ... ... ... ... ...లోకములో చక్ర పాణి యను పేరున పేరు కెక్కిన వాడును, భట్ట శాస్త్రము (ఉత్తర మీమాంస యందలి జ్ఞానకాం డను) పూర్తిగా దెలిసినవాడును........వాదించువాడును శ్రీ చక్రపాణి భట్టుడను పేరు గలవాడును, (పూర్వ) మీమాంసా శాస్త్రమును తెలిసినవాడును, ఋగ్వే దియు,..... ఆశ్రయము గలవాడు. ఆతని భార్య భవానీదేవివలె శుభ్రపదురాలైన దోనమాంబ. . . . . సత్యమునే పలుకునది. వారి పుత్రుడు దారియభట్టు అను పేరుగలవాడు. దీనులగు బ్రాహ్మణులకు కల్ప వృక్షమువంటివాడును, వేద వేదాంగ శాస్త్ర విదుల యందు సత్యధనుడను కీర్తిచే ప్రసిద్ధి కెక్కిన వాడును, బ్రహ్మతో సమానుడు, అర్థ శాస్త్ర నైపు ణ్యమునందు శుక్రునివంటివాడును, నీతి నిపుణుడును, శంఖము, మల్లిక, చంద్రులవంటి నిర్మలమైన కీర్తి గలవాడును, ఎప్పుడు అనేక గుణములచే శుభ్రపదు డగు భగవంతుడైన, శ్రీ మహా విష్ణువునకు శ్రేష్ఠు డును, బ్రహ్మను మించినవాడును, ఇతరులైన పెద్దలకు మనసార నమస్కరించువాడును, సమస్త రాక్షసులను జయించిన ఇంద్రునివద్దనున్న దేవగురుని బృహ స్పతివలె నీ రాజమహేంద్ర వద్ద మంత్రిశ్రేష్ఠు డును, అయిన దారియభట్టశర్మ. వేదార్థమును తెలిసి వేదకర్మలాచరించువాడును, భూదేవులయందు బ్రహ్మ వలె సమంత్రకమైన స్మార్త కర్మల నెరవేర్చువాడును, ఆపస్తంబ సూత్రానుసారమైన నిర్దిష్ట కర్మల నెర వేర్చువాడునైన దారియభట్టు కొరకు ఉత్తరాయణ పుణ్యకాలమున "సిరియూరు" [illegible] గ్రామ మును [illegible] పరిహారము [illegible] అగ్రహారము జేసి నాచే నీయబడినదని తెలుపుడు జేయబడినది.

(V) <u>దానస్థలనిర్ణయము:</u>—4—1—1 మొదలు 4—3—3 వఱకు 3 పంక్తులు (పావునార విషయ మందలి **"సిరియూరు"** గ్రామమునకు) తూర్పున విప్పత్తి; దక్షిణమున దేవ; పడమర మో౦లత్తి; ఉత్తరమున **నొడలి** సరిహద్దులు.

## ఫ ల శ్రు తి

4—1—4 మొదలు 4—2—6 వఱకు 11 పంక్తులు. గద్య పద్యాత్మకము. వ్యాసాది శ్లోక ములచే సర్వ శాసన సామాన్య శ్లోకములే.

## శా స న క ర్త

కటకరాజు. 4—2—6, 4—9—7 పంక్తులలో.

## శా స న వి శే ష ము లు

(i) చాళుక్య వంశానుక్రమణికలో పూర్వ పర రాజుల పరస్పర సంబంధములు (పితా—పుత్ర; అనుజ, ద్వైమాతురాదులు) పూర్తిగా దెలియబఱచుట. (ii) ఈతని కాలమునుండియు క్రీ. శ. 927—928 లో వేంగిదేశమును పరిపాలించిన చాలుక్య <u>మూడవ భీమ విష్ణువర్ధనుని</u> (ఎనిమిది మాసములు రాజ్యపాలన) లోపింప జేయుట. (ఈతని రాజ్య పాలనను చారిత్రకు లును, J. A.H. R. S. Vol. 16. P.131—136 లోని 8 పంక్తియు స్పష్టముగా నంగీకరించియున్నవి.

# సిరియూరు (కడలి) తామ్రశాసనము

అంతేగాక J. A. H. R. S. Vol XXIV. 1956—58. P. 149—152 లోను, 1965 ఏప్రియల్ భారతి 24—38 లో ప్రచురింపబడిన ఈతని సంపూర్ణ శాసనము లభించియున్నది.) (iii) ఈ శాసనమందు ఆజ్ఞప్తి పేరే గలదుగాని, నిర్మాత ఈతని కాలమందున్న పోతనభట్టు, మాధవభట్టు, లేక యితరుడో పేర్కొనబడలేదు. అంతేగాక లేఖా చార్యుడు ఈతని కాలమందున్న జొంటాచార్యుడో మఱియొకడో తెలుపబడలేదు. (iV) ఈ శాసనమందు చాళుక్యవంశానుక్రమమందు యుద్ధమల్లుని ఏడు సంవత్సరముల పట్టాభిషేక కాలమును మాత్రము దెలుపుచు, ఆతనిని నామమాత్రావశిష్టునిగ జేసి ఆఏడు సంవత్సరముల కాలమును తరువాత ఆ యుద్ధమల్లుని పాఱద్రోలి రాజ్యమాక్రమించిన (రెండవ) చాళుక్య భీమ విష్ణువర్ధని రాజ్యకాలము 10 సంవత్సరములతో గలిపి (1+7+10=18) 18 సంవత్సరములును రెండవ చాలుక్య భీమ విష్ణువర్ధనుని రాజ్య కాలముగా పరిగణించుట. ఈవిధాన మింతవరకే శాసనములుగాని, చారిత్రకులుగాని యనుసరించుట గోచరించదు. (V) ఏ రాజైనను తన పట్టాభిషేక కాల మొకే శాసనమందు తెలుపబడినట్లు గాన్పించును. అయితే ఈ రెండవ అమ్మరాజ **విజయాదిత్యుడు** తన పట్టాభిషేక కాలమును పడకలూరు శాసనమున 867 మార్గశీర్ష బహుళ త్రయోదశి శుక్రవారము కుంభ లగ్నమున బట్టము గట్టుకొన్నట్లు చెప్పియున్నాడు.

"గిరిరస వసుసంఖ్యాబ్దే। శక సమయే మార్గశీర్షే స్మిన్
కృష్ణత్రయోదశిదినే భృగువారేమైత్రినక్షత్రేధనుషిరవౌ
ఘటలగ్నే ద్వాదశ వర్షేతు జన్మనః పట్టం.........."
(లేఖతః జొంటాచార్యః నిర్మాత మాధవభట్టః)

అని యుండగా తిరిగి రెండవసారి యీ సిరియూరు శాసనమున తన పట్టాభిషేక కాలము దెలిపియుండుట.

"ముని రసవసు శాకాబ్దే। పౌష్యేకృష్ణే
త్రయోదశి మైత్రక్షేఽ
తత్సూను భృఽగువారే। పట్టమదా దమ్మనృపతే
రాచన్ద్రార్కఽం."

(Vi) అందును ఈపట్టాభిషేకదినము ఈరెండు శాసనములందును 867...... కృష్ణ త్రయోదశి, భృగు వారము సరిపడి యుండగా పడకలూరు శాసనమున "మార్గశీర్షేస్మిన్" అని మాధవభట్టు వ్రాసియుండగా ఈ శాసన నిర్మాత "పౌష్యే" అని వ్రాసి యుండుట. (Vii) సాధారణముగా శాసన నిర్మాతలు (భట్టులు) ఒక రాజు కాలమున ఒక్కడే యుండవలసి యుండగా నట్లుగాక మాఱియుండుటచే నీ రెండు శాసనములకు మధ్య అనంతమైన కాలమున్నట్లుగోచరించును. "చాంద్రమానంతు ద్వివిధం క్షయవృద్ధి, వృద్ధి క్షయం" అను నార్యోక్తిచే మార్గశిరబహుళము పౌష బహుళ మని తోచును.

## పట్టాభిషేకము

(Viii) 2—1—1 "పట్టమదాదమ్మనృపతే రాచన్ద్రార్కం"అనియు, 2—2—1—2—2—2 పంక్తులలో వాణీ వధూసంగమ యోగ్యకాలే। లక్ష్మీ స్వయం రాజమహేన్ద్ర మాప్తా। యుక్తాభిషిక్తా కృత పట్టబన్ధా। లతాంగినీ సంగమ కాంక్షయేవ" అను శ్లోకమును బరిశీలింపగా ఈ అమ్మరాజ విజయాదిత్యునకు (ఇతరులచే) బట్టము గట్టబడినట్లును "విద్యాభ్యాస కాలమందే అనుకూల నాయక నాయకుని సంగమింపగోరి స్వయముగావచ్చి చేరినటుల అర్హరీతుల నభిషేకింపబడి పట్టము గట్టబడిన రాజమహేంద్రుని (రాజ్య) లక్ష్మి స్వయముగా పొందెను" అని ధ్రువపడుచున్నది. చరిత్రయు నట్లే ఋజువు పఱచును. ఈతని పండ్రెండవ సంవత్సర ప్రాంతమున నీతని తండ్రియగు రెండవ చాళుక్య భీమ విష్ణువర్ధనుడు మరణించెను. ఆతని కాలమున దాయాదు లందలి శత్రువైన రెండవ యుద్ధమల్లుని పాఱద్రోలి వేంగి మండల మాక్రమించి యాతడు రాజ్యమేలెను. అట్టితఱి దాయాదియైన రెండవ యుద్ధమల్లుడు శత్రువై పరాజయముచే పారిపోయెనేగాని మరణింప లేదు. అందుచే దాయ శేషము, శత్రుశేషము నశింప లేదు. ఆతని కాలముననే రాష్ట్రకూట రాజగు నాలు

నుదాహరింపబడిన కాలమునందే గావింపబడినటుల గోచ రించుచున్నది.

ఈ శాసనమందలి మూడవ రేకు—మొదటి ప్రక్కయందలి 8 పంక్తులు దాదాపు పూర్తిగా నక్షర శైథిల్య మందుటచే దానప్రతిగ్రహీత వంశ వర్ణన మందలి వర్గత్రయములో ఆతని పితామహులపేర్లు గానరాకబోయినవి.

(x) దాన స్థల నిర్ణయము:—ఇందు శాసన పరి శుభ్రకుడగు వాని ప్రభావము పూర్తిగా ప్రస రించి కొంత గలవఱ పఱచినది. 3—1—2 పంక్తిలో దానస్థల మే విషయమో లేక యేనాడో యుదాహరింప బడిన అక్షర పంక్తి 3—1—1 లోని అమ్మరాజ విజయాదిత్యుని("మహారాజాధిరాజ,రాజమహేన్ద్ర,పర") బిరుదాక్షర పంక్తితోనే పూర్తిగా శిధిలమై అదృశ్య మైనవి. వీరి తిరస్కరిణీ విద్య నవగాహన జేసికొన నెక్కువగా చారిత్రక గ్రంధావలోకనము గావింపవలసి వచ్చుటచే నొక విధముగా మనసునకు బాధ గలిగించి వ్యయ, ప్రయాస కాలవాలము గల్పించినను పరోక్ష ముగ వీరు గురు స్వరూపులై బహు గ్రంధావలోకన కల్పనచే విశేష పరిజ్ఞాన ప్రదాతలైరి.

ఈ దాన (స్థల) గ్రామమైన "సిరియూ" రెచ్చటిదో తెలియరాదు. తూర్పు గోదావరి జిల్లా కాకినాడ తాలూకాలోని "సిరిపురము" గాని, పెద్దా పురము తాలూకాలోని"సిరిపురము"గాని అమలాపురము తాలూకాలోని "సిరిపల్లి" గాని తెలంగాణాయందలి "సిరియూరు" గాని యిందుల సరిహద్దు గ్రామ ములకు సరిపడుటలేదు. అయితే యీ "సిరి యూరు" గ్రామ అగ్రహారమునకు సరిహద్దు గ్రామ ములుగా తూర్పున "విప్పఱ్త్తి", దక్షిణమున "దేవ' పశ్చిమమున "మోరంబఱ్త్తి", ఉత్తరమున "నొడలి" అని యుదహరింపబడినవి. ఇందలి విప్పఱ్త్తి పశ్చిమ గోదావరి యందలి తణుకు తాలూకాలోను, నొడలి "వడలి" యను పేరున తణుకు తాలూకాలోను "దేవ" నరసాపురము తాలూకాలోనిప్పటికిని గలవు. మోరంబఱ్త్తి గూడ ఆ తణుకు తాలూకాలోనే గలదు. కావున ఆ యూళ్ల మధ్యనున్న "సిరియూరు" గ్రామము కాలగర్భమున నేడు లీనమై పోయినను "వసిష్ఠ గోదావరి" తీర సమీపమందున్నట్లు గోచరించుచున్నది. పూర్వపు శాసనములలో వసిష్ఠ గోదావరీ తీరమందు గల నేటి నరసాపురము, తణుకు, భీమవరము తాలూకాలను "పానార, పావునార పావనార, పాగుణార, పావార, పాగుణవార" అను ననేక (శ్లేష్మ, విశేషణయుక్తమగు) పేర్లతో వాడబడినట్లు ఇతర శాసనముల నుదాహరింపబడిన గ్రంధములు దెలుపుచున్నవి.కావున యీ శాసనమం దుదాహరింపబడిన "సిరియూర"ను గ్రామము పశ్చిమ గోదావరి జిల్లాయం దలి తణుకు తాలూకాలోని విప్పఱ్ఱు (ఇలపఱ్ఱు,) దేవ, మోరంబఱ్త్తి(ములపఱ్ఱు),(నొదలి) వడలి మధ్యస్థమైన ఏ"రామన్న" పాలెమో లేక కాలగర్భమైన ఏ మఱి యొక గ్రామమోయని నిర్ధారింప ననువు గలుగుచున్నది. అంతేగాక వేఱొకతావున గాదు.

పట్టాభిషేకోత్సవ కాలమందలి "పౌష" "మార్గశీర్ష" మాస నిర్ధారణ జ్యోతిశ్శాస్త్రజ్ఞులుగాని అంతకు సములైన చారిత్రాంశ సూక్ష్మ పరిశీలకులు మాత్రమే నిర్ణయింపవలసి యున్నది.

ఇందలి చారిత్రకాంశాది దోషము లేనియున్నను మన్నించి దెలుపు సహృదయులకు గృతజ్ఞతాభి వంద నము లొనరించి నిండు మనంబున జేకొందునని మనవి జేయుచున్నాను.

# సిరియూరు (కడలి) తామ్రశాసనము



## మొదటిరేకు - రెండవప్రక్క

1 ఓం [1]స్వస్తి శ్రీమతాం సకల భువన సంస్తూయమాన మాన
వ్యస గోత్రాణాం హారితి పుత్రాణాం కౌశికీ వర
2 వరప్రసాద లబ్ధ రాజ్యానా మ్మాతృగణ పరిపాలితానాం
స్వామి మహాసేన పాదానుధ్యాతానాం భగవన్నా రా
3 యణ ప్రసాద సమాసాదిత వర వరాహ లాంచ్ఛనేక్షణ
క్షణ వశీకృతారాతి మన్డలానా మశ్వ
4 మేధావ భృత[2] స్నాన పవిత్రీకృత వపుషాం చాలు
క్యానాం కుల మలంకరిష్ణోః సత్యా శ్రయ వ
5 ల్లభేన్ద్రస్య భ్రాతా కుబ్జ విష్ణువర్ద్ధనోష్టా దశ
వర్షాణి వేంగీ మన్డల మపాలయత్। తత్పుత్రో జ
6 యసింహ స్త్రయ స్త్రింశతం। తదనుజ ఇన్ద రాజ స్సప్త
దినాని॥ తన్నన్దనో విష్ణువర్ద్ధనో నవవర్షాణి। తత్సూ
7 ను మ్మంగ్గి యువరాజః పంచ వింశతిం। తత్సుతో
జయసింహ స్త్రయోదశ। తద్వైమాతు రానుజః కొక్కిలిః షణ్మా
8 సాన్। తస్య జ్యేష్ఠో భ్రాతా విష్ణువర్దన స్తముచ్చాట్య సప్త
త్రింశమబ్దాన్। తదపత్యం విజయాదిత్య భట్టారకోష్టాద

1. "ఓం" కారమును గుఱుతుగా వాడబడినది. 2. భృత=భృధ. 3. ఇన్ద=ఇన్ద్ర.



## రెండవరేకు - మొదటిప్రక్క

9 శత దొరసో విష్ణువర్ధనః షట్ట్రింశతం। తదాత్మజో నరేన్ద్ర
మృగరాజోష్టాచత్వారింశతం। తతో కం కలి విష్ణువర్ధనో ।
10 ధ్యర్ధం వర్షం। తత్తనూజో గుణాంక నల్ల విజయాదిత్య
శ్చతుశ్చత్వారింశతం। తదనుజ విక్రమాదిత్య సూను
11 శ్చాలుక్య భీమ స్త్రింశతం। తత్సుత విజయాదిత్య
ష్షణ్మాసాన్। తత్సూను రమ్మరాజ స్సప్త వర్షాణి।
12 తదాత్మ భూ రభర్క విజయాదిత్యః పక్షం। తతస్తాడప
రాజో మాసం। తన్నిజ్జి[4]త్య చాలుక్య భీ
13 మ తనయో విక్రమాదిత్య[5] సంవత్సరం వేంగీ విషయ
మపాలయత్॥ అత్రాన్తరే।[6] సామన్త
14 శబర వల్లభ దన్త్యాశ్చాన్యేచ భూమి మహా మహిమికయా
సప్తాబ్దాన్ప్య లుంప న్నభిషిక్తం యుద్ధమల్ల మవమ
15 త్యబలాత్।[7] ప్రాచ్యా ముదితో విజయాదిత్య భవ స్తేజసా
న్నిధి భీమనృమః[8] తత్సామన్తాది తమోనిభిర్ద్యాష్ట దశా
16 బ్దమవని మరక్షత్॥[9] మునిరస వసు శాకా* (బ్దే) పౌ* (ష్యే) కృ
ష్ణే త్రయోదశీ మైత్రక్షే। తత్సూను భృగువారే

4. తన్నిజ్జిత్య = తన్నిర్జిత్య; 5. విక్రమాదిత్య సంవత్సరం = విక్రమాదిత్యస్సంవత్సరం,
6. ఆర్యావృత్తమ్. (చతుషష్టి మాత్రా పూర్వకం); ? 7.
8. భీమనృమః=భీమనృపః; 9. ఆ. వృ. శ్లో.* (—) రంధ్రములు పడిన తావున ఆ యా అక్షర భాగములు మాత్రమే దిగబడినవి.

# సిరియూరు (కడలి) తామ్రశాసనము



## రెండవరేకు - రెండవప్రక్క

17 పట్టమదా దమ్మనృపతే రాచన్ద్రార్కం॥ (a (వాణీ........లా
స)ంగ్గమయోగ్యకాలే। లక్ష్మీ స్వయం రాజమహేన్ద్ర
18 మాప్తా। యుక్తాభిషేకా కృతపట్టబన్ధా లతాంగినీ సంగమ
కాంక్షయేవ।[10] నిచ్ఛిన్నా(...........)దేభ కుంభవిగల
19 [11]న్మక్తా ఫలాలం కృతా । (b) [12]విద్విగ్భూమితి రక్త కుంకుమ రస
[13]స్వాగాంగ్గ రాగాభృశం। వైయ్యాశాన్త సగన్ధ కీర్తి సు
20 మనోదారీ జయశ్రీ వధూః। ప్రాప్తాగన్ధర[14] గన్ధరముగ్ర
సమరే యన్త న్నిజ శ్రీ సఖీ॥ (c) దా
21 యాదేన్ధన దావపావక శిఖా విద్రోహి దోషారవి।
శ్చోరానోకహ సన్తతి క్రకచధారాప్రోత[15]
22 గత్యాగమః। దుష్టాం[16]భోజ హిచమన్దురా రిత భూభృ
[17]చ్ఛింగ్గ కల్పానిలః। క్రోధో రాజమహేన్ద్ర భూతలపతేయ్యా
23 స్యాధికం జృంభతే॥ (d) స సకలరిపు నృపతి మకుట తట ఘ
టిత మణిగణ మధుకర నికర పరిచుంబిత
24 చరణ సరసీరుహ యుగలో యుగలోచన పద కమల
విలసిద్విరేఫాయమానో మానోన్న తోద్ధత

---

(a) (వాణీ వధూ ప) ఆయా యక్షర భాగములు మాత్రమే నిల్చినవి. 10. (—) = (ఖిన్నమ)
11. విగలవ్మక్తా=విగలన్మక్తా; 12. విద్విగ్భూమితి=విడ్విగ్భూపతి; 13. స్వాగాంగ్గ=స్వాదాంగ్గ; 14. గన్ధర గన్ధర=గన్ధరగన్ధ; 15. ప్రోత=స్రోత 16. దుష్టాంభోజహి = దుష్టాంబోదహి; 17. భూభృచ్ఛింగ్గ = భూభృచ్ఛృంగ్గ; (a) ఉపజాతి:—ఉపజాతి వృత్తే కేచిత్పాదా ఇన్ద్రవజ్రావృత్తస్థాః । కేచిచ్చ ఉపేన్ద్రవజ్రా వృత్తస్థా భవన్తి. అత్ర ప్రథమ, ద్వితీయ, తృతీయ పాదేషు ఇన్ద్రవజ్రా. చతుర్థపాదే ఉపేన్ద్రవజ్రా. (b) శార్దూల విక్రీడితమ్; (c) శార్దూల విక్రీడితమ్ (a) గద్య



## మూడవరేకు - మొదటిపక్క

25 సమస్తలోకః (e) సమస్త భువనాశ్రయ శ్రీ విజయాదిత్య
*... ... ... ... ... జా ... ... ... ... ... ...

26 మభట్టారకః పరమ బ్రహ్మణ్యః మాతా పితృ
పాదానుధ్యా+ (... ..., ... ... ...) సినో రాష్ట్ర

27 కూట ప్రముఖా న్కుటుంబిన స్సర్వా న్సమాహూయే
? ... జా ... ... (f) ... ... ... ...య ... ... శుచిసత్యవాదీ। శ్రు

28 తాన్వితో విప్రకులోత్తమేచ॥... ... ... మ్మ శశి
తుల్యకాన్తి శం ద్విక్ర ద్వేద విదాం వ

29 రేణ్యః॥ (g) త ... ... ... ... ... ... త।
శ్చక్రపాణి రితి విశ్రుతో భువి భట్ట శాస్త్ర

30 పరిపూర్ణవేది ... ... ... ... ... నః॥ (h)శ్రీ చక్ర
పాణిభట్టాఖ్యా। మీమాంస శాస్త్ర

31 తత్త్వవిత్। రిగ్వేదీ ... ... ...... ... ... ...యః॥
(i)తస్య భార్యా భవానీవ సుభగా

32 దోనమాంబికా। ... ... ... ... ... ... ది నీ
(j)పు—స్తయోద్దారియ భట్టనా

(e) గద్య; (*) మహారాజాధిరాజ రాజ మహేన్ద్రవర (ఇతర శాసనాల ఆధారము)+తో పాగుణార విష యవా. (ఇతర శాసనముల ఆధారము) (?) ద్ధమాజ్ఞాపయతి (f) ఇన్ద్రవజ్ర (g) రథోద్ధతా (h) అనుష్టుభ్ (i) అనుష్టుభ్ (j) ఇన్ద్రవజ్రా—శ=శం.

# సిరియూరు (కడలి) తామ్రశాసనము



## మూడవరేకు - రెండవ ప్రక్క

33 మా। కల్పద్రుమో దీనజన ద్విజేభ్యః। యోవేద వేదాంగ
విదాం వరిష్ఠో జేగీయతే సత్యధనో మ
34 హద్భిః (k) సోభవత్కమల సంభవోపమః।— ద్దర్శ
శాస్త్ర కుశలో మహా కవిః। యస్త్య నీతి నిపు
35 ణస్య విశ్రుతః। శంఖకున్ద శశి నిర్మ్మలంయశః॥
(l)అనిశ మీాశ మనేక గుణం గుణీ। హరి
36 మపి ప్రవరం కమలాసనం। యజతియోమన
సా నితరా మ్ముహు । గ్గుర్ రు జనా
37 య కరోతి నమ [18]స్క్రియాం (m) నిర్జ్జితాశేషదై
త్యస్య। యథేన్ద్రస్య బృహస్పతిః। తథా
38 రాజమహేన్ద్రస్య। యశ్చ మన్త్రవిదాం వరః।। (n) శ్రీ
మాన సౌదారియ భట్టశర్మ్మా। వేదాత్త[19] తత్వా న్వి
39 త యాాయజూకః। మన్వాదిభిస్మార్త్త వర్గై శ్చ తుల్యా।
బభౌ సురాణాం భువి వాక్పతీవ॥ (o) త
40 స్మై దారియ భట్టాఖ్యాయ। ఆపస్తంబ విహిత
కర్మ్మానుష్ఠాన పరాయ। ఉత్తరాయణని

(k) రథోద్ధతా (l) ద్రుతవిలంబితమ్ (m) అనుష్టుభ్ (n) ఉపజాతి. వజ్రమాలా (o) గద్య
18. నమస్క్రియాం=నమస్క్రియాం; 19. వేదాత్త=వేదార్థ.



నాలుగవరేకు - మొదటివైపు

41 మిత్తే సిరియూరు నామ గ్రామం అగ్రహారీకృత్య సర్వ్వ
కర పరిహారం మయాదత్త మితి విదిత మ

42 స్తు వః। అస్యావధయః. పూర్వ్వతః విప్పటి
పొలగరుసు సీమా। దక్షిణతః దేవ

43 పొలగరుసు సీమా॥ పశ్చిమతః మోరంబటి పొల
గరుసు సీమా। ఉత్తరతః నొడలి పొలగరు

44 సుసీమా॥ అస్యోపరి నకేన చి ద్బాధా కర్త్తవ్యా యః
క రోతి స పంచమహా పాతక సంయుక్తో భ

45 వతి। తథాచోక్తం భగవతావ్యాసేన॥ (p) స్వదత్తాం
పర దత్తాం వా యోహరేతి వసున్ధరా।

46 షష్టిం వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే [20] కృమిః॥
(q) సర్వ్వస్య చ్ఛద్ధివై భోక్తా। శ్వాస్వవాన్త న్న ఖా

47 దతి। శునః కష్టతరై జ్ఞేయ స్వదత్త స్యాపహారకః॥
(r) న విషం విషమిత్యాహు। బ్రహ్మస్వం విష ముచ్య

48 తే॥ విష మేకాకిన [21] హన్తి। బ్రహ్మస్వం పుత్ర పౌత్రికం॥
(s) అన్యాయేన హృతో భూమి। అన్యాయేనతు హ

20. కృమిః=క్రిమిః; 21. ఏకాకినహన్తి=ఏకాకినం హన్తి; (p) అనుష్టుభు· (q) అనుష్టుభు. (r) అనుష్టుభు (s) అనుష్టుభు.

# సిరియూరు (కదలి) తామ్రశాసనము



నాలుగవరేకు - రెండవప్రక్క

49 రితా। హరతో హారయతశ్చై_వ। దహత్యా సప్త
మం కులం॥ (t) రక్షణే ధర్మ్మశ్చ భవతి। తథాచోక్తం॥
50 (u)బహుభి ర్వ్వసుధా దత్తా బహుభి శ్చానుపాలితా।
య*—యస్య+—దా భూమి స్తస్య తస్య త
51 దా ఫలం॥ (v) సామాన్యోయం ధర్మ్మసేతు న్నృపాణాం
కాలే కాలేపాలనీయో భవద్భిః॥ స వ్వా నే
52 త్సాన్భా వినః (22) పాత్తిర్వేన్ద్రా న్భూయోభూయో యా
చతే రామ భద్రః॥ (w) మద్వంశజాః పర
53 మహీపతివంశజా వా పాపా దపేతమనసో
భువి భావి భూపా। యేపాలయ
54 న్తి మమ ధర్మ్మమిమం సమస్తం। తేషా మ్మయా
విరచితోంజలి రేషమూర్ద్ధ్న(23)తి॥ ఆజ్ఞప్తిః కట
55 రాజస్య.

---

* స్య; + య; (t) గద్య. (u) అనుష్టుభు (v) శాలినీ (w) వసంత తిలక. 22. పాత్తిర్వేన్ద్రా=పార్ద్ధివేన్ద్రా; 23. మూర్ద్ధ్నతి=మూర్ద్ధ్నికృతి.

# శాంతి సంస్థాపనకు - యుద్ధ సన్నద్ధతకు -
# ప్రణాళికా బద్ధమైన కృషి

జాతీయ ప్రణాళికలను అమలు పరచడంలో ఎల్లప్పుడూ యుద్ధ సన్నద్ధులమైనట్లే పని చేయవలసి ఉంటుంది.

ఎందుకంటే దారిద్ర్యం, క్షామం, అజ్ఞానం, జాడ్యాలు — వీటి నిర్మూలనకు మనం సాగిస్తున్న యుద్ధంలో శీఘ్రగతిని, లక్ష్యాలను చేరుకోవడానికి మార్గం ఇదే.

అలాంటి పోరాటాన్ని మనం అపేక్షించాం — పరాయివారితో జగడాన్ని ఎల్లప్పుడూ ద్వేషించే మనం సాగిస్తున్న సమరం అది — త్వరితగతిని పెంపొందుతున్న జాతిని శాంతియుతంగా నిర్మించడానికీ, ప్రగతి సాధించడానికీ సలుపుతున్న పోరు అది —

కాని ఇప్పుడు మనం కోరని యుద్ధంలోనికి మనను బలవంతంగా దింపడం జరిగింది. మనను యుద్ధంలోనికి దింపిన వారికి శాంతి అంటే ద్వేషం. పరుల భూభాగాలను కాజేయడమే వారి పరమావధి. పొరుగున సఖ్యతతో మెలుగుతున్న మన సహృదయతను, మంచితనాన్ని చూసి దానిని వారు బలహీనతగా భావించారు —

ఇప్పుడు మన ప్రణాళికలను నిజంగా యుద్ధ సన్నద్ధులమైన సరళిలోనే రూపొందించుకోవాలి —

జాతియొక్క శక్తి సామర్థ్యాలను వేగవంతంగా పెంపొందించవలసివుంది. క్షేత్రాలలోను, కర్మాగారాలలోనూ ఇతోధికంగా ఉత్పత్తి జరిగి దేశదార్ఢ్యం పెంపొందడానికి భగీరథ ప్రయత్నం కావాలి —

జాతి అభివృద్ధికై రూ. 21,500 కోట్లు ఖర్చయ్యే నాలుగవ పంచవర్ష ప్రణాళికను రూపొందించడం జరిగింది. ఇప్పుడు వచ్చే సంవత్సరానికై నిరాడంబరమైన, ఆచరణయోగ్యమైన అత్యవసర వార్షిక ప్రణాళిక నొకదానికి రూపకల్పన చేస్తున్నారు —

ఆంధ్రప్రదేశ్ రూ. 700 కోట్లు వ్యయమయ్యే తన చతుర్థ ప్రణాళికలో సమస్త రంగాలలోనూ గొప్ప పురోభివృద్ధిని లక్షిస్తున్నది —

తృతీయ ప్రణాళిక చివరి సంవత్సరమైన వర్తమాన సంవత్సరంలో మన రాష్ట్రంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి సుమారు 90.21 లక్షల టన్నులు ఉంటుంది. ఈ ప్రణాళికారంభంలో యీ పరిమాణం 63.19 లక్షల టన్నులు ఉంది. నాలుగవ ప్రణాళికా కాలంలో ఉత్పత్తిని 116.40 లక్షల టన్నులకు హెచ్చించాలని లక్ష్యం.

ఇదేవిధంగా ప్రస్తుతం 2.65 లక్షల టన్నులుగల చేపల ఉత్పత్తిని వచ్చే ప్రణాళికా కాలంలో 3.21 లక్షల టన్నులకు హెచ్చించడానికి ప్రతిపాదించారు.

విద్యుదుత్పాదకశక్తిని 411 మె. వా. ల నుంచి 1750 మె. వా. లకు పెంచుతారు.

ఇదే ప్రకారం నేటి వనరులు, పశుగణం, అటవీ సంపద, విద్య, వైద్య, పారిశ్రామిక రంగాలలో సర్వతోముఖాభివృద్ధిని సాధించి జాతీయ శక్తి సంపదలను పెంపొందించడమే యీ బృహత్తర కృషి లక్ష్యం—

అయితే యీ ప్రయత్నంలో విజయం సాధించడం అనేక అంశాలపై ఆధారపడి ఉంటుంది. వాటన్నింటిలోకి ముఖ్యమైనవి ప్రజల అచంచలమైన దీక్షాశక్తి, దృఢ సంకల్పం, కార్యశూరత్వం—పొలాలలోని రైతులు, కర్మాగారాలలోని కార్మికులు—మీరు, మేము, మనందరం—ప్రతి ఒక్కరం తన వంతు పనిని ఇతోధిక శక్తి సామర్థ్యాలతో, త్యాగబుద్ధితో నిర్వర్తించాలి—

శాంతి ప్రియులైన ప్రజలు సాగిస్తున్న సమరం ఇది. భారతావనిని అజేయం చేయడానికి జరుపుతున్న బృహత్తర కృషి ఇది.

**సమాచార, పౌర సంబంధ శాఖ, ఆం. ప్ర.**

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 175/- | రు. 150/- |
| 2 లేక 3 వ కవరు పేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | 150/- | 125/- |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజి | ... | 125/- | 100/- |
| అర్థ పేజి | ... | 65/- | 55/- |
| పావు పేజి | ... | 40/- | 35/- |

ప్రత్యేక స్థానములకు 25% అధికం.

సం॥నకు వరుసగా 12 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12-0-0 |
| 6 మాసముల చందా | ... | రు. 6-0-0 |
| విడి ప్రతి | ... | రు. 1-0-0 |

మేనేజరు, భారతి.

మద్రాసు-1.